# వాల్మీకి రామాయణము

# యుద్ధకాండ



- శ్రీ శ్రీనివాస శిరోమణి



ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# వాల్మీకి రామాయణము

## యుద్ధకాండ

(ప్రథమ భాగము)



శ్రీ శ్రీనివాస శిరోమణి



శిరోమణి
147/4 బాలాజీ నగరు
రాయపేట : మద్రాసు

శాలికి నేను చేయ కల సర్వస్వదానము నా కౌగిలింత" అంటూ సంతోషముతో పులకాంకితుడు అయి కృతకృత్యుడు అయి వచ్చిన ఆ మహాపరాక్రమశాలిని హనుమంతుణ్ణి కౌగలించుకొన్నాడు.

అంతట రాముడు ఆలోచిస్తూ వానరేశ్వరుణ్ణి చూచి "ఓ సుగ్రీవుడా సీతాదేవిని వెతకటము మాత్రము అన్ని విధాలా చక్కగా జరిగింది. కాని సముద్రాన్ని తలచుకొంటూ ఉంటే మళ్లీ నా మనస్సు కలవరపడుతూ ఉంది. ఈ వానరులు అందరూ ఈ మహాసముద్రాన్ని ఎట్లా దాటి ఆ దక్షిణతీరానికి పోతారో చెప్పు. నా ప్రియురాలికి సీతాదేవికి ఈ విషయము హనుమంతుడు చెప్పినాడు. కాని వానరులు అందరూ సముద్రాన్ని దాటి పోవు నుపాయము ఏమిటో తోచటములేదు" అన్నాడు.

అంతట ఆ మహాబాహువు ఆ శత్రుసంహారకుడు రాముడు శోకసంభ్రాంతుడు అయిపోయినాడు. ఆలోచించ సాగినాడు.

## ౨

అట్లా దిగులు పడుతూ ఉన్న రాముణ్ణి ఆ శ్రీమంతుడు సుగ్రీవుడు చూచి "ఓ ప్రభూ, నీవు వీరుడవు. సామాన్యమానవుడి వలె దిగులు పడటము ఎందుకు. కృతఘ్నుడు స్నేహాన్ని వలె నీవు దుఃఖాన్ని వదిలి పెట్టు. సీతాదేవి వృత్తాంతమూ శత్రువుల ఉనికిపట్టూ మనకు ఇప్పుడు తెలిసినవి. నీవు దిగులు పడవలసిన కారణము నాకు కనపడటములేదు. ఓ ప్రభూ, నీవు మహామతిమంతుడవు. శాస్త్రవిదుడవు. ఊహాపోహాలలో సమర్థుడవు. పండితుడవు. ఆత్మవేత్తవు. అందువల్ల అపవర్గాన్ని వదిలి పెట్టేట్టు ఉత్సాహాన్ని చెడగొట్టే ఈ ఆలోచనను వదిలి పెట్టు. మేము మహాసముద్రాన్ని లంఘించి లంకాపట్టణానికి పోతాము. కోటల మీదికి ఎక్కుతాము. నీ శత్రువును రావణాసురుణ్ని మేము నాశనము చేసి వేస్తాము.

"నిరుత్సాహముతోనూ దైన్యముతోనూ దుఃఖమునుంచి కలవర పడి పోతూనూ ఉంటే సర్వార్థాలు నాశనము అయిపోతవి. అంతే కాకుండా అపదలపాలు కావటమున్నూ సంభవిస్తుంది. ఈ మన వానరసేనా నాయకులు శూరులు, సమర్థులు. వీండ్లు అందరూ నిన్ను సంతోష పెట్టడానికి అత్యుత్సాహముతో అగ్నిహోత్రములోకి అయినా దూకుతారు. వీండ్ల ఉత్సాహము నాకు తెలుసును. ఈ విషయములో నా ఊహ యథార్థము. నేను నా పరాక్రమముతో ఆ పాపకర్ముణ్ణి రావణాసురుణ్ణి సంహారముచేసి సీతాదేవిని తీసుకొని రాకలను. నీవూ ఆమెను తీసుకొని రాకలవు. ఓ రామా, మహాసముద్రానికి సేతువు కట్టేట్టు

ఆ రావణాసురుడి లంకాపట్టణాన్ని వానరులు అందరూ చూచేట్టు నీవు ఆలోచించి చేయవలెను. త్రికూటపర్వతముమీద ఉన్న ఆ లంకాపట్టణము కనపడితే చాలును. ఆ రావణాసురుడు యుద్ధములో చచ్చిపోయినాడు అనే అనుకో. మహాసముద్రములో సేతువు కట్టకపోయేట్లయితే సురాసురలు అందరూ ఏకము అయి దేవేంద్రుడి వెంట బయలుదేరి పోయినా ఆ లంకాపట్టణాన్ని కొట్టలేరు. లంకాపట్టణము దగ్గరదాకా సేతువు కట్టితే వానరసైన్యము జయించినట్టే నిశ్చయించుకో. అంతేకాదు. యుద్ధములో శూరులూ కామరూపులూ అయిన మన వానరులు రాక్షసులతో కూడా ఆ లంకాపట్టణాన్ని పెళ్లగించి తేకలరు. వానరులు అంతటి శక్తిమంతులు.

“ప్రభూ, నీవు దిగులు పడవద్దు. దిగులే సమస్త పనులనూ పాడుచేస్తుంది. దిగులే ఈ లోకములో మానవుడి శౌర్యాన్ని పోగొట్టుతుంది. రామా, నీవు మహా ప్రాజ్ఞుడవు. శౌర్యము అవలంబించు. ఏపనిని నీవు ఇప్పుడు చేయవలెనో ఆపనినే చేయవలెను. నీవంటి శూరులూ మహాత్ములూ అయినవారు అగపడకుండా పోయినదాని కోసమూ పాడు అయిపోయిన దాని కోసమూ దుఃఖపడరు. అట్లా కాకుండా దుఃఖపడేట్లయితే సమస్తకార్యాలూ నాశనము అయిపోతవి.

“ఓ రామా, నీవు బుద్ధిమంతులలో ఉత్తముడవు. సర్వశాస్త్రార్థకోవిదుడవు. నా వంటి సచివులతో కూడా శత్రువులను జయించడానికి బయలుదేరడమే కర్తవ్యము. నీవు ధనుర్ధరుడవు అయితే రణరంగములో నీ ఎదుట ఎవరు నిలవ కలరు. అట్లా నీ ఎదుట నిలవ కలవాడు ఎవడూ ముల్లోకాలలోనూ నాకు కనపడటము లేదు. వానరులు నీ కార్యాన్ని నిర్వహిస్తారు. వానరులమీద ఉంచే ఏ పనీ పాడు అయి పోదు. ఓ రామా సముద్రాన్ని దాటి త్వరలోనే నీవు సీతాదేవిని చూస్తావు. ఇంతవరకూ దుఃఖపడ్డది చాలు. ఇప్పుడు క్రోధము అవలంబించు. యుద్ధము చేయని క్షత్రియులు మందభాగ్యులు అవుతారు. భయంకరుడికి అందరూ భయపడుతారు. నదులు అన్నీ వచ్చి పడే సముద్రము భయంకరముగానే ఉంటుంది. నీది సూక్ష్మబుద్ధి. ఆ సముద్రాన్ని దాటి పోయే ఉపాయము మా అందరితోనూ ఇక్కడనే యోజించు. సముద్రము దాటి నా సైన్యము అంతా లంకకు చేరేట్లయితే నీకు జయము సిద్ధించినట్టే. శూరులూ కామరూపులూ అయిన వానరులు యుద్ధములో రాళ్లవానా చెట్లవానా కురిపించి రాక్షసులను రూపుమాపి వేస్తారు.

“ఓ రామా, నీవు యుద్ధము కావలెను అనుకుంటున్నావు. అందువల్ల మనము ఏదోవిధముగా ఆ సముద్రాన్ని దాటిపోదాము. ఆ రావణాసురుణ్ణి సంహారము చేసివేసినట్టే —

ప్రభూ, ఎన్నో మాటలు చెప్పడము ఎందుకు. నీవు అన్నివిధాలా జయిస్తావు. నాకు శుభనిమిత్తాలు కనబడుతున్నవి. నా మనస్సులో సంతోషముగా ఉంది" అని సుగ్రీవుడు చెప్పినాడు.

## 3

ఇట్లా యుక్తియుక్తముగా సుగ్రీవుడు చెప్పింది ఆ పరమార్థవేత్త రాముడు అంగీకరించినాడు. హనుమంతుణ్ణి చూచి "ఓ వీరుడా, సేతువును కట్టి కానీ సముద్రాన్ని ఎండకొట్టి కానీ మరి ఏవిధముగా నయినా కానీ సముద్రాన్ని దాటవేసే సామర్థ్యము నాకు ఉంది. చొరవలవి కాని ఆ లంకాపట్టణములో ఎన్ని కోటలు ఉన్నవి. సైన్య పరిమాణము ఎంత ఉంటుంది. ద్వారాలలో నుంచి లోపలికి పోనీయకుండా ఎట్లా కావలి కాస్తావుందీ ఆ పట్టణ రక్షణము ఎట్లా జరుగుతూ ఉందీ చెప్పు. రాక్షసుల గృహాల సన్నివేశాన్ని గురించినీన్నీ తెలుసుకోవలెను అనుకొంటున్నాను. నీవు చూచింది చూచినట్టు సర్వమూ చెప్పవలెను.

"ఓ హనుమంతుడా, నీవు సమర్థుడవు. నీవు లంకాపటణాన్ని అంతా సావధానముగా చక్కగా చూచినావు. నీవు తెలుసుకొన్నది అంతా నాకు చెప్పు" అని రాముడు అడిగినాడు.

అంతట ఆ వాక్యకోవిదుడు హనుమంతుడు "ఓ ప్రభూ, లంకా పట్టణములోకి చొరబడడానికి అలవికాకుండా కాపాడుతూ ఉన్న పద్ధతినిగురించీ సైన్యరక్షణాన్నిగురించీ రాక్షసులు రావణాసురుడి మీద ఎంత స్నేహముతో ఉంటూ వుందీ రావణాసురుడి తేజాన్నిగురించీ లంకాపట్టణ సర్వసమృద్ధిని గురించీ భయంకరము అయిన సముద్రాన్ని గురించీ, సైన్య విభాగాన్ని గురించీ, రథగజతురగాది వాహనాలను గురించీ సర్వమూ చెప్పుతాను వినవలసింది.

"ప్రభూ, ఆ లంకాపట్టణములో ప్రజలు అందరూ మహాసంతోషముతో ఉంటున్నారు. మదపుటేనుగులు మందలు మందలుగా కనిపించినవి. గొప్ప రథాలూ గుఱ్ఱాలూ సమృద్ధముగా ఉన్నవి. లెక్కలేని అంతమంది రాక్షసులు అక్కడ నివసిస్తూ ఉన్నారు. ఆ పట్టణములోకి శత్రువులు చొరబడడము అశక్యము. ఆ లంకాపట్టణానికి నాల్గుదిశలా నాల్గు పెద్దపెద్ద ద్వారాలు గట్టి గట్టి తలుపులతో ఉన్నవి. ఆ తలుపులకు పెద్ద పెద్ద ఇనుప గుదియలు గడియలుగా ఉన్నవి. ఆ ద్వారాల దగ్గర పెద్ద బాణమోచకయంత్రాలు శిలామోచకయంత్రాలూ ఉన్నవి. శత్రుసైన్యాలు అక్కడికి పోయినప్పుడు ఆ

యంత్రాలలో నుంచీ బాణాలూ శిలలూ వర్షముగా కురిపించి వెనకకు మళ్ళి గొట్టుతారు. ఆ ద్వారాల దగ్గర పరమ పరాక్రమవంతులు అయిన రాక్షస యోధులు సమూహాలు సమూహాలుగా ఉన్నారు. ఇనుముతో చేసిన భయంకరము అయిన శతఘ్నులు అక్కడ వందలకొద్దీ అమర్చి ఉన్నవి. ఆ శతఘ్నులను ప్రయోగిస్తే ఒక్కొక్క శతఘ్నికి వందలకొద్దీ చచ్చిపోతారు.

"ఆలంకాపట్టణము చుట్టూ సువర్ణమయము అయిన ప్రాకారము ఉంది. అది ఎంతో ఎత్తుఅయింది. దానికి అక్కడక్కడ పద్మరాగ ప్రవాళ వైదూర్య ముక్తామణులు అలంకారముగా అమర్చిఉన్నవి. ఆప్రాకారాన్ని దాటిపోవడము అశక్యము. ఆప్రాకారాన్ని ఆనుకొని పెద్ద అగడ్తఉంది. అందులో నీళ్లు ముట్టుకోడానికి వీలుకానంత చల్లగాఉంటవి. మహోగ్రాహాలూ మహామీనాలూ ఆఅగడ్తలో తిరుగుతూఉన్నవి. ఆనాల్గుద్వారాలలోనుంచీ ఆ అగడ్తమీదనుంచి విశాలముఅయిన వంతెనలు ఉన్నవి. అవి దారువులతో చేసినవి. ఆ వంతెనలను అవసరము అయినప్పుడు ఎత్తివేయడానికీ దించివేయడానికీ అక్కడనే పెద్దపెద్ద యంత్రాలు ఉన్నవి. ఆద్వారాలను కావలి కాసేవారి గృహాలున్నూ అక్కడనే ఉన్నవి. శత్రుసైన్యాలు వచ్చినప్పుడు ఆ వంతెనలను ఎత్తివేస్తారు. అప్పుడు అగడ్తను దాటి లోపలికి పోవడము అశక్యము. కదిలించడానికి అలవికాని బలిష్ఠము అయిన బంగారు స్తంభాలమీద ఒక వంతెనఉంది. ఆవంతెనమీద శోభాయమానముఅయిన అరుగులు ఉన్నవి.

"ఓ ప్రభూ, రావణాసురుడు చలనములేని స్వభావముకలవాడు. జాగరూకుడు. ఏమరుపాటు లేనివాడు. ఎప్పుడూ యుద్ధముచేయవలెను అనే కోరికతో ఆరావణాసురుడు స్వయముగా తన సైన్యాలను చూచుకుంటూ ఉంటాడు.

ఆ లంకాపట్టణము త్రికూటపర్వతముమీద ఉంది. ఆపర్వతముమీదికి పోవడానికి ఆధారము ఏమీలేదు. దేవతలు సహితమూ అక్కడికిపోలేరు. ఆపట్టణములోకి పోవడానికి మూడు అడ్డంకులు ఉన్నవి. ఆపట్టణము చుట్టూ ఎప్పుడూ జలాలు సమృద్ధముగా ప్రవహించే నదులు ఉన్నవి. అది జలదుర్గము. దాన్ని దాటితే పర్వతపంక్తులు ఉన్నవి. అది పర్వతదుర్గము. వాటిని దాటితే పెద్ద అడవులు ఉన్నవి. అది వనదుర్గము. దానిని దాటితే చుట్టూ ప్రాకారముతోనూ అగాధముఅయిన అగడ్తతోనూ కట్టిన దుర్గముఉంది. ఈవిధముగా నాలుగుదుర్గాల మధ్యను ఆ లంకాపట్టణము ఉంది. ఆపట్టణము సముద్రతీరానికి దూరముగా ఉంది. ఆసముద్రములో ఓడమార్గములేదు. అక్కడివారికి ఏ దేశమువారి వార్తలూ తెలిసే అవకాశములేదు.

అది దేవేంద్రుడి అమరావతీ పట్టణము వంటిది. పర్వతాగ్రముమీద ఉండడమునుంచి అది పరమదుర్గముగా ఉంది. అందుకు అనుగుణముగా అగడ్తలతోనూ శతఘ్నులతోనూ బాణశిలామోచకాది నానావిధ యంత్రాలతోనూ అది అజేయముగా ఉంది.

ఆ లంకాపట్టణపు తూర్పు వాకిలిదగ్గిర ఎదిరించ నలవికాని శూలపాణులు అయిన పదివేలమంది రాక్షసయోధులు ఉంటున్నారు. వాండ్లు అందరూ ఖడ్గాలతో పోరాడగలరు. దక్షిణద్వారము దగ్గిర చతురంగ సైన్యాలతో ఒక లక్షమంది రాక్షసయోధులు ఉంటున్నారు. వాండ్లు అందరూ పరమసమరులు. మరి పదిలక్షలమంది రాక్షసయోధులు డాళ్లతోనూ ఖడ్గాలతోనూ పశ్చిమ ద్వారమువద్ద కావలికాస్తూ ఉన్నారు. వాండ్లు అందరూ సర్వాస్త్రకోవిదులు, ఉత్తర ద్వారముదగ్గిర నూరుకోట్లమంది రాక్షసులు ఉన్నారు. వారిలో కొందరు రథికులు, కొందరు అశ్వికులు, కొందరు గజసాదులు. వారు అందరూ మంచి మంచి వంశాలలో పుట్టినారు. రావణాసురుడికి వాండ్లు అందరూ నమ్మినబంట్లు, వాండ్లను రావణాసురుడు ఎప్పుడూ మెచ్చుకొంటూ ఉంటాడు. వాండ్లే కాకుండా ఎదిరించ నలవికాని రాక్షసయోధులు గుంపులు గుంపులుగా వేలకు వేలు ఒక కోటిమంది పట్టణము మధ్యను ఉంటున్నారు.

"ఓ ప్రభూ, నేను అగడ్తమీది వంతెనలు పడగొట్టినాను. ఆ అగడ్తను పూడ్చివేసినాను. ఆ పట్టణాన్ని దహించివేసినాను. ఆ ప్రాకారాన్ని పడగొట్టినాను. ఆ రావణాసురుడి సైన్యములో కొంతభాగాన్ని సంహారము చేసివేసినాను. మహా పరాక్రమవంతులు అయిన రాక్షసవీరులను కొంతమందిని నేను చంపివేసినాను. ఏదో ఒకవిధముగా సముద్రాన్ని దాటిపోవచ్చును. లంకాపట్టణాన్ని అంతా వానరులు నాశనముచేసివేయగలరు. అంగదుడూ ద్వివిదుడూ మైందుడూ, జాంబవంతుడూ, పనసుడూ నలుడూ సేనానాయకుడు నీలుడూ పోతే చాలును. తక్కిన వానరసైన్యముతో పనిలేదు, ఆకాశమార్గాన పోయి పర్వతాలనూ వనాలనూ ప్రాకారాలనూ బహిర్ద్వారాలనూ అగడ్తనూ భేదించి సీతాదేవిని తేగలరు. వానరసైన్యానికి అంతటికీ సారభూతముగా ఉన్న అంగదాదులను వెంటనే పొమ్మని ఆజ్ఞాపించు. జైత్రయాత్రాయోగ్యము అయిన ముహూర్తాన ప్రయాణము అయిపోయేట్టు చూడు" అని చెప్పినాడు.

## ౪

హనుమంతుడు చెప్పింది అంతా యథాక్రమముగా ఆ మహాతేజోవంతుడు ఆ సత్యపరాక్రముడు రాముడు విని "ఓ హనుమంతుడా, ఆ రావణాసురుడు లంకాపట్టణాన్ని నేను వెంటనే మథించి వేస్తాను సత్యము చెప్పుతున్నాను. డిజ్ఞ

"ఓసుగ్రీవుడా, ఈముహూర్తములో మనము ప్రయాణము అయిపోవలెను. దివాకరుడు దివామధ్యానికి వస్తూ ఉన్నాడు. ఇది అభిజిన్ముహూర్తము. ఈ ముహూర్తములో ప్రయాణము అయిపోయేట్లయితే మనకు జయము అవుతుంది. ఇదే విజయముహూర్తము. ఆరావణాసురుడు ఎక్కడికిన్నీ తప్పించుకొనిపోలేడు. ఒకవేళ తప్పించుకొని పోయినా మనము వాణ్ణి పట్టుకో కలుగుతాము. నేను ప్రయాణము అయి వస్తూ ఉన్న సంగతి సీతాదేవి వింటుంది. ప్రాణము పోగొట్టుకోడానికి విషము తాగబోతున్నవాడి చేతికి అమృతకలశము అందినట్టుగా నేను వస్తూ ఉన్నాను అనే వర్తమానము తెలిసి సీతాదేవి జీవిస్తుంది.

"ఓ సుగ్రీవుడా, ఇవ్వేళ ఉత్తర ఫల్గునీ నక్షత్రము. నేను పునర్వసూ నక్షత్రములో పుట్టినాను. కాబట్టి ఇది నాకు సాధనతార. రేపు హస్తానక్షత్రము. అది నాకు నైధనతార అవుతుంది. అందువల్ల సమస్తసైన్యాలతోనూ ఇవ్వేళనే మనము బయలుదేరి పోవలెను. నాకు ఇప్పుడు శుభనిమిత్తాలు తోస్తున్నవి. నేను ఆ రావణాసురుణ్ణి సంహరించివేస్తాను. జానకిని తీసుకొని వస్తాను. నా మనోరథము సిద్ధిస్తుంది అని తెలియ చెప్పుతున్నట్టు నాకు కుడి కనుబొమ అదురుతూ ఉంది" అని చెప్పినాడు.

---

ఇట్లా ఆ ధర్మాత్ముడు రాముడు చెప్పగానే లక్ష్మణుడూ సుగ్రీవుడూ అతనిని అభినందించినారు. అంతట ఆ కార్యకోవిదుడు రాముడు మళ్లీ ఇట్లా చెప్పినాడు.

"ఓ సుగ్రీవుడా, బలవంతులు అయిన వానరవీరులను ఒక లక్షమందిని వెంటపెట్టుకొని నీలుడు దారి తీస్తూ ముందుగా పోవలెను. స్వచ్ఛజలాలూ స్వాదుఫలమూలాలూ తేనే సమృద్ధముగా దొరికే చల్లని అడవులలో సేనలు పోవడానికి దారితీయవలెను. దురాత్ములు రాక్షసులు మన రాక తెలుసుకొని దారిలో దొరికే ఫలమూలోదకాలలో విషము మొదలు అయినవి కలుపుతారు. ఓ నీలుడా అందువల్ల నీవు ఎప్పుడూ ఏమరుపాటు లేకుండా సన్నద్ధుడవు అయి ఉండి రాక్షసులు అట్లా చేయకుండా కాపాడవలెను. పల్లపు ప్రదేశాలలోనూ జలము నుంచి పోవలవి కాని ప్రదేశాలలోనూ మహారణ్యాలలోనూ శత్రుసేనలు దాగుకొని ఉంటే ఉండవచ్చును. అటువంటి ప్రదేశాలలో వానరవీరులు ఆకాశానికి ఎగిరి ఆ యా ప్రదేశాలలో శత్రుసైన్యము ఉందీ లేందీ కనిపెట్టి వానరసైన్యాన్ని నడిపించవలెను.

"ఓసుగ్రీవుడా, నీవు సర్వసేనాధిపతివి. మనం భయంకరము అయిన కార్యానికి పూనుకున్నాము. ఇందుకు పరాక్రమమే అవసరము. సారములేని వి

కొంచెము సైన్యముఅయినా ఉన్నట్లయితే దానిని మనము ఇక్కడనే వదిలిపెట్టి పోవలెను. ఆసైన్యము ఇక్కడివారికి ఉపయోగిస్తుంది.

“సింహాలవంటి వానరవీరులూ మహాబలవంతులూ అయినవారు వందలకొద్దీ వేలకొద్దీ సముద్రమువలె భయంకరముఅయిన అగ్రసేనలో పోవలెను. పర్వతాకారుడు అయిన గజుడూ మహాబలవంతులుఅయిన గవయుడూ గవాక్షుడూ ఆవుల మందకు ముందు గర్వముతో పోయే ఆబోతులవలె సైన్యానికిముందు పోవలెను. ఎగిరిపోయేవారిలో శ్రేష్ఠుడుఅయిన ఋషభుడు సైన్యాన్ని కుడిపక్కను కాపాడుతూ పోవలెను. ఎదిరించ నలవికాని మదపుటేనుగువంటి గంధమాదనుడు సైన్యాన్ని ఎడమపక్కను కాపాడుతూ పోవలెను.

“దేవేంద్రుడు ఐరావతము ఎక్కిపోయేట్లు నేను ఈ హనుమంతుణ్ణి ఆరోహించి సైనికులను పురికొల్పుతూ సేనామధ్యాన వస్తాను. కుబేరుడు సార్వభౌమము అనే ఉత్తరదిగ్గజాన్ని ఎక్కిపోయేట్లు యముడివంటి ఈలక్ష్మణుడు అంగదుణ్ణి ఆరోహించి వస్తాడు. భల్లూకరాజూ మహాబలవంతుడూ అయిన జాంబవంతుడూ సుషేణుడూ వేగదర్శి అనే ముగ్గురున్నూ సేనామధ్యభాగాన్ని కాపాడుతూ రావలెను.

రాముడు ఈవిధముగా చెప్పగానే ఆ వానరవాహినీపతి సుగ్రీవుడు మహాపరాక్రమవంతులు అయిన వానరవీరులను అందరినీ వారివారి సైన్యాలతో ప్రయాణముఅయి పోవలెను అని ఆజ్ఞాపించినాడు.

అంతట వానరసమూహాలు యుద్ధోత్సాహముతో ఎగిరి గంతులువేస్తూ పర్వతశిఖరాలమీదినుంచీ గుహాలలోనుంచీ వచ్చినవి.

అప్పుడు ఆ ధర్మాత్ముణ్ణి రాముణ్ణి లక్ష్మణుడూ సుగ్రీవుడూ పూజించినారు. మహావానరసేనాసమూహము కదిలింది. రాముడి ముందు వెనకలనూ పక్కలనూ ఏనుగులవంటి వానరసైనికులు వందలకొద్దీ వేలకొద్దీ లక్షలకొద్దీ నడిచినారు. సుగ్రీవుడు ఏలుతూఉన్న ఆవానరయోధులు గర్వముతోనూ సంతోషముతోనూ గంతులు వేస్తూనూ గర్జిస్తూనూ సింహనాదాలు చేస్తూనూ పరుగులెత్తుతూనూ గుత్తులు గుత్తులుగా పూలుపూసిన చెట్లు ఎక్కుతూనూ కమ్మని తేనె తాగుతూనూ ఫలమూలాలు తింటూనూ దక్షిణదిక్కుగా సాగిపోయినారు.

ఆ వానరులలో కొందరు గర్వముతో కొందరిని పైకి ఎత్తినారు. ఆ పైకి యెత్తినవారిని కొందరు కింద పడతోసినారు. కింద పడతోసినవారిని కొందరు ఆక్షేపించినారు. కొందరు తమను పడతోసినవారిని తిరిగీ కింద పడతోసినారు.

రాముడివెంట ఉన్న వానరవీరులు అందరూ "మనము రావణాసురుణ్ణి చంపివేయవలెను. రాక్షసులను అందరినీ రూపుమాపవలెను" అంటూ గర్జిస్తూ నడిచినారు.

ఋషభుడూ నీలుడూ కుముదుడూ అనే ముగ్గురు సేనానాయకులూ అనేక మంది వానరవీరులతో ముందుగా దారితీస్తూ పోయినారు. అమిత బలవంతులూ పరమ భయంకరులూ అయిన వానరవీరులమధ్యను సుగ్రీవుడూ రామలక్ష్మణులూ పోయినారు. శతవలి అనే పరమ పరాక్రమవంతుడు పదికోట్లమంది వానరవీరులతో వానరసైన్యాన్ని అంతా కాపాడుతూ నడిచినాడు. కేసరీ పనసుడూ గజుడూ అర్కుడూ అనే మహాబలవంతులు నూరుకోట్ల మందితో ఆ వానర సైన్యాన్ని ఒక పార్శ్వాన కాపాడుతూ నడిచినారు. సుగ్రీవుడి వెనక భల్లూక సేనలతో సుషేణుడూ జాంబవంతుడూ నడిచినారు. పరమ పరాక్రమవంతుడూ యెగిరిపోయే వారిలో శ్రేష్ఠుడూ సమస్త వానరసేనానాయకుడూ అయిన నీలుడు ఆ వానరసైన్యాన్ని అన్నివైపులా తిరిగిచూచుకొంటూ నడిచినాడు. దధిముఖుడు ప్రజంఘుడూ రంభుడూ రభసుడూ మొదలు అయిన వానరవీరులు అన్నివైపులా తిరిగిచూస్తూ త్వరత్వరగా నడవవలెను అని ప్రోత్సహిస్తూ నడిచినారు.

సముద్రము పొంగి పొర్లిపోతూ ఉన్నట్టు ఆ వానరసైన్యము భయంకర కోపుడు అయిన రాముడు ఆజ్ఞాపించినందువల్ల గ్రామాలపక్కకు కానీ నగరాల పక్కకు కానీ పోకుండా సముద్రముకన్నా భయంకరముగా ఘోషిస్తూ ముందుకు సాగిపోయింది. మంచి రౌతు నడిపించే ఉత్తమజాతి గుర్రాలవలె ఆ కపికుంజరులు అందరూ అమిత వేగముతో రాముడికి ఇరువైపులా నడిచినారు. హనుమంతుడూ అంగదుడూ మోసుకొనిపోతూ ఉన్న ఆ మానవోత్తములు రామలక్ష్మణులు అప్పుడు రాహుకేతువులు సగము మింగిన సూర్యచంద్రుల వలె కనిపించినారు.

గోళ్ళూ కోరలూ ఆయుధాలుగా పోరాడే వానరభల్లూక వీరులతో ఉన్న ఆ మహాసేనాసమూహము భూమిని అంతా ఆవరించి నడుస్తూ ఉంటే వారి హస్తాగ్రాలవల్లనూ పాదాగ్రాలవల్లనూ రేగిన దుమ్ము సూర్యప్రభలను కనపడకుండా చేసివేసింది. అంతే కాదు. ఆ దుమ్ము అతి భయంకరముగా లోకము అంతటా ఆవరించింది.

ఆకాశాన్ని మహామేఘాలవలె భూమినీ భూమిమీద ఉన్న పర్వతాలనూ వనాలనూ ఆ దక్షిణదిక్కును అంతా కమ్మివేస్తూ భయంకరము అయిన వానర వాహిని పోయింది. ఆ వానరబలము ఆ విధముగా యోజనాల పర్యంతము

బారులు కట్టి అమిత వేగముతో పోతూ ఉంటే మహానదులూ పర్వతాలు మొదలు
అయినవి అన్నీ వెనకకు పరుగులెత్తుతున్నట్టు కనిపించినవి.

ఆ వానరసైన్యము దారిలో నిర్మలోదకాలు ఉన్న సరస్సులు అడ్డము
అయినప్పుడు పక్కనుంచీ చెట్లు కిక్కిరిసి పెరిగిన పర్వతాలు అడ్డము అయి
నప్పుడు అడుగునుంచీ మిట్టపల్లాలు లేని సమప్రదేశము అడ్డము అయినప్పుడు
అంతటా వ్యాపించినీ ఫలవంతము అయిన వనాలు అడ్డము అయినప్పుడు మధ్య
నుంచినీ పోయినవి. అట్లా సంతోషాతిశయముతో ఆ మహాసైన్యములో వీరులు
అందరూ వాయువేగముతో నడుస్తూ రామకార్యార్థము ప్రతి ఒక్కరూ తమకు
ఉన్నదానికన్నా అధికపరాక్రమము తెచ్చుకొంటూ తమ తమ సంతోషపరా
క్రమ బలాతిశయాలను ఒకండ్లకు ఒకండు చూపించుకొంటూ యౌవ
నోత్సుకతతో తమ తమ దర్పాన్ని వివిధ విధాలా ప్రదర్శించుకొంటూ
సాగిపోయినారు. అప్పుడు ఆ వానరసేనలో కొందరు అమిత వేగ
ముతో నడిచినారు. కొందరు ఎగురుతూ పోయినారు. అరణ్యవాసులు
అయిన కొందరు కిలకిలధ్వనులు చేస్తూ పరుగులెత్తినారు. కొందరు మహా
ధ్వని అయ్యేట్టు తమ తోకలను ఝాడించి నేలమీద కొట్టినారు. కొందరు నేల
అదిరిపోయేట్టు కాళ్ళతో తొక్కినారు. కొందరు చేతులుచాచి కొండరాళ్లను
పెకలించినారు. కొందరు పెద్దపెద్ద చెట్లను విరిచివేసినారు. కొండలమీద తిరిగే
వారు కొందరు పర్వతశిఖరాలు ఎక్కుతూ మహానాదాలు చేసినారు. కొందరు
సింహనాదాలు చేసినారు. కొందరు తమ ఊరువుల వేగముతో రకరకాల లత
లనూ తెంపివేసినారు. కొందరు పరాక్రమవంతులు విజృంభించి రాళ్ళతోనూ
పెద్దపెద్ద చెట్లతోనూ ఆటలాడినారు భయంకరులుఅయిన ఆవానరులు నూర్లు
నూర్లుగానూ వేలు వేలుగానూ లక్షలు లక్షలుగానూ గుంపులుకట్టి కోట్లకొద్దీ
పోతూఉంటే భూమి శోభించింది. సుగ్రీవుడు అందరినీ అన్నివిధాలా కాపా
డుతూ ఉంటే ఆ మహావానరవాహిని సంతోషముతోనూ ఉత్సాహముతోనూ
ఎడతెగకుండా నడిచింది. సీతాదేవిని విడిపించుకుని రావడానికి యుద్ధము చేయ
వలెను. అనే సంతోషముతో ఎక్కడనూ ఒక్క ముహూర్తముసేపు అయినా
కూర్చోకుండా అమిత వేగముతో పోయినారు.

నానావిధ వృక్షలతాదులతోనూ మృగాలతోనూ ఉన్న సహ్యపర్వతమూ
మలయమహీధరమూ ఉన్న చోటికి వానరవాహిని పోయింది. ఆ సహ్య
మలయపర్వతాల మీద ఉన్న నానావిధ అరణ్యాలనూ నదులనూ సెల
యేళ్లనూ రాముడు చూస్తూ ఉన్నాడు. అప్పుడు పెద్దగాలి వీచింది. మనో

హారము అయిన ఆ పర్వతశిలల మీదవున్న నానావిధవృక్షాలూ ఆ గాలికి కదిలి వానరసేనాసమూహము మీద పూలు చల్లినవి. ఆ పుష్పాలలో మధు గంధాన్ని గుబాళిస్తూనూ తుమ్మెదల ఝంకారము అనే పాటలు పాడుతూనూ గాలి చందనము వలె దేహానికి చల్లగా సోకుతూ హాయిగా వీచింది. మనోహరము అయిన ఆ పర్వత సానువులలో విరగ పూసిన మొగలి పొదలూ తెల్లవావిలి చెట్లూ సురివింద చెట్లూ మాధవి లతలూ దుంపరాశ్త్రి చెట్లూ మొల్ల చెట్లూ కానుగ చెట్లూ ఇప్ప చెట్లూ పొగడ చెట్లూ వగిస చెట్లూ తుమ్మికి చెట్లూ బొట్టుగు చెట్లూ నాగకేసర చెట్లూ మామిడిచెట్లూ కలిగొట్టు చెట్లూ కాంచనము చెట్లూ ఖర్జూర చెట్లూ ఏగుమద్ది చెట్లూ ఇరుగుడు చెట్లూ అడవి మల్లెలూ ఎర్రగోరంట చెట్లూ ఈత చెట్లూ వేమి చెట్లూ ఉసిరిగ చెట్లూ కడిమి చెట్లూ నీలాశోక చెట్లూ ఉలిమిరి చెట్లూ ఊడుగు చెట్లూ పద్మకవృక్షాలూ వానరసైన్య కోలాహలానికి కదిలిపోయినవి.

ఆ సహ్యపర్వతముమీద నిర్మల శీతలోదకాలతో నదీబావులూ నీళ్లు నిలిచిన పల్లాలూ జలాశయాలూ వాటి సమీపములో చక్రవాకపక్షులూ కారండవ పక్షులూ నీటికాకులూ క్రౌంచపక్షులూ కనిపించినవి. అక్కడి వనాలలో అడవి పందులూ తరక్షువులూ సింహాలూ పెద్దపులులూ భయంకరము అయిన అనేకరకాల దుష్టసర్పాలూ నివసిస్తున్నవి. ఆ జలాశయాలలో కమలాలూ చెంగల్వలూ తెల్ల కలువలూ నల్ల కలువలూ యింకా వివిధ జలపుష్పాలూ మనోహరముగా వికసించినవి. ఆపర్వత సానువులలో నానావిధ పక్షిగణాలూ పాటలుపాడుతూ ఉన్నవి. వానరులు అందరూ ఆ జలాశయాలలో దిగి ఒకరిమీద ఒకరు నీళ్లు చల్లుకొంటూ ఆటలాడుతూ స్నానము చేసినారు. ఆపర్వతము పైకి పోయినారు. అక్కడ చెట్లను పండిన అమృతమువంటి ఫలాలనూ అక్కడి మూలాలనూ తిన్నారు. అక్కడి పూతేనెను తాగినారు. మదోత్కటులు అయినారు. మధుపింగళవర్ణులు అయిన ఆవానరులు వేళ్లాడుతూ ఉన్న తేనెతుట్టెలలో ఉన్న ద్రోణము ద్రోణము (కుండెడు కుండెడు) తేనెను తాగి సంతోషపడ్డారు. అంతట ఆ వానరపుంగవులు పెద్ద పెద్ద చెట్లను విరిచివేసినారు. లతలను తెంపివేసినారు. పర్వతాలను పగులకొట్టినారు. వారిలో కొందరు తేనెతాగిన మత్తుతో కేకలు వేసినారు. కొందరు చెట్లమీదికి ఎక్కినారు. కొందరు పెద్ద పెద్ద చెట్ల మీదినుంచి గబుక్కున నేలమీదికి దూకినారు. కొందరు చెట్లులేని బయళ్లలో యథేష్టముగా తిరిగినారు. అట్లా వానరులు అందరూ పండిన వరిపైరు వలె అక్కడి భూమి అంతటా కనిపించినారు.

అక్కడనుంచి ఆ రాజీవలోచనుడు రాముడు ఆ మహావానరసైన్యముతో మహేంద్రపర్వతానికి బయలుదేరిపోయినాడు. నానావిధ వృక్షాలతో అలంకా

ముగా ఉన్న మహేంద్రపర్వతాగ్రభాగానికి పోయినాడు. అక్కడనుంచి సముద్రాన్ని చూచినాడు. సమస్తము అయినవారినీ సంతోషపెట్టే ఆ రాముడు లక్ష్మణుడితోనూ సుగ్రీవుడితోనూ ఆ పర్వతశిఖరముమీదినుంచి దిగి వెంటనే ఆ సముద్రతీరానికి బయలుదేరినాడు.

అమితవేగముతో అలలు పైకి లేచి తీరానఉన్న తెల్లటిరాళ్ళను కడిగివేస్తూ ఉన్న ఆసముద్రతీరాన్ని సమీపించి రాముడు సుగ్రీవుణ్ణి చూచి 'ఓ వానరవాహినీపతీ మనము ఈ సముద్రతీరానికి వచ్చినాము మనము వెనుక ఆలోచించిందే ఇప్పుడు కన్నులఎదటికి వచ్చింది. నదులు అన్నిటికీ పెనిమిటిగా ఉన్న ఈసముద్రాన్ని దాటిపోవడము అశక్యము. ఇందుకు మనము ఏదో ఉపాయము ఆలోచించవలెను కాబట్టి మనము ఇక్కడనే విడిదిచేదాము. మన సైన్యాన్ని అవతలిగట్టుకు చేర్చే ఆలోచన చేద్దాము.

ఓసుగ్రీవుడా, సమస్తసేనలూ ఈసముద్రతీరాన్నే దిగవలెను. ఎవరున్నూ తన సైన్యాన్ని వదిలిపెట్టి ఎక్కడికిన్నీ పోకూడదు సేనానాయకులు ఇక్కడను అంతటా తిరుగుతూ ఉండవలెను. మనలను కనిపెట్టడానికి శత్రువులు ఇక్కడను ఎక్కడనుఅయినా దాగుకొని ఉండవచ్చును. అటువంటివారిని మన సేనానాయకులు కనిపెట్టవలెను” అని ఆజ్ఞాపించినాడు.

రామాజ్ఞను శిరసావహించి సుగ్రీవుడు లక్ష్మణుణ్ణి తోడుచేసుకొని ఆ సముద్రతీరాన నానావిధవృక్షాలూ ఉన్నచోట ఆ మహావానరసైన్యాన్ని విడిది చేయించినాడు. అట్లా ఆసముద్రతీరాన విడిదిచేసిన ఆమహాసైన్యము మధుపాండు వర్ణముఅయిన మరి ఒక మహాసముద్రమువలె విరాజిల్లింది. విడిది చేస్తూఉన్న వానరసైన్యసన్నాహధ్వనులలో సముద్రము చేస్తూఉన్న మహాఘోషము లీనము అయిపోయింది.

రామకార్యార్థము బయలుదేరి వచ్చిన సుగ్రీవుడి మహాసైన్యము అప్పుడు మూడు విధాలుగా (వానరవీరులు అందరూ ఒకచెంపనూ గోలాంగూల వీరులు అందరూ ఒక చెంపనూ భల్లూకవీరులు అందరూ ఒక చెంపనూ) విడిదిచేసినారు.

వాయువేగానికి ఎగిరి పడుతూఉన్న ఆ సముద్రాన్ని చూచి ఆ వానర వాహిని అంతా సంతోషపడ్డది.

ఆ సముద్రానికి అవతలిగట్టు యెక్కడ ఉందో తెలియదు. తెలిసినా కొలత వేయడానికి అలవికాదు. దానిని రాక్షసులు సేవిస్తున్నారు. అది వరుణదేవుని నివాసస్థానము. ఎటువంటి మృగాలను అయినా పట్టుకొని మింగివేసే భయంకరము అయిన నక్రాలు అందులో నివసిస్తూ ఉన్నవి. పగలు అయిపోయి

చీకటి పడుతూవుంటే అది భయంకరముగా కనపడుతుంది. తెల్లటి నురుగుతో అది నవ్వుతున్నట్లుగానూ యెంతో యెత్తున లేచే తరంగాలతో అది నృత్యము చేస్తున్నట్టుగానూ ఉంటుంది. చంద్రోదయముతో అది ఉప్పొంగిపోతుంది. అంతట చంద్రప్రతిబింబాలు అంతటా తేజరిల్లుతూ ఉంటవి. ప్రచండ వాయు వేగముతో నక్రగ్రాహాలూ తిమితిమింగిలాలూ అందులో విజృంభిస్తవి. పడగల మీది మణులతో మంటలు మండే మహాసర్పాలు కన్నులు మిరుమిట్లు గొలుపుతవి. ఆ యా మహా జలజంతువులనుంచి అందులోకి పోనలవి కాదు. అందులో వున్న నానావిధ పర్వతాలనుంచీ దూర నలవి కాదు. అందులో ఒక నౌకామార్గము లేదు. అది అగాధము. అటువంటి వరుణాలయాన్ని ఆ రాక్షసాలయాన్ని వానరసేనానాయకులు పరిశీలించి చూచినారు. దాన్ని దాటి పోవడము యెట్లాగా అనే ఆలోచన చేయసాగినారు.

వాయువేగానికి ఎంతో ఎత్తున పెద్దపెద్ద అలలు మకరాలతోనూ మహా సర్పాలతోనూ లేచి కిందపడ్డవి. చంద్రకిరణాల సంపర్కమువల్ల ఆసముద్రములో జలబిందువులు అన్నీ అగ్నికణాలవలె తేజరిల్లినవి. అవి ఆకాశములో నక్షత్రాల వలె తోచినవి. ఇటు సముద్రములోనూ అటు ఆకాశములోనూ మహోరగాలూ అసురాలయాలూ ఉన్నవి. సముద్రము పాతాళమువలె గంభీరము అయింది. అటు ఆకాశమున్నూ అంతే. అటు ఆకాశానికిన్నీ ఇటు సముద్రానికిన్నీ భేదము అగు పించలేదు. సముద్రజలము ఆకాశమువలెనూ ఆకాశము సముద్రజలమువలెనూ ఏ భేదమూ లేకుండా ఒక్క మాదిరిగా తోచింది. ఆకాశములో పరుగులెత్తే మేఘా లకూ ఇటు సముద్రములో పైకి లేచిపోయే అలలకూ తేడా ఏమీ కనిపించలేదు.

ఆఅలలు ఒకదానితో ఒకటి కొట్టుకొని యుద్ధరంగములో భేరుల ధ్వనివలె వినిపించింది. గాలికి లేచే ఆ తరంగజలాలు రత్నసమూహాలకు కొట్టుకొని మహా ధ్వని అయింది. తరంగజలాలలో మొసళ్ళు మొదలుఅయిన జలజంతువులు లేచి నందువల్ల సముద్రము కోపమువచ్చి ఎగిరిపడుతున్నట్టు కనిపించింది. వాయు వుతో లేచే తరంగాలతో సముద్రము ఆకాశములోకి పల్టీలు కొట్టుతున్నట్టు కని పించింది. సుళ్లు తిరుగుతూ మహాఘోషము పెట్టుతూఉన్న ఆమహాసముద్రాన్ని వానరులు మహాశ్చర్యముతో చూచినారు.

౫

ఆ సముద్రము ఉత్తరతీరాన ఆ వానరసైన్యము అంతా దిగింది. వానరసేనా నాయకుడు నీలుడు నియమించిన రక్షకులు హెచ్చరికతో శాస్త్రీయముగా

ఆ సైన్యాన్ని అక్కడ విడిది చేయించినారు. మైందుడూ ద్వివిదుడూ అనే వానరపుంగవులు ఇద్దరూ ఆ సైన్యాన్ని అన్ని దిక్కులా తిరిగి చూస్తూ కాపాడుతూ ఉన్నారు.

అట్లా ఆ సముద్రతీరాన ఆ వానరసైన్యము విడిదిచేసి స్వస్థముగా ఉన్న తరువాత రాముడు తన పక్కను ఉన్న లక్ష్మణుణ్ణిచూచి "తమ్ముడా, దుఃఖము కాలక్రమేణా తగ్గిపోతుంది అంటారు. అటువంటిది నా ప్రియురాలిని చూడకుండా ఉన్న నా దుఃఖము రోజు రోజుకూ అధికము అయిపోతున్నది. నా ప్రియురాలు నాకు దూరము అయిపోయినందుకు నేను దుఃఖ పడటములేదు. ఆమెను రాక్షసుడు ఎత్తుకొని పోయినందుకున్నూ నేను దుఃఖ పడటములేదు. ఆమె ఆయువు అయిపోతున్నది ఏమోను అని దుఃఖపడుతున్నాను."

"ఓ వాయువా, నా కాంత ఎక్కడ ఉందో అక్కడికి పో. ఆమెను స్పృశించు. ఆమెను స్పృశించిన తరువాత అక్కడినుంచి వచ్చి నన్ను స్పృశించు. నాకు ఆమె దేహస్పర్శము అయినట్టుగా సంతోషిస్తాను. చంద్రబింబాన్ని చూచి నా ప్రియురాలి ముఖబింబాన్ని చూచినట్టు నేను సంతోషపడుతుంటాను. అందువల్ల ఆమె ముఖబింబాన్ని చూడటము చంద్రుడి అధీనము అయింది. అదే విధముగా ఆమె స్పర్శసౌఖ్యము అనుభవించడము ఓ వాయువా నీ అధీనము అయింది.

"తమ్ముడా, సమస్తభోగాలూ త్యజించివేసి నా వెంట అడవికి వచ్చిన ఆ నా ప్రియురాలిని రాక్షసుడు ఎత్తుకొని పోతూ ఉంటే "అయ్యో, నాథా" అన్న దీనాలాపము నా హృదయములో గుచ్చుకొన్నది. ఆ ఆర్తాలాపము నేను తాగిన విషమువలె నా దేహాన్ని దహించి వేస్తున్నది. ఆమె వియోగమే కట్టెలు గానూ, ఆమెను గురించిన ఎడతెగని చింతే మంటలుగానూ మదనాగ్ని నా దేహాన్ని రేయింబగళ్లూ దహించి వేస్తున్నది.

"లక్ష్మణా, ఇప్పుడు నేను నిన్ను వదిలిపెట్టి ఈ సముద్రములో పడుకొంటాను. మంటలు మండుతూ ఉన్న మన్మథుడు నీళ్లలో పడుకొన్న నన్ను ఏ మాత్రమూ దహించి వేయలేడు. నేనూ ఆమే ఒక్క భూమిమీదనే ఉండటము ఇప్పటికి గొప్ప విషయమే. ఆమె జీవించి ఉండటమునుంచే నేనూ జీవించి ఉన్నాను. నీళ్లులేని పొలములో పయిరు చేరువలో నీళ్లు ఉన్న పొలము తేమనుంచి బ్రతికి ఉంటుంది. అదే విధముగా ఆమె బ్రతికి ఉంది అని విన్నాను. నేను బ్రతికి ఉన్నాను. నేను శత్రువులను జయించి ఆ సుశ్రోణిని ఆ శతపత్రాయతాక్షిని సర్వసంపన్న అయిన లక్ష్మీదేవివంటి ఆ సీతాదేవిని ఎప్పుడు

చూస్తానో. పద్మమువంటి ఆమె ముఖాన్ని కొంచెము పైకి ఎత్తి సొగసు అయిన దొండపండ్లవంటి పెదవులలో నుంచి రోగిరసాయనాన్ని వలె ఆమె అధరామృతము నేను ఎప్పుడు తాగుతానో. ఒకదానితో ఒకటి ఒరసుకొని పోయిన తాటిపండ్లవంటి పీనస్తనాలు వణికిపోతూ ఆమె నన్ను ఎప్పుడు కౌగలించుకొంటుందో, నేను నాథుణ్ణి అయి ఉండిన్నీ ఆ అసితాపాంగి నా సతి నాథుడు లేని దానివలె రాక్షసుల మధ్య పడిపోయి కాపాడే దిక్కు లేకుండా ఉంది. నా ప్రియురాలు జనకమహారాజు కూతురు—దశరథమహారాజు పెద్ద కోడలు—ఆమె రాక్షసాంగనల మధ్యను ఎట్లా నిద్రపోకలుగుతున్నదో. నల్లని మేఘాలను తొలగతోసుకొని బయటపడే శరచ్చంద్రరేఖవలె క్షోభపెట్ట నలవికాని రాక్షసులను తొలగతోసుకొని ఆమె ఎప్పుడు నా ఎదటికి వస్తుందో. ఆమె నైసర్గికముగ బక్క పలుచనిది. దేశకాల విపర్యయమువల్లనూ దుఃఖము వల్లనూ ఉపవాసాదులవల్లనూ ఆమె ఇప్పుడు మరింత కృశించిపోయి ఉంటుంది. నిజము.

"లక్ష్మణా, నేను నా మనోదుఃఖము వదిలిపెట్టి ఆ రాక్షసుడి వక్షస్థలాన్ని బాణముతో ఛేదించి సీతాదేవిని తిరిగి తెచ్చుకోవడము ఎప్పుడు జరుగుతుంది. దేవకన్యవంటి ఆ సాధ్వి తహతహలాడుతూ నా కంఠాన్ని కౌగలించుకొని ఆనందబాష్పాలు ఎప్పుడు వదులుతుంది మలినవస్త్రాన్ని విడిచివేసేటట్టు సీతావియోగమువల్ల వచ్చిన యీ భయంకరదుఃఖాన్ని నేను యెప్పుడు వదలిపెట్టుతాను" అంటూ ఆ బుద్ధిమంతుడు రాముడు విలపిస్తూవుంటే దినాంతము అయింది. దివాకరుడి కాంతులు మందగించినవి. సంధ్యాకాలము ఐంది. దుఃఖముతో వ్యాకులముతో ఆ కమలపత్రాయతాక్షిని సీతాదేవిని తలచుకొంటూ రాముడు సాయంసంధ్యను ఉపాసించినాడు.

సంధ్యావందనము పూర్తిచేసిన లక్ష్మణుడు రాముణ్ణి చూచి "అన్నా, నీవు అచిరకాలములోనే సీతాదేవిని చూస్తావు. రావణాసురుణ్ణి సంహారము చేసివేస్తావు. నీ కోరికలు అన్నీ ఈడేరుతవి. సర్వసమృద్ధార్థము అయిన అయోధ్యానగరానికి తిరిగిపోతావు. నీకు కార్యసిద్ధి అవుతుంది అని తెలియచెప్పడానికి ఇప్పుడు భూమిమీదనూ ఆకాశములోనూ మహాశుభనిమిత్తాలు కనపడుతున్నవి. వాయువు శుభకరముగానూ హితకరముగానూ మృదువుగానూ సేనలమీద వీస్తూ ఉంది. మృగాలూ పక్షులూ మధురధ్వనులు చేస్తూ వున్నవి. దిశలు అన్నీ ప్రసన్నముగా ఉన్నవి.

"ఓరామా, నీ వెనుక శుక్రుడు ప్రసన్నకాంతులతో ప్రకాశిస్తున్నాడు. పరిశుద్ధులు అయిన సప్తర్షులు కాంతిమంతులుగా ధ్రువుడికి ప్రదక్షిణము చేస్తు

న్నారు. మన ఎదుట ఇక్ష్వాకు వంశీయుడు మన పితామహుడూ రాజర్షి అయిన త్రిశంకువు పురోహితుడు అయిన వసిష్ఠమహర్షితో కూడా నిర్మలముగా భాసిస్తున్నారు. మన ఇక్ష్వాకువంశపవిత్రము అయిన విశాఖ నిర్మలముగా నిరుపద్రవముగా తేజరిల్లుతూ ఉంది. నిర్ఋతిదేవతాకమూ రాక్షసుల నక్షత్రమూ అయిన మూలను పక్కనున్న ధూమకేతువు పొగలు క్రమ్ముకొన్నవి ఇవి అన్నీ రాక్షసుల వినాశకాలము ఆసన్న మవుతున్నట్టు సూచిస్తున్నవి.

"అన్నా, ఇక్కడి జలాలు స్వచ్ఛముగా ఉండడమే కాకుండా రుచ్యముగా ఉన్నవి. వనాలు అన్నీ ఫలపూర్ణముగా ఉన్నవి. ఋతూచితముగా పూచిన వృక్షాల మీదినుంచి సుగంధము గుబాళిస్తూ ఉంది.

"ప్రభూ, వ్యూహాలు వ్యూహాలుగా ఉన్న యీ వానర సైన్యాలు పూర్వము తారకాసుర సంహారానికి బయలుదేరి పోయిన దేవసేనలవలె తేజరిల్లుతూ ఉన్నవి. ఓ పూజ్యుడా, నీవు ఇవి అన్నీ చూచి సంతోషపడవలెను. దిగులు పడనక్కరలేదు" అంటూ లక్ష్మణుడు సంతుష్టుడు అయి రాముణ్ణి ఊరడించినాడు.

## ౬

దేవేంద్రుడివంటి పరాక్రమముతో హనుమంతుడు ఆ లంకాపట్టణములో ఘోరమూ భయావహమూ అయిన పనులు చేసిపోయినాడు. అందుకు రాక్షసేంద్రుడు రావణాసురుడు సిగ్గుపడిపోయినాడు. కొంచెము తల వంచుకొని రాక్షసులను అందరినీ చూచి "ఓ రాక్షసవీరులారా, యింతవరకూ యెవరికీ లోపలికి రా వలవికాకుండా ఉన్న మన లంకా పట్టణానికి ఒక కోతివాడు రావడమే కాకుండా జనకరాజపుత్రిని చూచి ఎవరినీ లెక్క చేయకుండా అందరినీ అవమానించి పోయినాడు. వాడు చైత్యప్రాసాదాన్ని పగులగొట్టినాడు. రాక్షసవీరులను చంపివేసినాడు. లంకాపట్టణాన్ని అంతా వ్యాకుల పెట్టినాడు. ఇకను ఇప్పుడు మనము ఏమిచేయవలెనో మీరు అందరూ ఆలోచించి చెప్పవలెను.

"ఓ రాక్షసులారా, మీరు మహా బలవంతులు. మంచి ఆలోచనాపరులు. జయము మంత్రమూలము అని పెద్దలు చెప్పుతూ ఉంటారు. అందువల్ల మీరు ఆలోచించి చెప్పవలెను, రాముణ్ణి ఏమి చేయవలెనో ఆలోచించండి. చెప్పండి. నేను వినవలెను అనుకొంటున్నాను. ఈలోకములో పురుషులు అందరూ

ఉత్తములూ మధ్యములూ అధములు అనే మూడు విధాలుగా కనపడుతున్నారు. అయితే వాండ్ల భేదము తెలుసుకోటము కష్టము. వారి గుణదోషాలు నేను చెప్తాను, వినవలసింది.

"తమ మేలుకోరే నేర్పరులు అయిన మంత్రులలో కానీ తమతో పాటు సరిసమానముగా సుఖదుఃఖాలు అనుభవించే మిత్రులతో కానీ తమ మేలు కోరే పెద్దలతో కానీ చక్కగా ఆలోచించి అదృష్టాన్ని నమ్మి ఆరంభించి పనులు చేసేవాణ్ణి ఉత్తముడు అంటారు. తాను ఒక్కడే ఆలోచించి అదృష్టము మీద మనస్సు ఉంచి కార్యనిశ్చయము చేసేవాణ్ని మధ్యముడు అంటారు. మంచి చెడ్డలు ఆలోచించకుండా అదృష్టాన్ని లెక్క చేయకుండా తాను ఒకపని చేయవలెను అనుకొని ఆపని చేయకుండా ఉపేక్షించే వాణ్ణి అధముడు అంటారు.

ఇదే విధముగా మంత్రాంగమున్నూ ఉత్తమ మధ్యమ అధమములు అనే మూడు విధాలుగా ఉంది. మంత్రులలో భిన్నాభిప్రాయాలు లేకుండా శాస్త్ర దృష్టితో చేసే ఏకనిర్ణయము ఉత్తమ మంత్రాంగము. మంత్రులు అందరూ భిన్నాభిప్రాయాలతో ఉంటూ కార్యావసరాన్ని పట్టి చేసే ఏకనిర్ణయము మధ్యమ మంత్రాంగము. మంత్రులు అందరూ పరస్పర విరుద్ధాభిప్రాయాలతో ఉంటూ ఎవరికి తోచినట్టు వారు చెప్పుతూ ఎన్నడూ ఏకాభిప్రాయానికి రాక పోవడము అధమ మంత్రాంగము.

"ఓమంత్రి సత్తములారా, మీరు అందరూ చక్కగా ఆలోచించి ఏమి చేయవలెనో చెప్పవలెను. రాముడు వీర్యవంతులు అయిన అనేక వేల మంది వానరవీరులతో మనమీదికి యుద్ధానికి వస్తాడు. అతడు మహాబలవంతుడు. తన పరాక్రమముతో సముద్రాన్ని ఎండకొట్టి వేయకలడు. లేదా మరి ఒకవిధముగా చేయకలడు. ఏమి అయినప్పటికిన్నీ తమ్ముడితోనూ బలవంతులు అయిన అనుచరులతోనూ రాముడు అనాయాసముగా సముద్రాన్ని దాటి వస్తాడు. సందేహము లేదు. అతడు వానరసైన్యముతో వస్తే మన లంకా పట్టణానికిన్నీ మన రాక్షస సైన్యాలకున్నూ కీడు మూడకుండా క్షేమముగా ఉండేటందుకు మీరు అందరూ చక్కగా ఆలోచించవలెను" అని చెప్పినాడు.

౨

ఇట్లా రావణాసురుడు చెప్పినమాటలు విని రాక్షసులు అందరూ చేతులు జోడించి "ప్రభూ ఎవరు అయినా శత్రుపక్ష బలాబలాలు తెలుసుకోకుండా తమకు తోచినట్టు నిర్ణయించుకోడము నీతి బాహ్యము ఓరాజా పరిఘులతోనూ

శక్తులతోనూ ఋష్టి శూలాలతోనూ పట్టిసాలతోనూ ఇంకా వివిధాయుధాలతోనూ మహా గొప్ప సైన్యమున్నది.

"ఓ రాజా, నీవు భోగవతీపట్టణానికి పోయి యుద్ధముచేసి పన్నగులను అందరినీ జయించినావు. ఓ ప్రభూ, మహేశ్వరుడితో సఖ్యముచేసి అనేకమంది యక్షులతో కైలాసశిఖరము మీద నివాసము పెట్టుకొన్న ఆ మహాబలవంతుణ్ణి అందరి ధనపతులు అనుకొన్న లోకపాలకుణ్ణి కుబేరుణ్ణి నీవు కోపమువచ్చి యుద్ధముచేసి జయించినావు. యక్షవీరులను నాశనముచేసి యక్షసమూహాలను నానాబాధలూ పెట్టి పుష్పకవిమానాన్ని ఆ కైలాసశిఖరము మీదినుంచి తెచ్చుకొన్నావు. ఓ రాజా, నీ భయమునుంచి దానవేంద్రుడు అయిన మయుడు నీతో చెలిమి చేయవలెను అనుకొని తన కూతురిని మండోదరిని నీకు భార్యగా సమర్పించినాడు. ఓ ప్రభూ పరమపరాక్రమవంతుడూ దురాసదుడూ అయిన మధువు అనే దానవుణ్ణి నీవు జయించి వశపరచుకొన్నావు.

"ఓ మహాబాహూ, నీవు రసాతలానికి పోయి నాగరాజులు అయిన వాసుకినీ తక్షకుణ్ణీ శంఖుణ్ణీ జటినీ జయించి లోపరచుకొన్నావు. నీవు శత్రుసంహారకుడవు. చచ్చిపోకుండా ఉండడానికి బ్రహ్మదేవుడి వరాలు సంపాదించిన మహాబలవంతులూ శూరులూ అయిన కాలకేయాది రాక్షసులతో యుద్ధముచేసి జయించి నీవు వశపరచుకొన్నావు. ఆ కాలకేయాది రాక్షసుల మాయలు అన్నీ నీవు నేర్చుకొన్నావు. మహాబలవంతులు అయిన లోకపాలకులను జయించినావు. ఇక్కడినుంచీ దేవలోకము పోయి నీవు దేవేంద్రుణ్ణి కూడా జయించినావు. ఓ రాజా, శూరులూ బలవంతులూ అయిన వరుణదేవుడి పుత్రులను వారి చతుర్విధ సేనలతోనూ నీవు జయించినావు.

"ఓ రాజా, నీవు యమదండమే మహాగ్రాహముగానూ శాల్మల్యాయుధాలు అలంకరించిన మహావృక్షాలుగానూ యమపాశము మహాతరంగముగానూ యమకింకరులు సర్పాలుగానూ ఉండే యమసముద్ర సైన్యములోకిపోయి యముణ్ణి తోసివేసి గొప్ప జయము సంపాదించినావు. అక్కడ నీవుచేసిన యుద్ధానికి సర్వలోకాలూ సంచలించి పోయినవి. దేవేంద్రుడితో సరిసమానము అయిన పరాక్రమవంతులు అనేకమంది క్షత్రియులు ఈ భూమిమీద వృక్షాలు వలె అక్కడ పరమదుర్జయులుగా ఉన్నవారిని అందరినీ నీవు కొట్టినావు. వీర్యోత్సాహాది గుణాలలో ఆ క్షత్రియులతో రాముడు సరిసమానము అయిన వాడు కాడు.

"ఓ రాజా, నీవు ఊరికే ఉండు. నీవు శ్రమ పడడము ఎందుకు. మహాబాహువు ఇంద్రజిత్తు ఒక్కడూ ఆ వానరులను అందరినీ సంహారము చేసి

చేయకలము. మహారాజా, సర్వోత్కృష్టము అయిన యజ్ఞము చేసి ఇంద్రజిత్తు మహేశ్వరుణ్ణి మెప్పించి ఈ లోకములో పరమదుర్లభము అయిన వరము సంపాదించినాడు. శక్తి తోమరాద్యాయుధాలు చేపలుగానూ వెదచల్లిన పేగులు నాచుగానూ ఏనుగులు తాబేళ్లుగానూ గుర్రాలు కప్పలుగానూ ఏకాదశరుద్రులూ ద్వాదశాదిత్యులూ మహాగ్రాహాలుగానూ సప్త మరుత్తులూ అష్టవసువులూ మహాసర్పాలుగానూ రథాలూ గుర్రాలూ ఏనుగులూ జలసమూహాలుగానూ కాలిబంట్లు ఇసుక దిబ్బలుగానూ ఉన్న దేవతల సైన్యము అనే మహాసముద్రములోకి పోయి ఇంద్రజిత్తు దేవేంద్రుణ్ణి పట్టుకొని ఈ లంకాపట్టణానికి తీసుకొని వచ్చినాడే. ఓ ప్రభూ, నీవు బ్రహ్మదేవుడు చెప్పినందువల్ల ఆ దేవేంద్రుణ్ణి వదిలి పెట్టినావు. అట్లా కదా సర్వదేవతలూ నమస్కరించే ఆ దేవేంద్రుడు వృత్రాసురుణ్ణి శంబరాసురుణ్ణీ వధించిన ఆ దేవేంద్రుడు స్వర్గలోకానికి పోయింది. మహారాజా! నీవు ఇంద్రజిత్తును వదిలిపెట్టు. అతడు వానరసైన్యాన్ని అంతా రాముడితో కూడా నాశనము చేసి వేస్తాడు.

"ఓ రాజా, హనుమంతుడు అల్పుడు. వాడు కలగచేసిన ఆపదను గురించి ఆలోచించడము అనవసరము. నీవు అది మనస్సులో నయినా ఆలోచించవద్దు. నీవు రాముణ్ణి వధించి వేస్తావు" అని చెప్పినారు.



ఇట్లా రాక్షసులు అందరూ చెప్పిన తరువాత నీలమేఘమువంటి వాడూ శూరుడూ రాక్షససేనాధిపతీ అయిన ప్రహస్తుడు వినయముతో "ఓ ప్రభూ, దేవదానవగంధర్వులకు కానీ పిశాచపతగోరగులకు కానీ యుద్ధములో నిన్ను ఎదిరించే శక్తి లేదు. ఇకను వానరులా నిన్ను జయించేది. లంకాపట్టణములో తమను ఎవరూ ఏమీ చేయలేరు అనే నమ్మకముతో రాక్షసులు ఉంటూ ఉన్న సమయములో హనుమంతుడు వచ్చినాడు. పయిగా రాక్షసులు అందరూ భోగపానపారవశ్యములో ఉన్నారు. అటువంటి అప్పుడు హనుమంతుడు మోసము చేసినాడు, నేనే వణ్ణి ఎరుగ్గున్నట్లయితే ప్రాణాలతో వాణ్ణి పోనిచ్చి ఉండే వాణ్ణికాను.

"రాజా, నీవు నన్ను ఆజ్ఞాపించు. సముద్రము పొలిమేరగా పర్వతాలతోనూ వనాలతోనూ మహారణ్యాలతోనూ ఉన్న ఈ భూమిమీద ఎక్కడనూ ఒక్క వానరుడు అయినా ఉండకుండా చంపి వేస్తాను. నీ అపరాధానికి దుఃఖపడవద్దు. వానరులనుంచి నిన్ను నేను కాపాడుతాను అని చెప్పినాడు.

అంతట దుర్ముఖుడు అనే రాక్షసవీరుడు మహాకోపముతో లేచి "ఓరాజా, హనుమంతుడు మనలను అందరినీ అవమానించినాడు. వాడు వానరమాత్రుడు. వాడు వచ్చి మనపురాన్నీ అంతఃపురాన్నీ రాక్షసేంద్రుడవు అయిన నిన్నూ చికాకు పెట్టినాడు. ఇది ఎంతమాత్రమూ క్షమించడానికి వీలులేదు. నేను ఒక్కణ్ణే ఇప్పుడు పోతాను. ఆవానరులు అందరూ సముద్రములో చొరబడ్డా ఆకాశానికి ఎగిరినా పాతాళలోకములోపోయి దాగుకొన్నా వాళ్లను అందరినీ పట్టుకొని చంపివేసి తిరిగివస్తాను" అని చెప్పినాడు.

అంతట వజ్రదంష్ట్రుడు అనే మహాబలవంతుడు అయిన రాక్షసవీరుడు మరింత క్రుద్ధుడుఅయి నెత్తురూ మాంసమూ అంటుకొని పరమభయంకరముగా కనపడుతూఉన్న ఒక పెద్ద ఇనుపగుదియను చేతిలోపట్టుకొని "ఓరాజా, రాముడు ఎదిరించనలవికానివాడు. వాడు లక్ష్మణుడితోనూ సుగ్రీవుడితోనూ ఉంటూఉన్నాడు. దీనుడూ భీరువూఅయిన హనుమంతుడితో మనకు పనిఏమిటి. నేను ఒక్కణ్ణే పోయి నాఈ ఇనుపగుదియతో ఆరాముణ్ణి సుగ్రీవుడితోనూ లక్ష్మణుడితోనూ చంపివేస్తాను. వానరసైన్యాన్ని చీకాకుపరిచి వస్తాను.

"ఓరాజా, ఉపాయకుశలుడూ జాగరూకుడూ అయినవాడే శత్రువులను జయించకలుగుతాడు. కావలెనుఅంటే మరిఒక ఉపాయము చెప్పుతాను. వినవలసింది. కామరూపులూ శూరులూ భయంకరాకారాలూ అయిన రాక్షసులు ఒక వెయ్యిమంది పని చక్కపెట్టడానికి మానవరూపము ధరించి రాముడి దగ్గరకు పోవలెను. వాండ్లు తడపడకుండా రాముడితో తమను భరతుడు పంపించినాడు అనీ అతడు ఇంకా సైన్యాలతో వెనకనుంచి వస్తున్నాడు అనీ చెప్పవలెను. ఇంతలో మేము కొందరము శూలాలతోనూ ఈటెలతోనూ ఖడ్గాలతో నూ గదలతోనూ విల్లంబులతోనూ పోయి ఆకాశములో గుంపులు గుంపులుగా చేరి ఆవానరసైన్యముమీద వివిధాయుధాలనూ రాళ్లనూ వానగా కురిపిస్తాము. అప్పుడు ఆ వానరసైన్యము అంతా యమసదనానికి పోతుంది. ఆ అపత్సమయములో ఆ రామలక్ష్మణులకు ఏమిచేయడానికీ తోచకుండాపోతుంది. అంతట వాండ్లు అవశ్యమూ ప్రాణాలు వదులుతారు" అని చెప్పినాడు.

అప్పుడు కుంభకర్ణుడి కొడుకు మహాపరాక్రమవంతుడూ వీరుడూ అయిన నికుంభుడు అనే వాడు పరమ క్రుద్ధుడుఅయి లేచి "ఓ రాజా, నీవు లోకాలను అన్నిటినీ గగ్గోలు పెట్టకలవాడవు. నీవు ఈ రాక్షసులు అందరితోనూ ఇక్కడనే ఉండు, నేను ఒక్కణ్ణే పోయి రాముణ్ణీ లక్ష్మణుడితోకూడా సుగ్రీవుణ్ణీ హనుమంతుణ్ణీ వారు వీరు ఏమిటి అందరినీ చంపివేసి వస్తాను" అని చెప్పినాడు.

అంతట పర్వతాకారుడు వజ్రహస్తుడు అనే రాక్షసవీరుడు క్రుద్ధుడుఅయి నాలుకతో పెదవులు నాకుతూ "ఓ రాక్షసులారా, మీరు అందరూ నిర్భయముగా యథేష్టముగా మీమీ పనులు చేసుకొంటూ ఇక్కడ ఉండండి, నేను ఒక్కణ్ణే పోయి ఆ వానర సమూహాలను అన్నిటినీ భక్షించి వేస్తాను. మీరు నిశ్చింతగా స్వస్థముగా మద్యపానముచేస్తూ క్రీడిస్తూ ఉండండి. నేను ఒక్కణ్ణే లక్ష్మణుడితో కూడా సుగ్రీవుణ్ణీ అంగదుణ్ణీ హనుమంతుణ్ణి రణకుంజరుడు అయిన ఆ రాముణ్ణీ చంపి వేస్తాను" అని చెప్పినాడు.

౯

అంతట నికుంభుడూ రభసుడూ మహాబలవంతుడు అయిన సూర్యశత్రువూ సుప్తఘ్నుడూ యజ్ఞహుండూ మహాపార్శ్వుడూ మహోదరుడూ దుర్ధర్షుడు అయిన అగ్నికేతువూ రశ్మికేతువూ మహాతేజోవంతుడూ మహాబలవంతుడూ రావణాసురుడి పుత్రుడూ అయిన ఇంద్రజిత్తూ ప్రహస్తుడూ విరూపాక్షుడూ మహాబలవంతుడు అయిన వజ్రదంష్ట్రుడూ ధూమ్రాక్షుడూ అతికాయుడూ దుర్ముఖుడూ మొదలు అయిన రాక్షసవీరులు అందరూ పరమక్రుద్ధులు అయి పరిఘలూ పట్టిసాలూ ప్రాసాలూ శక్తులూ శూలాలూ గండ్రగొడ్డళ్ళూ విల్లంబులూ మహానిశిత ఖడ్గాలూ తీసుకొని పరమ పరాక్రమముతో తేజరిల్లుతూ రావణాసురుడి వంక చూచి "ఓ ప్రభూ మేము పోయి రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ సుగ్రీవుణ్ణీ మన లంకాపట్టణాన్ని చెదరకొట్టి పోయిన నీచుణ్ణి హనుమంతుణ్ణీ చంపివేసి తిరిగి వస్తాము" అని చెప్పినారు.

అట్లా ఆయుధాలతో లేచిన వారిని అందరినీ అప్పుడు విభీషణుడు నివారించి వారిని అందరినీ కూర్చుండపెట్టి చేతులు జోడించి రావణాసురుణ్ణి చూచి "అన్నా, సామదానభేదాలు అనే మూడు ఉపాయాలతోనూ కార్యము సాధించలేక పోయేట్లయితే దండోపాయము ఉపయోగించవలెను అని పెద్దలు చెప్పతూ ఉంటారు.

"ఓ అన్నా, ఏమరుపాటుతో ఉన్న వారినీ విషయాసక్తులు అయిన వారినీ విరక్తులు అయిన వారినీ రాజులు ఒకరితో ఒకరు పోట్లాడు కొంటున్న వారినీ దైవము ప్రతికూలము అయిన వారినీ బాలురను వృద్ధులనూ దీర్ఘరోగులూ మొదలు అయిన వారినీ రాజనీతి ప్రకారము చక్కగా ఆలోచించి దండోపాయము ప్రయోగిస్తే కార్యము సిద్ధిస్తుంది.

"రాముడు ఏమరుపాటు లేనివాడు. అతడు విజిగీషువు. బలవంతుడు. కోపాన్ని జయించినాడు. దురాధర్షుడు. అటువంటివాణ్ణి ఎట్లా ఎదిరించవలెను

అనుకొంటున్నారు—హనుమంతుడు మహాభయంకరముఅయిన సముద్రాన్ని లంఘించివచ్చినాడు. అట్లా లంఘించడము దుర్ఘటముఅయిన కార్యము. ఎవడూ అట్లా సముద్రాన్ని లంఘించగలడు అని మనస్సులోనయినా అనుకోడు.

"ఓ నిశాచరులారా, శత్రువుల బలమూ పరాక్రమమూ అప్రమేయముగా ఉన్నవి. మీరు ఆలోచించకుండా హఠాత్తుగా ఆ బలపరాక్రమాలు ఎటువంటివి అయినప్పటికిన్నీ చులకనచేసి మాట్లాడటము మంచిది కాదు. రాముడు ఇదివరకు ఖరాదులను సంహారముచేసి మన ప్రభువుకు అపకారము చేసినాడు. ఆ యశస్వి భార్యను జనస్థానమునుంచి మన ప్రభువు ఎత్తుకొనివచ్చినాడు. ఖరుడే ముందుగా రాముణ్ణి చంపబోయినాడు. యుద్ధములో రామునిచేతిలో చచ్చిపోయినాడు. ప్రాణికోటి తనశక్తికొద్దీ తనప్రాణాన్ని కాపాడుకొంటూ ఉంటుంది. అదేవిధముగా రాముడు చేసినాడు.

"ఓ రాక్షసులారా, పరదారలను తెచ్చడమువల్ల అపకీర్తివస్తుంది. ఆయుష్షు క్షీణిస్తుంది. ధనము నాశనము అయిపోతుంది. ఇంకా అనేక పాపాలు పట్టుకొంటవి. మనకు ఇప్పుడు ఆ వైదేహినుంచి మహాభయము వచ్చింది. ఆమెను తెచ్చినందువల్ల ప్రయోజనముఏమిటి? ఇప్పుడు కలహము లేకుండా ఉండవలెను అనేట్లయితే ఆమెను పరిత్యజించవలెను. రాముడు మహాపరాక్రమశాలి. ధర్మానువర్తి. అతనితో నిరర్థకముఅయిన వైరముపెట్టుకోడము మనకు మంచిది కాదు. అతనికి ఆ మైథిలిని ఇచ్చివేయవలెను. ఏనుగులతోనూ గుర్రాలతోనూ అనేక రత్నాలతోనూ ఉన్న ఈ లంకాపట్టణాన్ని రాముడువచ్చి బాణాలతో చీల్చివేయక పూర్వమే మైథిలిని పంపించివేయవలెను. మహాభయంకరమూ దురాధర్షమూ అయిన వానరమహాసైన్యమువచ్చి లంకాపట్టణాన్ని ముట్టడించక పూర్వమే సీతాదేవిని రామునికి ఇచ్చివేయవలెను. ఆ రామునికి అతని ప్రియభార్యను మనము స్వయముగా ఇవ్వకపోయేట్లయితే ఈ లంకాపట్టణము నాశనము అయిపోతుంది. రాక్షసవీరులు అందరూ హతముఅయిపోతారు.

"ఓ ప్రభూ, నీకూ నాకూ ఉన్న బంధుత్వమునుంచి నిన్ను నేను వేడుకొంటున్నాను. నేను చెప్పినట్టు చేయవలసింది. నేను నీ మేలుకోసము యథార్థము చెప్పుతున్నాను. రామునికి నీవు ఆ మైథిలిని ఇచ్చివేయవలెను.

"ప్రభూ, ఆ రాజకుమారుడు రాముడు శరత్కాల సూర్యకిరణాలవంటి బాణాలను కొత్తగా కొనలూ మొదళ్లూ వేసినవాటిని దృఢముఅయినవాటిని అమోఘముఅయిన వాటిని నిన్ను చంపివేయడానికి వదలకపూర్వమే మైథిలిని నీవు ఆ దాశరథికి ఇచ్చివేయడము మంచిది. కోపమువల్ల ధర్మమూ సుఖమూ

నాశనముఅయిపోతవి. అందువల్ల కోపాన్ని వదలిపెట్టు. ధర్మాన్ని భజించు. నీ కీర్తి అధికము అవుతుంది. నీ సంతోషము వృద్ధిఅవుతుంది. అనుగ్రహించు. మనము సపుత్రబాంధవముగా బ్రతికి ఉందాము. ఆ దాశరథికి ఆ మైథిలిని ఇచ్చివెయ్యి" అని చెప్పినాడు.

ఇట్లా విభీషణుడు చెప్పిన మాటలను ఆ రాక్షసేశ్వరుడు రావణాసురుడు విని రాక్షసులను అందరినీ పంపించివేసి తన అంతఃపురములోకి పోయినాడు.

## ౧౦

ఆ రాత్రి కడచిపోయింది. ప్రాతఃకాలము అయింది. ఆ మహాద్యుతి మంతుడు ఆ వీరుడు విభీషణుడు ధర్మార్థాలను నిశ్చయించినాడు. రావణాసురుడికి మేలు చేయడము అనే భయంకరము అయిన పని చేయడానికి బయలుదేరినాడు.

రావణాసురుడి గృహము పర్వతశిఖరసమూహాలతో పర్వతము అంత ఎత్తు అయింది. ఆ గృహములో మహాకక్ష్యలు అన్నీ చక్కగా విభజించి నిర్మించినవి. మతిమంతులూ స్వామి భక్తి పరాయణులూ అయిన మహామంత్రులూ వేద వేదాంగాలు అభ్యసించిన మహాజనులూ ఆ గృహావరణములోనే నివసిస్తూ ఉన్నారు. ఆప్తులూ సమర్థులూ అయిన రాక్షసులు అక్కడ అంతటా కావలి ఉన్నారు.

అప్పుడు మదపుటేనుగుల నిట్టూర్పులతో గాలి వ్యాకులముగా వీస్తూ ఉంది. శంఖఘోషమహానాదమూ వాద్యధ్వనులూ ప్రతిధ్వనిస్తూ ఉన్నవి. ప్రమదాజనము కిటకిటలాడుతూ ఉంది. అక్కడి మహాపథములో కలకల ధ్వనులు చెలరేగుతున్నవి.

ఉత్తమాభరణాలతో అలంకరించిన తోరణాలతోనూ బంగారు తిన్నెలతోనూ గంధర్వనివాసము వలెనూ దేవతల నికేతనము వలెనూ రత్నసమూహాలతో సర్పరాజుల భవనము వలెనూ ఉండే ఆ రాక్షసాధిపతి రావణాసురుడి భవనములోకి మహామేఘాలలోకి పోయే సూర్యుడివలె దేహకాంతులతో తేజరిల్లుతూ విభీషణుడు పోయినాడు. వేదవేత్తలు రావణాసురుడి విజయము కోసము పఠిస్తున్న పుణ్యాహమంత్రధ్వనులు వింటూనూ మంత్ర వేద విదులు అయిన బ్రాహ్మణులు పట్టుకొని ఉన్న దధిపాత్రలనూ ఘృతపాత్రలనూ అక్షతలనూ పూలదండలనూ చూస్తూనూ రాక్షసులు పూజిస్తూ ఉంటే స్వతేజముతో దేదీప్యమానముగా సింహాసనముమీద విరాజిల్లుతున్న కుబేరుడి తమ్ముణ్ణి తన అగ్రజుణ్ణి రావణాసురుణ్ణి విభీషణుడు చూచినాడు. నమస్కారము చేసినాడు.

ఆ విభీషణుడు ఆచారశీలుడు. అందువల్ల ఆ సమయమర్యాదను అనుసరించి "జయ జయ"లు చెప్పినాడు. రావణాసురుడి కన్ను సంజ్ఞలను పట్టి బంగారముతో అలంకరించిన ఆసనము మీద కూర్చున్నాడు. అప్పుడు అక్కడ మంత్రులు తప్ప మరి ఎవరూ లేకుండా ఉండటము చూచినాడు. అంతట ఆ మహాపరాక్రమశాలికి రావణాసురుడికి అనేక హేతువులతో నిశ్చయించిన హితకరము అయినమాట చెప్పడానికి ఉద్యుక్తుడు అయినాడు. విభీషణుడు ఈ లోకములో మంచి సెబ్బరలు అన్నీ తెలిసినవాడు. దేశకాలాలను పట్టి కార్యాకార్యాలను నిశ్చయించే సామర్థ్యము కలవాడు. అంతేకాదు. ఎప్పుడు ఏది చెప్పవలెనో చక్కగా ఎరిగినవాడు. అందువల్ల అన్నగారిని స్తోత్రాదులతో ప్రసన్నుణ్ణిగా చేసుకొన్నాడు. అంతట సాంత్వనముగా "అన్నా, ఆ వైదేహిని సీతాదేవిని నీవు లంకాపట్టణానికి తెచ్చింది మొదలు అన్నీ అశుభనిమిత్తాలే కనపడుతున్నవి. సమంత్రకముగా వేలుస్తూ ఉంటే అగ్నిహోత్రము కొద్ది కొద్దిగా అగ్నికణాలతో మంటలు లేస్తూ పొగలు కమ్ముకొంటున్నదే కాని ప్రజ్వరిల్లడము లేదు. అగ్నిహోత్ర గృహాలలోనూ పాయిల దగ్గిరనూ ఇంకా వేదాధ్యయన స్థలాలలోనూ పాములు కనపడుతున్నవి హవిస్సులకు చీమలు పట్టుతున్నవి. ఆవులకు పాలు ఎండిపోతున్నవి. మదపుటేనుగులు మదజలము కార్చటము మానివేసినవి. గుర్రాలు దైన్యముతో ఇకిలిస్తున్నవి. ఒంటెలూ కంచరగాడిదలూ గాడిదలూ రోమాలు నిక్కపొడుచుకొని (నక్కొరుపోయి) కన్నీళ్లు కారుస్తున్నవి. వైద్యులు ఆలోచించి చికిత్స చేస్తూ ఉన్నప్పటికిన్నీ ఈ జంతువులు ఎప్పటి మాదిరిగా ఉండడము లేదు. మాలకాకులు ఎటు చూచినా గుంపులు గుంపులుగా మూగి ఘోరముగా అరుస్తున్నవి. విమానగృహశిఖరాలమీద గుంపులు గుంపులుగా మూగుతున్నవి. గద్దలు గుంపులు కట్టి ఇంటి ఇంటి మీదనూ వాలుతున్నవి. తొలి మలి సందెలలో నక్కలు పట్టణ సమీపానికి వచ్చి అమంగళముగా అరిచి పోతున్నవి. కుక్కలూ మాంసముతినే క్రూరమృగాలూ మన లంకాపురద్వారాల దగ్గిరకు వచ్చి పిడుగుల మోతలతో అరుస్తున్నవి.

"అన్నా, ఇందుకు తగినట్లు లంకాదహనాదులు సంభవించినవి, కాబట్టి సీతాదేవిని రాముడికి ఇచ్చి వేయడము ప్రాయశ్చిత్తముగా నాకు తోచింది. మహారాజా, నేను అజ్ఞానము వల్లనో ఆశ వల్లనో ఇట్లా చెప్పుతున్నాను. ఇది దోషముగా తలచ వద్దు. దుశ్శకునదోషము రాక్షసస్త్రీలకు పురుషులకూ అంతఃపురములో వారికీ వారికీ వీరికి ఏమిటి-ఈ లంకాపట్టణములో సమస్తము అయిన వారికిన్నీ తెలుసును. అయితే నీకు భయపడి ఈ ఆలోచన నీకు ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు. నేను నీ తమ్ముణ్ణి. అందువల్ల నేను చూచిందీ విన్నదీ నీకు

అవశ్యమూ చెప్పవలెను. కనుక చెప్పినాను. కాబట్టి నీవు ఆలోచించి ఏది న్యాయమో అది చేయవలెను" అని చెప్పినాడు.

అట్లా మృదువుగా యుక్తియుక్తముగా భూతభవిష్యద్వర్తమానకాలాలలో మేలు చేసే మాటలు విభీషణుడు మంత్రులమధ్యను కూర్చుని ఉన్న రావణాసురుడితో చెప్పినాడు ఆ మహాపరాక్రమశాలికి మహాకోపము వచ్చింది. తన పట్టు వదలకుండా "ఓ విభీషణుడా, నాకు ఏ భయమూ లేదు. రాముడు సీతాదేవిని ఎన్నటికీ పొంద లేడు. దేవేంద్రుడితో కూడా దేవతలు అందరూ ఏకము అయి సాయము వచ్చినా రాముడు యుద్ధములో నా ఎదుట నిలవ లేడు" అని దేవసేనలను నాశనముచేసి వేసిన ఆ మహాబలవంతుడు రణరంగములో ప్రచండ పరాక్రమముతో పోరాడే ఆ రావణాసురుడు చెప్పినాడు. అట్లా చెప్పి తనకు మంచి చెప్పిన తమ్ముణ్ణి పంపించి వేసినాడు.

౧౧

ఆ పాపిష్ఠి రావణాసురుడు మైథిలీకామమోహితుడు అయినందువల్లనూ తాను చేసిన పాపకృత్యమువల్లను సుహృదులు అయిన విభీషణాదుల అనాదరమువల్లనూ వాడి పోయినాడు.

ఆ రోజు కడచి పోయింది. యుద్ధము విషయము అమాత్యులతోనూ స్నేహితులతోనూ ఆలోచించ వలసిన సమయము ఆసన్నము అయింది అనుకొన్నాడు అంతట ఆ మహారథుడు రావణాసురుడు బంగారు కిటికీలతోనూ మణివిగ్రహభూషణాలతోనూ అలంకరించిన రథము ఎక్కినాడు. వివిధగతులలో పోయే శిక్షు పొందిన గుర్రాలు పూంచిన ఆ మహారథము అప్పుడు మహామేఘనిస్వనాలతో రాజసభాభవనము వైపు నడిచింది.

ఖడ్గాలూ డాళ్ళూ వివిధాయుధాలూ ధరించిన రాక్షసయోధులు కొందరు ఆ రథానికి ముందు నడిచినారు. వివిధవికృతవేషాలతోనూ నానావిధభూషణాలతోనూ అలంకరించుకొన్న కొందరు రాక్షసయోధులు ఆరథానికి ఇరు ప్రక్కలనూ వెనకనూ నడిచినారు. అతిరథులు అయిన రాక్షసులు కొందరు రథాల మీదనూ కొందరు ఉత్తమజాతి మదపు ఏనుగుల మీదనూ కొందరు ఆట గుర్రాల మీదనూ ఎక్కి రావణాసురుడి రథము వెంట పోయినారు. గదలూ ఇనుప గుదియలూ పట్టుకొని కొందరూ గండ్రగొడ్డళ్లు పట్టుకొని కొందరూ శూలాలు పట్టుకొని కొందరూ పోయినారు.

ఆ మహారథచక్రనేమిస్వనానికి దిక్కులు మారుమోగి పోయినవి. సమస్త సంపన్నము అయిన రాజవీధిలోకి ఆ మహారథము తటాలున పోయింది. అది సభా

భవనము దగ్గరకు పోగానే వేలకొద్దీ వాద్యధ్వనులు మోగినవి. శంఖమహాఘోషము భూనభోంతరాళాలు నిండిపోయింది. ఆ రాక్షసేంద్రుడికి రాక్షసులు పట్టిన శ్వేతచ్ఛత్రము పూర్ణచంద్రుడి వలె తేజరిల్లింది. నడుమ బంగారు పూల గుత్తులతో స్ఫటికాలవలె స్వచ్ఛకాంతులతో ఆ రావణాసురుని ఉభయ పార్శ్వాలా వింజామరలు విరాజిల్లినవి. రథముమీద ఉన్న ఆ రాక్షసోత్తముడికి నేలమీద నిలుచున్న రాక్షసులు అందరూ తలలు ఒగ్గి నమస్కారము చేసినారు. జయజయ ధ్వనులు చేసినారు. ఆశీర్వదించినారు. స్తోత్రము చేసినారు. ఆ మహాతేజోవంతుడు ఆ శత్రుసంహారకుడు రావణాసురుడు ఆ మహారథము దిగి మనోహరము అయిన సభాభవనములోకి పోయినాడు. వెండి బంగారు స్తంభాలతోనూ స్ఫటికాలు పొదిగిన మధ్యప్రదేశాలతోనూ బంగారు వస్త్రాల ఆస్తరణాలతోనూ విశ్వకర్మ నిర్మించిన ఆ సభాభవనాన్ని ఆరువందల పిశాచాలు కావలి కాస్తున్నవి. అక్కడ వైడూర్యమణులు పొదిగిన పరమాసనము మీద ప్రియకచర్మాస్తరణము కప్పి దిండ్లుపెట్టిఉన్నవి ఆ ఉత్తమాసనము మీద ఆ మహాతేజోవంతుడు రావణాసురుడు తన దేహకాంతులతో వెలుగుతూ కూర్చున్నాడు.

అంతట రావణాసురుడు అమితవేగముగా పోయే దూతలను చూచి "ఇప్పుడు ఒక మహాకార్యము వచ్చింది. దానిని నిర్వహించవలెను. మీరు పోయి రాక్షసనాయకులను అందరినీ వెంటనే వెంటపెట్టుకొని రావలెను" అని ఆజ్ఞాపించినాడు. అప్పుడు ఆ దూతలు విహారశయనాదులమీద ఉన్నవారిదగ్గిరకూ ఉద్యానవనాలలో విహరిస్తున్న వారిదగ్గిరకూ నిర్భయముగా పోయి రావణాసురుడి ఆజ్ఞను తెలియచెప్పినారు. అంతేకాదు. ఆ దూతలు ఇంటి ఇంటికీ పోయి రాజాజ్ఞను వెల్లడించినారు. ఆ వర్తమానము వినగానే లంకాపట్టణములో ఉంటూ ఉన్న రాక్షసులు అందరూ బయలుదేరినారు కొందరు రథాలమీదనూ కొందరు పొగరు ఎక్కిన గుర్రాలమీదనూ కొందరు మదపుటేనుగుల మీదనూ సభాభవనానికి ప్రయాణము అయినారు. ఆ యా వాహనాలు లేనివారు పాదచారులు అయిపోయినారు. అట్లా ఆ లంకాపట్టణములో గుంపులు గుంపులుగా రథాలూ గుర్రాలూ ఏనుగులూ ఆ యా వాహనాలూ పోతూఉంటే పక్షిసంఘాలు బారులుకట్టి ఆకాశములో పోతున్నట్టుగా తోచింది. ఆ రాక్షసులు అందరూ ఆ సభాభవనద్వారము దగ్గిర వారి వారి వాహనాలు దిగి సింహాలు గిరిగుహలోకి పోయేట్టు ఆ సభాభవనములోకి పోయినారు. వారు అందరూ రావణాసురుడి పాదాలకు నమస్కారము చేసినారు. ఆ రాక్షసేంద్రుడు వారిని అందరినీ సమ్మానించి కొందరిని కాంచనాసనాలమీదనూ కొందరిని దర్భాస

నాల మీదనూ మిగిలినవారిని నేలమీదనూ కూర్చుండ నియమించినాడు. అట్లా రాక్షసనాయకులు అందరూ వారివారి యోగ్యతలనుపట్టి రావణాసురుడి సమీపములో కూర్చున్నారు. ఆ యా కార్యాలు నిశ్చయించడములో పండితులు అయిన ముఖ్యమంత్రులూ సర్వజ్ఞులూ గుణవంతులూ బుద్ధిదర్శనులూ అయిన అమాత్యులూ అప్పుడు అక్కడ కూర్చున్నారు.

బంగారములో విచిత్రముగా చేసిన రథము మీద అప్పుడు ఆ సభాభవనానికి విభీషణుడు వచ్చినాడు. అతడు అన్నగారికి తన పేరు చెప్పుకొని పాదాభివందనము చేసినాడు. అదేవిధముగా శుకుడూ ప్రహస్తుడూ నమస్కారము చేసినారు. అప్పుడు ఆ ముగ్గురికీ వారి వారి యోగ్యతలకు తగినట్టు రావణాసురుడు ఆసనాలు చూపించినాడు. అట్లా నానామణిభూషణాలతోనూ మంచి మంచి వస్త్రాలతోనూ శ్రేష్ఠము అయిన చందనాగరుమైపూతలతోనూ వచ్చి కూర్చున్న రాక్షసులు ధరించిన పూల మాలికలు సుగంధాన్ని ఆ సభాభవనము అంతటా గుబాళించినవి. ఆ సభికులు అరవ లేదు. వారిలో ఒక్కడున్నూ అబద్ధము ఆడడు. వారు ఎవరూ గట్టిగా మాట్లాడరు. అందరూ తమ ప్రయోజనాలు ఈడేరిన వారు. అందరూ భయంకరులు. పరాక్రమవంతులు. వారు అందరూ తమ ఏలిక వంక చూడ సాగినారు.

ఆ సభలో ఆయుధధారులూ బలవంతులూ ధీరహృదయులూ అయిన ఆ రాక్షసుల మధ్యను కూర్చున్న ఆ ధీరహృదయుడు రావణాసురుడు వసువుల మధ్యను కూర్చుండే దేవేంద్రుడి వలె తేజరిల్లినాడు.

## ౧౨

అప్పుడు ఆ జయశీలి రావణాసురుడు ఆ సభను అంతా కలయ చూచి ప్రహస్తుడితో "ఓ సేనాధిపతీ, నీవు ఇప్పుడు వివిధాయుధవిద్యలూ అభ్యసించిన మన చతుర్విధయోధులనూ నగర రక్షణానికి ఎప్పటికన్నా ఎక్కువ హెచ్చరికతో ఉంచవలెను" అని ఆజ్ఞాపించినాడు.

అంతట ప్రహస్తుడు రాజశాసనాన్ని ఆచరణలో పెట్టడానికి సైన్యములో కొంత భాగాన్ని రాజమందిరము దగ్గిరనూ కొంతసైన్యాన్ని నగరము వెలుపలనూ కొంతసైన్యాన్ని నగరము అంతటానూ నియమించి రాజసమ్ముఖానికి వచ్చి "రాజా, మన బలగాన్ని అంతా మన నగరానికి లోపలనూ వెలుపలనూ రాజమందిరము దగ్గిరనూ ఉంచినాను. ఇక చేయవలసినపని యథేష్టముగా స్వస్థముగా చేసుకోవచ్చును" అని విన్నవించి కూర్చున్నాడు.

అంతట ఆ రాజ్యహితాసక్తుడు రావణాసురుడు తన సుఖాన్నే కాంక్షిస్తూ స్నేహితులతో "ఓ సభాసదులారా, ధర్మార్థకామాలకు సంబంధించిన సంకటము వచ్చినప్పుడు మీరు ప్రియాప్రియాలూ, సుఖదుఃఖాలూ, లాభాలాభాలు, కీడుమేళ్ళూ తెలుసుకోగలరు. మీరు అన్నివిధాలా ఆలోచించి నిశ్చయించి నాచేత ఆరంభించి చేయించిన సమస్త కార్యాలూ సఫలము అయినవి. ఏ ఒక్క కార్యమూ ఎన్నడూ విఫలము అయిపోలేదు. సూర్యచంద్రులూ గ్రహనక్షత్రాలూ దేవతలూ తోడుపడినందువల్ల దేవేంద్రుడు జయలక్ష్మిని సంపాదించినాడు. అదేవిధముగా మీరు అందరూ తోడ్పడితే నాకు జయలక్ష్మి లభ్యము అవుతుంది.

"ఇప్పుడు నేను చెప్పపోయే విషయము మీకు అందరికీ యిదివరకే తెలియ చెప్పవలెను అనుకొన్నాను. అయితే మహా బలవంతుడూ సర్వశాస్త్రకోవిదుడూ అయిన నాతమ్ముడు కుంభకర్ణుడు నిద్రపోతున్నందువల్ల చెప్పలేదు. వాడు ఆరుమాసాలనుంచి నిద్రపోయి యిప్పుడు లేచి వచ్చినాడు. అందువల్ల కుంభకర్ణుడి సమక్షములో చెప్పుతున్నాడు.

"ఓ స్నేహితులారా, నేను రాక్షసులు సంచరించిన దండకారణ్యము నుంచి జనకరాజపుత్రిని రాముడి పట్టమహిషిని సీతాదేవిని లేవనెత్తుకొని వచ్చినాను. ఆ సీతతో సరిసమానము అయిన అందకత్తె మరి ఒకతె ముల్లోకాలలోనూ లేదు. ఆ అలసగామిని నాతో శయనించడానికి యింతవరకూ యిష్టపడలేదు. ఆ తను మధ్య ముఖము శరత్కాల చంద్రబింబమువలెనూ ఆ పృథుశ్రోణి బంగారు బొమ్మవలెనూ అసమాన సౌందర్యవతి. ఆమె మయుడు సృష్టించిన మాయ (ఆశ్చర్య రూపము) వంటిది. మంచి ఎర్రని అరకాళ్ళతో ఎర్రని గోళ్ళతో సమముగా నేలమీద మోపే ఆమె మృదుపాదాలునూ వెల్చిన అగ్నిహోత్రజ్వాల వలెనూ సూర్యప్రభల వలెనూ తేజరిల్లె ఆమె దేహకాంతులనూ చూస్తూ ఉంటే మన్మథుడు నన్ను దహించివేస్తున్నాడు. ఉన్నతము అయిన ముక్కు వెడల్పాటి అందము అయిన కన్నులూ సుందరవదనమూ చూచి నేను కామపరవశుడను అయిపోయినాను. కోపముతో ఉన్నా సంతోషముతో ఉన్నా దేహవ్యథలో ఉన్నా మనోవ్యథలో ఉన్నా విడిచి పెట్టకుండా బాధపెట్టి దేహాన్ని వివర్ణముచేసే మన్మథుడు నన్ను కలవర పెట్టుతున్నాడు. ఆ భామిని తన పెనిమిటి రాకను ఎదురుచూస్తూ ఉంది. అందుకోసము ఆ విశాలనేత్రి నన్ను ఒక సంవత్సరకాలము గడువు అడిగింది. ఆచారునేత్రి కోరికను నేను అంగీకరించినాను. నేను బహుదూరము నడిచిన గుర్రము వలె కామభారమువల్ల అలసిపోయి ఉన్నాను.

"ఓ స్నేహితులారా, తిమితిమింగలాది బహుజలజంతువులతో నిండిపోయి కలత పెట్టడానికి అలవికానిసముద్రాన్ని వానరులు ఎట్లా దాటి వస్తారు. ఆ రామలక్ష్మణులు ఎట్లా దాటి వస్తారు. వారు సముద్రాన్ని దాటిరారు అనుకోడానికి వీలులేదు. ఒక వేళ వాండ్లు వస్తే రావచ్చును. ఒక్క వానరుడు వచ్చి మనతో యుద్ధము చేసినాడు. ఏ ఏ పనులు ఎట్లా జరుగుతవో ముందుగా తెలుసుకోలేము. అందువల్ల ఈ విషయములో మీ బుద్ధికి తోచింది చెప్పవలెను. మీ అందరి సాయముతో దేవాసురయుద్ధములో నేను జయించినాను. అదే విధముగా అప్పటి నుంచి ఇప్పటి వరకూ నాకు సహాయులుగా ఉంటున్నారు. దేవతలను జయించిన నాకు మానవులు అంటే భయము ఏమిటి. అయినప్పటికిన్నీ మీరు అందరూ ఈ విషయము ఆలోచించవలెను. రామలక్ష్మణులూ సుగ్రీవుడూ మొదలు అయిన వారు సీతాదేవి ఉన్నచోటు తెలుసుకొన్నారు. వారు ఇప్పుడు ఈ సముద్రము అవతలి గట్టుకు వచ్చి చేరినారు. సీతాదేవిని ఇవ్వకుండా ఆ రామలక్ష్మణులను చంపి వేసే ఉపాయము మీరు జాగ్రత్తగా ఆలోచించి నిశ్చయించవలెను. వానరులను సాయము చేసుకొని సముద్రాన్ని దాటి వచ్చే సామర్థ్యము వారికి లేదు అనుకొంటున్నాను. నేను తప్పకుండా జయించగలను అనుకొంటున్నాను" అని చెప్పినాడు.

రావణాసురుడు కామపరీతుడు అయి ఇట్లా పరిదేవనము చేయడము చూచి కోపమువచ్చి కుంభకర్ణుడు "ఓ రాజా, నీ అంతట నీవు రాముడి భార్యను బలవంతముగా తెచ్చుకొన్నావు. నీవు ఎవరినీ ఆలోచించలేదు. ఆలోచించిన తర్వాత ఏ పనిని అయినా చేయవలెను. కాని పనిచేసిన తర్వాత ఆలోచించి ప్రయోజన ఉండదు. నీవు ఈ పని చేయడానికి ముందుగా మమ్ములను ఆలోచించి ఉన్నట్లయితే యామునపర్వతము యమునానదినివలె నీకు ఏ మనఃక్షోభమూ రాకుండా ఉపాయము చేసి ఉండేవాండ్లము. పనిచేసి ఇప్పుడు ప్రాణముమీదికి వచ్చినప్పుడు విచారపడ్డందువల్ల ప్రయోజనము ఏమిటి. ముందుగా ఆలోచించి నిశ్చయించి పనులు చేసే రాజు తరువాత పరితపించడు. కార్యనీతి ఎరగనివాడు ముందు చేయవలసిన పనులు వెనకా వెనుక చేయవలసిన పనులు ముందూ చేస్తూ ఉంటాడు. బలవంతుడు అయినప్పటికిన్నీ యుద్ధములో జయించ నలవికానివాడు అయినప్పటికిన్నీ బుద్ధిస్థిమితము లేకుండా నియమము తప్పి పనులుచేసే వాడిలో లోపము కనిపెట్టి శత్రువులు సులభముగా జయిస్తారు. క్రౌంచపర్వతము దాట నలవికానిది అయినప్పటికిన్నీ హంసలూ మొదలు అయిన పక్షులు ఆ క్రౌంచపర్వత రంధ్రములో నుంచి అవతలికి ఇవతలికీ పోతూ వస్తూ ఉంటవి.

"అన్నా, నీవు ఆలోచించకుండా పెద్ద పని చేసినావు. నీవు చేసింది దోషయుక్తము అయిన పని. విషము కలిసిన మాంసమువంటిది. నిన్ను ఆ రాముడు దైవవశమువల్ల ఇంతవరకూ చంపివేయలేదు. ఎవరూ చేయలేని దుష్కార్యము నీవు తలపెట్టి చేసివేసినావు. నీవు నా తోబుట్టువు. కాబట్టి నేను నీతో నిలవక తప్పదు. అయిపోయినదానికి విచారపడి ప్రయోజనములేదు. నిన్ను కాపాడ కలిగినవాణ్ణి నేనే. నేను శత్రువులను చంపివేసి నీవు చేసిన ఈ తప్పు పనిని సరిదిద్దుతాను.

"అన్నా, నీ శత్రువులు ఇంద్రసూర్యులు అయినా అగ్ని వాయువులు అయినా కుబేరవరుణులుఅయినా నేను యుద్ధముచేసి సంహారము చేసి వేస్తాను. తీక్ష్ణదంష్ట్రిలతోనూ పర్వతాకారముతోనూ ఉన్న నేను పెద్ద ఇనుపగుదియ తీసుకొని సింహనాదము చేస్తే దేవేంద్రుడు అయినా వెరచి పారిపోతాడు. ఆ రాముడు నా మీద ఒక బాణము వదిలి రెండవ బాణము తీసే లోపల నేను వాడి నెత్తురు తాగివేస్తాను. అన్నా, నీవు యథేష్టముగా హాయిగా ఇక్కడ ఉండు. నేను ఆ రాముణ్ణి సంహారముచేసి నీకు జయము సంపాదిస్తాను. నీవు సుఖపడేట్టు చేస్తాను. ఆ రామలక్ష్మణులను సంహారము చేసివేసిన తరువాత వానరశ్రేష్ఠులను అందరినీ నమిలివేస్తాను. నీవు యథేష్టముగా ఇక్కడ క్రీడిస్తూ ఉండు. నిర్భయముగా నీ ఇష్టము వచ్చిన పనులు చేసుకొంటూ ఉండు. నేను ఆ రాముణ్ణి యమసదనానికి పంపించి వేస్తాను. అప్పుడు సీతాదేవి నీకు లొంగి పోతుంది" అని చెప్పినాడు.

## ౧౩

కుంభకర్ణుడు తెలియ చెప్పిన నీతిని తెలుసుకోలేక రావణాసురుడు క్రుద్ధుడు అయిపోయినాడు. ఆ సంగతి,మహాబలవంతుడు మహాపార్శ్వుడు కని పెట్టి నాడు. ఒక క్షణము ఆలోచించినాడు. అంతట చేతులు జోడించి "ప్రభూ, పెద్ద పులులూ మొదలు అయిన క్రూరమృగాలూ మహా విషసర్పాలూ ఉన్న వనములోకి పోయి అక్కడ దొరికిన తేనెను తాగకుండా వచ్చేవాడు మూర్ఖుడు. రాజా, నీవు శత్రు సంహారకుడవు. సర్వనియంతవు. నీకు మరి ఒక నియంత ఎవడు ఉన్నాడు. శత్రువుల శిరముమీద నీ పాదము ఉంచి నీవు ఆ వైదేహిని క్రీడించు. నీవు మహాబలవంతుడవు. కోడి మాదిరిగా బలవంతముగా ఆమెను ఆక్రమించు. ఆమెను వశపరుచుకో. అనుభవించు. సంతోషించు. నీ కోరిక నెర వేర్చుకొన్న తరువాత భయము ఏమిటి ఉంటుంది. ఒకవేళ ఏది అయినా చిక్కు వచ్చేటట్లయితే ప్రతీకారము చేయవచ్చును. వజ్రాయుధము తీసుకొని దేవేం

గ్రీవుడు ఆ రాముడికి సాయము వచ్చినా మాతో కుంభకర్ణుడూ ఇంద్రజిత్తూ ఉండేట్లయితే చాలు. మేము వాడిని చంపివేస్తాము. యుద్ధము చేయడము చేతకాని వాళ్లు సామదాన భేదోపాయాలు అనే మూటినీ ఏర్పరిచినారు. దండోపాయమువల్లనే కార్యసిద్ధి అవుతుంది.

"ఓ రాజా, నీవు మహాబలవంతుడవు. ఇక్కడికి శత్రువులు వస్తే శస్త్రబలముతో వశపరుచుకొంటాము. సందేహించవద్దు" అని చెప్పినాడు.

ఇట్లా చెప్పిన మహాపార్శ్వుణ్ణి రావణాసురుడు మెచ్చుకొని "ఓ మహాపార్శ్వుడా, నాకు సంబంధించిన రహస్యము ఒకటి ఉంది. అది చెప్పతాను విను. ఇదివరకు నేను ఒక పని చేసినాను. అది జరిగి చాలాకాలము అయింది. అగ్నిశిఖవంటి పుంజికస్థల అనే అప్సరాంగన బ్రహ్మదేవుడి ఇంటికిపోతూ ఉంది. నేను తనను చూస్తాను ఏమోను అనే భయముతో ఆమె ఆకాశములో దాగుకొంటూ దాగుకొంటూ పోతూ ఉంది. నేను ఆ అప్సరాంగనను చూచినాను. దానిని అప్పుడు బలవంతముగా వివస్త్రను చేసినాను. భోగించినాను. అది అంతట నలిగిపోయిన తామరతూడు వలె బ్రహ్మదేవుడి దగ్గరకుపోయింది. ఆ మహాత్ముడు జరిగిన సంగతి తెలుసుకొన్నాడు. అప్పుడు బ్రహ్మదేవుడు కుపితుడు అయిపోయి నన్ను చూచి "ఇది మొదలు పరస్త్రీలతో బలాత్కారముగా పోయేట్లయితే నీ తల నూరు ముక్కలుగా పగిలిపోతుంది, తప్పదు" అని శాపము పెట్టినాడు. నేను ఆశాపము భయమునుంచి ఆ వైదేహిని సీతాదేవిని నా శుభశయ్యమీదికి బలవంతముగా చేర్చలేదు.

"ఓ మహాపార్శ్వుడా, సముద్రానికి ఉన్న వేగమూ వాయువుకు ఉన్న గమనమూ నాకుఉన్నవి అని ఆ రాముడికి తెలియదు. అందువల్లనే వాడు నామీదికి వస్తూఉన్నాడు. గిరిగుహాలో ఉన్న సింహమువలెనూ క్రుద్ధమృత్యువువలెనూ ఉన్న నన్ను అందులో కోపిష్ఠివాణ్ణి అయిన నన్ను ఆ రాముడు రెచ్చకొట్టుతున్నాడు. వాడు ఎంత తెలివితక్కువవాడు. రెండునాలుకల పాములవంటి తీక్ష్ణబాణాలను నేను యుద్ధములో వదలడము ఆ రాముడు ఎన్నడూ చూచిఎరగడు, అందువల్లనే వాడు నామీదికి వస్తున్నాడు. ఏనుగును కొరవులతో అడ్డగించేట్టు వజ్రాయుధాలవంటి బాణాలు వందలకొద్దీ వదిలి నేను ఆ రాముణ్ణి నిగ్రహిస్తాను. ప్రాతఃకాలాన ఉదయించే సూర్యుడు నక్షత్రాల కాంతులను లాగివేసేటట్టు నేను నాచుట్టూఉండే సైన్యముతో విజృంభించి ఆ రాముడిబలాన్ని లాగివేస్తాను. వెయ్యికన్నుల దేవేంద్రుడున్నూ వరుణదేవుడున్నూ నన్ను యుద్ధములో జయించలేక పోయినారు.

ఈ లంకాపట్టణాన్ని పూర్వము పరిపాలించిన కుబేరుణ్ణి నేను నా బాహు బలముతో జయించివేసినాను. నాకు రాముడూ వాడి వానరసైన్యమూ ఒక లెక్కా" అని చెప్పినాడు.

౧౪

కుంభకర్ణుడి గర్జనలను రావణాసురుడి ఉపన్యాసాన్ని విని విభీషణుడు లేచి ఆరాక్షసరాజు మంచికోసము అరయుక్తముగా "ఓ రాజా, వక్షఃస్థలమే పడగగానూ చింతే విషముగాను చిరునవ్వే కరుకు కోరలుగానూ అయిదు వేళ్లు అనే అయిదు తలల మహాకాయముతో ఉన్న సీతాదేవి అనే మహాసర్పాన్ని నీ మెడకు చుట్టినవాడు ఎవడు. గోళ్లూ కోరలూ ఆయుధాలుగా పోరాడే వానర వీరులు పర్వతాకారులు లంకాపట్టణానికి వచ్చేలోపలనే మైధిలిని ఆ దాశరథికి ఇచ్చివేయవలెను. వాయువేగముతో వచ్చిపడే వజ్రాయుధాల వంటి బాణాలు రాముడు వదిలి రాక్షసవీరుల శిరస్సులను తెగవేసేలోపలనే మైధిలిని ఆ దాశరథికి ఇచ్చివేయవలెను. అట్లా చేస్తేనే నీవు సుఖముగా ఉండకలుగుతావు.

"ఓ రాజా, యుద్ధములో రాముడిఎదుట కుంభకర్ణుడు కానీ ఇంద్ర జిత్తుకానీ మహాపార్శ్వుడుకానీ మహోదరుడుకానీ, నికుంభుడుకానీ, కుంభుకుడు కానీ అతికాయుడు కానీ నిలవలేరు. ఓ రాజా, నిన్ను సూర్యుడూ దేవతలూ దాచిపెట్టినా ఆ రాముడు వదిలిపెట్టకుండా పట్టు కొంటాడు. నీవు దేవేంద్రుడి ఒడిలో కుర్చున్నా మృత్యువు కాపాడినా నీవు ఆకాశానికి ఎగిరిపోయినా పాతాళలోకానికి పారిపోయి దాగుకొన్నా నిన్ను ఆ రాముడు వదిలిపెట్టడు. నిన్ను బ్రతుకనీయడు" అని చెప్పినాడు.

అప్పుడు ప్రహస్తుడు లేచి "ఓ విభీషణుడా, మాకు యుద్ధములో యక్ష గంధర్వ మహోరగుల వల్లకానీ పతగోత్తముల వల్లకానీ మానవమాత్రులు రామ లక్ష్మణులవల్లకానీ ఎప్పుడూ ఏ భయమూ లేదు" అని చెప్పినాడు.

ప్రహస్తుడు చెప్పిన అహితము విని రాజా మేలుకోరే అపూజ్యుడు విభీష ణుడు ధర్మార్థకామాలను మూడింటిని గురించీ చక్కగా ఆలోచించి "ఓ ప్రహ స్తుడా, ధార్మికుడు కానివాడు స్వర్గానికి పోలేడు. అదేవిధముగా రావణుడు మహాపార్శ్వుడూ కుంభకర్ణుడూ చెప్పినట్లు రాముణ్ణి జయించలేడు. అట్లా జరగ డము అశక్యము, ఓ ప్రహస్తుడా, తెప్పకొయ్య అయినా లేనివాడు సము ద్రాన్ని ఎట్లాదాటలేకపోతాడో అదేవిధముగా నీవుకానీ రాక్షసులు అందరూ

కానీ ఆ రాముణ్ణి చంపివేయలేరు. రాముడు మహారథుడు. పరమపరాక్రమవంతులు పుట్టిన ఇక్ష్వాకు వంశములో పుట్టినాడు. అతడు పరమధార్మికుడు. మహాసమర్థుడు. జనరంజకుడు. యుద్ధములో దేవతలు సహితము ఆ రాముడి ఎదుట మూఢులు అయి పోతారు.

“ప్రహస్తుడా, ఆ రాముడు తీక్ష్ణము అయినబాణాలు వదులుతాడు. కంకపక్షి రెక్కలతోనూ వంగిన కణుపులతోనూ అవి దురాసదముగా ఉంటవి. అవి నీ దేహాన్ని ఛేదించుకొని పోనంతవరకూ నిన్ను నీవు పొగడు కొంటూ ఉంటావు. రాముడు యుద్ధములో దేవేంద్రుడితో సరిసమానుడు అయినవాడు. మా అన్న రావణుడు కానీ మహాబలవంతుడు అయిన త్రిశీర్షుడు కానీ కుంభకర్ణుడు కాని వాడి కొడుకు నికుంభుడు కానీ ఇంద్రజిత్తు కానీ నీవుకానీ యుద్ధములో రాముణ్ణి ఓర్చుకోలేరు.

“దేవాంతకుడు కానీ నరాంతకుడు కానీ అతిరథుడూ మహాబలవంతుడూ అయిన అతికాయుడు కానీ పర్వతిసమాన బలవంతుడు అయిన అకంపనుడు కానీ యుద్ధములో రాముడి ఎదుట నిలువలేరు.

“ఓ ప్రహస్తుడా, మా అన్న రావణుడు స్వభావసిద్ధముగా ఉగ్రుడు. ఇప్పుడు స్త్రీవ్యసనానికి లొంగిపోయినాడు. ఆలోచించకుండా ఈ పని చేసినాడు. రాక్షసులు అందరూ నాశనము అయిపోయే పని ఇప్పుడు తలపెట్టుతున్నాడు. మంత్రులు అయిన మీరు అందరూ శత్రువులవలె ప్రవర్తిస్తున్నారు. మిమ్ములను అతడు అనుసరిస్తున్నాడు. రామవైరము అనే వెయ్యితలలతో అంతులేని దేహముతో మహాభయంకరమూ బలవంతమూ అయిన మహాసర్పము రావణుణ్ణి గట్టిగా చుట్టవేసుకున్నది. మీరు ఈ మహాసర్పమునుంచి రావణుణ్ణి విడిపించవలెను. భయంకర భూతావిష్టుడు అయిన వాడి తలవెంట్రుకలను పట్టుకుని బయటికి ఈడ్చేటట్టు దుర్మార్గానికి ఒడిగట్టిన రాజును పరిపూర్ణకాములు అయిన మంత్రులు అందరూ సన్మార్గము పట్టించవలెను. లక్ష్మణుడు అనే అగాధముఅయిన సముద్రములో మునిగి రాముడుఅనే బడబానలాగ్ని ముఖాన పడబోతున్న ఈరావణుణ్ణి మీరు అందరూ ఏకముఅయి ఆసముద్రములోనుంచి దాటించవలెను. సీతాదేవిని రాముడికి వెంటనే ఇచ్చివేసేట్లయితే మనరాజుకూ మన బంధుమిత్రులకూ సమస్తరాక్షసులకూ క్షేమకరముగా ఉంటుంది. నేను బాగా ఆలోచించి చెప్పుతున్నాను. తన బలపరాక్రమాలనూ శత్రువుల బలపరాక్రమాలనూ తన రాజు స్థానాన్నీ వృద్ధిక్షయాలనూ శత్రువుల స్థానాన్నీ వారి వృద్ధిక్షయాలనూ విమర్శించి ఆలోచించి తన స్వామికి మేలుఅయ్యేటట్టు నిర్ణయించకలవాడే మంత్రి” అని చెప్పినాడు.

౧౫

రాక్షసయోధులలో శ్రేష్ఠుడూ మహాబలవంతుడూ అయిన ఇంద్రజిత్తు బృహస్పతివంటి విభీషణుడు చెప్పినమాటలు విని "ఓ పినతండ్రీ, నీవు మహాభయ పడిపోయి అనర్థముఅయిన మాటలు చెప్పినావు. అబ్బే, ఎటువంటి మాటలు అన్నావు. ఈ పులస్త్యవంశములో పుట్టినవాడు ఎవడూ నీవు చెప్పినట్టు చెప్పనే చెప్పడు. నీవు చెయమన్నట్టు చేయనే చేయడు. ఈవంశములో నీవు విభీషణుడవు ఒక్కడివితప్ప బలమూ పరాక్రమమూ ప్రభావమూ శౌర్యమూ ధైర్యమూ తేజమూ లేనివాడు ఎవడున్నూ పుట్టలేదు.

"ఓవిభీషణుడా, నీవు రాక్షసుడవు అయివుండిన్నీ ఏమిటి-ఎందుకు ఆమానవ రాజపుత్రులను రామలక్ష్మణులను పొగడినావు. మాలో ఏ ఒకసామాన్యుడు అయినా వాండ్లను చంపివేయకలడు. నీవు పిరికివాడవు. అందువల్ల మమ్ములను భయపెట్టుతున్నావు. నీవు ఇటువంటిపని చేయవద్దు.

ఓయీ, త్రిలోకనాథుడూ దేవరాజూఅయిన దేవేంద్రుణ్ణి నేను ఈభూమి మీదికి లాగుకొనివచ్చి చెరసాలలో పెట్టినాను. సమస్తదేవతలూ నాకు భయపడి దశదిశలా పరుగులెత్తి పారిపోయినారు. పెద్దపెట్టున ఘీంకారాలు చేస్తూవచ్చిన ఐరావతాన్ని నేను నేలపడతోసినాను. దాని దంతాలను బలాత్కారముగా ఊడ పెరికినాను. నేను దేవతలదర్పాన్ని అణచివేసినాను. దైత్యోత్తములను దుఃఖాల పాలు చేసినాను. అటువంటి పరాక్రమశాలిని నేను మానవులను అందులో ప్రాకృతులను జయించలేనా" అని అడిగినాడు.

దేవేంద్రతుల్యుడూ దురాసదుడూ అయిన ఇంద్రజిత్తు అన్నమాటలు ఆయుధధారులలో శ్రేష్ఠుడు అయిన విభీషణుడు విని అధికార్థముగా "నాయనా నీకు ఆలోచించే శక్తి లేదు. నీవు పిల్లవాడవు. ఇంకా నీ బుద్ధి పరిపక్వము కాలేదు. నీవు నీ నాశనానికి అర్థములేని మాటలు అధికముగా పేలినావు. ఓ ఇంద్రజిత్తా, రాముడివల్ల సర్వనాశనము అయి పోతుంది అని మా అన్నతో చెప్పుతూ ఉంటే నీవు అజ్ఞానమువల్ల ఈ విధముగా మాట్లాడినావు. నీ తండ్రి నాశనము అయిపోవడానికి నీవు ఒప్పుకొంటున్నావు. నీవు మా అన్న రావణుడికి పుత్రుడవుగా ఉన్న మిత్రముఖవైరివి. ఇట్లా పితృనాశనాన్ని కోరుతున్న నిన్ను చంపి వేయవలెను. నీవు బాలుడవు. సాహసివి. దుర్మతివి. బలవంతుడవు. ఇటువంటి నిన్ను మంత్రాంగము చేసే ఈ సభలోకి తీసుకొని వచ్చినవాడిని కూడా చంపి వేయవలెను.

"ఓ ఇంద్రజిత్తా, నీవు మూర్ఖుడవు. నీకు అణకువ లేదు. నీది తీక్ష్ణ స్వభావము. అల్పబుద్ధివి. గర్విష్ఠివి. దురాత్ముడవు. నీవు నీ క్రూరతనము నుంచి ఏమీ తెలియకుండా మాట్లాడినావు. బ్రహ్మదండము వలెనూ యమదండము వలెనూ జ్వలిస్తూ రాముడి బాణాలు మృత్యురూపముతో వచ్చి పడుతూ ఉంటే ఎవడు ఓర్చుకో కలడు.

"ఓ రాజా, ధనాన్నీ రత్నాలనూ ఆభరణాలనూ దివ్యాను అయిన వస్త్రాలనూ చిత్ర విచిత్రము అయిన మణులనూ సీతాదేవినీ రాముడికి సమర్పించు. నిర్భయముగా సుఖముగా ఉందాము" అని చెప్పినాడు.

౧౬

విభీషణుడు చక్కగా ఆలోచించి ఇట్లా చెప్పిన హితవాక్యాలను రావణాసురుడు విన్నాడు. అతనికి కాలము ముంచుకొని వస్తూ ఉంది. అందువల్ల అతిపరుషముగా "ఓ విభీషణుడా, కుపిత విషసర్పాలతో నివసించ వచ్చును. శత్రువులతో స్నేహము చేయవచ్చును. కాని స్నేహితుల వలె ఉంటూ శత్రువులను సేవించే వారిని మాత్రము దరిచేరనీయకూడదు. ఓ రాక్షసుడా, ఈ లోకములో జ్ఞాతుల స్వభావము నేను ఎరుగుదును. తమ వారికి కష్టాలువస్తే జ్ఞాతులు సంతోషిస్తారు. అంతేకాదు – తమలో ప్రధానుడు అయినవాణ్ణి కార్యసాధకుణ్ణి విద్వాంసుణ్ణి ధార్మికుణ్ణి శూరుణ్ణి జ్ఞాతులు ఎప్పుడూ అవమానిస్తారు. తిరస్కరిస్తారు. జ్ఞాతులు ఎప్పుడూ ప్రచ్ఛన్నహృదయులుగా ఉంటారు. పయికి ఒకటి మాట్లాడుతూ మనస్సులో మరి ఒకటి ఆలోచిస్తూ ఉంటారు, అన్యోన్యస్నేహముతో ఉంటూ ఉన్నట్టు ఉండి కష్టకాలము వచ్చినప్పుడు ద్రోహము చేస్తారు, జ్ఞాతులు భయంకరులు. భయావహులు.

"ఓ విభీషణుడా, పద్మక వనములో ఒకప్పుడు ఒకచోట తమను పట్టుకో డానికి పాశహస్తులు అయి వచ్చిన మనుష్యులను ఏనుగులు చూచి కొన్ని శ్లోకాలు పాడినవి. ఆ శ్లోకాలలో విషయము నేను చెప్పుతాను, విను. "అగ్నిహోత్రము మనలను ఏమీ చేయలేదు, ఆయుధాలు మనలను ఏమీ చేయలేవు. పాశాలు అంత కన్నా మనలను ఏమీ చేయలేవు. మానవులు స్వప్రయోజనము కోసము వెంట పెట్టుకొని వచ్చే మన జ్ఞాతులు అయిన ఏనుగులు మాత్రము మనకు ఘోరము అయిన అపకారము చేస్తవి. మానవులు మనలను పట్టుకొని పోవడానికి ఉపా యము చెప్పేవి మనజ్ఞాతులు అయిన ఏనుగులే. సందేహము లేదు. అందువల్ల మన జాతులను చూచి భయపడవలెను. భయాలు అన్నిటికన్నా జ్ఞాతిభయము లాచా

గొప్పది. ఇది అందరికీ తెలిసిన విషయమే. సంపద అంతా ఆవులలో ఉంది ఇంద్రియనిగ్రహము బ్రాహ్మణులలో ఉంది. చాపల్యము స్త్రీలలో ఉంది. అపకారము అంతా జ్ఞాతులలో ఉంది" అని ఆ ఏనుగులు చెప్పినవి.

"ఓ విభీషణుడా, నీవు సౌమ్యుడవు అనుకొన్నాను. నన్ను లోకముఅంతా పూజించడమూ నేను సమస్తైశ్వర్యాలూ అనుభవించడమూ జ్ఞాతులలో ముఖ్యుణ్ణిగా ఉండడమూ నీకు ఇష్టములేదు అని తెలుస్తున్నది. తామరాకులో పడ్డ నీటి బిందువులు ఒకదానితో ఒకటి కలియవు. అదేవిధముగా ఎంత స్నేహము చేసినా జ్ఞాతి అయిన వాడు దుష్టుడు అయితే తనవారితో కలసి ఉండడు. తుమ్మెదలు పూలలోనుంచి తమకు కావలసినంత తేనెను తాగుతవి. ఆ తరువాత ఆ పూల దగ్గర ఉండకుండా పోతవి. అదేవిధముగా నా నుంచి నీవు సమస్త సౌఖ్యాలూ అనుభవించినావు. నా శత్రువుతో స్నేహము చేస్తున్నావు, నీవు తుమ్మెదలవలె ప్రవర్తిస్తున్నావు.

"ఓ విభీషణుడా, ఏనుగు ముందుగా స్నానంచేస్తుంది ఆ తరువాత తొండముతో దుమ్ము తీసుకొని ఒంటినిండా కొట్టుకొంటుంది అదేవిధముగా దుష్టుడు ముందుగా చాలా స్నేహము చేస్తాడు, ఆ తరువాత నెత్తిన దుమ్ముకొట్టి పోతాడు. శరత్కాలములో మేఘాలు వానకురిసేటట్టు ఉరుములు ఉరుముతవే కాని నేల మీద తేమ అయినా ఉండదు. అదేవిధముగా దుష్టుడు అయిన స్నేహితుడు ఉపకారము చేస్తూ ఉన్నట్టు గర్జిస్తూ అపకారముచేసి ఊరుకుంటాడు. ఓ నిశాచరుడా, నీవు నాకు తమ్ముడవు అయి పోయినావు. అన్యుడవు అయినట్లయితే నీ నోట ఇటువంటి మాటలు వెలువడిన ఉత్తరక్షణాన నీ ప్రాణాలు ఎగిరి పోయి ఉండేవి. నీవు కులపాంసనుడవు. ఛీ. ఛీ. అవతలికి పో అన్నాడు.

ఇట్లా రావణాసురుడు పరుషవాక్యాలు అనగానే ఆ న్యాయవాది విభీషణుడు గద చేతిలో పట్టుకొని నల్గురు రాక్షసులతో కూడా ఆకాశానికి ఎగిరినాడు. ఆ కాంతిమంతుడికి విభీషణుడికి కోపము వచ్చి .అంతరిక్షానికి పోయి అక్కడ నిలుచుని రావణాసురుణ్ణి చూచి "ఓరాజా, నీవు ఇంకా ఏమేమి అనవలెను అనుకొంటున్నావో అవి అన్నీ అను. నేను నీకు బదులు చెప్పను నీవు నాకు జ్యేష్ఠుడవు. తండ్రితో సరి సమానము అయిన వాడవు. మాన్యుడవు. అయితే నీవు ఇప్పుడు ధర్మమార్గము తప్పినావు. నన్ను గురించి నీవు అన్నది అంతా అబద్ధము. నీ పరుషవాక్యాలను మాత్రము నేను మన్నించ లేను. ఓదశాననుడా, నీ మేలు కోరి నేను జాగ్రత్తగా ఆలోచించి నిశ్చయించింది నీకు చెప్పినాను. మృత్యువశంగతులూ బుద్ధిస్థైర్యము లేని వారూ మంచి మాటలు వినరు. ఓ

రాజా, సంతోషపెట్టే మాటలు చెప్పేవారూ వినేవారూ ఎప్పుడూ సులభముగా దొరకుతూనే ఉంటారు అప్రియము అయినప్పటికిన్నీ హితము చెప్పేవారూ వినేవారూ దొరకటము దుర్లభము. కాలపాశబద్ధుడవు అయి నాశనము కాబోతున్న నిన్ను చూచినాను. మండుతూ ఉన్న ఇంటిని చూచి ఊరకుండ లేనట్టు నేను నీకు మేలు అయ్యే ఆలోచన చెప్పినాను. మండే మంటల వంటి నిశితము అయిన బంగారు బాణాలను నీ మీద రాముడు వగులుతూ ఉంటే చూడ టము నాకు ఇష్టము లేదు. శూరులూ బలవంతులూ అస్త్రవేత్తలూ అయిన వాడ కాలను మూగించుకొని వచ్చినప్పుడు మహాప్రవాహానికి ఇసుకతో వేసిన ఆనకట్ట వలె యుద్ధములో కూలి పోతారు. నీవు నాకు అన్నవు అయినందువల్ల నేను నీ మేలు కోరి చెప్పినాను. అందుకు నీవు నన్ను మన్నించవలెను.

"ఓ అన్నా నీవు ఇక అన్నివిధాలా నిన్ను కాపాడుకో. ఈ లంకా పట్టణాన్నీ రాక్షసులనూ రక్షించుకో. నీకు నేను స్వస్తి చెప్పుతున్నాను. నేను వెళ్లి పోతున్నాను. నేను ఉండను కనుక సుఖముగా ఉండు.

"ఓ నిశాచరుడా, నేను నీ మేలు కోరి నిన్ను నివారించవలెను అనుకొన్నాను, నా మాటలు నీకు రుచించలేదు. ఆయువు అయి పోయిన వారు చచ్చి పోయిన వారితో సరిసమానులు. చచ్చిపోయిన వారు స్నేహితులు చెప్పేమాటలు వినడము ఉండదు" అన్నాడు.

## ౧౭

విభీషణుడు రావణాసురుడితో అట్లా అంత పరుషముగా మాట్లాడి ఆ క్షణమే తన నల్గురు మంత్రులనూ వెంటపెట్టుకొని రామలక్ష్మణులు ఉన్న చోటకివచ్చినాడు.

కన్నులు చెదిరిపోయే మెరుపుల వలెనూ మేరుపర్వతశిఖరము వలెనూ ఆకాశములో వస్తూ ఉన్న ఆ విభీషణుణ్ణి అతడి అనుచరులనూ భూమిమీద ఉన్న వానరులు అందరూ చూచినారు. ఒక్కడే కాకుండా మరి నల్గురు రాక్షసులను వెంటపెటుకొని వస్తూ ఉన్న ఆ రాక్షసుణ్ణి వానరవాహినీపతి సుగ్రీవుడు చూచినాడు. ఆ గుర్తర్షుడు ఆ బుద్ధిమంతుడు సుగ్రీవుడు ఆ రాక్షసులను గురించి వానరులతో ఆలోచించినాడు. క్షణ్యయముగా కొంచెము సేపు ఆలోచించి వాన వీరులను చూచి "ఓ వీరులారా, రాక్షసుడు తనతో పాటు మరి నల్గురితో వస్తున్నాడు వాండ్లు సమస్తాయుధాలూ ధరించినారు. మనలను చంపి వేయడానికే వస్తున్నారు" అన్నాడు. సుగ్రీవుడు ఈ మాటలు అనే అనడముతో వానరులు

అందరూ చేతులలో రాళ్లూ చెట్లూ తీసుకొని "రాజా, ఆజ్ఞాపించు. మేము ఆ దురాత్ములను చంపివేస్తాము. వాండ్లు అల్ప తేజస్కులు. మేము వాండ్లను హత మారుస్తాము. నేల మీదికి పడగొట్టుతాము" అన్నారు.

అట్లా వానరవీరులు అన్యోన్యము మాట్లాడుకొంటూ ఉండగా విభీషణుడు ఆ సముద్రము ఉత్తరతీరానికి చేరినాడు. ఆకాశములో నిలుచుని ఆ మహా ప్రాజ్ఞుడు ఆ పూజ్యుడు విభీషణుడు సుగ్రీవుణ్ణీ వానరవీరులనూ చూచి పెద్ద గొంతుతో "ఓ వానరవీరులారా, రాక్షసరాజు రావణాసురుడు అనే వాడు ఒకడు ఉన్నాడు. వాడు దురాచారుడు. నేను వాడి తమ్ముణ్ణి. నా పేరు విభీషణుడు. వాడు ఆ రావణాసురుడు జటాయువును చంపి వేసి జనస్థానమునుంచి సీతాదేవిని దొంగతనముగా లేవనెత్తుకొని వచ్చినాడు. ఆ దీనురాలిని అవివశను సీతాదేవిని రాక్షసాంగనల కాపలాలో ఉంచినాడు. ఆమెను నిర్బంధ పెట్టినాడు. రావణాసురుడితో సీతాదేవిని రాముడికి ఇచ్చివేయవలసింది అని నేను ఎన్నో హేతువులతో అనేక విధాల చెప్పినాను. నానావిధాలా బ్రతిమలాడినాను. వాడికి కాలము ముగించుకొని వస్తూ ఉంది. చావ పోయే వాడికి మందులు ఇమడనట్టు నేను ఎన్ని విధాల చెప్పినా వాడికి నా మాటలు నచ్చలేదు. నా హిత వాక్యాలను వినకపోవడమే కాకుండా నన్ను నానామాటలూ అన్నాడు. తన బానిసనువలె నన్ను వాడు అవమానించినాడు. అందువల్ల నేను నా భార్యా పుత్రులను వదిలిపెటి రాముణ్ణి శరణము వేడడానికి వచ్చినాను. ఆ మహాత్ముడికి ఆ సర్వలోక శరణ్యుడికి ఆ రఘువంశలలాముడికి రాముడికి నేను విభీషణుణ్ణి శరణము వేడడానికి వచ్చినాను అని మీరు వెంటనే చెప్పకోరుతున్నాను" అని చెప్పినాడు.

ఈ మాటలు సుగ్రీవుడు విన్నాడు. వెంటనే రామలక్ష్మణుల దగ్గరకు పోయి "రామప్రభూ, రావణాసురుడి తమ్ముడు విభీషణుడు అనే వాడు మరి నల్గురు రాక్షసులతో వచ్చినాడు. వాడు నీ శరణము అడుగుతున్నాడు. ఓపరంతపా, నీవు ఇప్పుడు సావధానచిత్తములో ఆలోచించవలెను. కార్యాకార్య విచారములోనూ సేనలను వ్యూహము పన్నడములోనూ రాజనీతి ప్రకారము సామాద్యుపాయాలు ప్రయోగించడములోనూ గూఢచారులను నియమించడములోనూ శత్రువులు నాశము అయి వానరులు జయించడములోనూ నీవు తగినట్టుగా ప్రవర్తించవలెను. నీకు శుభము అవుతుంది. ఈ రాక్షసులు కంటికి కనపడకుండా తిరుగుతూ ఉంటారు. వీండ్లు ఇచ్ఛాధీనరూపులు. ఎవరికి తెలియకుండా అనిష్టాలు చేస్తారు. మహా మాయావులు, వీండ్లను ఎప్పుడూ ఎంతమా

త్రమూ నమ్మకూడదు. ఇప్పుడు ఇక్కడికి వచ్చిన ఈ విభీషణుడు రావణాసురుడి గూఢచారుడు అయి ఉంటాడు. వీడు మనలో చేరి మనతో కలసి మెలసి ఉండి మనలో మనకు తగాదాలు పెట్టడానికి వచ్చి ఉంటాడు. నిజముగా శరణాగతుడు కాదు. సందేహము లేదు. అట్లా కాక పోయేట్లయితే మనలో కలిసి మెలిసి ఉంటూ మన లోపాలను అన్నిటినీ తెలుసుకొని ఎప్పుడో ఒకప్పుడు మనలను దెబ్బ తీయడానికి వచ్చి ఉంటాడు.

“ఓ రామప్రభూ, మిత్రులు పంపించిన సైనికులనూ అడవులలో నుంచి వచ్చిన సైనికులనూ జీతానికి వచ్చే సైనికులనూ మనము చేర్చుకోవచ్చును. కాని శత్రుపక్షములో నుంచి వచ్చిన వాణ్ణి మాత్రము మనము దరిచేర నీయకూడదు. ప్రభూ, వీడు నీ శత్రువు అయిన రాక్షసరాజు రావణాసురుడి తమ్ముడు. శత్రుపక్షమునుంచి వచ్చినాడు. వీణ్ణి నమ్మడము ఎటాగు. వీణ్ణి ఎంతమాత్రమూ నమ్మకూడదు. ఓ రామా, నీవు క్షమావంతులలో శ్రేష్ఠుడవు, అందువల్ల చెప్పుతున్నాను. వీడు ఈ విభీషణుడు రావణాసురుడి వేగులవాడు. వీణ్ణి నిగ్రహించవలెను అని నేను అనుకొంటున్నాను.

“ఓ రామా, రావణాసురుడు కపటబుద్ధిలో వీణ్ణి పంపించి ఉంటాడు వీడు శరణాగతుణ్ణి అనే మాయవేషము వేసుకొని వచ్చినాడు. నిన్ను నమ్మిస్తాడు. ఆ తరువాత దెబ్బతీస్తారు. ప్రాజ్ఞుడు అయిన శత్రువు తన సంగతి ఎవరికీ తెలియనీయకుండా శత్రుసైన్యలో చేరి వారి లోటుపాటు తెలుసుకొని గుడ్లగూబ కాకులను వలె చంపి వేస్తాడు. వీడు క్రూరుడుఅయిన రావణాసురుడి తమ్ముడు. అందువల్ల వీణ్ణీ వీడి మంత్రులనూ తీవ్రముగా దండించి చంపివేయడము కర్తవ్యము” అని చెప్పినాడు.

ఇట్లా ఆ వాక్యజ్ఞుడు వానరవాహినీపతి సుగ్రీవుడు కోపాటోపములో రాముడికి చెప్పి మెదలకుండా ఊరకున్నాడు. సమయోచితముగా మాట్లాడే ఆ మహాయసుడు రాముడు అప్పుడు దగ్గిరవున్న హనుమంతుడు మొదలు అయిన వానరవీరులను అందరినీ చూచి “ఓ వానరవీరులారా, ఇప్పుడు సుగ్రీవుడు రావణాసురుడి తమ్ముణ్ణి విభీషణుణ్ణిగురించి సహేతుకముగానూ సప్రయోజనముగానూ చెప్పింది అంతా మీరు అందరూ విన్నారు. కార్యసంకటసమయములో బుద్ధిమంతుడూ సత్పురుషుడూ సమర్థుడూ శ్రేయస్కాముడూ అయిన వొక్క మిత్రుడు చెప్పినాడు అని తక్కిన మిత్రులు ఊరకుండరాదు. మిత్రులు ఐనవారు అందరూ ఎవరికి తోచిన అభిప్రాయాన్ని వారు చెప్పవలెను. మీరు అందరూ ఇప్పుడు ఈ విషయములో మీ మీ అభిప్రాయాలను చెప్పవలెను” అని అడిగినాడు.

ఆ హితచికీర్షువులు అందరూ గౌరవపూర్వకముగా వెంటనే "ఓ ప్రభూ ముల్లోకాలలోనూ నీకు తెలియంది ఏమీ లేదు. నీకు సమస్త విషయాలూ తెలిసినప్పటికిన్నీ మేము నీ స్నేహితులము అయినందువల్ల మమ్ములను గౌరవించడానికి నీవు అడుగుతున్నావు. నీవు సత్యవ్రతుడవు, ధార్మికుడవు, పరమ పరాక్రమశాలివి. ఏ పనిని అయినా చక్కగా ఆలోచించకుండా నీవు చేయవు. నీవు మరుపులేనివాడవు. సర్వజ్ఞుడవు అయినప్పటికిన్నీ నీవు మిత్రాధీనుడవు అని తెలియచెప్పడానికి మమ్ములను అడుగుతున్నావు. నీ సచివులు బుద్ధిసంపన్నులు, సమర్థులు, ఒక్కొక్కరే వారి వారి అభిప్రాయాలను సహేతుకముగా చెప్పవలెను" అన్నారు.

ఇట్లా వానరవృద్ధులు రాముడితో చెప్పగానే మతిమంతుడు అంగదుడు లేచి "ప్రభూ, ఈ విభీషణుడు శత్రువు దగ్గరనుంచి వచ్చినాడు. అందువల్ల వీణ్ణి మనము అన్నివిధాలా సందేహించవలసిందే. వీణ్ణి ఎంతమాత్రమూ నమ్మకూడదు. కపటచిత్తులు తమ మనస్సులో అభిప్రాయాలను ఏమాత్రమూ పయికి తెలియనీయకుండా కలసి మెలసి ఉంటూ సమయము దొరకగానే దెబ్బతీస్తారు. అది గొప్ప అపాయము అవుతుంది. ఏ విషయములోనయినా గుణదోషములను ఆలోచించి గుణాలు ఎక్కువగా వుంటే తీసుకోవడమూ దోషాలు ఎక్కువగా వుంటే వదిలిపెట్టడమూ చేయవలెను. అదేవిధముగా ఈ విభీషణుడిలో సద్గుణాలు ఎక్కువగా ఉండి దుర్గుణాలు తక్కువగా ఉండేట్లయితే మనతో ఉంచుకోవచ్చును. దోషి అయ్యేట్లయితే వదిలివేద్దాము. అందువల్ల వీణ్ణి మనలో చేర్చుకొని పరీక్షించవలెను" అని చెప్పినాడు.

అంతట శరభుడు ఆలోచించి విభీషణుణ్ణి తమలో చేర్చుకొని పరీక్షించేట్లయితే అపకారము జరుగవచ్చును అనుకొని అంతకన్నా సులభోపాయముగా "ప్రభూ, ఈవిభీషణుడి దగ్గరకు వెంటనే ఒక గూఢచారుణ్ణి పంపించవలెను. వాడు సూక్ష్మబుద్ధితో పరీక్షించి వీడి గుణదోషాలు తెలుసుకొన్న తరువాత మనలో చేర్చుకోవడమో చేర్చుకోకపోవడమో చేయవలెను" అని చెప్పినాడు.

అంతట జాంబవంతుడు లేచినాడు, అతడు వృద్ధు. విచక్షణాజ్ఞానము కలవాడు. ఏదిఅయినా నీతిశాస్త్రము ప్రకారము ఆలోచిస్తాడు. జాంబవంతుడు "ఓ రామా, రావణాసురుడు బద్ధవైరముతో మనలను జయించవలెను అనుకొన్నాడు. పయిగా వాడు పాపాత్ముడు. వాణ్ణి వదిలిపెట్టి ఈ విభీషణుడు ఇక్కడికి వచ్చినాడు. వీడు ఇక్కడికి రావడానికి తగిన కారణము చెప్పలేదు, తన అన్న రావణాసురుడు తనను తిట్టినాడు అనీ అందువల్ల వాణ్ణి వదిలిపెట్టి

వచ్చినాను అనీ చెప్పినాడు. వీరు రావడానికి అది అంత గొప్పకారణముగా తోచడములేదు. వీడు ఇదివరకు ఎన్నడూ నీ ముఖము చూచి ఎరగడు. అందువల్ల వీడు వెతుకుకొంటూ ఇంతదూరము నీకోసము రావడము నమ్మడానికి వీలులేకుండా ఉంది. తనమాట వినని అంతమాత్రాన అంగులో ఆపత్కాలములో ఉన్న అన్నను వదిలిపెట్టి శత్రువు దగ్గరకు రావడము అంతకన్నా నమ్మడానికి వీలులేకుండా ఉంది. అందువల్ల వీడు రాకూడని సమయములో రాకూడని దేశానికి వచ్చినాడు. వీణ్ణి నమ్మడానికి వీలులేకుండా ఉంది. కాబట్టి వీణ్ణి మనలో చేర్చుకోవద్దు అని యుక్తియుక్తముగా నిరపాయముగా ఉండడానికి చెప్పినాడు.

ఏపని నీతియుక్తమో ఏపని నీతియుక్తముకాదో తెలిసిన మైందుడు ఆలోచించి సమయోచితముగా "ఓ రామప్రభూ. విభీషణుని దగ్గరకు గూఢచారుడు పోయి ముచ్చటలాడుతూ మాటల ధోరణిలో రావణాసురుడినిగురించీ వీడి అభిప్రాయమూ కనిపెట్టవలెను. మాటలలో వీడి విషయము అంతా తేలిపోతుంది. వీడు దుష్టుడు అని తోస్తే దండించడమూ యోగ్యుడు అని తోస్తే మనలో చేర్చుకోడమూ అప్పుడు చేయవచ్చును" అని చెప్పినాడు.

అంతట మంత్రులలో ఉత్తముడూ సకలశాస్త్రజన్యజ్ఞానసంపన్నుడూ అయిన హనుమంతుడు లేచి "ఓ ప్రభూ నీవు మతిమంతులలో శ్రేష్ఠుడవు ఆయా కార్యనిశ్చయములో సమర్థుడవు నీవు నిర్ణయించిన పనులను గురించి వచ్చుచెప్పడములో నీఅంత నేర్పరి మరిఒకడు లేడు. నిన్ను అతిశయించి మాట్లాడే శక్తి ఆ బృహస్పతికి అయినా లేదు నేనా నీకు ఉపదేశించ కలవాణ్ణి కాదు. అయినప్పటికినీ నాకు తోచింది చెప్పుతున్నాను. ఇది నా తర్కకౌశలము తెలియడముకోసము చెప్పడములేదు. తక్కిన మంత్రులు చెప్పింది తప్పు అని ఋజువుచేయడానికోసము చెప్పడములేదు. నా అంత ఆలోచనాపరుడు ఎవడూ లేడు అని తెలియచెప్పుకోడానికి చెప్పడములేదు. వీడు ఈ విభీషణుడు లంకాపట్టణములో నాకు అనుకూలముగా మాట్లాడినాడు అనే పక్షపాతమువల్లనూ చెప్పడములేదు. ఓ రామప్రభూ, నీమీద నాకుఉన్న గౌరవమునుంచి నాకు యథార్థము అని తోచింది చెప్పుతున్నాను.

"ప్రభూ, మంత్రులలో ఒకరు విభీషణుడి గుణదోషాలను చక్కగా పరీక్షించినతరువాత మనలో చేర్చుకోడమో చేర్చుకోకపోవడమో చేయవలెను అని చెప్పినాడు. ఇందులో ఒక తప్పు కనపడుతున్నది ఏదిఅయినా గొప్పరాజ్యకార్యము నిర్వహిస్తేనేతప్ప ఒకడి గుణదోషాలు తెలియవు. గుణదోషాలు తెలిసి ఉంటేనేతప్ప ఒకడిని గొప్ప రాజ్యకార్యము నిర్వహించడానికి నియో

గించను. అందువల్ల గుణదోషాలు పరీక్షచేసి చేర్చుకోడము అనే పద్ధతికి అనోన్యాశ్రయదోషము పట్టింది.

ఒక మంత్రి ఆ వచ్చినవాడిదగ్గరకు గూఢచారుణ్ణి పంపించి వాడి గుణదోషాలను తెలుసుకోవలెను అని చెప్పినాడు. అదిన్నీ సమంజసముగాలేదు. ఎక్కడనో దూరదేశములో ఉన్నవాణ్ణిగురించి తెలుసుకోడానికి గూఢచారుణ్ణి పంపిస్తే అక్కడికిపోయి సమస్తమూ విచారించి తెలుసుకొని రాకలుగుతాడు. కాని ఎట్టఎదట కనపడుతున్న వాడిదగ్గర గూఢచారిపోయి ఏమి కనుక్కోకలుగుతాడు.

ఒక మంత్రి సత్తముడు ఈ విభీషణుడు అకాలములో అనుచిత ప్రదేశానికి వచ్చినాడు అని చెప్పినాడు. ఇదిన్నీ సమంజసముగాలేదు. ఓ ప్రభూ, వీడు ఈ విభీషణుడు తన అన్న రావణాసురుడు పురుషాధముడు అనీ నీవు పురుషోత్తముడవు అనీ మనసా విమర్శించి తెలుసుకొనిఉంటాడు. రావణుడు సీతాదేవిని అపహరించడమూ తాను మంచిచెప్పినా వినకపోవడమూ మొదలుఅయినవి స్వయముగా ఎరుగును. నీవు ఖరదూషణాదులను వధించడమూ వారిని సంహారముచేసి సుగ్రీవుడికి పట్టముకట్టడమూ మొదలు నీ పరాక్రమాదులను తెలుసుకొనిఉంటాడు. అంతేకాదు దాటనలవికాని మహాసముద్రాన్ని దాటిపోయి లంకాపట్టణాన్ని ముట్టడించడానికోసము నీవు ఇక్కడికి ఇప్పుడు రావడమున్నూ తెలుసుకొని అందువల్ల నిన్ను చేరడానికి ఇప్పుడు ఇక్కడికి వచ్చినాడు. ఈ విభీషణుడు రావడానికి ఇదేసమయము—ఇదే సముచిత ప్రదేశము కూడానూ.

ఒక మంత్రి గూఢచారుడు విభీషణుడి దగ్గరకుపోయి ఆయా ప్రశ్నలు వేసి మాటలధోరణిలో గుణదోషాలను తెలుసుకోవలెను అని చెప్పినాడు. అది పొసగదు. ఈ విభీషణుడు బుద్ధిమంతుడు. కాబట్టి పూర్వపరిచయము లేని వాడు ఒకడు ఏది అయినా ప్రశ్నించినప్పుడు ఏమి బదులుచెప్పితే ఏమి అవుతుందోను అనే సందేహముతో బదులే చెప్పకపోవచ్చును. లేదా అర్థముకాకుండా ఉండే జవాబు వచ్చును. సరి అయిన సమాధానము చెప్పలేదు కనుక దోషిఅని ప్రశ్నలు అడిగినవాడు అనుకోవచ్చును. అడిగిన వారికి అందరికీ తమ విషయము అంతా తేటతెల్లముగా చెప్పవలెను అనే నియమము ఎవరికీ ఉండదు. ఇంతకూ మనము శత్రువులలో భేదము కలగజేసి వారిలో కొంతమందిని చీలతీసి మనలో కలుపుకొనవలసిన ప్రయత్నము చేయవలసి ఉండగా వాండ్లలో వాండ్లు కొట్లాడుకొని వాడి అంతట వాడువస్తే వాణ్ణి ఏవేవో ప్రశ్నలు వేయడము తెలివి తక్కువ. అందువల్ల మిత్రలాభము చెడిపోతుంది. ఇది నీతిశాస్త్ర సమ్మతము కాదు.

"ఓ ప్రభూ, ఈ లోకములో మనసుయిచ్చి మాట్లాడితే ఎదటివారున్నూ మనసుయిచ్చి మాట్లాడుతారు. కపటముగా మాట్లాడితే ఎదటివారున్నూ కపటముగా మాట్లాడుతారు. తనకు ఉన్న తెలివితేటలు ఎదటివారికి ఉండవు అనుకోడము బుద్ధితక్కువ. కుట్ర ప్రశ్నలకు బుద్ధిమంతులు కుట్రసమాధానాలే చెప్పుతారు. అందువల్ల ఈ ప్రయత్నము నిరర్థకము. ప్రభూ, ఎదటివారి మనశ్శుద్ధిని ఇంగితమూ ఆకారమూ చేష్టలూ భాషా అనే నాల్గింటిని పట్టి తెలుసుకొంటూ ఉంటాము. ఈ విభీషణుడు మాట్లాడినప్పుడు దుష్టభావము ఏమీ లోచలేదు. అందువల్ల వీడు దుష్టుడుకాడు అని ఇంగితమువల్ల తెలుస్తున్నది. వీడి ముఖములో ఏ వికారమూ లేకుండా ప్రసన్నముగా కనిపించినాడు. అందువల్ల వీడి ఆకారము శుద్ధముగా ఉంది. మోసగాడు ఏ జంకూ గొంకూ లేకుండా ఇంతదూరము నిర్భయముగా వచ్చి ఇంత నిబ్బరముగా మాట్లాడలేడు. అందువల్ల వీడి చేష్టలలో లోపము కనిపించలేదు. వీడు అన్నవాక్యాలలో తొందరపాటుకానీ సందిగ్ధాలుకానీ లేవు. అందువల్ల వీడిభాషా శుద్ధిలో లోపము ఏమీ కనిపించలేదు.

"ప్రభూ, మోసముచేయడానికి వచ్చినవాడు తన మనోగతాభిప్రాయాన్ని ఎంత దాచిపెట్టినా దాగదు. అది ఎట్లాగో ఎప్పటికి అప్పుడు బయటపడుతూ ఉంటుంది. ఓ రామప్రభూ, నీవు కార్యవిదులలో శ్రేష్ఠుడవు. నీకు నేను చెప్పవలసిన పనిలేదు. దేశకాలాలను పట్టి చేసేపని త్వరగా సఫలము అవుతుంది.

"ఓప్రభూ, వీడు ఈ విభీషణుడు నీ నిరుపమానపరాక్రమాన్ని గురించీ నీధార్మికతనుగురించీ తెలుసుకొన్నాడు. తన అన్నరావణుడు చేసే మాయ వ్యాపారాలను అన్నిటినీ స్వయముగా చూచినాడు, నీవు వాలిని చంపివేసి సుగ్రీవుణ్ణి వానరరాజునుచేయడము విన్నాడు. ఇప్పుడు తనకు లంకా రాజ్యము ఇప్పించమని ప్రార్థించడానికి వచ్చినాడు. వీడు నీ శరణాగతుడు. వీణ్ణి నీవు దగ్గరకు తీయవలెను.

"ఓప్రభూ, నాకు తెలిసినంతవరకూ ఈ విభీషణుడు నిర్దోషి, నా బుద్ధికి గోచరించింది అంతా చెప్పినాను, ఇక మిగతా పని చేయవలసిన వాడవు నీవు" అని మనోహరముగానూ మధురముగానూ అర్థవంతముగానూ చెప్పినాడు.

౧౮

సర్వమూ తెలిసిన ఆ దుర్ధర్షుడు రాముడు హనుమంతుడు చెప్పింది అంతా విన్నాడు. సంతుష్టుడు అయినాడు. అంతట తన మనస్సులో ఉండి చెప్ప తల

చుకొని "ఓ వానరులారా, నేనుకూడా ఈ విభీషణుణ్ణి గురించి నాకు తోచింది చెప్పుతాను. వీరు అందరూ నా శ్రేయస్సు కోరేవారు, కనుక వినవలసింది. విభీషణుడిలో దోషము ఉన్నప్పటికీన్నీ ఇక్కడికి మన దగ్గరకు మిత్రభావముతో వచ్చినాడు. మిత్రభావముతో వచ్చినాడు కనుక ఏమి అయినప్పటికీన్నీ వీణ్ణి నేను కాదు అనను. దగ్గరకు తీస్తాను. మైత్రి చేయడానికి వచ్చిన వాణ్ణి దగ్గర చేర్చుకోడము పెద్దలు అంగీకరించిన ధర్మము" అన్నాడు.

రాముడు చెప్పిన ఈ మాటలు విని సుగ్రీవుడు ఆలోచించి "రామా, ఈ రాక్షసుడు దుష్టుడు అయితే నేమి. కాకపోతే నేమి; అది అట్లా ఉండనివ్వు. ఆపత్కాలములో తన అన్నను వదిలిపెట్టి వచ్చిన వీణ్ణి ఎటువంటి వాడు అని అందాము. ఆ అన్న ఎటువంటి వాడు అయినా కావచ్చును. తిమ్మడు అయిన వాడు అటువంటి సమయములో ఆ అన్నను వదిలి పెట్టి రాకూడదు," అన్నాడు.

వానరాధిపతి సుగ్రీవుడు అన్న మాటలు సాకల్యముగా ఆ సత్యపరాక్రముడు రాముడు విని వానరులు అందరి వంకనూ చూచి పుణ్యలక్షణుడు అయిన లక్ష్మణుణ్ణి చూచి మందహాసము చేస్తూ ఓ వానరులారా, శాస్త్రాధ్యయనము చేసి పెద్దలను సేవించే వారు చెప్పే మాటలు వానరాధిపతి సుగ్రీవుడు చెప్పినాడు. అయితే ఈ విషయములో ప్రత్యక్షమూ లౌకికమూ అయిన ధర్మసూక్ష్మము ఒకటి ఉంది. ఇరుగు పొరుగున ఉండే రాజులూ జ్ఞాతులూ కష్టకాలము వచ్చినప్పుడు దెబ్బతీస్తూ ఉంటారు. అందువల్లనే ఇరుగు పొరుగు రాజులనూ జ్ఞాతులనూ బుద్ధిమంతులు అయిన రాజులు తమ శత్రువులుగా పరిగణిస్తూ ఉంటారు. ఇప్పుడు విభీషణుడు తన జ్ఞాతిఅయిన రావణాసురుణ్ణి దెబ్బతీయడానికి మనదగ్గరకు ఇక్కడికి వచ్చినాడు. యోగ్యులుఅయిన రాజులు తమకు మేలు చేసే జ్ఞాతులను గౌరవిస్తూఉంటారు. అట్లా అయినప్పటికీన్నీ సమర్థులుఅయిన జ్ఞాతులను నమ్మరాదు. ఈవిభీషణుణ్ణి రావణాసురుడు శంకించిఉంటాడు. వాడికీ వీడికీ విరోధము వచ్చిఉంటుంది. అందువల్ల వీడు ఇక్కడికి వచ్చినాడు.

"ఓసుగ్రీవుడా, శత్రుబలాన్ని స్వీకరించే విషయములో నీవు చెప్పిన దోషాన్ని యథాశాస్త్రముగా చెప్పుతాను విను. మనము రాక్షసవంశీయులము కాము. వారి దాయాదులము కాము. మనకు రాక్షసరాజ్యముతో నిమిత్తము లేదు. అందువల్ల విభీషణుడు మనలను ద్వేషించడు. ఈ రాక్షసుడు రాజ్య కాంక్షతో వచ్చినాడు. వీడు మనలను వదిలిపెట్టడు. రాక్షసులు వెర్రివాండ్లు కారు. వాండ్లలో పండితులు ఉన్నారు. విభీషణుడు అటువంటివాడు. అందు వల్ల అతనిని మనము చేర్చుకోవలెను. జ్ఞాతులు పరస్పర కలహాలులేకుండా సంతు

ష్టులుగా కలసిమెలసి ఉండరు. ఎప్పుడూ విరోధముతో ఉంటూఉంటారు. ఈ విభీషణుడికి ఆరావణుడితో విరోధము వచ్చిఉంటుంది. అందువల్లనే ఈతడు మనదగ్గరకు వచ్చినాడు.

"నాయనా, సుగ్రీవుడా తోబుట్టువులు అందరూ భరతుడి మాదిరిగా ఉండరు. తండ్రికి నావంటి కొడుకులున్నూ పుట్టరు. నీవంటి స్నేహితులు ప్రతి వారికీ దొరకరు. అందరూ మనమాదిరిగా ఉంటారు అనుకోవద్దు" అని చెప్పినాడు.

రాముడు ఇట్లా చెప్పగానే ఆమహాప్రాజ్ఞుడు సుగ్రీవుడు లేచి నమస్కారము చేసి "ఓరామా, నీవు కుమారవంశులలో శ్రేష్ఠుడవు. ఈ విభీషణుణ్ణి ఆ రావణాసురుడే రహస్యముగా చెప్పి పంపించిఉంటాడు. వీణ్ణి నిగ్రహించడము మంచిది అని నేను అనుకొంటున్నాను. ఓరామా, నీవు పుణ్యాత్ముడవు. నీకు తెలియదు. రావణాసురుడు కుటిలోపాయముతో మనలను దెబ్బతీయడానికి ఈ విభీషణుణ్ణి పంపించినాడు. వీణ్ణి మనము నమ్మేటట్టుగా వీడు ప్రవర్తిస్తాడు. ఏమరుపాటుతో ఉన్నప్పుడు వీడు మనలను దెబ్బతీస్తాడు. మనలను అందరినీ ప్రచ్ఛన్నముగా చంపివేయడానికే వీడు ఇక్కడికి వచ్చినాడు. ఆరావణాసురుడు పరమక్రూరుడు అని అందరికీ తెలిసిన విషయమే. వీడు వాడి తమ్ముడు. వీణ్ణి వీడి మంత్రులతోకూడా చంపివేయావలెను" అని చెప్పినాడు.

ఇట్లా ఆ వానరరాజు రాముడితో చెప్పి ఊరుకున్నాడు. రాముడు ఆలోచించి నాడు. సుగ్రీవుడితో శుభకరముగా "ఓమిత్రుడా, ఈవిభీషణుడు క్రూరుడు అయితే నాకు ఏమిటి - కాకపోతే నాకు ఏమిటి. వీడు నాకు ఏ విధము అయిన కీడూ చేయలేడు. ఈ భూమి మీద ఉన్న రాక్షసులనూ పిశాచులనూ దానవులనూ నేను తలచుకొంటే నా గోటి మొనతో చంపివేయ కలను. వీడు ఈ విభీషణుడు నన్ను ఏమి చేస్తాడు.

"ఓసుగ్రీవుడా ఒక పావురాయిని దాని శత్రువు శరణము అడిగినాడు. ఆ శత్రువు సామాన్యుడు కాడు. ఆ పావురాయి భార్యను చంపి వేసిన బోయ వాడు. శరణాగతుడు అయినందువల్ల ఆ పావురాయి ఆ బోయవాణ్ణి గౌరవించింది. వాడి భోజనానికి తన దేహములో మాంసాన్ని సమర్పించింది. ఇది అందరికీ తెలిసిన కథే. ఇక నా వంటివాడు శరణాగతుణ్ణి కాపాడవలెను అని వేరే చెప్పవలెనా. కణ్వమహర్షి పుత్రుడు కండువు అనే ఆతడు సత్యవాది. పరమర్షి. అతడు పూర్వము పరమధర్మబోధకము. అయినగాథను చెప్పినాడు. అది చెప్పుతాను. విను

"ఓ పరంతపా, చేతులు జోడించి భయముతో శరణము వేడుతున్నవాణ్ణి శత్రువు అయినప్పటికిన్నీ తనలో క్రౌర్యము లేదు అని తెలియ చేయడాని కోసము చంపి వేయ కూడదు. ఆర్తుడు అయినా గర్వి అయినా శత్రుపక్షములలో నుంచి వచ్చినా శరణము అడిగినవాణ్ణి ఆత్మవేత్త తన ప్రాణాన్ని వదలుకొని అయినా కాపాడవలెను. అట్లా శరణాగతుడు అయిన శత్రువును భయమువల్ల కానీ మోహమువల్ల కానీ కాపాడక పోయేట్లయితే పాపము వస్తుంది. తన శక్తికొద్దీ కాపాడకపోవడము లోకనిందితకార్యము. కాపాడనందువల్ల శరణాగతుడు నాశనము అయి పోయేట్లయితే శరణాగతుడి పాపాలు కాపాడని వాణ్ణి చుట్టు కొంటవి. కాపాడని వాడి పుణ్యాన్ని అంతా తీసుకొని శరణాగతుడు ఉత్తమ లోకానికి పోతాడు. శరణాగతుణ్ణి కాపాడక పోయేట్లయితే ఇంత మహాపాపము వస్తుంది. అందువల్ల స్వర్గాదిపుణ్యలోకాలు నశించి పోతవి, అపకీర్తి వస్తుంది. బలమూ పరాక్రమమూ నష్టము అయిపోతవి. ఇది యథార్థము. ఇట్లా కండు మహర్షి చెప్పినాడు. నేను మహర్షి చెప్పినట్టు చేయ నిశ్చయించుకొన్నాను. ఇది ధర్మము. ఇందువల్ల నాకు కీర్తి వస్తుంది. అభ్యుదయము అవుతుంది, నాకు పుణ్యలోకాలు సంప్రాప్తము అవుతవి.

"ఓ సుగ్రీవుడా, నేను నీ వాణ్ణి నీ శరణాగతుణ్ణి అని ఒక్కమారు నన్ను యాచించే ఎవడిని అయినా నేను కాపాడుతాను. సమస్తభూతకోటినుంచి భయము లేకుండా శరణాగతుణ్ణి కాపాడడమే నావ్రతము. ఈ వచ్చిన వాడు విభీషణుడు కానీ స్వయముగా రావణాసురుడే కానీ నీవు తీసుకొనిరా, నేను వీడికి అభయము ఇచ్చినాను" అని చెప్పినాడు.

రాముడు అన్న ఈ మాటలకు రాముడి వలెనే ప్రేమాతిశయముతో "ఓ ప్రభూ, నీవు ధర్మజ్ఞుడవు. లోకనాథులకు సుఖాన్ని ఇచ్చేవాడవు. సువ్రతుడవు. సత్పథగామివి, నీవు ఇటువంటి పూజ్యము అయినమాట చెప్పడములో ఆశ్చర్యము ఏమీ లేదు.

ఆ విభీషణుడు పరిశుద్ధుడు అని నా అంతరాత్మకు కూడా తోస్తున్నది. నా అనుమానాలను నివారించుకోడముకోసము నిన్ను అన్నివిధాలా పరీక్షచేసినాను. రామా, విభీషణుణ్ణి ఇప్పుడే తీసుకొని వస్తాను. ఆ మహాప్రాజ్ఞుడున్నూ మాలో ఒకడు అవుతాడు. నీకు స్నేహితుడున్నూ అవుతాడు" అని సుగ్రీవుడు చెప్పినాడు.

౧౮

రాముడు అభయము ఇవ్వగానే విభీషణుడు సంతుష్టుడు అయినాడు. అంతట ఆ మహాప్రాజ్ఞుడు స్వామి భక్తిపరాయణులు అయిన తన నల్గురు మంత్రులతోనూ వినయ విధేయతలతో నేలవంక చూస్తూ ఆకాశమునుంచి కిందికి దిగినాడు. ఆ ధార్మికుడు విభీషణుడు తన రక్షకుణ్ణి రాముణ్ణి వెతుకు కొంటూ వచ్చి నల్గురు మంత్రులతో కూడా సాష్టాంగ నమస్కారము చేసినాడు.

అప్పుడు విభీషణుడు సుగ్రీవాదులతో చెప్పినట్టు కాకుండా ధర్మయుక్తముగానూ మహాయోగ్యముగానూ, "ప్రభూ, నేను రావణుడి తమ్ముణ్ణి. నన్ను వాడు అవమానించినాడు. నేను, సర్వభూతశరణ్యుడవు అయిన నీ శరణము వేడడానికి వచ్చినాను. ఇప్పుడు నీ శరణు చొచ్చినాను. నేను లంకా పట్టణాన్ని నా మిత్రులనూ నా ధనాన్ని వదిలిపెట్టి నీ దగ్గరకు వచ్చినాను. ఇక నా రాజ్యము నాప్రాణము నా సమస్తసౌఖ్యాలూ నీ అధీనము" అని చెప్పినాడు.

ఈ మాటలు విని రాముడు మంచి మాటలతో విభీషణుణ్ణి ఓదార్చి ప్రసన్నదృష్టితో "ఓ విభీషణుడా, రాక్షసుల బలా బలాలనుగురించి యథార్థము చెప్పు అని అడిగినాడు.

ఎటువంటి కష్టకార్యాన్ని అయినా ఇట్టే చేసి వేసే రాముడితో "ఓ రామప్రభూ! రావణాసురుడు గంధర్వాసుర రాక్షసులచేత కానీ సమస్త భూతాల చేత కానీ చావకుండా ఉండే వరము బ్రహ్మదేవుణ్ణి మెప్పించి సంపాదించినాడు. అందువల్ల వాడు ఎవడి చేతిలోనూ చావని వీరుడు. వాడి తరువాత వాడు నాకన్నా పెద్దవాడు కుంభకర్ణుడు ఉన్నాడు. వాడు మహాపరాక్రమవంతుడు, అమిత తేజోవంతుడు, యుద్ధములో దేవేంద్రుడితో సరిసమానము అయిన బలవంతుడు.

రావణుడి సేనాధిపతి ప్రహస్తుడు కైలాసపర్వతము మీద కుబేరుడి సేనానాయకుణ్ణి మాణిభద్రుణ్ణి జయించినాడు. ఆ ప్రహస్తుణ్ణి గురించి మీరు వినే ఉంటారు. రావణుడి కొడుకు ఇంద్రజిత్తు గోధాంగుళీత్రాణము ధరించి అభేద్యము అయిన కవచము తొడుగుకొని పెద్దధనుస్సుతో యుద్ధరంగములోకి వస్తాడు. ఇరుపార్శ్వాలా వ్యూహాలు ఏర్పడగానే వాడు అగ్నిహోత్రుణ్ణి తృప్తి పరుస్తాడు. ఆ ప్రభావముతో వాడు కంటికి కనపడకుండా మాయము అయిపోయి శత్రువులను చంపివేస్తాడు.

"మహోదరుడూ మహాపార్శ్వుడూ అకంపనుడూ అనే ముగ్గురూ రావణుడి సైన్యములో మహావీరులు. వాండ్లు యుద్ధములో దిక్పాలకులతో సరిసమాన

ముగా ఘోరాజే శక్తిమంతులు, మాంసశోణితాహారులూ కామరూపులూ అయిన రాక్షసయోధులు పది వేల కోట్లమంది లంకాపట్టణములో ఉన్నారు. వాండ్లను అందరినీ వెంటపెట్టుకొని రావణాసురుడు దేవతలతో యుద్ధము చేసినాడు. దేవతలనూ దిక్పాలకులనూ జయించినాడు" అని చెప్పినాడు.

విభీషణుకు చెప్పిన ఈ మాటలు ఆ దృఢపరాక్రమవంతుడు రాముడు విన్నాడు. మనసా ఆలోచించి "ఓ విభీషణుడా, రావణాసురుడి ఇదివరకటి శౌర్యకృత్యాలను గురించి చెప్పినావు. వాటిని అన్నిటినీ నేను విన్నాను. నేను ఆదశగ్రీవుణ్ణి సబాంధవముగా ప్రహస్తుడితో కూడా చంపి వేసి నిన్ను లంకాపట్టణానికి రాజును చేస్తాను. సత్యముగా చెప్పుతున్నాను. రావణుడు రసాతలానికి పోయినా పాతాళలోకానికి పోయినా బ్రహ్మలోకానికి పోయినా వాణ్ణి ప్రాణాలతో వదిలి పెట్టను. వాడి ప్రాణము తీయకుండా ఊరుకోను. యుద్ధములో వాణ్ణి పుత్రులనూ వాడి బంధువులనూ వాడి చతురంగ బలాలనూ సంహారము చేయకుండా నేను తిరిగి అయోధ్యాపట్టణానికి పోను. నా ముగ్గురి తమ్ముల మీద ఒట్టు పెట్టుకొని చెప్పుతున్నాను" అన్నాడు.

రాముడు ఈ మాటలు అనీ అనడముతోటే ఆ ధర్మాత్మునకు విభీషణుడు సాష్టాంగనమస్కారము చేసి లేచి "ఓ రామప్రభూ, లంకాపటణాన్ని ముట్టడించడములోనూ రాక్షసులను చంపివేయడములోనూ రాక్షస సైన్యములో చొరబడి యుద్ధము చేయడములోనూ నా శక్తికొద్దీ నీకు సాయపడుతాను" అని చెప్పుతూఉంటే రాముడు సంతోషాతిశయముతో విభీషణుణ్ణి కౌగలించుకొని లక్ష్మణుణ్ణిచూచి "తమ్ముడా, నీవు కులగౌరవము కాపాడడములో శ్రేష్ఠుడవు, ఇప్పుడు నేను సంతోషముగా చెప్పుతున్నాను. నీవు ఇప్పుడే సముద్రజలాలను తీసుకొనిరా. ఈ మహాప్రాజ్ఞుణ్ణి ఈ విభీషణుణ్ణి రాక్షసులకు రాజుగా సముద్ర జలాలతో అభిషేకించు" అని చెప్పినాడు.

అంతట లక్ష్మణుడు రాజశాసనాన్ని శిరసావహించి ఆ వానరవీరుల మధ్యను విభీషణుణ్ణి రాక్షసరాజుగా రాజ్యాభిషేకము చేసినాడు. రామానుగ్రహమువల్ల విభీషణుడు రాక్షసరాజు అయినందుకు వానరవీరులు అందరూ రాముణ్ణి ఉద్దేశించి "బాగుంది! బాగుంది" అని కేకలు వేసినారు. కోలాహల ధ్వనులు చేసినారు.

ఆ తరువాత సుగ్రీవుడూ హనుమంతుడూ విభీషణుణ్ణి ఏకాంతముగాచూచి "ఓ విభీషణుడా, అక్షోభ్యము అయిన ఈ మహాసముద్రాన్ని మనము అంద

రము వానరసైన్యముతో దాటిపోవడము ఎట్లాగో మాకు తెలియలేదు. ఆ ఉపాయము నీవే మాకు చెప్పవలెను" అని అడిగినారు.

"ఓ మిత్రులారా, మన రామప్రభువు, సముద్రుణ్ణి శరణము వేడవలెను. ఈ అప్రమేయ మహోదధిని సగరచక్రవర్తి వృద్ధిచేసినాడు. సముద్రుడు మహా మతిమంతుడు. తాను ఎట్లా వృద్ధిఅయిందీ ఎరుగును. రామకార్యము కాబట్టి తప్పకుండా సాయపడుతాడు" అని విభీషణుడు చెప్పినాడు.

విభీషణుడు చెప్పింది విని సుగ్రీవుడు రామలక్ష్మణుల దగ్గరకుపోయినాడు. ఆ విపులగ్రీవుడు సుగ్రీవుడు రాముడితో సముద్రాన్ని ఉపాసించవలెను అని విభీషణుడు చెప్పిన మంగళకరము అయిన మాటను చెప్పినాడు. స్వభావసిద్ధముగా పరమధార్మికుడు అయిన రాముడికి ఆ మాటనచ్చింది. ఆ మహాతేజోవంతుడు ఆ కార్యదక్షుడు రాముడు లక్ష్మణుణ్ణీ సుగ్రీవుణ్ణీ చూచి మందహాసము చేస్తూ "లక్ష్మణా, విభీషణుడు చెప్పిన ఆలోచన నాకు నచ్చింది. సుగ్రీవుడు పండితుడు. ఆలోచించడములో నీవు సమర్థుడవు. మీరు ఇద్దరున్నూ ఆలోచించండి. మీకున్నూ నచ్చేట్లయితే చెప్పండి" అన్నాడు.

అప్పుడు ఆ వీరులు ఇద్దరూ గౌరవపూర్వకముగా "ప్రభూ, ఏమీ తోచకుండా ఉన్న ఈ సమయములో విభీషణుడు చక్కని ఉపాయము చెప్పినాడు. అది మాకు ఎందుకు నచ్చదు. సురాసురలు అందరూ ఏకము అయి దేవేంద్రుడితో వచ్చినా సేతువు కట్టకుండా ఈ సముద్రాన్ని దాటి పోవడము అశక్యము. విభీషణుడు చెప్పినట్లు చేయవలెను. ఆలస్యము చేయవద్దు. మన సైన్యముతో కూడా లంకాపట్టణము చేరడానికి నీవు సముద్రుణ్ణి ఆరాధించవలెను." అని చెప్పినారు.

అప్పుడు రాముడు ఆసముద్రతీరాన దర్భలు పరుచుకొని వేదిలో అగ్ని హోత్రుడివలె ఆ దర్భశయ్య మీద పడుకొన్నాడు.

## ౨౦

వీర్యవంతుడు అయిన శార్దూలుడు అనే రాక్షసుడు ఆ సముద్రతీరానికి వచ్చి సుగ్రీవుడి సైన్యాలను అన్నిటినీ జాగ్రత్తగా చూచినాడు. ఆ వేగులవాడు వెంటనే లంకాపట్టణానికి పోయి రావణాసురుణ్ణి చూచి "రాజా, వానరసైన్యము ఇంత అంత అని లెక్క వేయడానికి అలవి కాకుండానూ లోపలికి చొరబడి చూడడానికి వీలుకాకుండానూ మరి ఒక సముద్రము మాదిరిగా సముద్రతీరానికి వచ్చింది. రామలక్ష్మణులు ఉభయులూ ఉత్తమాయుధాలు ధరించి వానర

సైన్యాలను వెంటపెట్టుకొని సీతాదేవి ఉన్న చోటు వెతకడానికి వస్తున్నారు. ఆ కాంతిమంతులు ఇప్పుడు సముద్రము ఉత్తర తీరాన విడిది చేసినారు. ఎటు చూచినా పదియోజనాలదూరము వానరసైన్యము భూమి మీద కనిపించింది. రాజా, వెంటనే యథార్థము అంతా తెలుసుకో నీవు ఇప్పుడే దూతలను పంపించు. సామమో దానమో భేదమో వెంటనే ప్రయోగించవలెను" అని చెప్పినాడు.

ఇట్లా శార్దూలుడు చెప్పింది రావణాసురుడు విన్నాడు. ఏమరుపాటు లేకుండా వెంటనే చేయవలసిన పనిని గురించి ఆలోచించి నిశ్చయించినాడు. కార్యవేత్తలలో ఉత్తముడు అయిన శుకుడు అనే రాక్షసుణ్ణి చూచి "ఓ శుకుడా, నీవు ఇప్పుడే పోయి వానరరాజు సుగ్రీవుణ్ణి చూచి నేను చెప్పే మాటలు నేను చెప్పినట్టుగా ధైర్యముగా మృదువుగా స్పష్టముగా చెప్పు.

"ఓ వానరుడా, నీవు మహారాజువు. సత్కులములో పుట్టినావు. మహా బలవంతుడవు. బ్రహ్మదేవుని పుత్రుడు అయిన ఋక్షరజుడికి నీవు పుత్రుడవుగా పుట్టినావు. కాబట్టి నీవు నాకు మిత్రుడవు. నీవు నిష్కారణముగా నాతో వైరము పెట్టుకోవద్దు అందువల్ల నీకు ప్రయోజనము ఏమీ ఉండదు నాతో వైరము పెట్టుకోకుండా పోయేట్లయితే నీకు ఏ అవస్థయూ రాదు నేను నీకు తోబుట్టువు వంటి వాణ్ణి ఓ సుగ్రీవుడా, నేను రాముడి భార్యను లేవనెత్తుకొని వస్తే నీకు ఏమి సంబంధము. నీవు బుద్ధిమంతుడవు. కాబట్టి ఆలోచించు. నీవు హాయిగా కిష్కింధకు పో నీ వానరులు అందరూ ఈ లంకాపట్టణానికి రాలేరు. దేవతలూ గంధర్వులూ అయినా రాలేరు. ఇక నరులూ వానరులూ రాలేరు అని నేను వేరే చెప్పవలెనా.—

"ఓ శుకుడా, ఈ మాటలు సుగ్రీవుడితో చెప్పు" అన్నాడు.

అంతట శుకుడు పక్షిరూపము ధరించి అప్పటికి అప్పుడు ఆకాశానికి ఎగిరినాడు. సముద్రానికి కొంచెము ఎత్తుగా ఆ దూరము అంతా ఎగిరి పోయి ఆకాశములో నిలుచుని సుగ్రీవుణ్ణి చూచి రావణాసురుడు చెప్పిన మాటలు యథాతథముగా చెప్పినాడు. అట్లా మాట్లాడుతున్న ఆ శుకుణ్ణి పట్టుకోడానికి వానరులు చటుక్కున ఆకాశానికి ఎగిరినారు. వాణ్ణి బలాత్కారముగా ఒడిసి పట్టుకొని పిడికిళ్లతో పొడిచి నేల మీదికి పడత్రోసినారు. అట్లా వానరులు కొట్టి రెక్కలు విరిచి వేస్తూ ఉంటే ఆ రాక్షసుడు "ఓ రామప్రభూ, ధార్మికులు దూతను చంపివేయరు. నీవు ఈ వానరులను గట్టిగా నివారించవలెను. లేకపోతే వీండ్లు నన్ను చంపివేస్తారు. తన స్వామి చెప్పి పంపించిన

మాటలూ తన స్వామి అభిప్రాయమూ చెప్పకుండా తన స్వంతమాటలూ తన అభిప్రాయమూ చెప్పే దూతను చంపి వేయవచ్చును. నేను అట్లా చేయలేదు. నా స్వామి చెప్పి పంపించిన మాటలే నేను చెప్పినాను" అని అరిచినాడు.

శుకుడి మొరలు విని రాముడు వానరులను చూచి "ఆ రాక్షసుణ్ణి చంపి వేయవద్దు" అని చెప్పినాడు రాముడు అభయమునుంచి శుకుడు ఆకాశానికి ఎగిరినాడు. అక్కడ నిలుచుని "ఓ, సుగ్రీవుడా, నీవు శక్తి సంపన్నుడవు మహాబలవంతుడవు పరాక్రమవంతుడవు. లోకాలను గగ్గోలు పెట్టించే ఆ రావణాసురుడితో నన్ను ఏమి చెప్పమంటావు" అని అడిగినాడు.

అప్పుడు సుగ్రీవుడు ఆ రాక్షసదూతతో ఓయీ! నీ రావణాసురుడితో నేను ఇట్లా చెప్పినాను అని చెప్పు.

"ఓ రావణుడా నీవు నాకు స్నేహితుడవు కావు. నీవు నాకు ఏమీ ఉపకారము చేసినవాడవు కావు. నాకు ఇష్టుడవున్నూ కావు. నీవు నా స్నేహితుడు అయిన రాముడికి విరోధివి. నా శత్రువు అయిన వాలికి నీవు మిత్రుడవు. కాబట్టి నీవు నా పరమవిరోధివి. నిన్ను కనికరించ కూడదు. వాలిని వలె నిన్ను చంపి వేయవలెను. ఓ రావణుడా నిన్ను నీ కొడుకులతోనూ నీ బంధువుల తోనూ నీ జ్ఞాతులతోనూ చంపి వేయవలెను. అచిరకాలములో నే నీ లంకా పట్టణానికి నా మహాసైన్యముతో వస్తాను నిన్నూ నీ పట్టణాన్ని భస్మము చేసి వేస్తాను ఓ రావణుడా నీవు మూఢుడవు దేవేంద్రుడూ దేవతలూ నిన్ను దాచిపెట్టినా నీవు సూర్యపథానికి పోయినా పాతాళలోకానికి పోయినా రాముడు నిన్ను చంపకుండా వదిలిపెట్టడు. ముల్లోకాలలోనూ పిశాచాలు కానీ రాక్షసులు కానీ అసురులు కానీ నిన్ను రాముడినుంచి రక్షించలేరు. ముసలి వాడు అయి శక్తి ఉడిగిపోయిన జటాయువును చంపివేసినావు. అది ఒక పరాక్రమమా? సీతాదేవిని తెచ్చుకొన్నాను అని ఒంటు ఎరుగకుండా ఉన్నావు. రాముడు కానీ లక్ష్మణుడు కానీ అప్పుడు సమీపములో ఉన్నట్లయితే నీ పని ఏమి అయి ఉండేదో. వారు ఉభయులూ దగ్గరలో లేనప్పుడు నీవు ఆ విశాలాక్షిని సీతాదేవిని దొంగిలించుకొని వచ్చినావు. ఆ మహాబలవంతుడు ఆ మహాత్ముడు దేవతలు అయినా ఎదిరించలేని ఆ రఘువంశలలాముడు రాముడు వచ్చి నీ ప్రాణాలు తీసి వేస్తాడు అని నీవు ఎరుగవు.

"ఓ రాక్షసుడా, నేను సుగ్రీవుణ్ణి, ఇట్లా చెప్పినాను అని రావణాసురుడితో చెప్పు" అన్నాడు.

అంతట వానరశ్రేష్ఠుడు అంగదుడు సుగ్రీవుణ్ణి చూచి "మహారాజా, వీడు ఈ రాక్షసుడు దూత కాదు. వీడు గూఢచారుడు అని నాకు తోస్తున్నది. వీడు ఇక్కడ ఉన్నట్టు ఉండి మన సేనలను తూకము వేస్తున్నాడు. వీణ్ణి ఇప్పుడు పట్టుకోవలెను. వీణ్ణి లంకాపట్టణానికి పోనీయడము నాకు ఇష్టము లేదు" అని చెప్పినాడు.

సుగ్రీవుడు ఆజ్ఞాపించినందువల్ల వానరులు ఆకాశానికి ఎగిరినారు. అనాధ వలె ఏడవడము మొదలు పెట్టిన శుకుణ్ణి పట్టుకొని కట్టివేసినారు. భయంకరాకారులు అయిన ఆ వానరులు అందరూ కొట్టుతూ ఉంటే శుకుడు "రామ ప్రభూ, రక్షించు" అని పెద్ద పెట్టున ఏడుస్తూ "ఓ ప్రభూ ఈ వానరులు నా రెక్కలు ఊడకొట్టుతున్నారు. నా కళ్ళు పెరికి వేస్తున్నారు. నన్ను చంపి వేస్తున్నారు. నేను ఇక బ్రతుకను. నన్ను ఇట్లా వానరులు ఇక్కడ చంపి వేసేట్లయితే నేను పుట్టింది మొదలు నా ప్రాణాలు పోయేటంతవరకూ నేను చేసిన పాపాలు అన్నీ నిన్ను చుట్టుకొంటవి. ఓ రామా, నన్ను రక్షించు" అని ఏడ్చినాడు.

ఆ ఏడ్పు రాముడు విన్నాడు. ఆ దూతను వదిలి వేయమని వానరులతో చెప్పినాడు.

## ౨౧

ఆ మహోదధితీరాన ఆ అరిందముడు రాముడు దర్భశయ్యను అమర్చుకొన్నాడు. ప్రాఙ్ముఖుడు అయి చేతులు జోడించి సముద్రుడికి నమస్కారము చేసినాడు. పాము శరీరమువంటి తన మృదుబాహువును తలగడగా పెట్టుకొని పడుకొన్నాడు.

అట్లా తలగడగా పెట్టుకొన్న ఆ మహాత్ముని దక్షిణబాహువు ఇదివరకు అయోధ్యానగరములో ఉన్నప్పుడు రత్నఖచితకాంచనాభరణాలతోనూ ముక్తామయాభరణాలతోనూ బంగారు బాహుపురులతోనూ శోభించింది. ఉత్తమాంగనలు స్నానాలంకరణాది సమయాలలో ఎంచిన నానావిధ గంధాలు నలుగు పెట్టి రక్తచందనాగులు పైపూతలుగా పూసినందువల్ల ఆ బాహువు బాలసూర్యప్రభలతో ధగధగలాడుతూ చందనాగరు గంధవాసనలు గుబాళించింది. శయనించినప్పుడు ఆ బాహువు గంగాజలాలలో తక్షక సర్పకాయమువలె భాసించింది. సీతాదేవి తలగడగా చేసుకొని తన శిరస్సు పెట్టుకొని పడుకొన్నప్పుడు ఆ బాహువు అమితముగా శోభించింది. కాడికంటె ఆ బాహువు శత్రువులను అధికముగా దుఃఖపెట్టింది. స్నేహితులను అమితముగా సంతోషపెట్టింది. సముద్రము పోలి

మేరగా ఉన్న భూమండలానికి అంతటికీ ఆ బాహువు ఆధారము అయింది. అప్రదక్షిణముగా బాణాలు వదిలేటప్పుడు అల్లెత్రాటి దెబ్బలకు చర్మము పగిలి ఆ బాహువు కాయలు కాసింది. ఆ బాహువు మహాపరిఘాయుధము వంటిది. ఆ మహాభుజాన్ని ఆ మహాబాహువు రాముడు అప్పుడు తలగడగా పెట్టుకొని తనకు సముద్రతరణమో లేక మరణమో తప్పదు అని నిశ్చయించుకొని కాయిక నియమముతోనూ మనోనియమముతోనూ వాచిక నియమముతోనూ ఆ మహోదధి తీరాన శాస్త్రోక్తముగా దర్భశయ్యమీద పడుకొన్నాడు.

ఆ నీతిజ్ఞుడు ఆ ధర్మవత్సలుడు రాముడు ఆ సముద్రతీరాన దర్భశయ్యమీద పడుకొని సముద్రుణ్ణి ఉపాసిస్తూ మూడు అహోరాత్రములు గడపినాడు. అంత నియమముతో అట్లా ఆరాధించినప్పటికిన్నీ రాముడికి ఆ సముద్రుడు సాక్షాత్కారము కాలేదు. అందుకు రాముడికి కోపము వచ్చింది. ఆ సముద్రము వంక చూచి కన్నులు ఎర్ర చేసినాడు. సమీపములో ఉన్న తమ్ముణ్ణి పిలిచి "లక్ష్మణా నాకు సముద్రుడు ఇంతవరకూ దర్శనము ఇయ్యలేదు. వీడు ఎంత గర్వముతో ఉన్నాడు. దుర్గుణుడు. శాంతమూ క్షమా ఆర్జవమూ ప్రియభాషణమూ మొదలు అయిన సద్గుణాలను అసామర్థ్య లక్షణాలుగా భావిస్తాడు. తనను తాను పొగడుకొంటూ అందరినీ తరుముకొట్టుతూ వంచనము చేస్తూ మంచి చెడ్డలు అనే భేదము లేకుండా నిర్దయతో అందరినీ దండించే దుష్టుణ్ణి ఈ లోకము గౌరవిస్తుంది. శమదమాది సద్గుణసంపన్నుణ్ణి ఈ లోకము అగౌరవిస్తుంది.

"లక్ష్మణా, ఈ లోకములో బలవంతుడు అనే కీర్తి కానీ పరాక్రమవంతుడు అనే యశస్సు కానీ మంచితనమువల్ల రావు. అంతే కాదు, సామోపాయముతో యుద్ధములో జయము సంపాదించడమున్నూ అశక్యమే. దండమే అన్నిటికీ సాధనము.

"లక్ష్మణా, ఈ మకరాలయము మీద నేను ఇప్పుడు నిశితబాణాలు వదులుతాను. నా బాణాలకు ఈ సముద్రములో ఉంటున్న మకరాలు అన్నీ ఛిన్నాభిన్నము అయి పయికి తేలుతవి. ఈ సముద్రజలాలు స్తంభించిపోతవి. మహాకాయాలతో సర్పాలూ తొండాలు తెగిపోయిన ఏనుగులవంటిమత్స్యాలూ ముక్కలు ముక్కలు అయిపోయి పైకి తేలుతవి. నేను వదిలే బాణాలకు ఈ సముద్రజలాలు ఇంకిపోతవి. శంఖాలూ ముత్తెపుచిప్పలూ మత్స్యాలూ మకరాలూ కుప్పలు కుప్పలుగా బయట పడుతవి. తమ్ముడా, ఇంతవరకూ ఓర్పుతో ఉండడము నుంచి ఈ సముద్రుడు నన్ను అసమర్థుణ్ణిగా భావించినాడు. అందు

వల్ల నన్ను ఉపేక్షించినాడు. ఈ సముద్రుడిదగ్గర ఓర్పు ఏమాత్రమూ పని చేయదు సామోపాయముతో నాకు సాక్షాత్కారము కాడు.

"తమ్ముడా, క్రూర విషసర్పాలవంటి బాణాలనూ ధనుస్సునూ తెచ్చి పెట్టు. ఈ సముద్రాన్ని ఎండకొట్టుతాను. వానరులు అందరూ అవతలి గట్టుకు నడిచి పొయ్యేట్టు చేస్తాను. ఎవరికిన్నీ క్షోభ పెట్టడానికి అలవికాకుండా ఉన్న ఈ సముద్రాన్ని నేను ఇప్పుడు క్షోభ పెట్టుతాను. నాలుగు పక్కలా ఎల్లగా విస్తరించిన చెలియలి కట్టను దాటకుండా అలలతో రేగుతూఉన్న ఈ సము ద్రాన్ని ఇప్పుడు నా బాణాల దెబ్బకు హద్దులుదాటి భూమిమీద వరదలుఅయి పారేట్టు చేస్తాను. దానవసమూహాలతోకూడా ఈ సముద్రాన్ని ఇప్పుడు నేను క్షోభ పెట్టుతాను" అంటూ భయంకరము అయిన ధనస్సు చేతితో తీసు కొన్నాడు. సముద్రమువంక తేరిపార చూచినాడు. కుపితుడు అయినాడు. జ్వలిస్తూ ప్రళయకాలాగ్నిహోత్రము వలె దుర్ధర్షుడు అయినాడు. భయంకరము అయిన ఆ ధనస్సు నడుమును గట్టిగా పట్టుకొన్నాడు. ధనుస్సును సజ్యము చేసినాడు. ఆ ధనుష్టంకారానికి ఈ జగత్తులో ఉన్న జంతు వులు అన్నీ గజగజ వణికి పోయినవి. దేవేంద్రుడు వజ్రాయుధాలను వలె మహోగ్రబాణాలను సముద్రముమీద వదిలినాడు.

అగ్ని శిఖలవంటి ఆ బాణాలు అమిత వేగముతోపోయి సముద్ర ములో పడ్డవి. అందులో ఉన్న జలజంతువులు అన్నీ బెదరి పోయినవి. భయంకరధ్వనితో గాలి వీచింది. పెద్దపెద్ద అలలు లేచినవి. నక్రాలూ మకరాలూ క్షోభపడి పోయినవి. అలలు సుళ్లు తిర గడము మొదలు పెట్టినవి. శంఖాలు ముత్తెపుచిప్పలూ ఆ అలలతో పైకి వచ్చినవి. అగ్ని జ్వాలతో పోయి పడ్డ బాణమునుంచి అలలతో పొగలు పయికి లేచినవి. ఆ బాణాలు పాతాళము వరకూ పోయినవి. ఆ పాతాళ లోకములో ఉన్న మహా పరాక్రమవంతులు అయిన దానవులు బాధపడి పోయినారు. మిల మిల మెరిసే పన్నగుల ముఖాలు మంటలు మండుతూ విషము కక్కుతూ క్షోభ పడి పోయినవి. అప్పుడు సముద్రములో అలలు మొసళ్లతోనూ మత్స్యాల తోనూ వందలకొద్దీ వేల కొద్దీ వింధ్యమందర పర్వతాల అంత ఎత్తున పైకి లేచినవి.

అంతట రాముడు మరింత కోపముతో నిట్టూర్పులు విడుస్తూ వింట బాణాన్ని ఎక్కు పెట్టి మహోగ్రవేగముతో వదల పోవడము లక్ష్మణుడు చూచి "వద్దు; వద్దు" అంటూ పోయి ఆ వింటిని పట్టుకొన్నాడు.

## ౨౨

అప్పుడు ఆ రఘువంశ శ్రేష్ఠుడు రాముడు సముద్రుణ్ణి ఉద్దేశించి "ఓ సముద్రుడా, నిన్నూ నీలో ఉన్న పాతాళాన్నీ ఎండ కొట్టుతాను. నా బాణాలకు నీ జలాలు అన్నీ ఎండి పోతవి. నీలో ఉన్న జలజంతువులు అన్నీ దగ్ధము అయిపోతవి. నీవు ఉంటున్న స్థలము అంతా ఇసుకతో బయట పడుతుంది. నా ధనస్సులోనుంచి కురిసే బాణ వర్షానికి నీవు ఎండి పోతావు. నా వానరసేనలు కాలినడక నే నిన్ను దాట పోతవి.

"ఓ సముద్రుడా, నీలో దానవులు అందరూ నివసిస్తూ ఉన్నారు. వారి సహవాసదోషము వల్ల నీవు నా బలాన్ని కానీ పరాక్రమాన్ని కానీ ఆలోచించి కనుక్కో లేకుండా ఉన్నావు నేను నిన్ను తాపము ఎత్తిస్తాను అని తెలుసుకో లేకుండా ఉన్నావు" అని భయంకరముగా చెప్పినాడు. అంతట ఆ మహాబలవంతుడు రాముడు బ్రహ్మదండము వంటి బ్రాహ్మాస్త్రాన్ని తీసినాడు. ఆ భయంకరాస్త్రాన్ని తన ధనుస్సుకు ఎక్కించినాడు. దానిని వదలడానికి అల్లెత్రాటిని మోగించినాడు. ఆ ధనుష్టంకారానికి భూమ్యాకాశాలు పగిలి పోయినట్టుగా తోచింది.

అప్పుడు ఆ ధనుష్టంకారధ్వనికి పర్వతాలు కంపించి పోయినవి. లోకము అంతా చిమ్మచీకట్లు కమ్ముకొన్నవి. దిక్కులు తెలియకుండా పోయినవి. ఆ క్షణాన సమస్తనదులూ సరస్సులూ క్షుభితము అయి పోయినవి. నక్షత్రాలతో కూడా సూర్యచంద్రులు వెనకకు నడిచినారు. ఆ అంధకారములో సూర్యకిరణాలు వందల కొద్దీ ఉల్కల వలె (కొరవులవలె) ఆ కాశములో అగుపించినవి అంతరిక్షము నుంచి మహాధ్వనులతో పిడుగులు పడ్డవి. ఆకాశము నుంచి వాయువు పంక్తులు పంక్తులుగా ప్రచండముగా వీచింది. ఆ వాయు ప్రసారానికి అప్పటికి అప్పుడు ఆకాశము అంతటా మేఘాలు కమ్ముకొన్నవి. మహావృక్షాలు నేల కూలినవి. పర్వతాగ్రభాగాలూ పర్వతశిఖరాలూ అల్లాడి పోయినవి మేఘాలు మహాభయంకరముగా ఉరుములు ఉరిమినవి. మెరుపులు నిప్పులు కక్కడము మొదలు పెట్టినవి. ఆ నిప్పులు పిడుగులు అయి నేలమీద పడ్డవి. పిడుగుల ధ్వనులకు కంటికి అగుపించే ప్రాణికోటి కంటికి అగుపించని పిశాచాది భూత కోటీ మహాభయంకరముగా అరిచినవి. నిద్రపోతున్న ప్రాణులు అన్నీ లేచి భయముతో గడగడ వణుకుతూ కదల లేకుండానూ మెదల లేకుండానూ ఎక్కడివి అక్కడనే ఉండి పోయినవి.

ఆ మహాత్ముడు రాముడు అదివరకు వదిలిన అగ్నిశిఖల వంటి బాణాలు పోయి పడీ పడడములో మహోదధి జలాలూ ఆ జలాలలో ఉంటూ ఉన్న పన్నగులూ రాక్షసులూ సమస్త ప్రాణులూ తల్లడిల్లి పోయినవి. ఆ సముద్రము వెల్లువలై లేచింది. ఆ వెల్లువ చెలియలికట్టను వదిలిపెట్టి ఒక్క యోజనము దూరము వెనకకు పోయింది. ఎన్నడూ చెలియలికట్టను వదిలిపెట్టి పోని ఆ గర్వితుడు సముద్రుడు వెనక్కు పారిపోతూ ఉంటే శత్రుసంహారకుడు రాముడు ఎక్కుపెట్టిన బ్రహ్మాస్త్రాన్ని వదలకుండా నిలుచుండి పోయినాడు.

అప్పుడు ఆ సముద్రము మధ్య నుంచి మహామేరువు పర్వతముమీద ఉదయించే సూర్యుడి వలె సముద్రుడు స్వయముగా పయికి లేచినాడు. ఆ సముద్రుడి శరీరము స్నిగ్ధవైదూర్య కాంతులతో తేజరిల్లింది. కన్నులు తామర రేకులవలె కనిపించినవి. ఎర్రటి పూలదండలు వేసుకొని ఎర్రటి వస్త్రాలు కట్టుకొని వున్నాడు. శిరస్సున రకరకాల పూల దండలతోనూ మెడలో జంబూనదిలో పుట్టిన బంగారముతో చేసిన ఆభరణాల తోనూ గనులలోనుంచి తీసినబంగారముతో చేసిన ఆభరణాలతోనూ కరగించిన బంగారముతో చేసిన ఆభరణాలతోనూ తనలో పుట్టిన ఉత్తమరత్నాలు పొదిగిన రత్నహారాలతోనూ విశాలవక్షస్థలముమీద తళతళలాడే ముత్యాల హారము మధ్యను కౌస్తుభమణికి తోబుట్టువువలె పాటలప్రభలతో వెలుగొందుతున్న నాయకమణితోనూ ముఖాలు మంటలు మండుతూవున్న పాములతోనూ సముద్రుడు కనిపించినాడు. అప్పుడు ఆ సముద్రములో అలలు ఆకాశాన్ని అంటుతూ పయికి లేచినవి. అంతటా మహామేఘాలు కమ్ముకొన్నవి. గాలి విపరీతముగా వీస్తూవుంది. ఆ సముద్రము పయిన మొసళ్లు మొదలు అయినవి తిరుగుతూనూ ఉరగులూ రాక్షసులూ లోపల క్షోభపడుతూనూ వివిధ దేవతా స్వరూపలు అయిన గంగా సింధు మొదలు అయిన నదులు చుట్టూ తిరుగుతూ ఉండగా ఆవిర్భవంచుడు సముద్రుడు రాముడి దగ్గరకు వచ్చినాడు.

ఆ బాణపాణిని రాముణ్ణి సముద్రుడు చూచి చేతులు జోడించి ముందుగా సంబోధించి "ఓ పుణ్యాత్ముడా, పృథివీ, వాయువూ, ఆకాశమూ, జలమూ, అగ్నిహోత్రమూ (అనే పంచభూతాలూ) తమ మర్యాదను ఎప్పుడూ తప్ప కుండా వుంటూవున్నవి. అట్లా మర్యాదను తప్పకుండా వుండడము వాటి సహజ స్వభావము. (పృథివి గట్టిగా వుండడమూ వాయువు అడ్డదిడ్డముగా తిరగ డమూ ఆకాశము ఎడము ఇవ్వడమూ జలము లోతుగా వుండడమూ అగ్ని

హోత్రజ్వాలలు పైకి లేవడమూ నాటి వాటి సహజ స్వభావాలు) అందువల్ల నేను అగాధముగానూ నన్ను ఎవరూ దాటి పోవలవికాకుండానూ ఉంటు న్నాను. ఇది నా సహజ స్వభావము. నేను ఈ స్వభావాన్ని వదిలి పెట్ట డానికి వీలులేదు. లోతు లేకుండా వుండడము నా స్వభావానికి విరుద్దము. అగ్నిహోత్రము ఎప్పుడు అయినా చల్లగా వుంటుందా. ఉండదు. అదే విధ ముగా నేను లోతులేకుండా వుండను. ఓ రామప్రభూ, నేను నీకు యధా ర్థము చెప్పుకొంటున్నాను.

"ఓరామా, నీవు రాజపుత్రుడవు. అందువల్ల నమ స్తమున్యావలనూ నీవు సుస్థిరముగా వుంచవలెను. నాజలాలలో నక్రాలూ గ్రాహాలూ మొదలుఅయినవి ఎన్నో జీవిస్తూవున్నవి. నేను స్తంభించిపోయేట్లయితే (గడ్డకట్టుకునిపోయేట్లయితే) అవి అన్నీ బాధపడిపోతవి. నాశనముఅయిపోతవి. అందువల్ల ఏమి అయినప్పటి కిన్నీ కామమువల్లకానీ లోభమువల్లకానీ భయమువల్లకాని నేను స్తంభించి పోను. అయితే నా చేతనయినపనిమాత్రము చేసి నీకు సాయపడుతాను. నక్రాలూ గ్రాహాలూ మొదలుఅయినవి అన్నీ ఈసముద్రాన్ని దాటి అవతలికట్టుకు పోయే టంతవరకూ నీసైన్యాన్ని బాధ పెట్టకుండా చేస్తాను.

"ఓరామప్రభూ, నీవానరసైన్యము అంతా అవతలికట్టుకు పోవడానికి నీవు ఈసముద్రములో సేతువు కట్టవలెను. అందుకు నేను మెదక చేస్తాను" అని చెప్పినాడు.

ఇట్లా చెప్పిన ఆసముద్రుణ్ణి చూచి రాముడు "ఓసముద్రుడా, నేనుఅమో ఘముఅయిన మహాబాణాన్ని వింట సంధించినాను అది బ్రహ్మాస్త్రము. దాన్ని వదలకుండా ఊరక ఉంచడానికి వీలులేదు. దానిని ఇప్పుడు ఎక్కడ వదిలి పెట్ట మంటావో నీవే చెప్పు" అని అడిగినాడు.

ఆమహాతేజోవంతుడు సముద్రుడు ఆమహాశరాన్ని చూచి "రామప్రభూ, నీవలెనే జగత్ప్రసిద్ధికెక్కిన మనోహరముఅయిన ద్రుమకుల్యము అనేప్రదేశము ఇక్కడికి దగ్గరలోనే ఉత్తరదిక్కున వుంది. ఆ ప్రదేశములో అనేకమంది దస్యులూ (దొంగలూ) ఆభీరులూ (గొల్లవాండ్లు) నివసిస్తూవున్నారు వాండ్లు భయంకరులు. భయంకరముఅయిన పనులు చేస్తూఉంటారు. వాండ్లు అందరూ పాపాత్ములు. ఆపాపిష్టివాండ్లు అందరూ ఆద్రుమకుల్యములో నేను కల్పించిన జలాలు తాగి బ్రతుకుతున్నారు. ఆ పాపాత్ముల సంసర్గము నేను సహించ లేకుండా ఉన్నాను. అమోఘముఅయిన నీశరోత్తమాన్ని ఆద్రుమకుల్యము మీద వదలిపెట్టు. వాండ్లు అందరూ నాశనము అయిపోతారు" అని చెప్పినాడు.

అంతట రాముడు సముద్రుడు చూపించిన ఆ ద్రుమకుల్యముమీద మంటలు మండుతూవున్న బ్రహ్మాస్త్రాన్ని వదిలి పెట్టినాడు. ఆశరము పిడుగువలె మంటలు మండుతూ పోయి ఆ ప్రదేశములో పడ్డది. మహాధ్వనితో భూమిని చీల్చుకుంటూ ఆబాణము రసాతలములోకి పోయింది. అప్పుడు ఆ రసాతలము నుంచి బాణము పోయిన కలుగుగుండా జలము పైకిఉబికింది, ఆ జలము ఉబికిన కూపము వ్రణకూపముఅని ప్రసిద్ధికెక్కింది. ఆ వ్రణకూపములో నుంచి నిరంతరమూ జలము పైకివస్తూఉంటుంది. ఆ జలము సముద్రజలము వలె కనపడుతూ ఉంటుంది.

రాముబాణము నుంచి ఆ ద్రుమకుల్యము మధ్యభాగాన పల్లాలలో ఉన్న జలాలు ఎండిపోయినవి. ఆ పల్లాలలో జలాలే అక్కడివారికి అందరికీ జీవనాధారముగా ఉంటూ ఉండేవి. ఆ నీళ్ళను ఎండబెట్టడమే కాకుండా ఆ మహా పరాక్రమవంతుడు ఆ రణపండితుడు రాముడు వదలిన బ్రహ్మాస్త్రము అక్కడ నివసిస్తూ వచ్చిన పాపాత్ములను అందరినీ దగ్ధము చేసి వేసింది.

ఆ ద్రుమకుల్యము అప్పటినుంచి మరుకాంతారము అని ముల్లోకాలలోను ప్రసిద్ధి కెక్కింది. ఆ మరుకాంతారములో ఆరోగులుగా బహుజనులు నివసించే టట్టుగానూ పశువులకు కావలసినంత పచ్చిగడ్డీ సమృద్ధిగా క్షీరాలూ కంద మూల ఫలాలూ తియ్యని తేనెలూ సుగంధము గుబాళించే ఓషధులూ దొరకేటట్లు గానూ రాముడు వరము ఇచ్చినాడు. ఆ వర ప్రభావమువల్ల అది అప్పటినుంచీ మంగళకరము అయిన ప్రదేశము అయింది.

సముద్రుడు తన కుక్షిలోఉన్న ఆ ద్రుమకుల్యము దగ్ధము అయిపోగానే ఆ సర్వశాస్త్రజ్ఞుణ్ణి రాముణ్ణి చూచి "ఓ శాంతుడా, నీ వానరసైన్యములో నలుడు అనే వాడు ఒకడు ఉన్నాడు. వాడు విశ్వకర్మ పుత్రుడు. వాడి తల్లికి విశ్వకర్మ తన అంతటి పుత్రుడు పుట్టుతాడు అనే వరము ఇచ్చినాడు. అందువల్ల నలుడు వాడి తండ్రి విశ్వకర్మ అంతటి వాడు. వాడు ధైర్యవంతుడు. మహోత్సాహి, వాడు సేతువును కట్టకలడు, ఆ సేతువు కదలిపోకుండా నేను నిలుపుతాను" అని చెప్పి అంతర్ధానము అయిపోయినాడు.

సముద్రుడు ఇట్లా చెప్పి అదృశ్యుడు అయిపోగానే ఆ వానరోత్తముడు ఆ మహాబలవంతుడు నలుడు లేచి చేతులు జోడించి "రామప్రభూ, సముద్రుడు చెప్పింది యథార్థము. నా తండ్రి విశ్వకర్మ నాకు ఇచ్చిన సామర్థ్యముతో నేను ఈ సముద్రములో సేతువు కట్టగలను. ఓ వానరులారా, ఈ లోకములో పురుషుడికి దండోపాయమే శ్రేష్ఠము అయింది అని నా అభిప్రాయము. కృతజ్ఞత లేనివాండ్ల దగ్గర క్షమ కానీ సామదానోపాయాలు కానీ

పనిచేయవు. సముద్రుణ్ణి పూర్వము మన రామప్రభువు పూర్వీకుడు సగర చక్రవర్తి వృద్ధిచేసినాడు. ఆ ఉపకారము సముద్రుడు మరిచిపోయినాడు. ఇప్పుడు రామప్రభువు దండిస్తాడు అనే భయముతో పరుగెత్తుకొని వచ్చి సేతువు కట్టుకోడానికి మెరక చేస్తాను అని చెప్పిపోయినాడు.

"ఓ రామప్రభూ, మందరపర్వతము మీద నాతల్లికి విశ్వకర్మ తన అంతటి పుత్రుడు పుట్టేట్టు వరము ఇచ్చినాడు. నేను ఆ విశ్వకర్మౌరసపుత్రుణ్ణి, శిల్ప విద్యలో నేను నా తండ్రి అంతటి వాణ్ణి. ఈ విషయము ఎవరూ చెప్పనందువల్ల ఈపని నేను చేయగలను అని నాఅంతట నేను చెప్పుకోలేదు. ఇప్పుడు సముద్రుడు ఈ సంగతి గుర్తుకు తెచ్చినాడు. నేను సేతువు కట్టగలను నీవు కావలెను అనేట్లయితే ఇప్పుడే వానరుల సాయముతో సేతువు కట్టడము ఆరంభిస్తాను" అని చెప్పినాడు.

ఈ మాటలు నలుడు చెప్పగానే రాముడు సేతువును వెంటనే నిర్మించవలసింది అని ఆజ్ఞాపించినాడు. అంతట వానరులు సంతోషముగా లక్షలు లక్షలుగా అన్నివైపులా అడవులకు పోయినారు. ఆ పర్వతాకారులు వానరయూథపతులు ఆయా అరణ్యాలలో ఏగుమద్ది చెట్లనూ ఇరుమద్ది చెట్లనూ చండ్రచెట్లనూ కొండమల్లె చెట్లనూ తాటిచెట్లనూ బొట్టుగు చెట్లనూ తిమిశ చెట్లనూ మారేడుచెట్లనూ ఏడాకుల అరటిచెట్లనూ పూచిన కొండగోగుచెట్లనూ మామిడిచెట్లనూ అశోకచెట్లనూ వెదుళ్ళనూ ఇంకా నానావిధ వృక్షాలనూ పెళ్ళగించి సముద్రతీరానికి చేర్చినారు. ఆ చెట్లను కొన్నిటిని సమూలముగానూ, కొన్నిటిని విమూలముగానూ ఇంద్రధ్వజాల వలె లేవనెత్తి సముద్రములో పడవేసినారు. ఈ చెప్పినవాటినే కాకుండా కొబ్బరిచెట్లనూ తాండ్రచెట్లనూ పొగడచెట్లనూ తుమ్మచెట్లనూ వేపచెట్లనూ తెచ్చి ఆ సముద్రములో వానరులు పడవేసినారు. ఆ మహాకాయులు వానరులు ఏనుగులు అంత పెద్దపెద్ద రాళ్ళను పర్వతాలలో నుంచి పెళ్ళగించి యంత్రాల మీద వేసి ఆ సముద్రతీరానికి తీసుకొని వచ్చినారు. అట్లా ఎంతో శ్రమపడి తెచ్చిన రాళ్లను తటాలున సముద్రములో పడవేస్తూ ఉంటే జలాలు ఆకాశము ఎత్తున పయికి లేచినవి. ఆ వానరులు అవిశ్రమముగా ఆ సముద్రాన్ని క్షోభ పెట్టినారు.

ఆ వానరులలో కొందరు నూలుతాడు పట్టుకొంటూ నూరుయోజనాల దూరమూ పోయినారు. కొందరు వానరులు కొలతబద్దలు పట్టుకొని పనిచేయడం మొదలు పెట్టినారు. కొందరు వానరులు ఎక్కువ తక్కువలు రాకుండా మట్టము కట్టసాగినారు. కొందరు వానరులు పర్వత పాషాణాలను గబగబా పట్టుకొని

కావలసింది అని ఆదరించసాగినారు. అట్లా ఆ సముద్రములో పది యోజనాల వెడల్పునా నూరు యోజనాల పొడుగునా నలుడు సేతువును కట్టడము మొదలు పెట్టినాడు.

రామాజ్ఞను శిరసావహించి వందలకొద్ది వానరులు నలుడు కట్టుకొంటూ పోతూ ఉన్న ఆసేతువుమీద మేఘాలవంటి పర్వతశిఖరాల శిలలనూ పచ్చిగడ్డినీ కొయ్యలనూ వేసి కట్టినారు. పూచిన చెట్ల కొమ్మలను తీసుకొనివచ్చి ఆ సేతువు మీద పరచినారు. ఏనుగులు అంతటి వానరులు కొండలు అంతటి రాతి బండలను పెళ్లగించి పట్టుకొని పరుగెత్తుకొంటూ వచ్చినారు. ఆ బండలను సముద్రములో పడవేస్తూ ఉంటే దిక్కులు పిక్కటిల్లి పోయేట్లు మహాధ్వనులు బయలుదేరినవి.

ఏనుగుల వంటి ఆ మహాకాయులు వానరులు సంతోషముగా మొదటి రోజున పధ్నాలుగు యోజనాల దూరము సేతువును కట్టినారు ఆ మహాబలవంతులు ఆమరునాడు అమిత వేగముతో ఇరవై యోజనాల దూరము సేతువును నిర్మించినారు. ఆ మహాకాయులు మూడవనాడు ఇరవైఒక్క యోజనాల దూరమూ మహావేగముతో నాల్గవనాడు ఇరవైరెండు యోజనాల దూరమూ ఐదవనాడు అంతకన్నా అమిత వేగముతో ఇరవైమూడు యోజనాల దూరమూ సువేలాద్రి వరకూ సేతువును కట్టినారు.

ఆ మహాబలవంతుడు ఆదిత్యవంశుడు వానరముఖ్యుడు నలుడు అతని తండ్రి విశ్వకర్మ వలె ఆసముద్రములో కట్టిన సేతువు రమణీయముగానూ కాంతిమంతముగానూ ఆకాశములో స్వాతిపథము వలె శోభించింది. ఆ అద్భుత సేతువును గంధర్వులూ దేవతలూ సిద్ధులూ పరమర్షులూ అప్పుడు ఆకాశములో నిలుచుని చూచినారు, అట్లా మకరాలయములో సేతువును కట్టవచ్చును అని అదివరకు ఎవరూ మనస్సులోనయినా అనుకోలేదు. ఒక్క నలుడు కాని అంత కష్టము అయిన పనిని అంత సులభముగా చేయవచ్చును అని ఎవరూ ఊహించనయినా లేదు. అది అద్భుతమయిన సేతువు. దాన్ని చూస్తే ఒళ్లు గగుర్పొడుస్తుంది ఆసేతువును సమస్త ప్రాణికోటులూ చూచినవి. అబ్బురపడిపోయినవి అట్లా ఆసేతువును కట్టుతూ కోట్లకొద్దీ వానరులు ఆమహోదధి అవతలి గట్టుకు పోయినారు. మిట్టపల్లాలు లేకుండానూ వంకరటింకరలు లేకుండా సూటిగానూ శోభాయమానముగానూ నిర్మించిన ఆసేతువు ఆ సముద్రానికి పాపటవలె భాసించింది.

విభీషణుడు చేతిలో గద పట్టుకొని తన మంత్రులతో కూడా ఆ సముద్రము దక్షిణ గట్టున శత్రువులు వచ్చి పైన పడితే కొట్టడానికి కావలి

ఉన్నారు. అప్పుడు సుగ్రీవుడు రాముణ్ణి చూచి "ఓ సత్యపరాక్రముడా, నీవు ఈ హనుమంతుణ్ణి ఆరోహించు. లక్ష్మణుడు అంగదుణ్ణి ఆరోహిస్తాడు. మొసళ్లకు ఉనికిపట్టు అయిన ఈ సముద్రములో మనము చాలా దూరము పోవలెను. మీరు నడువ వద్దు. ఈ వానరులు ఇద్దరూ ఆకాశగాములు. అందు వల్ల ఎట్లా కావలెను అంటే అట్లా మిమ్ములను మోసుకొని పోకలరు" అని చెప్పినాడు.

అప్పుడు ఆ శ్రీమంతుడు ఆ ధర్మాత్ముడు రాముడు ధనుర్ధరుడుఅయి లక్ష్మణుడితోనూ సుగ్రీవుడితోనూ ఆ సైన్యానికి అగ్రభాగాన బయలుదేరినాడు. అప్పుడు కొందరు వానరులు ఆ సేతువు మధ్యభాగాన నడిచినారు. కొందరు పక్కలను నడిచినారు. కొందరు జలాలలో పడి లేచినారు. దారి చాలనందు వల్లకొందరు తీరానకనిపెట్టుకొని ఉన్నారు. కొందరు గరుత్మంతుడివలె ఆకాశములో ఎగిరిపోయినారు. భయంకరముఅయిన ఆ వానరవాహిని సింహనాదాలు చేస్తూనూ కోలాహలధ్వనులు చేస్తూనూ ఆ సముద్రాన్ని దాటిపోతూ ఉంటే సముద్రఘోషము వినిపించకుండా పోయింది.

నలుడు నిర్మించిన ఆ సేతువుమీదగా ఆ వానరవాహిని రామలక్ష్మణసుగ్రీవులతో కూడా ఆ సముద్రాన్ని దాటి అవతలి గట్టుకు పోయింది. అక్కడ ఫలమూలాలూ రుచ్యము అయిన నీరూ దొరికేచోట విడిది చేసినారు. ఆ దుర్ఘట కార్యానికి ఆశ్చర్యపడిపోయి రాముణ్ణి చూడడానికి దేవతలూ సిద్ధులూ చారణులూ మహర్షులూ అక్కడికి వచ్చినారు. వారు అందరూ మంగళజలాలతో వేరె వేరె రాముణ్ణి అభిషేకించినారు. నరులూ దేవతలూ పూజించే ఆ రాముణ్ణి "ఓ రామా, నీవు నరులకు దేవుడవు. నీ శత్రువులను అందరినీ జయించు. సముద్రవలయితము అయిన ఈ భూమండలాన్ని బహుకాలము పరిపాలించు" అంటూ వివిధ మంగళవాక్యాలతో ఆ వచ్చినవారు అందరూ స్తోత్రము చేసినారు.

## ౨౩

అప్పుడు రాముడు జరగబోయే కార్యాన్ని సూచించే నిమిత్తాలను చూచినాడు. ఆ యా నిమిత్తాలను అతడు లక్ష్మణుడికన్నా బాగా ఎరుగును. లక్ష్మణుణ్ణి కౌగలించుకొని "లక్ష్మణా, ఈ వనములో ఫలమూలాలూ శీతలోదకాలూ సమృద్ధముగా ఉన్నవి. ఈ సైన్యాన్ని చక్కగా విభజించి గరుడవ్యూహముగా ఇక్కడనే ఉందుదాము, ఈ కనపడుతున్న నిమిత్తాలను పట్టి లోకక్షయకరమూ భయంకరమూ అయిన

యుద్ధము త్వరగా జరుగుతుంది. మహాపరాక్రమవంతులు అయిన అనేక మంది రాక్షసులూ వానరులూ యుద్ధములో హతమయిపోతారు.

“తమ్ముడా, చూడు. దుమ్ము రేగుతూ గాలివీస్తూ ఉంది, భూమి కంపిస్తున్నది, పర్వతాగ్రాలు అల్లల్లాడుతూ ఉన్నవి. మహావృక్షాలు నేలకూలుతున్నవి, గంభీరస్వరాలు చేసే మహామేఘాలు కర్ణకఠోరముగా తోడేళ్లవలె అరుస్తున్నవి అంతేకాదు, మేఘాలు భయంకరముగా కనిపిస్తున్నవి, రక్తబిందువులతో వానపడుతున్నది. సంధ్యాకాలము రక్తచందనకాంతులతో పరమదారుణముగా కనపడుతున్నది. సూర్యమండలములో మంటలు మండుతూ ఉన్నవి. ఆ సూర్యమండలములో నుంచి అగ్నిపిండాలు కిందరాలుతున్నవి. దీనాకారాలతో మృగాలూ పక్షులూ సూర్యునికి ఎదురుగుండా వచ్చి క్రూరస్వరాలతోను దీనస్వరాలతోనూ అరుస్తూ భయముపుట్టిస్తున్నవి.

చంద్రుడు కాంతులు మాసిపోయి తాపము ఎత్తిస్తున్నాడు. ప్రళయకాలములో వలె చంద్రుడి పరివేషము (గాలిగుడి) కొనలలో నల్లటి కాంతులతోనూ ఎర్రటి కాంతులతోనూ మధ్యను పొట్టిగా మరింత ఎర్రని కాంతులతో భయంకరముగా కనపడుతున్నది. ఇదివరకు చూచిన నిర్మలము అయిన సూర్యబింబములో నల్లని మచ్చ కనిపించింది, నక్షత్రాలు దుమ్ముకొట్టుకొన్నట్టుగా కనపడుతూ యుగాంతకాలాన్ని సూచిస్తున్నవి. కాకులూ గద్దలూ రాబందులూ మొదలు అయిన వాటిని దుర్బలపక్షులు చంపివేసినవి. నక్కలు అమంగళముగా భయంకరముగా అరుస్తున్నవి.

“లక్ష్మణా, యుద్ధము జరుగుతుంది. ఆ యుద్ధములో రాక్షసులమీద వానరులు విసరివేసే కొండలు మొదలు అయిన వాటివల్లనూ రాక్షసులు వానరులమీద ప్రయోగించే శూలఖడ్గాద్యాయుధాలవల్లనూ ఈ భూమిఅంతా రక్తమాంసాలతో బురద బురద అయిపోతుంది

“తమ్ముడా, మనము ఇప్పుడే సుగ్రీవుడూ అంగదుడూ హనుమంతుడూ మొదలు అయిన వానరముఖ్యులను వెంటపెట్టుకొనిపోయి రావణాసురుడు పరిపాలిస్తున్నందువల్ల ఎదిరించడానికి అలవికాకుండా ఉన్న లంకాపట్టణాన్ని చూదాము” అని చెప్పినాడు.

అంతట ఆ ధర్మాత్ముడు రాముడు ధనుర్ధరుడు అయి సంగ్రామోత్సాహముతో లంకాపట్టణాభిముఖుడు అయి అందరికన్నా ముందుగా నడిచినాడు. అప్పుడు లక్ష్మణుడూ విభీషణుడూ సుగ్రీవుడూ ఇంకా తక్కినవానరవీరులూ శత్రువులను చంపివేయవలెను అనే నిశ్చయముతో రాముణ్ణి వెంబడించినారు.

వానరవీరులు అట్లాపోతూ రాముణ్ణి సంతోషపెట్టడానికి తోకలు ఆడిస్తూ కుప్పిగంతులు వేస్తూ సింహనాదాలు చేస్తూ నడిచినారు. వారి యుద్ధోత్సాహానికి రాముడు సంతోషించినాడు.

## ౨౪

అక్కడ ఆ వనములో రాముడు విడిది చేయించిన వానరవీరసమితి ఆకాశములో నక్షత్రాలతోనూ చంద్రుడితోనూ శరత్కాల పున్నమి రాత్రివలె భూమిమీద శోభించింది. మహా సముద్రమువలె అపారముగా వచ్చిన ఆ వానరవాహినీ పాదఘట్టనలకు అప్పుడు భూమి జడుసుకొన్నట్టుగా కంపించింది. ఆ వానరసైన్యము అక్కడ దిగి విడుదులు ఏర్పరచుకొని సర్దుకుణిగిన తరువాత ఆ వానరసైన్యానికి లంకాపట్టణములో మోగుతూ వున్న భేరీమృదంగధ్వనలూ రాక్షసయోధుల కోలాహల ధ్వనులూ వినిపించినవి. ఆ ధ్వనులు విని వానరయోధులు సహించలేక పోయినారు ఆ కోలాహలధ్వనుల కన్నా అధికముగా వానరయోధులు సింహనాదాలు చేయడము మొదలుపెట్టినారు. అంగుడు వానరయూథపతులు అందరూ సంతోషించినారు. ఆకాశములో మేఘాలవలె గర్వాతిశయముతో వానరులు చేసిన గంభీరధ్వనులు లంకాపట్టణములో రాక్షసులు అందరూ విన్నారు.

చిత్రవిచిత్రము అయిన ధ్వజాలతోనూ పతాకాలతోనూ శోభిస్తూ వున్న లంకాపట్టణాన్ని అప్పుడు రాముడు చూచినాడు. అతని మనస్సు సీతాదేవి మీదికి పోయింది. అతనికి దుఃఖము వచ్చింది. అంగారకగ్రహము పీడిస్తూ వున్న రోహిణివలె రావణాసురుడి చెరలో వున్న ఆ మృగశాబాక్షిని సీతాదేవిని తలచుకొన్నాడు. దుఃఖము భరించలేకపోయినాడు. పెద్ద పెద్ద వేడి వేడి నిట్టూర్పులు విడిచినాడు లక్ష్మణుణ్ణి చూచి సమయోచితముగా "తమ్ముడా, విశ్వకర్మ మనసా సంకల్పించి ఈ లంకాపట్టణాన్ని ఈ చిత్రకూట పర్వతము మీద నిర్మించినాడు. ఈ పట్టణము యెంతో యెత్తున ఆకాశాన్ని అంటుతూ వుంది తెల్లటి మేఘాలు కమ్ముకొన్న ఆకాశమువలె విమానాకార గృహాలతో ఈ భూమిమీద ఈ లంకాపట్టణము శోభాయమానముగా వుంది. మనోహరము అయిన పుష్పఫలభరిత వృక్షాలతోనూ మధుర గానము చేస్తూవున్న నానావిధ పక్షిసంఘాలతోనూ ఈ లంకాపట్టణము కుబేరుడి చైత్రరథవనము వలె నేత్రపర్వముగా వుంది. ఈ లంకాపట్టణ వనాలలో ఎప్పుడూ దొరికే పండ్లూ కాయలూ తిని పక్షులు మత్తు యెక్కి పాటలు పాడుతూ వున్నవి. ఎప్పుడూ పూచే రకరకాల పూలలో దొరికే తియ్యని

తేనెలు తాగి తుమ్మెదలు కదలకుండానూ మెదలకుండానూ వున్నవి. చిగురుటాకులు తింటూ కోకిలలు వృక్షసమూహాలను వదిలిపెట్టకుండా శ్రవణపేయముగా కేకలు వేస్తూ వున్నవి" అని రాముడు చెప్పినాడు.

రాముడు ఆ తరువాత నీతిశాస్త్రము ప్రకారము ఆ వానరసైన్యాన్ని చక్కగా విభజించి వ్యూహాకారములో ఉంచవలెను అనుకొన్నాడు. అంతట వానరయూథపతులను అందరినీ చూచి "ఓ వానరయూథపతులారా, దుర్జయుడూ మహాపరాక్రమవంతుడూ అయిన అంగదుడు తన సైన్యముతో ఈ మహాసైన్యవక్షఃస్థలములో ఉండవలెను. వానరర్షభుడు ఋషభుడు తన సైన్యముతో ఈ మహాసైన్యానికి కుడి పక్కను ఉండి కాపాడవలెను. మదపుటేనుగువలె దుర్ధర్షుడూ మహాబలవంతుడూ అయిన గంధమాదనుడు తన సైన్యముతో ఈ మహాసైన్యాన్ని ఎడమ పక్కను ఉండి కాపాడవలెను. మహాబలవంతులూ భల్లూకవీరులూ అయిన జాంబవంతుడూ సుషేణుడూ దీర్ఘదర్శి అనే ముగ్గురున్నూ ఈ సైన్యాన్ని కుక్షిభాగములో కాపాడుతూ ఉండవలెను.

"ఓ వీరులారా, ఈ లోకానికి పశ్చిమ భాగాన తేజోవంతుడు అయిన వరుణదేవుడు ఉంటూ ఉన్నట్టుగా కపిరాజూ కపిసేనానాయకుడూ అయిన సుగ్రీవుడు ఈ మహాసైన్యానికి వెనక పక్కను ఉండవలెను. నేను నా తమ్ముడు లక్ష్మణుడితో కూడా ఈ మహాసైన్యశిరోభాగములో ఉంటాను" అని రాముడు చెప్పినాడు.

ఆ వానరసైన్యాన్ని రాముడు అట్లా చక్కగా విభజించినాడు. ఆ సైన్యము వ్యూహాకారముగా ఏర్పడ్డది. అప్పుడు ఆ వానరసైన్యముతో ఆ భూమి మేఘాలు సంచారము చేస్తున్న ఆకాశమువలె శోభించింది. మహాతేజోవంతుడు రాముడు అప్పుడు సుగ్రీవుడితో "ఓ వానరరాజా, మన సైన్యాన్ని వ్యూహాకారములో ఉంచడము అయిపోయింది. ఇకను ఇప్పుడు శార్దూలుణ్ణి వదిలిపెట్టవచ్చును" అని చెప్పినాడు. రామాజ్ఞను శిరసావహించి ఆ వానరేంద్రుడు ఆ రాక్షసమాత్రుని శార్దూలుణ్ణి విడిచి పెట్టినాడు.

వానరులు పెట్టిన బాధలను ఏడుస్తూ భయపడుతూ శార్దూలుడు రావణాసురుడి దగ్గరకు పోయినాడు. వాణ్ణి చూచి రావణాసురుడు నవ్వుతూ "ఏమిరా, నీ రెక్కలు విరిగిపోయి కనపడుతున్నావు. నీవు ఆ చపలచిత్తుల చేతులలో చిక్కినావా" అని అడిగినాడు.

శార్దూలుడు తనను నిష్ప్రయోజకుడు అని రావణాసురుడు ఏమి చేస్తాడోము అనే భయముతో తొట్రుపాటుతో "రాజా, నేను ఇక్కడనుంచి సము

ద్రము ఉత్తరతీరానికి పోయినాను. సుగ్రీవుణ్ణి చూచి మంచి తియ్యని మాటలతో నీవు చెప్పింది అంతా ఎక్కువ తక్కువలు లేకుండా చెప్పినాను. నన్ను చూచీ చూడటముతో వానరులు అందరూ క్రుద్ధులు అయిపోయినారు. చటుక్కున ఆకాశానికి ఎగిరి నన్ను ఒడిసి పట్టుకొని నేలమీదికి పడతోసినారు. పిడికిళ్ళతో పొడిచినారు. నన్ను చచ్చేటట్టు కొట్టినారు. రాజా, వాండ్లతో మాట్లాడటానికే వీలు లేకపోయింది. వాండ్లను అడిగి తెలుసుకోడము అంతకు ముందే అశక్యము అయిపోయింది. ఆ వానరులు అందరూ స్వాభావికముగా కోపిష్ఠి వాండ్లు.

"ప్రభూ, వాండ్లు సముద్రానికి సేతువు కట్టినారు. ఆ సేతువు మీదుగా వాండ్లు అందరూ సముద్రము దాటి ఇవతలి గట్టుకు వచ్చినారు. విరాధుణ్ణీ ఖరుణ్ణీ కబంధుణ్ణీ వధించిన ఆ రాముడు ఇప్పుడు సుగ్రీవుడితో కూడా సీతాదేవి ఉన్న చోటు వెతకడానికి వస్తూ ఉన్నాడు. రాక్షసులను సంహరించడానికి ఆ రాముడు సన్నద్ధుడు అయి వస్తున్నాడు.

"రాజా, ఆ వానరభల్లూక సైన్యములో ఉన్న వాండ్లు అందరూ పర్వతాకారులు. మహామేఘాలవంటి వాండ్లు. వాండ్లు వేలకు వేలు ఈ భూమి కనపడకుండా మూగినారు. ఈ వానరసేనలకూ రాక్షససేనలకూ సంధి కుదరదు. వానరసైన్యాలు గుంపుగా మన లంకాపట్టణ ప్రాకారాల [illegible]. రాజా, సీతాదేవిని తిరిగి ఇచ్చివేస్తావో యుద్ధము చేస్తావో ఏమి చేయవలెనో వెంటనే నిర్ణయించవలెను. ఆలస్యము చేయవద్దు" అని చెప్పినాడు.

శుకుడు చెప్పిన ఈ మాటలకు రావణాసురుడికి కోపము వచ్చింది. కన్నులు ఎర్రబడి పోయినవి. ఆ కన్నులలోనుంచి నిప్పుకణాలు రాలుస్తూ "దేవదానవగంధర్వులు అందరూ ఏకము అయి యుద్ధము చేయడానికి వచ్చినా, సమస్తలోకాలూ నా మీదికి వచ్చినా నేను సీతను ఎంతమాత్రమూ రాముడికి ఇవ్వను. నా బాణాలకు పని లేకుండా అమ్ముల పొదులలో ఉంటూ ఉన్నవి. వసంతకాలములో పూచిన చెట్లువలె నా బాణాలు రాముణ్ణి ముసురుకొంటవి. ధగధగ మెరుస్తూ మంటలతో నా కోదండములోనుంచి వెలువడే బాణాలు కొరవులు ఏనుగులవలె రాముణ్ణి నిగ్రహిస్తవి. ఉదయసూర్యుడు సర్వనక్షత్రగ్రహకాంతినీ రూపుమాపేటట్టుగా నేను నా మహత్తర సైన్యముతో వానరబలాన్ని పూర్తిగా నాశనము చేసివేస్తాను. నాకు సముద్రమువంటి వేగమూ వాయువువంటి గమనమూ ఉన్నట్టు ఆ రాముడికి ఇదివరకు తెలియదు. అందువల్లనే వాడు నాతో యుద్ధము చేయవలెను అనుకొంటున్నాడు. నా తూణీరములో ఉన్న

తీక్ష్ణవిష సర్పాలవంటి బాణాలతో నేను యుద్ధము చేయుటము ఎప్పుడూ రాముడు చూడలేదు. అందుచేతనే వాడు నా మీదికి యుద్ధానికి వస్తూ ఉన్నాడు. పోరాటములో నా పరాక్రమము వాడు ఇదివరకు ఎరగడు. నేను శత్రుసేనలు అనే నాట్యరంగములోకి పోయి కొడుపులతో వీణతంతులను మోగించేట్టు నాపైవింట బాణాలు ఎక్కించి అల్లెతాటిని మోగిస్తాను. నా ధనుష్టంకారానికీ బాణపాతానికీ సర్వమూ నాశనము అయిపోతూ ఉంటే నేను వినోదము అనుభవిస్తాను. శరాగ్నితో ఆ సహస్రాక్షుడు దేవేంద్రుడు కానీ వరుణదేవుడు కానీ యమధర్మరాజు కానీ నన్ను ఎదిరించలేకపోయినారు. ఇక తక్కిన వాండ్లను గురించి చెప్పేది ఏమిటి" అన్నాడు రావణాసురుడు.

## ౨౫.

రాముడు వానరసైన్యాన్ని వెంటపెట్టుకొని సముద్రాన్ని దాటి ఇవతలికి చేరినాడు అని తెలియగానే ఆ ధైర్యవంతుడు రావణాసురుడు తన మంత్రులను శుకసారణులను చూచి "ఓ మంత్రి పుంగవులారా, ఇదివరకు కనీ వినీ ఎరగని సేతువును సముద్రముమీద రాముడు కట్టించినాడు అనీ ఇంతవరకు ఎవరికీ దాటరానిదిగా ఉన్న సముద్రాన్ని వానరసైన్యముతో కూడా దాటి వచ్చినాడు అనీ తెలిసింది. సముద్రానికి సేతువు కట్టడము అనేది నేను నమ్మలేకుండా ఉన్నాను. అదే కాకుండా ఆ దాటివచ్చిన వానరసైన్యము ఎటువంటిదో తెలుసుకోవలెను అనుకుంటున్నాను. కాబట్టి మీరు ఉభయులూ ఎవరికీ తెలియకుండా ఆ వానర సైన్యములోకి పోయి ఆ సైన్యపరిమాణము ఎంతో తెలుసుకొని రావలెను. ఆ వానరుల పరాక్రమమూ వారిలో ముఖ్యులు ఎవరో రాముడి మంత్రులు ఎవరో సుగ్రీవుడి మంత్రులు ఎవరో యుద్ధసమయములో ఆ వానర సైన్యములో ముందు నిలిచేవారు ఎవరో వారిలో శూరులు ఎవరో మీరు తెలుసుకొని రావలెను. అంతే కాకుండా మహాసముద్రానికి వారు సేతువును ఎట్లా కట్టించిరన్నీ, ఆ మహా బలవంతులయిన వానరులు అందరూ ఏ ఏ దేశాలవారో విచారించవలెను. ఇప్పుడు రాముడి ప్రయత్నము ఏమిటో వాడి పరాక్రమము ఎటువంటిదో వారు ఏయే ఆయుధాలు ఉపయోగిస్తారో వాడి తమ్ముడు లక్ష్మణుడి పరాక్రమము ఎటువంటిదో మొదలు అయిన విషయాలు అన్నీ మీరు తెలుసుకోవలెను. మహాపరాక్రమవంతులు అయిన ఆ వానరులకు సేనానాయకుడు ఎవడో మీరు తెలుసుకోవలెను. ఆ ఈ విషయాలు అన్నీ ఉన్నవి ఉన్నట్టుగా తెలుసుకొని ఇక్కడికి మీరు వెంటనే రావలెను" అని చెప్పినాడు.

ఆ శుకసారణులు ఇద్దరూ అంతట వానరవేషాలు వేసుకొని ఆ వానర సైన్యములోకి ఎవరికీ తెలియకుండా పోయినారు. ఆ సైన్యాన్ని అంతా చూచినారు. అది అచింత్యముగా తోచింది. ఆ సైన్య పరిమాణానికి వాండ్లె ఒళ్లు గగుర్పొడిచింది. ఇంత అంత అని లెక్క వేయడము అలవి కాకపోయింది. ఆ వానరసైన్యము పర్వత శిఖరాల మీదనూ కొండ గుహలలోనూ సముద్రతీరాననూ వనాలలోనూ ఉద్యాన వనాలలోనూ వ్యాపించి ఉంది. కొంత సైన్యము అప్పుడే సముద్రాన్ని దాటి వచ్చింది. కొంత సైన్యము సముద్రాన్ని దాటివస్తూ ఉంది. మరి కొంత సైన్యము సముద్రాన్ని దాటి రావడానికి అవతలి ఒడ్డున సిద్ధముగా ఉంది. అట్లా వానరసైన్యము భూమి అంతటా నానావిధాలుగా వ్యాపించి ఉంది. అక్కడ విడిది చేసిన మహాబలవంతులు సింహనాదాలు చేస్తూ ఉన్నారు. ఆ మహాసైన్యము క్షోభ చెంది కలసికొని మహాసముద్రము వలె శుక సారణులకు తోచింది.

ఆ శుకసారణులు వానరసైన్యాన్ని అంతా పరిశీలించినారు. వాండ్లు ఎంతో ప్రచ్ఛన్నముగా తిరిగినారు. అయినప్పటికిన్నీ మహాతేజోవంతుడు విభీషణుడు వాండ్లను పట్టుకొన్నాడు. అంతట రాముడికి వాండ్లను ఒప్పగించి "ఓ రామా, నీవు పరపురంజయుడవు. వీండ్లు ఇద్దరూ రావణాసురుడి మంత్రులు. వీడి పేరు శుకుడు. వీడు సారణుడు. వీండ్లు మన రహస్యాలను తెలుసుకొని పోవడానికి గూఢచారులుగా వచ్చినారు" అని చెప్పినాడు. అప్పుడు ఆ రాక్షసులు ఇద్దరూ రాముణ్ణి చూచి భయపడి పోయినారు. తమ ప్రాణాలమీద ఆశ వదులుకొన్నారు. భయముతోనూ దిగులులోనూ చేతులు జోడించి "ఓ పుణ్యాత్ముడా, ఈ వానరసైన్యాన్ని చూచి యిక్కడి సంగతులు అన్నీ తెలుసుకొని రమ్మని మమ్ములను మా ఏలిక రావణాసురుడు పంపించినాడు. మేము అందు కోసమే ఇక్కడికి వచ్చినాము" అని చెప్పినారు.

సర్వప్రాణికోటినీ ఎప్పుడూ కాపాడే ఆ రాముడు వాండ్లను ఇద్దరినీ చూచి నవ్వుతూ "మా సైన్యాన్ని అంతా చూచినట్లయితే మమ్ములను చక్కగా పరీక్షించి ఉన్నట్లయితే మీ ప్రభువు రావణాసురుడు మీకు చెప్పిన విషయాలు అన్నీ తెలుసుకొని ఉన్నట్లయితే మీ దారిన మీరు యథేష్టముగా పొండి. అట్లా కాకపోయినట్లయితే—ఏ కొంచెము అయినా చూడకపోయినట్లయితే అంతా చక్కగా చూచి మరీ పొండి. ఈ విభీషణుడే మా సైన్యాన్ని అంతా సాకల్యముగా మీకు చూపిస్తాడు. మీరు మాకు పట్టుపడ్డందుకు భయపడవద్దు. మీకు ప్రాణభయము ఏమీ అవసరము లేదు. ఆయుధాలు లేని వాండ్లనూ, దూతలనూ చంపివేయకూడదు. మేము మిమ్ములను చంపము.

"ఓ విభీషణుడా, సామాద్యుపాయాలతో శత్రుపక్షాన్ని ఆకర్షించకలము అనుకొని వీండ్లు ఇక్కడికి వచ్చినారు. అట్లా వచ్చిన వీండ్లు ఇప్పుడు మనలను వేడుకొంటున్నారు. కాబట్టి, వీండ్లను వదిలి వేయ వలసిందేను."

"ఓ రాక్షస మంత్రులారా, మీరు లంకా పట్టణము పోయి మీ ఏలికకు నేను చెప్పే ఈ మాటలు ఎక్కువ తక్కువలు లేకుండా చెప్పవలెను.

"ఓ రావణాసురుడా, నీవు ఏ బలముతో నా భార్యను సీతను ఎత్తుకొని పోయినావో ఆ బలాన్ని అంతా నీవు ఇప్పుడు చూపించవలెను నీ సైన్యాలనూ నీ బంధువులనూ సమకూర్చుకొని యుద్ధానికి సిద్ధముగా ఉండు. నేను రేపు ప్రాతః కాలాన నీ లంకాపట్టణ బహిర్ద్వారాలనూ ప్రాకారాలనూ బద్దలుకొట్టి నీ రాక్షస సైన్యాన్ని నా బాణాలతో ధ్వంసము చేసి వేస్తాను చూడుకో ఓ రావణుడా, దేవేంద్రుడు వజ్రాయుధాన్ని వలె భయంకరము అయిన బాణాలు నేను నీ మీద రేపు ఉదయము వదులుతాను. నా కోపాన్ని తీర్చుకొంటాను. నీవు నీ బలముతో సిద్ధముగా ఉండు" అని శుకసారణులతో చెప్పినాడు.

ఆ మాటలకు అప్పుడు ఆ సర్వవానరులున్నూ రాముణ్ణి జయించమని అభినందించి ఆ శుకసారణులు లంకా పట్టణానికి పోయినారు. వారు అంతట రావణాసురుడి దగ్గరకు పోయి "ఓ రాజా, మేము పోయి వానర సైన్యాలను అన్నిటినీ చూచినాము. మమ్ములను విభీషణుడు పట్టుకొన్నాడు. ఆ ధర్మాత్ముడు ఆ మహాత్ముడు రాముడు మమ్ములను వదిలి పెట్టించినాడు. రాజా, ఆ కాంతిమంతుడూ అతని తమ్ముడు లక్ష్మణుడూ మీ తమ్ముడు విభీషణుడూ మహా తేజోవంతుడూ దేవేంద్రుడి వంటి పరాక్రమంతుడూ అయిన సుగ్రీవుడూ దిక్పాలకుల వంటి వారు శూరులు అస్త్రవేత్తలు, దృఢపరాక్రములు ఆ నల్గురు ఏకము అయినారు. వానర సైన్యాన్ని అట్లా ఉంచు రామలక్ష్మణ విభీషణ సుగ్రీవులు నలుగురే లంకా పట్టణాన్ని బహిర్ద్వారాలతోనూ ప్రాకారాలతోనూ పెల్లగించి వేయకలరు.

"ఓ రాజా, మేము రాముడి ఆకారాన్ని చూచినాము. అతని ఆయుధాలను చూచినాము. లక్ష్మణ విభీషణ సుగ్రీవులు మున్నగువారు అక్కర లేదు. రాముడు ఒక్కడే ఈ లంకా పట్టణాన్ని అంతా సంహారము చేసి వేయకలడు. రామలక్ష్మణ సుగ్రీవులు కాపాడుతూఉన్న ఆ వానర సైన్యము మీదికి సురాసురలు అందరూ ఏకము అయి దేవేంద్రుడితో కూడా వచ్చినా ఏమీ చేయలేరు. రాజా, పది యోజనాలు వెడల్పునా నూరు యోజనాల పొడుగునా సముద్రానికి వానరులు సేతువు కట్టినారు. మేము ఆ సేతువును

కన్నులారా చూచినాము, ఆ సేతువు మీది నుంచే వానరసైన్యము అంతా సముద్రాన్ని దాటివచ్చింది. రాముడు ఇప్పుడు సముద్రతీరాన విడిది చేసి ఉన్నాడు. వానరసైన్యము చాలా భాగము సముద్రాన్ని దాటి వచ్చింది ఇంకా కొంతవానరసైన్యము సముద్రాన్ని దాటి వస్తూ ఉంది. ఆ వానరసైన్యానికి అంతు కనపడలేదు. ఓ రాజా వానరవీరులు అందరూ మహాబలవంతులు. అందరూ యుద్ధోత్సాహముతో ఉన్నారు. ఏ క్షణము అయినా యుద్ధము చేయకలరు. వాళ్లతో యుద్ధమువద్దు. నీవు కోపము వదిలిపెట్టు శాంతించు. రాముడికి సీతాదేవిని ఇవ్వు" అని శుకసారణులు చెప్పినారు.

౨౬

శుకసారణులు నిర్భయముగా చెప్పిన మంచిమాటలు రావణాసురుడు విని "ఓమంత్రులారా, దేవదానవగంధర్వులు అందరూ ఏకము అయి యుద్ధము చేయడానికి వచ్చినా సమస్తలోకాలు నన్ను బెదిరించడానికి వచ్చినా నేను సీతను రాముడికి ఇవ్వను. ఓ సారణుడా, నీవు మెత్తని వాడవు, నిన్ను వానరులు కొట్టినారు ఏమో. నీవు బాగా భయపడి పోయినావు. అందువల్ల సీతను మళ్ళీ ఇచ్చి వేయమని చెప్పుతున్నావు. ఏ శత్రువు నన్ను యుద్ధములో జయించ కలడో నీవు చెప్పు" అని అడిగినాడు.

ఇట్లా కఠినముగా మాట్లాడి ఆ కాంతిమంతుడు రావణాసురుడు అంతట ఆ వానరసైన్యాన్ని చూడదలచెను. అనుకొని మంచు మాదిరిగా తెల్లగా ఎన్నో తాటి చెట్ల ఎత్తున ఉన్న తన ప్రాసాదము ఎక్కినాడు. కుపితుడు అయిపోయి శుకసారణులను వెంట ఉంచుకొని సముద్రప్రాంతములోనూ పర్వతాలమీదనూ వనాలలోనూ భూమి అంతటానూ ఉన్న వానరసైన్యాన్ని చూచినాడు, లెక్క వేయడానికి అలవి కాకుండా అపారముగా ఉన్న ఆ వానర మహా సైన్యాన్ని చూచి సారణుడితో "ఓ సారణుడా, ఈ వానరముఖ్యులలో శూరులు ఎవరు. మహాబలవంతులు ఎవరు. వీరిలో మహోత్సాహముతో ముందుగా పోరాటానికి వచ్చేవారు ఎవరు. సుగ్రీవుడు ఎవరిమాట వింటాడు. సేనానాయకులకు సేనానాయకుడు అయిన వాడు ఎవడు. సారణుడా, ఈ వానరవీరులలో ముఖ్యులుఅయిన వాళ్లు ఎవరు. ఉన్నది ఉన్నట్టు చెప్పు" అని అడిగినాడు.

ఆవానరులలో ముఖ్యులుఅయిన వారిని అందరినీ తెలుసుకొని వచ్చిన ఆ సారణుడు "ఓ రాజా, అడుగో నీలుడు. వేలకు వేలమంది చుట్టూ ఉన్నారు. లంకాభిముఖుడుఅయి సింహనాదము చేస్తున్నాడు. వాడి మహాఘోషానికి

లంకాపట్టణ బహిర్ద్వారాలూ ప్రాకారాలూ పర్వతాలూ వనాలూ పట్టణము అంతానూ చలించిపోతున్నవి.. మహాబలవంతుడు అయిన సుగ్రీవుడు సేనాముఖాన ఉన్నాడు. వీరుడు. ఈనీలుడే వానర సేనానాయకుడు.

"అదుగో, పరమపరాక్రమవంతుడు అంగదుడు. చేతులు పయికెత్తి లంకాభిముఖుడు అయి కోపముతో విజృంభించి నేలమీద నడిచి వస్తూవున్నాడు. పర్వతశిఖరము అంతె ఎత్తున పద్మకింజల్క వర్ణముతో కనబడుతున్నాడు. దిశ దిశలూ మారుమోగిపోయేట్టు తోకను అమితవేగముతో పదేపదే నేలకు వేసి కొట్టుతున్నాడు. ఈ అంగదుణ్ణి వానరరాజు సుగ్రీవుడు యువరాజుగా అభిషేకించినాడు. వీడు, వాలిపుత్రుడు. తండ్రితో సరిసమానము అయిన పరాక్రమవంతుడు. సుగ్రీవుడికి ఎప్పుడూ ఇష్టుడు. దేవేంద్రుడికి పనిచేసి పెట్టడానికి వరుణదేవుడివలె రామకార్యార్థము పరాక్రమించి నిన్ను యుద్ధానికి ఆహ్వానిస్తున్నాడు.

"అదుగో వాడే జనకాత్మజను సీతాదేవిని చూచివోయిన రామహితైషి హనుమంతుడు. ఈ వానరసైన్యము అంతా ఇక్కడికి రావడానికి వీడే కారకుడు. ఈ వీర్యవంతుడు ఈ దుర్జయుడు అనేక వానరయూథాలతో నీ మీదికి రావడానికి సిద్ధపడుతున్నాడు.

అంగదుడి వెనక అదుగో నలుడు. వాడే సముద్రానికి సేతువు కట్టినవాడు. వీరుడు. మహాసైన్యముతో యుద్ధానికి సంసిద్ధముగా ఉన్నాడు. ఛందనవనములో నివసించే పరాక్రమవంతులు అయిన వానరులు అందరూ ఆనలుడి వెంట వచ్చినారు. వాండ్లు అందరూ దేహాలు నిగిడ్చి సింహనాదాలు చేస్తూ ఉన్నారు. ఈ వెయ్యికోట్ల ఎనిమిదిలక్షల వానరులూ భయంకరులు క్రూరులు, చండపరాక్రములు. ఈ నలుడు ఒక్కడే లంకాపట్టణాన్ని నాశనము చేస్తాను అని చెప్పినాడు.

"అదుగో శ్వేతుడు అనేవాడు. వెండివలె తెల్లగా ఉన్నాడు. వాడు యుద్ధచపలుడు. భయంకర పరాక్రముడు. బుద్ధిమంతుడు. ముల్లోకాలలోనూ పరమపరాక్రమవంతుడు అని ప్రసిద్ధికెక్కినాడు. అదుగో వాడు ఆ శ్వేతుడు సుగ్రీవుడి దగ్గరకు గబాగబాపోయి వానరసైన్యాన్ని విభజిస్తున్నాడు. సైనికులను ప్రోత్సాహపరుస్తున్నాడు. అదుగో వాడు అక్కడినుంచి మళ్ళీ ఎక్కడికో పోతున్నాడు. చూడు.

"అదుగో కుముదుడు, వీడు గోమతీనదీతీరాన వివిధశిఖరాలతోనూ మనోహరముగా ఉండే సంకోచనము అనే పర్వతముమీద నివసిస్తూ అక్కడి వానర

రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. ఈ కుముదుడు ఒకకోటి వానరవీరులతో వచ్చినాడు. అదుగో వాడితోక వెంట్రుకలు పొడుగుగాఉన్నవి. ఎర్రగానూ పచ్చగానూ తెల్లగానూ ఆ తోక రంగురంగులలో కనపడుతున్నది. ఈ కుముదుడున్నూ తన సైన్యముతో లంకాపట్టణాన్ని నాశనముచేసివేయ నిశ్చయించుకొన్నాడు.

"ఓ రాజా, అదుగో రంభుడు. సింహసమాన పరాక్రమవంతుడు. కపిల వర్ణముతో దీప్తనేత్రాలతో నిశ్చలముగా నిలుచునిఉన్నాడు. తన నేత్రాలతో దహించివేసేటట్టుగా లంకాపట్టణము వంకచూస్తున్నాడు. నూటముప్ఫయి లక్షలమంది వానరవీరులతో వచ్చినాడు. ఆ వానరులు అందరూ శూరులు క్రూరులు, చండపరాక్రములు. ఈ రంభుడు వింధ్యపర్వతమూ సహ్యపర్వతమూ కృష్ణగిరి అనే మూడు పర్వతాలమీద ఉంటూఉన్న వానరులను పరిపాలిస్తూ ఉన్నాడు.

"అదుగో శరభుడు అనే వానరయూథపతి. చెవులు నిక్కపొడుచుకొని ఉన్నవి. మాటిమాటికీ వాడు ఆవలిస్తూఉన్నాడు. ఈ శరభుడు చావుకు వెరవడు. యుద్ధములో ఎటువంటిసమయములోనయినా పరుగెత్తి పారిపోడు. కోపముతో వణికిపోతూ పదేపదే ఎగాదిగాచూస్తూఉన్నాడు. తన తోకను తిప్పుతూ సింహనాదము చేస్తున్నాడు. మహాబలవంతుడు. భయము అనేది వీడు ఎరుగడు. మనోహరము అయిన సాల్వేయపర్వతము మీద ఉన్న వానరులకు, అందరికీ రాజు. రాజా, ఈ శరభుని చేతిక్రింద విహారులు అనే ప్రసిద్ధ వానరోత్తములు ఒక నలభై లక్షల మంది ఉన్నారు. వాండ్లు అందరూ మహాబలవంతులు.

"అదుగో పనసుడు. పర్వతాకారుడు. మేఘము ఆకాశాన్ని ఆవరించి ఉరుములు ఉరిమేటట్టుగా వీడు భేరీలవంటి ధ్వనితో భయంకరముగా సింహనాదము చేస్తూ ఉన్నాడు. వీడు యుద్ధాన్ని కాంక్షిస్తున్నాడు. దేవతల మధ్యను దేవేంద్రుడివలె వానరోత్తముల మధ్యను కూర్చుని ఉన్నాడు. వీడు భయంకరుడు. యుద్ధములో ఎదిరించ వలనికానివాడు. వీడికన్నా వీరుడు ఇంకొకడు లేడు. వీడు పారియాత్రపర్వతము మీద వానరులను ఏలుతున్న రాజు. వీడిక్రింద ఏభై లక్షల మంది వానరోత్తములు వేరే వేరే యూథాలుగా ఉన్నారు.

"అదుగో వినతుడు సముద్రతీరాన రెండవ సముద్రము వలె మహాభయంకరముగా వస్తూ ఉన్న సేనాసమూహములో శోభిస్తూ ఉన్నాడు. వీడు దర్దుర

పర్వతముతో పరిసమానము అయిన వాడు. పర్ణాసానదీ ప్రాంతములో వానరు లను పరిపాలించే రాజు. వీడి సైన్యములో అరవై లక్షల మంది వానరవీరులు ఉన్నారు.

"అదుగో క్రోథనుడు. నిన్ను యుద్ధానికి పిలుస్తున్నాడు. వీడితో పరాక్రమవంతులూ బలవంతులూ అయిన వానరులు యూథాలు యూథాలుగా ఉన్నారు.

"అదుగో గవయుడు. బలదర్పితులు అయిన వానరులను అందరినీ తృణీకరించి యుద్ధోత్సాహముతో తన ఎర్రటి కపాన్ని పెంచుతున్నాడు. పరమ తేజోవంతుడు. కోపిష్ఠివాడు. నీ మీద పడవలెను అనుకొంటున్నాడు. వీడికింద డెబ్బయి లక్షలమంది వానరవీరులు ఉన్నారు. వీడు తన సేనతో వచ్చి లంకా పట్టణాన్ని అంతా నాశనము చేయ నిశ్చయించుకొన్నాడు.

"ఓ రాజా ఈ వానరయూథపతులు అందరూ జయించ నలవికాని శూరులు. బలవంతులు. కామరూపులు. వీండ్లకు ఒక్కొక్కరికి ఒక్కొక్క గొప్పసైన్యము ఉంది.

౨౮

"రాజా, రామకార్యార్థము తమ ప్రాణాలను అయినా లెక్క చేయకుండా పరాక్రమముతో పోరాడే వానరయూథపతులను గురించి చెప్పతాను. చూడు. అదుగో హరుడు. బాగా పొడుగాటి తోకతో ఉన్నాడు. చూడు. ఆ తోకమీద వెంట్రుకలున్నూ పొడుగుగా పెరిగినవి. ఆ వెంట్రుకలు ఎర్రగా తెల్లగా పసుపుగా నిగనిగలాడుతూ ఉన్నవి. వాడు ఆ తోకను పయికి ఎత్తుతూ ఉంటే సూర్యుడు తన కిరణాలను నేలమీద వెదచల్లుతున్నట్టుగా ఉంది. వీడు యూథపతి, వీడూ వీడి సైనికులూ ఆ వానరరాజు సుగ్రీవుడి కింకరులు. వానరులు వందలకొద్దీ వేలకొద్దీ చెట్లను పట్టుకొని లంకాపట్టణము ఎక్కడానికి ఆ హరుడి వెనక గబాగబా వస్తు ఉన్నారు. హరుడు వెయ్యికోట్లమంది వానరులతో వచ్చినాడు. నిన్ను తానే జయించవలెను అనుకొంటున్నాడు.

"రాజా, అదుగో భల్లూకవీరులు. నీలమేఘాలవలెనూ కాటుకకొండల వలెనూ వస్తూ ఉన్నారు. వారిని లెక్క వేయడానికి అలవికాకుండానూ ఇంత దూరము వరకూ ఉన్నారు అని నిర్దేశించడానికి వీలుకాకుండానూ మహాసముద్రమువలె వస్తున్నారు. చూడు. వీండ్లు పర్వత ప్రదేశాలలోనూ విస్తృత ప్రదేశాలలోనూ నదీ తీరాలలోనూ నివసిస్తూ ఉన్నారు. వీండ్లు అందరూ పరమ [illegible]. నిన్ను ఎదిరించడానికి వస్తున్నారు.

అదుగో చూడు—నీలమేఘాలమధ్యను పర్జన్యుడివలె భల్లూకవీరుల మధ్యను ఉన్నవాడు ధూమ్రుడు. వాడే సమస్త భల్లూక వీరులకున్నూ అధిపతి. నర్మదానదీ జలాలు తాగుతూ వాడు ఋక్షవంతము అనే పర్వతముమీద నివసిస్తూ ఉన్నాడు. అదుగో వాడి పక్కనే పర్వతాకారుడు మరి ఒక భల్లూక వీరుడు కనపడుతున్నాడు. వాడు ధూమ్రుడి తమ్ముడు. రూపములో అన్నను పోలి ఉన్నాడు. అయితే పరాక్రమములో అన్నకన్నా అధికుడు.

వాడేజాంబవంతుడు: మేటి సేనానాయకులకు సేనానాయకుడు. మహాపరాక్రమవంతుడు. గురుశుశ్రూష చేసినాడు. యుద్ధములో వాణ్ణి ఎవరూ ఎదిరించలేరు. వాడు బుద్ధిమంతుడు. దేవాసుర యుద్ధములో దేవేంద్రుడికి చాలా సాయము చేసినాడు. ఈ జాంబవంతుడు దేవేంద్రుణ్ణి మెప్పించి ఎన్నో వరాలు సంపాదించినాడు.

మహాకాయాలతో ఉన్న భల్లూకవీరులు అందరూ రాక్షసులవంటి వాండ్లు పిశాచాలవంటి వాండ్లు, అగ్నిహోత్రుడితో సరిసమానము అయిన తేజోవంతులు. అయితే పెద్ద పెద్ద రోమాలతో నల్లగా కనపడుతున్నారు. పర్వతాల పయికి ఎక్కి పెద్ద పెద్ద మేఘాలవంటి రాళ్ళను కిందికి ఇప్పుడు పడతోస్తూ ఉన్నారు. వీండ్లకు చావుఅంటే భయములేదు.

“రాజా, అదుగో ఎగురుతూ ఉన్నాడు దంభుడు అనే వాడు. వానర సమూహాలు ఆశ్చర్యముతో వాణ్ణి చూస్తూ ఉన్నవి దంభుడు మహాబలసంపన్నుడు. వానర సేనానాయకులలో ముఖ్యుడు వాడు వాడి సైన్యముతో దేవేంద్రుణ్ణి మెప్పించినాడు.

“రాజా, అదుగో సన్నాదుడు అనే వానరవీరుడు. వాడు వానరులకు అందరికీ పితామహుడు. వాడు ఒక్క అడుగులో ఒక్క యోజనము దూరము పర్వతాన్ని ఆక్రమించి పోకలడు. అనేవిధముగా పయికి ఒక్క యోజనము ఎత్తున దేహముతో లేవకలడు. చతుష్పాజ్జంతువులలో దీనికిన్నీ వీడికన్నా పెద్ద దేహము లేదు. పూర్వము వీడు దేవేంద్రుడితో యుద్ధము చేసినాడు. ఓడిపోలేదు. వీడు అపరాజితుడు. దేవేంద్రుడితో పరిసమానము అయిన పరాక్రమవంతుడు. దేవాసురయుద్ధములో దేవతలకు తోడుపడడానికి వీడు అగ్నిహోత్రుడికీ ఒక గంధర్వకన్యకూ పుట్టినాడు.

“అదుగో క్రథనుడు అనే వానరవీరుడు. వాడు యుద్ధాసక్తుడు. యుద్ధములో అపజయము ఎరగడు. వెయ్యికోట్ల మంది వానరులతో వచ్చినాడు. వీడు హిమాలయపర్వతముమీద కిన్నరులు సేవిస్తూనూ మా అన్న కుబేరుడు విహ

రిస్తూనూ ఉండే జంబూవనములో ఉంటూ ఉన్నాడు. వీడు ఒక్కడూ తన సైన్యముతో నిన్నూ నీ లంకా పట్టణాన్ని నాశనము చేసివేయవలెను అనుకొంటున్నాడు.

"ఇదుగో, ప్రమాధి అనే వానరవీరుడు. వీణ్ణి చూడు.

పూర్వము శంబసాదనుడు అన్వే రాక్షసుడు గజాకారముతో మునిజనులను బాధ పెట్టసాగినాడు. అప్పుడు ఆ మునిజనులు నియోగించినందువల్ల ఆ గజాకారరాక్షసుణ్ణి కేసరి అనేవాడు చంపివేసినాడు. అప్పుడు ఏనుగులకున్నూ వానరులకున్నూ వైరము వచ్చింది. ఆ వైరాన్ని పురస్కరించుకొని ఇప్పటికిన్నీ ఈ ప్రమాధి కనపడ్డ మదపు ఏనుగులను భయపెట్టుతూ వున్నాడు. ఏనుగును పట్టుకొని పర్వతానికి వేసి కొట్టి చంపివేయడమో పర్వతాన్నే ఏనుగుమీద వేసి కొట్టి చంపివేయడమో పెద్ద పెద్ద వృక్షాలను పెళ్ళగించి వాటితో ఏనుగును కొట్టడమో ఏనుగునే చెట్టుకు వేసి కొట్టి చంపడమో చేస్తూ వుంటాడు. వీడు గంగానదీ సమీపాన మందరపర్వతము వంటి ఉశీరబీజము అనే పర్వతముమీద దేవలోకములో దేవేంద్రుడివలె విహరిస్తూ వుంటాడు. ఆ గిరి గుహాలలో నివసిస్తూ ఆ గంగానదీ తీరాలలో తిరుగుతూ ఏనుగులతో పోరాడుతూ వుంటాడు. వీడు వెయ్యి లక్షల సైన్యముతో వచ్చినాడు. చూడు, వీడి సైనికులు అందరూ మహాబలవంతులు. ఉత్సాహముతో పరాక్రమముతో గర్వముతో వాండ్లు గర్జిస్తున్నారు. వీడి సైనికుల సంరంభము నుంచి గాలికి దుమ్ము ఎర్రగా వివిధవర్ణాలతోనూ పయికి లేస్తూ వుంది. ఆ మహాసైన్యము మధ్యను ప్రమాధి మహామేఘము వలె కనపడుతున్నాడు.

"రాజా, అదుగో, గోలాంగూల ధీశ్వరుడు గవాక్షుడు. ఒక కోటిమంది గోలాంగూల వీరులను వెంట బెట్టుకొని సేతువు మీద నుంచి వస్తూ వున్నాడు. తెల్లని ముఖాలతో వస్తూ వున్న ఆ బలవంతులను చూడు. ఈ ప్రమాధి తాను ఒక్కడే తన సైన్యముతో లంకాపట్టణాన్ని సర్వనాశనము చేసి వేస్తాము అని చెప్పినాడు.

"ఓ రాజా, ఏ పర్వతముమీద తియ్యని పూవు తేనెలు తాగడానికి తుమ్మెదలు ఎప్పుడూ మూగుతూ వుంటవో ఏ పర్వతము మీద ఫలవృక్షాలు కావలెను అని కోరుకొన్న పండ్లు అన్నీ పండుతూ ఉంటవో ఏ పర్వతము మీదికి సూర్యుడు రాగానే ఆ పర్వతమువలె స్వర్ణరూపము ధరిస్తాడో ఏ పర్వతముమీద మృగాలూ పక్షులూ జంతువులూ సమస్తప్రాణులూ బంగారురంగుతో భాసిస్తూవుంటవో ఏపర్వత సెత్తాలలో మహర్షులు ఎప్పుడూ నివసిస్తూవుంటారో

ఏ పర్వతముమీద ఏటికి ఏడాదీ ఫలవృక్షాలు అన్నీ అతి రుచ్యము అయిన పండ్లను కాస్తూ ఉంటవో రాజా, నీవు రాక్షసుల మధ్యను ఉంటూ ఉన్నట్టు అరవై వేల బంగారు కొండలమధ్యను ఏ పర్వతము ఉంటూ ఉందో ఆ కాంచన పర్వతముమీద ఎప్పుడూ విహరించే వానర ముఖ్యులకు అందరికీ ముఖ్యుడు అయిన కేసరి అడుగో. వాడివెంటవచ్చిన వానరులను చూడు. కపిలముఖాల తోనూ శ్వేతముఖాలతోనూ తామ్రముఖాలతోనూ మధుపింగళ ముఖాలతోనూ తీక్ష్ణములయిన కోరలతోనూ ఆయుధాలుగా ఉపయోగించే నఖాలతోనూ నాలుగు కోరలసింహాల వలెనూ దగ్గరకుపో నలవికాని పెద్దపులుల వలెనూ కనపడుతున్నారు. వాండ్లుఅందరూ అగ్నిహోత్రముతో సరిసమానముఅయిన తేజోవంతులు, మంటలుమండే విషముకక్కే మహాసర్పాలవంటి వాండ్లు. పెద్దపెద్ద తోకలతో మదపుటేనుగుల వలెనూ మహాపర్వతాల వలెనూ గుండ్రని ఎర్రని కన్నులతో భయంకరులకు భయంకరులుగానూ భయంకరవేగముతో మేఘ గంభీరధ్వనులతో సింహనాదాలు చేస్తూ ఉన్నారు.

"రాజా, అడుగో విఖ్యాతవీరుడు శతవలి అనేవాడు. ఆ కనపడుతున్న వానరవీరుల మధ్యను ఉన్నాడు. ఆ పరాక్రమవంతుడు జయముకోసము ఎప్పుడూ సూర్యుణ్ణి ఉపాసిస్తూఉంటాడు. వాడు శూరుడు బలవంతుడు. పౌరుషాన్ని ఏమాత్రము వదలడు. రాముణ్ణి సంతోష పెట్టడానికి తన ప్రాణాన్ని అయినా వదిలిపెట్టుతాడు. వాడుగూడా తన సైన్యముతో నీ లంకాపట్టణాన్ని కొట్టడానికి నిశ్చయించుకొన్నాడు.

"రాజా, అడుగో, గజుడూ గవాక్షుడూ గవయుడూ నలుడూ నీలుడూ—వాండ్లకు ఒక్కొక్కరికి పదికోట్ల సైన్యముఉంది, వాండ్లే కాకుండా వింధ్యపర్వతముమీద నివసిస్తూఉన్న వానరులు అనేకమంది వచ్చినారు.

మహారాజా, ఈ వానరులు అందరూ మహాప్రభావులు. పర్వతాలు అంతటి దేహాలతో కనపడుతున్నారు. అందరూ క్షణములో పర్వతాలను పగుల కొట్టి ఈ భూమిఅంతటా వెదచల్లకలరు అని సారణుడు చెప్పినాడు.

## ౨౯

ఈ విధముగా సారణుడు చెప్పడము అయిపోగానే శుకుడు రావణాసురుణ్ణి చూచి "రాజా, మదపుటేనుగుల వలెనూ గంగాతీరాన మర్రి చెట్లవలెనూ హిమవత్పర్వతము మీద మద్దిచెట్లవలెనూ ఎట్టఎదుట మహాకాయా

లతో కనపడుతూ ఉన్న వానరులను చూడు. వాండ్లు దుర్జయులు, మహా బల వంతులు, కామరూపులు, పోరాటములో దైత్యదానవులతో సరిసమానము అయినవాండ్లు. దేవతలవంటి పరాక్రమవంతులు.

"ఈ వానరులు తొమ్మిది వేల కోట్లు అయిదు వేల కోట్లు ఏడు వేల కోట్లు అనేక వేల శంఖాలూ అనేకవందల బృందాలుగా అంతులేకుండా ఉన్నారు. వీరు అందరూ సుగ్రీవుడి అనుచరులు. ఎప్పుడూ కిష్కింధానగరములో ఉంటూ వున్నారు. దేవతలకూ గంధర్వులకూ వీండ్లు అందరూ పుట్టినారు. వీండ్లు అందరూ కూడా పుట్టుకతోనే కామరూపులు.

"దేవా, అదుగో ఇద్దరు యువకులు. తీర్చి దిద్దిన రూపాలతో కనపడు తున్నారు. చూడు, వాండ్లనే మైంద ద్వివిదులు అంటారు. పోరాటములో వాండ్లతో సరిసమానము అయినవాండ్లు ఎవరూ లేరు. బ్రహ్మానుగ్రహము వల్ల వాండ్లు ఉభయులూ అమృతపానము చేసినారు. యుద్ధములో వాండ్లు తమ పరాక్రమముతో లంకాపట్టణాన్ని కొట్టవలెను అని కాంక్షిస్తున్నారు.

"ప్రభూ, అదుగో, మరి ఇద్దరు పర్వతాలు అంతటి మహాకాయులు. వారి చుట్టూ పదికోట్లు సైన్యము ఉంది. చూడు, వాండ్లు యిద్దరూ లంకా పట్టణము వంక చూస్తున్నారు. వాండ్లనే సుముఖుడూ దుర్ముఖుడూ అంటారు. వాండు ఇద్దరూ మృత్యుదేవుడి పుత్రులు. తండ్రితో సరి సమానము అయిన వాండ్లు.

"రాజా, అదుగో, చూడు. మదపుటేనుగు వలె నిలుచుని వున్నాడు. వాడు ఇదివరకు లంకాపట్టణానికి వచ్చి సీతాదేవిని చూచి సీతతో మాట్లాడి పోయి నాడు. ఇప్పుడు మళ్ళీ వచ్చినాడు. వీడు కేసరిభార్యకు తొలిచూలు బిడ్డ. వాయుదేవుడి పుత్రుడు. హనుమంతుడు అని ప్రసిద్ధి కెక్కినాడు. మొట్ట మొదట సముద్రలంఘనము చేసిన వానరవీరుడు. వీడు క్రుద్ధుడు అయ్యేట్లయితే తన బలముతో సముద్రాన్ని అయినా క్షోభపెట్టే సమర్థుడు. వీడు వీడి చిత్తము వచ్చిన రూపము ధరించగలడు. బలవంతుడు. రూపసి. వాయుదేవుడి వలె ఎక్కడికి అయినా అనివార్యముగా పోతూ ఉంటాడు.

"ఈ హనుమంతుణ్ణి బాగా ఎరిగినవాడు నాకు ఒక ఆప్తుడు ఉన్నాడు. వాడు చెప్పింది చెప్పుతాను విను. వీడు పుట్టడమే ఎంతో బలముతోనూ దర్పము తోనూ పుట్టినాడు. వీడి పసితనములో ఒకనాడు ఉదయము వీడికి మంచి ఆకలి వేసింది. ఉదయిస్తూ ఉన్న సూర్యబింబాన్ని చూచి అది ఒక పండు అను కొన్నాడు. ఆ పండును తిని తన ఆకలి పోగొట్టుకోవచ్చును అనుకొని అప్పటికి

అప్పుడు మూడు వేల యోజనాలు ఎగిరి పోయినాడు. దేవతలూ మహర్షులూ సమీపించలేని సూర్యుణ్ణి వీడా పట్టుకొనేది. అప్పుడు వీడు అక్కడినుంచి ఉదయగిరిమీద పడిపోయినాడు. ఆ పడడము ఒక రాతి బండమీద పడ్డాడు. వీడి హనువు (చెక్కిలి పై భాగము) కొంచెము చితికిపోయింది. అందువల్ల వీణ్ణి హనుమంతుడు అన్నారు. వీడి అంతటి బలవంతుడు మరి ఒకడు లేడు. వీడి ఆకారమువంటి ఉన్నతాకారము మరి ఎవడికీ లేదు. వీడు మహాప్రభావము కల వాడు. వీడు పోట్లాడేటట్టు ఎవడూ మాట్లాడలేదు. వీడు ఒక్కడే ఎవరి సహాయమూ లేకుండా లంకాపట్టణాన్ని కొట్టవలెను అనుకొంటున్నాడు.

"ఓ ప్రభూ, అడుగో, హనుమంతుడి సమీపములో ఉన్న ఆ శూరుణ్ణి చూడు. అతడి దేహము శ్యామముగా ఉంది నేత్రాలు పద్మపత్రాలు మాదిరిగా ఉన్నవి. అతడే ఇక్ష్వాకువంశములో పుట్టిన అతిరథుడు రాముడు. ఈ లోకములో పరాక్రమానికి ప్రసిద్ధికెక్కినాడు. ఎవరు ఏమి చెప్పినా ధర్మము తప్పడు. ఇంతవరకూ ధర్మాన్ని అతిక్రమించలేదు. వేదాధ్యయనము చేసినాడు. వేదవేత్తలలో ఉత్తముడు. బ్రహ్మాస్త్రము మొదలు అయిన సమస్త దివ్యాస్త్రాలు తెలిసినవాడు. తన బాణాలతో ఆకాశాన్ని భేదించి వేయకలడు. పర్వతాలను ఆ బాణాలతోనే పగలకొట్టి వేయకలడు. కోపానికి మృత్యువు వంటివాడు. పరాక్రమానికి దేవేంద్రుడు వంటివాడు. నీవు జనస్థానమునుంచి అపహరించి తెచ్చిన సీత ఈతని భార్య, ఇప్పుడు నీతో యుద్ధము చేయడానికి వస్తూ ఉన్నాడు.

"ఈ రాముడికి కుడి పక్కను బంగారు రంగులో ఉన్నవాడు ఈతని తమ్ముడు లక్ష్మణుడు చూడు. విశాలము అయిన వక్షఃస్థలము ఎర్రని కన్నులు, ఉంగరాలు తిరిగిన నల్లని తల వెంట్రుకలు. ఈతడు రాముడికి ప్రాణప్రియుడు, నీతిజ్ఞుడు. యుద్ధకుశలుడు. సర్వశస్త్రాస్త్ర విశారదుడు మహాకోపిష్ఠి దుర్జయుడు. జయశీలి పరాక్రమశాలి. బుద్ధిమంతుడు. రాముడి కుడిభుజము. అతడి బహిఃప్రాణము వీడు రాముడి కోసము తన ప్రాణాన్ని అయినా వదులుతాడు. యుద్ధములో సమస్త రాక్షసులను తానే సంహారము చేయవలెను అని వీడు అనుకొంటున్నాడు.

"రాజా, రాముడి ఎడమ పక్కను విభీషణుడు తన నలుగురు మంత్రులతోనూ ఉన్నాడు చూడు. ఆ రాజరాజు – శ్రీమంతుడు రాముడు విభీషణుణ్ణి లంకారాజ్యాధిపతిగా రాజ్యాభిషేకము చేసినాడు 'ఇప్పుడు అందువల్ల ఈ విభీషణుడు మహాసంరంభముతో నీ మీదకు యుద్ధానికి వస్తూ ఉన్నాడు.

"దేవా అదుగో రాముడికీ విభీషణుడికి మధ్యను పర్వతమువలె అచలముగా నిలుచుని వున్నాడు సర్వ వానరరాజులకూ రాజు అయిన సుగ్రీవుడు. పర్వతాలు అన్నిటిలోనూ హిమవత్పర్వతము వలె ఈ సుగ్రీవుడు వానరరాజ వంశములో పుట్టి తేజోబలముతోనూ దేహబలముతోనూ బుద్ధిబలముతోనూ జ్ఞానబలముతోనూ వానరరాజులను అందరినీ అతిశయించినాడు. మహోరూపము అయిన కిష్కింధా నగరములో చుట్టూ వనాలతోనూ, వానరయూథ పతులతోనూ పర్వత దుర్గములో వుంటున్నాడు. చూడు! సుగ్రీవుని వక్షస్థలము మీద లక్ష్మీప్రదము అయిన నూరు కమలాల కాంచనమాల శోభిస్తూ ఉంది. వీడు ఈ సుగ్రీవుడు రాముడిచేత వాలిని చంపించి దేవతలకూ మానవులకూ దుర్లభము అయిన ఆ కాంచనమాలనూ (వాలి భార్య అయిన) తారనూ సుస్థిరము అయిన వానర రాజ్యాన్ని సంపాదించినాడు. రాజా, ఆ కాంచనమాలను ధరించేవాడు ఎన్నడు యుద్ధములో ఓడిపోడు.

"ఓ ప్రభూ, నూరు లక్షలు ఒక కోటి అనీ నూరు వేల కోట్లు ఒక శంఖము అనీ నూరు వేల శంఖాలు ఒక మహాశంఖము అనీ, నూరు వేల మహాశంఖాలు ఒక బృందము అనీ, నూరు వేల బృందాలు ఒక మహాబృందము అనీ, నూరు వేల మహాబృందాలు ఒక పద్మము అనీ, నూరు వేల పద్మాలు ఒక మహాపద్మము అనీ, నూరు వేల మహాపద్మాలు ఒక ఖర్వము అనీ, నూరు వేల ఖర్వాలు ఒక మహాఖర్వము అనీ, నూరు వేల మహాఖర్వాలు ఒక సముద్రము అనీ, నూరు వేల సముద్రాలు ఒక ఓఘము అనీ నూరు వేల ఓఘాలు ఒక మహౌఘము అనీ పెద్దలు చెప్పతారు.

"రాజా, ఇప్పుడు వానరరాజు సుగ్రీవుడు నీ తమ్ముడు విభీషణుణ్ని అతని నలుగురు మంత్రులనూ కోటి మహౌఘాల వానరసైన్యాన్ని వెంటబెట్టుకొని నీ మీదికి యుద్ధానికి వస్తున్నాడు.

"ఓ మహాప్రభూ, జ్వలిస్తూ ఉన్న గ్రహగోళము వలె వానరవాహిని వస్తూ ఉంది. చూడు. మనము జయించేట్టు శత్రువులు ఓడిపోయేట్టు పరమ ప్రయత్నము వెంటనే చేయవలెను" అని శుకుడు చెప్పినాడు.

౨౬

శుకుడు చెప్పింది అంతా రావణాసురుడు విన్నాడు. రాముణ్ని అతని సమీపములో ఉన్న తన తమ్ముణ్ని విభీషణుణ్ని రాముని కుడిభుజము వంటి వాడూ మహా పరాక్రమవంతుడూ అయిన లక్ష్మణుణ్ని భయంకర పరాక్రముడూ సర్వ వానరరాజూ అయిన సుగ్రీవుణ్ని వానరయూథపతులను చూచి

నాడు. కొంచెము గాభరా వేసింది. కోపమువచ్చింది. చేతులు జోడించి నేల వంక చూస్తూ ఉన్న శుకసారణులను ఉద్దేశించి కోపము నుంచి గద్గదస్వరముతో పరుషముగా, "ఓ శుకుడా, ఓ సారణుడా, నిగ్రహానుగ్రహ సమర్థుడు అయిన ప్రభువును ఆశ్రయించుకొని జీవించే మంత్రులు తమ ప్రభువుకు అప్రియ వార్తలను ఎంతమాత్రమూ చెప్పకూడదు. ప్రతికూలముగా యుద్ధానికి వస్తూవున్న శత్రువులను—అందులో యుద్ధారంభ సమయములో స్తోత్రము చేయడము ఎంత మాత్రమూ తగినపనికాదు. రాజనీతిలో ముఖ్యము అయిన భృత్యధర్మము మీకు తెలియలేదు. ఆచార్యులనూ గురువులనూ వృద్ధులనూ మీరు సేవించింది అంతా వృథా అయిపోయింది. మీరు ఒకవేళ నీతిశాస్త్రము గట్టిగా చదివి నప్పటికిన్నీ దాని అర్థము మీకు బోధపడలేదు. ఒకవేళ అర్థము బోధపడ్డప్పటికిన్నీ దానిని మీరు ఆచరణలో పెట్టలేను. జ్ఞానభారాన్ని మాత్రము మోస్తున్నారు. మీరు మూర్ఖులు. మీరు నాకు మంత్రులు అయినారు. మీవల్ల నేను శత్రువుల చేతిలో ఎప్పుడో చచ్చిపోయి ఉండవలసింది. దైవయోగమువల్ల బ్రతికి ఉన్నాను.

"నేను ఆజ్ఞాపిస్తే—నా నోటిలోనుంచి మాటలు వెలువడే లోపలనే శుభాశుభాలు అన్నీ జరిగిపోతవి. అటువంటి నాతో మీరు కఠినముగా మాట్లాడినారు. మీకు మృత్యుభయము లేదో ఏమో. అడవిలో కార్చిచ్చుకు కొన్ని చెట్లు తగలబడిపోకుండా ఉంటే ఉంటవేమో, కాని నా కోపానికి గురిఅయిన అపరాధులు క్షేమముగా ఉండడము మాత్రము ఉత్తిది. మీరు ఇదివరకు చేసిన ఉపకారమునుంచి నా కోపము మెత్తపడుతున్నది. శత్రుపక్షాన్ని స్తోత్రముచేసే పాపిష్ఠులను మిమ్ములను నేను చంపివేసి ఉండేవాణ్ణి. మీరు మీ పదవులు వదిలి పెట్టిపొండి. మిమ్ములను చంపివేయడము నాకు ఇష్టములేదు. మీరు ఇదివరకు చేసిన ఉపకారాలు జ్ఞాపకము వచ్చి మిమ్ములను మన్నించినాను. మీరు కృతఘ్నులు. నామీద మీకు ఉన్న స్నేహము ఇప్పుడు పెడముఖము అయింది. నిజముగా మిమ్ములను చంపివేయవలెను. కాని వదిలివేస్తున్నాను." అంటూ రావణాసురుడు భయపెట్టినాడు.

ఈ మాటలకు ఆ శుకసారణులు ఇద్దరూ సిగ్గుపడిపోయినారు రావణాసురుడు జయించవలెను అని స్తోత్రముచేసి వెళ్ళిపోయినారు. అప్పుడు రావణాసురుడు మహోదరుణ్ణి చూచి నీతిశాస్త్రవిశారదులుఅయిన వేగులవాండ్లను పిలిపించవలసింది అని చెప్పినాడు. అతడు అట్లాగేను అని చెప్పి వెంటనే వేగుల వాండ్లు రావణాసురుడి దగ్గరకు రావలెను అని ఆజ్ఞాపించినాడు. రాజశాసనాన్ని శిరసావహించి గూఢచారులు అప్పటికి అప్పుడు రావణాసురుడి దగ్గరకు

పోయి జయము ఆశీర్వదించి చేతులు జోడించి నిలుచున్నారు. ఆ గూఢచారులు విశ్వసనీయులు. శూరులు. రాజభక్తిపరాయణులు. శత్రుభయము లేని వాండ్లు. రాక్షసాధిపతి రావణాసురుడు వాండ్లను అందరినీ చూచి "ఓ చారులారా! మీరు ఇక్కడనుంచి ఇప్పుడే వానరసైన్యములోకి పోవలెను. రాముని యుద్ధ ప్రయత్నము ఏమిటో పరిశీలించి మీరు తెలుసుకోవలెను. అతనికి మంత్రులు ఎవరో ఆ మంత్రులలో అతని అంతరంగికులు ఎవరో అతడు ఎవరిలో ఎక్కువ స్నేహముతో ఉంటున్నాడో కనిపెట్టవలెను. ఆ రాముడు ఎట్లా నిద్రపోతాడో ఆ యాపనులు అతడు ఎట్లా చేస్తాడో ఇంకా అతనిని గురించిన సమస్త సంగతులూ నిశ్చయముగా తెలుసుకొని మీరు తిరిగి రండి—ఓ చారులారా, బుద్ధిమంతులు అయిన రాజులు తమ చారులవల్ల సమస్త సంగతులూ తెలుసుకొని అతి స్వల్ప ప్రయత్నముతో శత్రువులను జయిస్తూ ఉంటారు. కాబట్టి మీరు ఇప్పుడు మీ ప్రజ్ఞతో సర్వమూ తెలుసుకొని రావలెను" అని చెప్పినాడు.

"అట్లాగేను" అని చెప్పి ఆ గూఢచారులు పరమ సంతోషముతో శార్దూలుడి వెనక రావణాసురుడికి ప్రదక్షిణముచేసి రామలక్ష్మణులు ఉన్న చోటుకి ప్రయాణముఅయి పోయినారు. ప్రచ్ఛన్నముగా సుగ్రీవ విభీషణులనూ రామలక్ష్మణులనూ చూచినారు. వానరసైన్యాన్ని ఆ నలుగురినీ చూచి కలవరపడి పోయినారు. అట్లా వాండ్లు ప్రచ్ఛన్నముగా ఆ వానరసైన్యములో తిరుగుతూ ఉన్నప్పటికిన్నీ హఠాత్తుగా విభీషణుడు వాండ్లను పట్టుకొన్నాడు. వాండ్లలో శార్దూలుడు పరమ పాపిష్ఠివాడు అని వాణ్ణి వానరులకు ఒప్పగించినాడు. వానర వీరులు తక్కినవాండ్లను కూడా పట్టుకొన్నారు. ఆ పరమ పరాక్రమవంతులు వానరులు ఆ రాక్షస గూఢచారులను చంపి వేయబోతూ ఉంటే రాముడు అడ్డుపడి వాండ్లను అందరిని విడిపించి వేసినాడు. ఆ రాక్షస గూఢచారులు అట్లా వానరులచేత దెబ్బలుతిని నిట్టూర్పులు విడుస్తూ విమనస్కులు అయిపోయి మళ్లీ లంకాపట్టణానికి వచ్చినారు

ఆయా వృత్తాంతాలు తెలుసుకోవేటందుకు ఎప్పుడూ బయట తిరుగుతూ ఉండే ఆ మహాబలవంతులు ఆ నిశాచర గూఢచారులు సువేల పర్వత ప్రాంతములో వానరసైన్యముతో ఉన్న ఆ భీమబలుణ్ణి రాముణ్ణిగురించి విన్నవించడానికి రావణాసురుడు దగ్గరకు పోయినారు.

## ౩౦

క్షోభ పెట్టనలవికాని వానరసైన్యముతో రాముడు సువేల పర్వత ప్రాంతములో ఉన్నాడు అని ఆ గూఢచారులు రావణాసురుడికి తెలియ చెప్పి

నారు. అది విని రావణాసురుడు కొంచెము కలవరపడి శార్దూలుణ్ణి చూచి "ఓ నిశాచరుడా, నీ ముఖము ఎప్పటిమాదిరిగా లేదు. దీనముగా ఉన్నావు. క్రుద్ధులు అయిన శత్రువుల చేతులలో నీవు చిక్కలేదుకదా" అని అడిగినాడు.

ఆ శార్దూలుడు భయవిహ్వలుడు అయిపోయి రాక్షసరాజ శార్దూలాన్ని చూచి మెల్లగా "ప్రభూ, ఆ వానరపుంగవుల మధ్యకుపోయి వాండ్లనుగురించి విచారించి తెలుసుకోడము వేగులవాండ్లకు అలవిఅయ్యే పనికాదు. వాండ్లు అందరూ పరాక్రమవంతులు. బలవంతులు. పయిగా వాండ్లను అందరినీ రాముడు కాపాడుతున్నాడు. వాండ్లతో మాట్లాడడము అశక్యము. ఇక వాండ్లను పరీక్షించడము అనేది అసలే లేదు. మార్గాలు అన్నిటిలోనూ పర్వతాలవంటి వానరులు కావలి కాస్తున్నారు. ఆ వానర సైన్యములోకి నేను పోయినాను. నేను అటూ ఇటూ అయినా తిరగలేదు. నన్ను గుర్తుపట్టినారు. విభీషణుడి సచివులు నన్ను పట్టుకొన్నారు. బలవంతముగా నన్ను నేలమీద పొర్లించినారు. వానరులు క్రుద్ధులు అయిపోయినారు. వాండ్లు నన్ను పిడికిళ్ళతో పొడిచినారు. కోరలతో కొరికినారు. అరచేతులతో చరిచినారు. కాళ్ళతో తన్నినారు. కొట్టినారు. గుద్దినారు. సైన్యము అంతటా నన్ను తిప్పినారు. నా దేహము అంతటా నెత్తురు కమ్ముకొన్నది. నా అవయవాలు స్వాధీనము తప్పిపోయినవి. వాండ్లు నన్ను చావకొట్టుతూ ఉంటే నేను చేతులుజోడించి ప్రార్థించినాను. అంతట వాండ్లు నన్ను రాముడి దగ్గరకు తీసుకొనిపోయినారు. ఆ రాముడు నన్ను కాపాడినాడు. నేను ఎట్లాగో బ్రతికి బయట పడ్డాను.

రాజా, ఆ రాముడు మహాసముద్రానికి రాళ్లు వేసి సేతువు కట్టించినాడు ఆ సేతువుమీద నుంచే సముద్రాన్ని దాటి వానరసైన్యముతో వచ్చినాడు. ఇప్పుడు సువేలపర్వతముమీద ససైన్యముగా సాయుధుడుగా ఉన్నాడు. అతడు ఇదివరకు నన్ను వదిలిపెట్టించక పూర్వమే వానరసైన్యాన్ని అంతా గరుడ వ్యూహాకారముగా ఉంచినాడు, రాముడు లంకాపట్టణానికి రావడానికి సిద్ధముగా ఉన్నాడు. అచిరకాలములోనే వచ్చి పట్టణ ప్రాకారాలను పడకొట్టుతాడు. నీవు సీతను అయినా ఇచ్చివేయవలెను, లేదా గొప్ప యుద్ధము అయినా చేయవలెను. ఈ రెండింటిలో ఏదో ఒకటి వెంటనే చేయవలెను" అని చెప్పినాడు.

శార్దూలుడు ఇట్లా చెప్పగానే ఆ మహాపరాక్రమవంతుడు రావణాసురుడు "ఓ నిశాచరుడా దేవదానవగంధర్వులు అందరూ ఏకము అయిఎత్తి వచ్చినా సమస్తలోకాలలో వారూ ఏకముఅయి నన్ను ఎదిరించినా నేను సీతను రాముడికి

ఇవ్వను. అది అట్లా ఉండనివ్వు. నీవు వానరసేనను అంతా తిరిగి చూచినావు. కాబట్టి వాండ్లలో శూరులు ఎవరో చెప్పు. వాండ్లలో దురాసదులు ఎవరో చెప్పు. అసలు వాండ్లు ఎటువంటివాండ్లు. వాండ్ల ప్రభావము ఎటువంటిది, వాండ్ల తండ్రులు ఎవండ్లు, తాతలు ఎవండ్లు, వివరముగా చెప్పు. నీవు చెప్పేదానినిపట్టి వాండ్ల బలాబలాలు నాకు తెలుస్తవి. ఎవరెవరి విషయములో ఏమి ఏమి చేయవలసింది నేను నిర్ణయిస్తాను. యుద్ధము చేయతలచుకొన్న వాండ్లు శత్రుబలాన్ని గురించి అవశ్యమూ తెలుసుకోవలెను" అని చెప్పినాడు.

శార్దూలుడు గూఢచారులలో శ్రేష్ఠుడు. వాడు అంతట రావణాసురుడితో "రాజా సుగ్రీవుడు ఋక్షరజుడి పుత్రుడు. వాణ్ణి ఆ సుగ్రీవుణ్ణి యుద్ధములో జయించడము అలవికాని పని. జాంబవంతుడు గద్గదుడి కొడుకు. ధూముడు అనే వాడు జాంబవంతుడి తమ్ముడు. పోరాటములో అనేకమంది రాక్షసులను చంపి వేసిన హనుమంతుడు కేసరి అనే వాడి పుత్రుడు. ఆ కేసరి తండ్రి బృహస్పతి.

"ప్రభూ మహాపరాక్రమవంతుడూ ధార్మికుడూ అయిన సుషేణుడి తండ్రి వరుణదేవుడు. దధిముఖుడు అనే వాడు సౌమ్యుడు. వాడి తండ్రి చంద్రుడు. వానరసైన్యములో సుముఖుడూ దుర్ముఖుడూ వేగదర్శి అనే ముగ్గురూ ముఖ్యులు. వాండ్లను వానరరూప మృత్యుదేవతలుగా బ్రహ్మదేవుడు స్వయముగా సృష్టించి నాడు. వానరసేనా నాయకుడు నీలుడు. వాడు అగ్నిహోత్రుడికి పుట్టినాడు. కేసరి కొడుకు అని చెప్పిన హనుమంతుడు వాయుదేవుడికి పుట్టినాడు. అంగదుడు యువకుడు. వాణ్ణి ఎవరూ ఎదిరించలేరు. వాడు వాలి పుత్రుడు. దేవేంద్రుడి మనుమడు. మైందద్వివిదులు అశ్వినీదేవతలకు పుట్టినారు. గజుడూ గవాక్షుడూ గవయుడూ శరభుడూ గంధమాదనుడూ అనే అయిదుగురున్నూ కాలాంతకుడి వంటి వాండ్లు. వాండ్లు యముడికి పుట్టినారు. శ్వేతుడూ జ్యోతిర్ముఖుడూ అనే వాండ్లు ఇద్దరూ సూర్యుడికి పుట్టినారు. వరుణదేవుడికి హేమకూటుడు అనే మరి ఒక పుత్రుడు ఉన్నాడు. మహావీరుడు నలుడు విశ్వకర్మకు పుట్టినాడు. దుర్ధరుడు వసువు పుత్రుడు. రాజా వానరులు పదికోట్ల మంది ఉన్నారు. వాండ్లు అందరూ దేవతలకు పుట్టినారు. కాంతిమంతులు శూరులు. వాండ్ల అందరి పేర్లూ చెప్పలేను. వాండ్లు అందరూ కూడా యుద్ధాన్ని కాంక్షిస్తున్నారు.

"ప్రభూ, ఖరదూషణ త్రిశిరులను సంహారము చేసి వేసిన రాముడు సింహమువంటివాడు. యువకుడు. అతడితో పరిసమానము అయిన పరాక్రమ[illegible] మరి ఒకడు ఈ భూలోకములో లేడు. విరాధుణ్ణీ యముడివంటి కబం

ఖుణ్ణి జనస్థానములో రాక్షసులను అందరినీ రాముడు ఒక్కడే వధించి వేసి నాడు. అతడి బాణాల తాకిడికి దేవేంద్రుడు అయినా బ్రతుకడు. అతడు మహా వీరుడు. అంతే కాదు. అటువంటి గుణవంతుడు మానవులలో మరిఒకడు కన పడడు. అతడు ధర్మాత్ముడు. అతని తమ్ముడు లక్ష్మణుడు మదపుటేనుగులలో శ్రేష్ఠము అయిన మదపుటేనుగు వంటి వాడు.

"ప్రభూ, ఆ రాముడు సీతమ్మణ్ణి విభీషణుణ్ణి లంకాధిపతిగా రాజ్యాభిషే కము చేసినాడు అందువల్ల అతడు ఇప్పుడు రామకార్యధురంధరుడు అయి నాడు. రాముడికి మేలు చేయడానికి పూనుకున్నాడు. రాజా, సువేలపర్వతము మీద విడిది చేసిన వానర సైన్యాన్ని గురించీ రాముడి ప్రయత్నాన్ని గురించీ చెప్పినాను. ఇక మిగతా పనికి నీవే కర్తవు" అని చెప్పినాడు.

## ౩౧

క్షోభ పెట్టడానికి అలవి కాకుండా సువేలపర్వతము మీద వానర సైన్య ముతో విడిది చేసిన రాముణ్ణి గురించి గూఢచారులు చెప్పిందిఅంతా లంకాధిపతి రావణాసురుడు విన్నాడు. కొంచెము భయపడ్డాడు. తన మంత్రులను చూచి తాము ఆలోచించవలసిన సమయము ఆసన్నము అయిందిఅనీ మంత్రులు అందరూ హెచ్చరికతో సమావేశము కావలెనుఅనీ ఆజ్ఞాపించినాడు. అతడి ఆజ్ఞప్రకా రము మంత్రులు అందరూ సమావేశము అయినారు. ఆదుర్ధర్షుడు వారి అందరి తోనూ చక్కగా ఆలోచించి అప్పుడు చేయవలసిన పనిని నిర్ణయించినాడు. ఆమంత్రులను అందరినీ పంపించి వేసి రావణాసురుడు అంతట తన భవనములోకి పోయినాడు.

రావణుడు మాయలమారివాడు. మాయపనులు చేయడములో మహా సమ ర్థుడూ మహాబలవంతుడూ అయిన విద్యుజ్జిహ్వుణ్ణి పిలిచినాడు. సీతాదేవిని ఉంచిన అశోకవనానికి వాణ్ణి వెంటపెట్టుకునీ బయలుదేరినాడు. ఆ జనకాత్మ జను సీతాదేవిని తాము మాయచేసి మోసపుచ్చవలెను అనీ అందుకోసము రాముడి రస్సునూ రాముడు ఉపయోగించే పెద్దవింటినీ అంబునూ మాయతో కల్పించి ఆఅశోకవనానికి తెమ్మనీ విద్యుజ్జిహ్వుడితో చెప్పినాడు. వాడు అందుకు సంతోషముగా ఒప్పుకున్నాడు. వాడు అట్లా చేస్తానుఅని చెప్పినందుకు రావ ణాసురుడు సంతోషాతిశయముతో వాడికి ఒక ఆభరణము బహుమానముగా ఇచ్చినాడు.

అంతట రావణాసురుడు సీతాదేవిని చూడటానికి అశోకవనములోకి పోయినాడు. ఎన్నడూ దైన్యము అనుభవించ కూడని ఆ సీతాదేవి దైన్యముతో

తలవంచుకొని భర్తను గురించి ధ్యానము చేస్తూ పరమ దుఃఖముతో నేలమీద కూర్చుని ఉంది. ఆమెకు అటూ ఇటూ భయంకరాకారలు అయిన రాక్షసాంగనలు కావలి కాస్తున్నారు. రావణాసురుడు అప్పుడు ఆమెకు సంతోషవార్త చెప్పేవాడి వలె ఆమెను సమీపించి "ఓ మంగళరూపిణీ, నేను నిన్ను ఎంత మంచిగా వేడుకొన్నా నా మాట నీవు వినలేదు. ఏమి ఏమో వాగినావు. నీ భర్తను ఖరాదులను చంపివేసిన నీ భర్తను రాముణ్ణి యుద్ధములో చంపి వేసినారు. నీ మూలాధారము తెగిపోయింది. నీ దర్పాన్ని అణచివేయడము అయిపోయింది. నీ కష్టమునుంచి నీ వ్యసనమునుంచి నీ అంతట నీవే నాకు భార్యవు అవుతావు:

"ఓ మూఢురాలా, రాముడు తప్ప నీకు మరి ఒకడు భర్తగా పనికిరాడు అనుకొన్నావు. ఆ మతిని మార్చుకో. చచ్చిపోయిన భర్తతో ఏమి చేస్తావు. ఓ మంగళ రూపిణీ, నీవు ఇక నా భార్యలకు అందరికీ అధికారిణివి కా. ఓ సీతా, నీవు మూఢురాలవు. నీకు ఏమీ తెలియక పోయినప్పటికీన్నీ సమస్తమూ తెలుసును అనుకొంటున్నావు. నీవు ఇదివరకే దక్కించుకోవలసిన అవకాశాన్ని పోగొట్టుకొన్నావు. నీవు దురదృష్టవంతురాలవు. ఇప్పుడు ఏమి చేస్తావు. వృత్రాసురుణ్ణివలె నీ భర్తను భయంకరముగా చంపి వేసినారు. ఎట్లా జరిగిందీ చెప్పతాను విను.

"రాముడు నన్ను చంపి వేయవలెను అని వానరరాజు సుగ్రీవుణ్ణి అతడి మహాసైన్యాన్ని వెంట పెట్టుకొని సముద్ర తీరానికి వచ్చినాడు. అప్పుడు సూర్యాస్తమయము అయింది. ఆ మహాసైన్యము మహాసముద్రము ఉత్తరతీరాన దిగింది. బహుదూరమునుంచి నడిచి వచ్చినందువల్ల సైన్యాలు అన్నీ అలసిపోయినవి. అందరూ సొమ్మసిల్లి నిద్ర పోతున్నారు. అర్ధరాత్రము అయింది.

రాముడు వానర సైన్యముతో వస్తూ ఉన్నాడు అని మాకు ముందుగానే గూఢచారులవల్ల తెలిసింది. ప్రహస్తుడు నా మహాసైన్యాన్ని తీసుకొని వారు దిగిన తావుకు పోయినాడు. రామలక్ష్మణులూ వానర సైన్యమూ సొమ్మసిల్లి నిద్రపోవడము చూచినాడు. పట్టిసాలూ పరిఘలూ చిన్న చిన్న చక్రాయుధాలూ పెద్ద పెద్ద ఇనుపదండాలూ ఖడ్గాలూ శూలాలూ తళతళలాడే కూటముద్గరాలూ తోమరాలూ ఈటెలూ పెద్ద పెద్ద చక్రాయుధాలూ ముసలాలూ బాణాలూ తీసుకొని రాక్షసులు ఆ అర్ధరాత్రమప్పుడు వానరసైన్యము మీద పడ్డారు.

ప్రహస్తుడు ఖడ్గ ప్రహరణములో ఆరితేరిన వాడు. నిద్రపోతున్న రాముణ్ణి చూచినాడు. గటుక్కున తన మహా ఖడ్గముతో రాముడి శిరస్సును తెగ వేసినాడు.

అప్పుడు విభీషణుడు ఆకాశానికి ఎగిరపోయినాడు. కాని వాణ్ణి రాక్షసులు పట్టుకొన్నారు. లక్ష్మణుడూ వానరులూ దశదిశలా పరుగెత్తి పారిపోయినారు. సుగ్రీవుడు గ్రీవము తెగి పడిపోయినాడు, హనుమంతుడు హనువులు పగిలి చచ్చిపోయినాడు. జాంబవంతుడు ఎగిరిపోతూ ఉంటే రాక్షసులు వాడి మోకాళ్లు తెగ వేసినారు. వాడు ఆ జాంబవంతుడు మోకాళ్లు తెగిపోయి మొదలు నరికిన చెట్టువలె నేలకూలినాడు. అరినిష్పాదనులూ దీర్ఘ దేహులూ అయిన మైంద ద్వివిదులు కత్తివేటకు నడుములు తెగి తుండ్లు తుండ్లుగా నేలమీదపడి నెత్తురులో పొర్లాడుతూ నిట్టూర్పులు విడుస్తూ ఏడుస్తూ ప్రాణాలు వదిలినారు. పనసుడు పనసపండు మాదిరిగా నేలమీద రాలినాడు. దరీముఖుడు అనేక బాణాలు గుచ్చుకొని ఒక గుహలో పడిపోయినాడు, మహాపరాక్రమవంతుడు అయిన కుముదుడు చడీ చప్పుడూ లేక చచ్చిపోయినాడు. అంగదుడు బాహువులు తెగి నెత్తురు కక్కుతూ నేలకూలినాడు. ఏనుగుల కాళ్లకిందపడి నిద్రపోతున్న వానరులు కొందరు చచ్చిపోయినారు. మహా మేఘాలవలె వాయు వేగముతో పోయే గుర్రాల కాళ్లకిందపడి కొందరు వానరులు చచ్చిపోయినారు. రాక్షసులు కపటోపాయముతో కొందరు వానరులను చంపి వేసినారు. కొందరు వానరులు భయపడి పరుగెత్తిపోయినారు. అట్లా వానరులు పరుగులెత్తుతూ ఉంటే ఏనుగులవెంట సింహాలవలె వాండ్లవెంట రాక్షసులు పడ్డారు. ఆ వానరులను రాక్షసులు చంపి వేసినారు. కొందరు వానరులు సముద్రములో పడిపోయినారు, కొందరు వానరులు ఆకాశానికి ఎగిరిపోయినారు. భల్లూకవీరులు వానరవృత్తిని అవలంబించి పెద్ద పెద్ద చెట్లు ఎక్కినారు. రాక్షసులు ఆ సముద్రతీర ప్రదేశాలలోనూ పర్వతాలమీదనూ, వనాలలోనూ వానరులను వెదికి వెదికి పట్టుకొని చంపివేసినారు. నీ పెనిమిటిని రాముణ్ణి వానరసైన్యముతో కూడా నాసైన్యము చంపి వేసింది.

"ఓ సీతా, నెత్తురుతో దుమ్ముకొట్టుకొని ఉన్న నీ పెనిమిటి శిరస్సును తెచ్చినారు" అంటూ ఆ పరమదుర్ధర్షుడు రాక్షసరాజు రావణాసురుడు ఒక రాక్షసాంగనతో సీతాదేవి వినేటట్టుగా "యుద్ధములోనుంచి రాముడి శిరస్సు స్వయముగా తెచ్చిన ఆక్రూరకర్ముణ్ణి విద్యుజ్జిహ్వుణ్ణి పిలుచుకొనిరా" అన్నాడు.

అప్పుడు విద్యుజ్జిహ్వుడు రాముడి శిరస్సునూ ధనుస్సునూ తీసుకొనివచ్చి రావణాసురుడి ఎట్టఎదుట ఉంచి సాష్టాంగ నమస్కారము చేసినాడు. పెద్ద

శాలుకతో సమీపములో నిలుచునిఉన్న ఆ విద్యుజ్జిహ్వుడితో "ఓ నిశాచరుడా రాముడి శిరస్సును నా ఎదుటకు తే. ఈ సీతాదేవి ఎదట ఉంచు. ఈ దరిద్రురాలు తన పెనిమిటి చరమావస్థను చక్కగా చూస్తుంది" అన్నాడు. విద్యుజ్జిహ్వుడు చూడముచ్చటగొలిపే రాముడి శిరస్సును సీతాదేవి ఎట్టఎదట ఉంచి అవతలికిపోయి నిలుచున్నాడు.

"ఓ సీతా, అదుగో నీ పెనిమిటి కార్ముకము. ధగధగలాడుతూ ఉంది. ముల్లోకాలలోనూ మహాకార్ముకము అని ప్రసిద్ధికెక్కింది. ఓ సీతా, ఇంతకూ నీ పెనిమిటి మానవమాత్రుడు. అర్ధరాత్రము అప్పుడు ప్రహస్తుడు చంపివేసినాడు. నీ పెనిమిటి శిరస్సునూ అల్లెతాటితో కూడా ఈ ధనుస్సునూ ఇక్కడికి తెచ్చినారు" అని చెప్పి రావణాసురుడు విద్యుజ్జిహ్వుడిచేత ఆ శిరస్సునూ ఆ ధనుస్సునూ నేలమీద అక్షతల పారవేయించి ఆ యశస్వినిని జనకాత్మజను సీతాదేవిని చూచి తన వశవర్తినిగా ఉండవలసింది అని చెప్పినాడు.

## 32

సీతాదేవి ఆ శిరస్సునూ ఉత్తమోత్తమము అయిన ఆ ధనుస్సునూ చూచింది. హనుమంతుడు అక్కడికి వచ్చినప్పుడు చెప్పిన రామసుగ్రీవుల సఖ్యాన్ని గురించి స్మరించింది. ఆ ముఖవైఖరినీ ఆ కన్నులనూ ఆ తలవెంట్రుకలనూ ఆ చూడామణినీ ఆ లలాటాన్నీ చూచింది. ఆ గుర్తులను పట్టి అది రాముడి శిరమేను అనుకొన్నది. ఆమెకు పెద్దపెట్టున దుఃఖము వచ్చింది. ఏడుస్తూ లేడిపిల్లవలె అరిచింది. కైకేయీదేవిని నిందించింది. కైకేయీదేవి అప్పుడు అక్కడ ఉన్నట్టుగా "ఓ కైకేయీ, నీ కోరిక ఈడేరింది. ఇక్ష్వాకుకులనందనుడు రాముడు హతము అయి పోయినాడు. నీ కలహశీలముతో ఇక్ష్వాకువంశము అంతా నాశనము అయిపోతుంది. తప్పదు. నీవు రాముడిచేత వల్కలాలు కట్టించి నాతో కూడా ఏ పనికోసము అడవికి పంపించినావో ఆ పని కాస్తా అయిపోయింది. ఓ పూజ్యురాలా, రాముడు నీకు ఏమి అపకారము చేసినాడు" అంటూ ఆ తపస్విని ఆ యువతి వైదేహి గజగజ వణికి పోతూ నరికివేసిన అరటి చెట్టువలె నేలమీద పడిపోయింది. సంజ్ఞ లు తప్పి పోయింది. ఒక ముహూర్తము సేపటికి తెప్పరిల్లింది. ఆ శిరమువంక చూస్తూ "మహాబాహూ, నీవు వీరవ్రతము అవలంబించినావు. నేను హతము అయిపోయినాను. నీ చరమావస్థ చూచినాను. నేను విధవను అయినాను. ఓ సదాచార సంపన్నుడా, భార్య చేసుకొన్న పాపము నుంచి భర్త ముందుగా పోతాడు అని పెద్దలు చెప్పుతూ ఉంటారు. నీవు సత్ప్రవర్తనవు. నా కన్నా ముందుగా పోయినావు. (నా పాపకర్మమే ఇందుకు

కారణము అయి ఉంటుంది) దుఃఖము మీద దుఃఖము మూటగట్టుకొని వచ్చి నేను దుఃఖసముద్రములో మునిగి పోతూ ఉంటే నీవు నన్ను కాపాడటానికి వచ్చి చనిపోయినావా.

"రామా, మా అత్త కౌసల్యాదేవి దూడను ప్రేమించే గోవువంటిది. నీవు చనిపోయినందువల్ల దూడ కోల్పోయిన గోవువలె అయిపోతుంది. ఓ రామా నీది ఊహించనలవికాని పరాక్రమము, అంతే కాదు. నీకు దీర్ఘాయుర్దాయము అని జ్యోతిష్కులు చెప్పినారు. అది అంతా అసత్యము అయిపోయింది. నీవు అల్పాయుష్కుడవు అయి పోయినావు. నీ విషయములో ఆ జ్యోతిష్కుల బుద్ధి బుగ్గి అయిపోయి ఉంటుంది. నీకు కాలపరిపాకము ఇట్లా అయిపోయింది. సమస్త ప్రాణులకూ కాలమే కారణము కదా. నీవు నీతిశాస్త్ర విదుడవు నీకు సమస్తోపాయాలూ తెలుసును. ఎటువంటి కష్టాలుఅయినా రాకుండా చూచు కొనే సామర్థ్యము నీకు ఉందే. ఎందువల్ల ఈ మాత్రము తెలుసుకోకుండా చనిపోయినావు. నా కారణమునుంచి (నేను విధవను కావలసిన కారణము నుంచి) ఓ కమలలోచనుడా, భయంకరమూ అతిక్రూరమూ అయిన కాళరాత్రి నిన్ను కౌగలించుకొన్నది. అది కనికరము లేకుండా నిన్ను తుంచివేసింది. ఓ పురుషపుంగవా, ఓ మహాబాహూ, నీ కోసము నిరంతరము తపస్సు చేస్తూఉన్న నన్ను వదిలి పెట్టి నీ ప్రియురాలినివలె పృథివిని కౌగలించుకొని పడుకొన్నావా.

"ఓ వీరుడా, ఈ కాంచనాలంకృతి ధనుస్సు నాకు ఎంతో ప్రియము అయింది. నీవూ నేనూ గంధమాల్యాదులతో పూజించిన ఈ ధనుస్సు ఇప్పుడు ఇట్లా అయిపోయింది. ఓ రామా, నీవు పుణ్యాత్ముడవు. స్వర్గములో నీ తండ్రి నా మామగారూ అయిన దశరథమహారాజుతోనూ నీ పితృదేవతలతోనూ చేరి పోయినావు. నీవు ఆ స్వర్గములో నక్షత్రరూపము ధరించి ఉంటావు. మహా త్కార్యాలు చేసిన ఇక్ష్వాకువంశ రాజర్షులనూ ఇంకా చూడవలసిన పుణ్యాత్ము లనూ చూస్తూ వుంటావు.

"రామా, నేను చిన్నదానను. చిన్నతనము నుంచీ నేను నీదగ్గర వుంటూ వచ్చినాను. నేను నీ భార్యను. నీ సహచారిణిని. నన్ను ఎందుకు చూడవు, నాతో ఎందుకు మాట్లాడవు. నీవు నా పాణిగ్రహణ సమయములో ఎప్పుడూ నాతో నే వుంటాను అని ప్రమాణము చేసినావు. జ్ఞాపకము తెచ్చుకో. ఇట్లా ఇంత దుఃఖములో వున్న నన్ను కూడా నీతో పాటు తీసుకొనిపో. ఓ రామా ఉత్తములోకానికి పోయేవారిలో నీవు ఉత్తముడవు. నిన్ను వదిలి పెట్టి నేను

దుఃఖములో వున్నాను. నేను నీ ప్రియురాలిని. నన్ను వదిలిపెట్టి ఎందుకు ఈ లోకమునుంచి ఆ లోకానికి పోయినావు.

"ఓ రామా, మంగళ ద్రవ్యాలు అయిన చందనాదులు పూసిన నీ దేహాన్ని నేను ఇదివరకు కౌగిలించుకొంటూ వుండేదాన్ని. ఆ నీ దేహాన్ని ఇప్పుడు నక్కలూ కుక్కలూ మొదలయినవి ఈడ్చుకొని పోతున్నవా. ఆప్తదక్షిణలు యిచ్చి అగ్నిష్టోమాది యజ్ఞాలు చేసినావే. ఆ అగ్ని సంస్కారాదులు లేకుండా చనిపోయినావు ఏమిటి. (అందుకు నా పాపకర్మమే కారణమూ).

"ఓ రామా, అరణ్యవాసానికి వచ్చిన ముగ్గురిలో మిగిలిన ఒక్క లక్ష్మణుణ్ణి చూచి మీ అమ్మ కౌసల్యాదేవి మనస్సు శోకముతో చలించిపోయి ఏమి ఏమో అడుగుతుంది. అప్పుడు ఆమెకు లక్ష్మణుడు నిన్నూ నీ మిత్రుడి సైన్యాన్నీ రాత్రిపూట చంపివేసినారు అని చెప్పతాడు. నిద్రపోతున్న నిన్ను రాక్షసులు చంపివేయడమూ నేను రాక్షస గృహములో ఉండడమూ విని విషముతో ఆమె గుండె పగిలిపోతుంది. ఆమె బ్రతుకదు. ప్రాణాలు వదిలివేస్తుంది. ఇంతకూ నేను దురదృష్టవంతురాలను. నా నిమిత్తము ఆ మహాబలవంతుడు రాముడు సముద్రాన్ని దాటి వచ్చినాడు. అనర్హముగా ఒక క్షుద్రుడు చేతిలో చనిపోయినాడు. నా నుంచి తన వంశము నాశనము అయిపోతుంది అని తెలియక నన్ను పెండ్లి ఆడినాడు. ఆ పూజ్యుడికి రాముడికి భార్య మృత్యువు అయింది, నేను పూర్వజన్మలో ఏ సత్కార్యదానమో చెడ కొట్టి ఉంటాను. అందువల్ల పరమధర్మాత్ముడు అయిన రాముడికి భార్యను అయినప్పటికిన్నీ ఇప్పుడు ఇక్కడ ఇటువంటి దుఃఖము అనుభవిస్తున్నాను.

"ఓ రావణుడా, వెంటనే నన్ను ఆ రాముడిమీద పడవెయ్యి. భార్యను భర్తతో చేర్చు. మంగళప్రదము అయిన ఈ పని చెయ్యి. ఓ రాక్షసరాజా, రాముడి శిరస్సుతో నా శిరస్సును చేర్చు. అతని కాయముతో నా కాయాన్ని చేర్చు. మహాత్ముడు అయిన నా పెనిమిటి వెంట నేనూ పోతాను" అని చెప్పతూ ఆ విశాలాక్షి మాటి మాటికీ ఆ తలనూ, ఆ వింటినీ చూస్తూ దుఃఖముతో తపించిపోతూ విలపించింది.

సీతాదేవి అట్లా ఏడుస్తూ ఉండగా రాక్షసద్వారపాలకుడు ఒకడు అక్కడికి వచ్చి చేతులుజోడించి రావణాసురుణ్ణి చూచి జయము ఆశీర్వదించి సాష్టాంగనమస్కారము చేసి వినయముగా "ప్రభూ, సేనానాయకుడు ప్రహస్తుడు మంత్రులు అందరితోనూ వచ్చి కనిపెట్టుకొని ఉన్నాడు, మంత్రులు నీ దర్శనాన్ని కాంక్షిస్తున్నారు. వారు నన్ను ఈ విషయము విన్న

వించడానికి పంపించినారు. మహాప్రభూ, కష్టసాధ్యము అయిన కార్యము ఒకటి వచ్చింది అనీ నీ ఆజ్ఞకోసము కనిపెట్టుకొని ఉన్నాము అనీ చెప్పుచున్నారు. నీవు ఇప్పుడు వారికి దర్శనము ఈయవలెను" అని చెప్పినాడు.

ఆ ద్వారపాలకుడు చెప్పింది విని రావణాసురుడు అశోకవనములో నుంచి బయటికి బయలుదేరినాడు. అతడు అవతలకు పోగానే రాముడి శిరస్సూ ధనుస్సూ అంతర్ధానము అయి పోయినవి.

రావణాసురుడు అప్పుడు తన సభాభవనములోకి పోయినాడు. రాముడి పరాక్రమాన్ని గురించి తెలుసుకొన్నాడు, భయంకరపరాక్రములు అయిన మంత్రులతో రాముణ్ణి గురించి ఆలోచించినాడు. ఏ ఏ పనులు ఎట్లా చేయవలసిందీ నిర్ణయించినాడు. మృత్యువుతో సరిసమానము అయిన ఆ రావణాసురుడు తన మేలు కోరే సేనాధ్యక్షులను అందరినీ చూచి "దృఢదండెముతో భేరీని మోగించండి. వెంటనే మన సైన్యాలను అన్నిటినీ రావించండి. కారణము చెప్పవద్దు" అని ఆజ్ఞాపించినాడు.

సేనా నాయకులు అందరూ అట్లాగేను అని చెప్పి తమ తమ మహాసైన్యాలను రావించినారు. సైన్యాలు అన్నీ సన్నద్ధము అయి వచ్చినవి అని సేనా నాయకులు ఆ యుద్ధకాముడికి రావణాసురుడికి విన్నవించినారు.

## 33

దుఃఖపారవశ్యముతో ఒళ్లు ఎరగకుండా పోయిన సీతాదేవిని సరమ చూచింది. ఆమె విభీషణుడి భార్య. సీతాదేవిని కాపాడడానికి ఆమెను అది వరకు రావణాసురుడు నియమించినాడు. ఆ సరమ స్నేహశీలి, దృఢవ్రత. ఆమెతో సీతాదేవి స్నేహము చేసింది సీతాదేవికి ఆమె ఇష్టురాలూ ఆప్తురాలూ అయింది.

సీతాదేవిని రావణాసురుడు మోసము చేయడము సరమ చూచింది. బడలిక పోగొట్టుకోడానికి నేల మీద పడి పొరాడి దుమ్ము కొట్టుకొని లేచిన ఆడు గుర్రము మాదిరిగా కనిపించిన సీతాదేవి దగ్గరకుపోయి ఆ మృదుభాషిణి సరమ "ఓ వైదేహీ, ఊరడిల్లు. మనోవ్యథ పడవద్దు. నీతో రావణాసురుడు మాట్లాడిందీ నీవు అందుకు అతడికి చెప్పిన బదులు మాటలూ నీ మీద నాకు ఉన్న స్నేహాతిశయమునుంచి రావణాసురుడికి భయపడకుండా ఇక్కడ చెట్లచాటున నిర్జన ప్రదేశములో ఉండి నేను విన్నాను.

"ఓ సీతా నీవు పిరికిదానవు. ఓ విశాలాక్షీ, రావణాసురుడు అంత తొందరగా ఇక్కడనుంచి ఎందుకు వెళ్ళిపోయినాడో నీవు గమనించలేదు. నేను

పోయి అదినీన్ని తెలుసుకొని వచ్చినాను. రామప్రభువు చనిపోలేదు. అతడు సేమ సమస్తమూ తెలిసినవాడు. ఆ మహానుభావుడు ఎప్పుడూ మైమరచి నిద్రపోడు. ఒక వేళ రామప్రభువు నిద్ర పోయేట్లయితే లక్ష్మణుడు ఎంతమాత్రమూ నిద్ర పోడు. అందువల్ల నిద్రపోతూ ఉండగా రాముణ్ణి చంపివేసినారు అని చెప్పింది అంతా అబద్ధము. ఆ పురుష వ్యాఘ్రాన్ని ఎవడూ వధించలేడు. దేవతలను దేవేంద్రుడివలె వానరులను అందరినీ ఆ రామప్రభువు కాపాడుతూ ఉన్నాడు. పయిగా ఆ వానరులు అందరూ చెట్లను ఆయుధాలుగా చేసుకొని పోరాడుతారు. వాండ్లను రాక్షసులు ఏమి చేస్తారు ఏమీ చేయలేరు. వారు అందరూ సురక్షితముగా ఉన్నారు. నేను తెలుసుకొని వచ్చినాను"

"ఓ సీతా, ఆ అజానుబాహువును ఆ విశాలవక్షుణ్ణి ఆ మహాతన్విని జగత్ప్రసిద్ధికెక్కిన ఆ పరమపరాక్రమవంతుణ్ణి ఆ ధార్మికుణ్ణి ఆ నీతిశాస్త్రవిదుణ్ణి రాముణ్ణి చంపివేయగలవాడు ఎవడూ ఈ జగత్తులో లేడు. ఆ మహాత్ముడి బలము అచింత్యము. పౌరుషము అచింత్యము. అతడు శత్రుసేనాసమూహాలను చంపివేస్తాడు! కాని శత్రువుల చేతులలో చచ్చిపోడు. ఆ శ్రీమంతుడు తననూ తన తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణీ తక్కిన వారినీ కాపాడుకొంటూ కుశలముగా ఉన్నాడు.

"రావణుడు సర్వభూతవిరోధి, భయంకరుడు, మాయావి, అయోగ్యుడు అయిన బుద్ధితో నిన్ను మోసము చేయడానికి రాముడి మాయశిరస్సునూ మాయ ధనుస్సునూ తెప్పించినాడు."

"ఓ సీతా, నేను నీకు ప్రియము చెప్పుతున్నాను. నీ దుఃఖము అంతా తీరిపోయింది. నీకు శుభము అవుతుంది. నీవు ఐశ్వర్యము అనుభవించబోతున్నావు. నిజము. ఆ రామప్రభువు తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణి వానర సైన్యాన్నీ వెంట పెట్టుకొని సముద్రాన్ని దాటి ఈ దక్షిణదిశకు వచ్చినాడు. ఇప్పుడు సముద్రతీరాన లక్ష్మణుడితోనూ వానరసైన్యముతోనూ విడిసి చేసినాడు. సుఖముగా ఉన్నాడు. రావణాసురుడు పంపించిన చారులు ఈ సంగతి తెలుసుకొని వచ్చినారు. ఆ చారులు శీఘ్రముగా మును, వాండ్లు వచ్చి రామప్రభువు సముద్రము దాటివచ్చిన వృత్తాంతము చెప్పినందువల్ల నే ఇక్కడినుంచి రావణాసురుడు వెళ్లిపోయినాడు. ఆ వృత్తాంతాన్ని గురించే రావణాసురుడు ఇప్పుడు మంత్రులు అందరితోనూ ఆలోచిస్తున్నాడు" అని చెప్పింది.

ఇట్లా సరమ సీతాదేవితో చెప్పుతూ వుండగా రాక్షససైన్యాలు యుద్ధసన్నద్ధము అవుతూ వున్నందువల్ల భైరవధ్వని వినిపించింది. దృఢదండాలతో మ్రోగిస్తూ వున్న భేరీలమహాస్వనము వింటూ ఆ మధురభాషిణి సరమ సీతా

దేవితో "ఓ భీరూ, సైనికులు యుద్ధసన్నద్ధులు కావలెను అని తెలియచేయడానికి మహాభైరవముగా భేరీలను మ్రోగిస్తున్నారు. ఈ భేరీల ధ్వని మేఘగర్జనమువలె వినబడుతున్నది. ఏనుగులను యుద్ధానికి సిద్ధము చేస్తున్నారు. రథాలకు గుర్రాలను కట్టుతున్నారు. వేలకువేలు అశ్వికులు ఈటెలు తీసుకొని సంతోషముగా గుర్రాల మీద బయలుదేరుతున్నారు. ఆ యా ప్రదేశాలనుంచి గుంపులు గుంపులుగా పదాతులు బయలుదేరి వస్తూ వున్నారు అద్భుతముగా అమిత వేగముతో మహాధ్వనులు చేస్తూ సైన్యాలు రాజవీథులలో నుంచి మహాప్రవాహాలు సముద్రములోకి పోయేట్టుగా పోతున్నవి రాక్షసయోధులు ధరించిన కవచాల ధగధగలతోనూ డాలువాళ్ల మిలమిలలతోనూ ఆయుధాల తళతళలతోనూ రథాలకూ గుర్రాలకూ ఏనుగులకూ అలంకరించిన ఆభరణకాంతులతోనూ ఎండాకాలములో అడవిని దహించుకొంటూ పోయే కార్చిచ్చువలె వివిధ వర్ణాలతోనూ రాక్షససైన్యము సాగిపోతూ వుంది.

"అవిగో విను. ఘంటలు మోగుతున్నవి. రథచక్రాలు మహాధ్వనులు చేస్తూ ఉన్నవి. గుర్రాలు సకిలిస్తున్నవి వాద్యధ్వనులు మిన్ను అంటుతున్నవి. ఎప్పుడూ రావణాసురుణ్ని సేవించే రాక్షసయోధులు చేతులలో ఆయుధాలు పట్టుకొని చూచేవాండ్లకు ఒళ్ళు గగుర్పు పుట్టేటట్టు యుద్ధసన్నద్ధులు అవుతున్నారు.

"ఓ సీతా రాక్షసులకు భయమువచ్చి పడ్డది. నిన్ను జయలక్ష్మి వరించబోతున్నది. నీకు ఇక దుఃఖములేదు. ఆ అచింత్య పరాక్రమవంతుడు ఆ కమలపత్రాక్షుడు రామప్రభువు దేవేంద్రుడు దైత్యులనువలె రాక్షసులను అందరినీ సంహారము చేసివేస్తాడు. ఓ శుభ్రాంగీ, దేవేంద్రుడితో విష్ణుమూర్తివలె లక్ష్మణుడితో కూడా నీ పెనిమిటి రామప్రభువు రావణాసురుణ్ని విక్రమించి నిన్ను చేరుతాడు. నిన్ను కౌగలించుకొంటాడు. నీవు అప్పుడు ఆ మహానుభావుడి విశాల వక్షః స్థలాన్ని ఆనందబాష్పాలతో తడిపివేస్తావు

"ఓ సీతా, చాలా మాసాలనుంచీ నీ జఘనాలవరకూ జడకట్టుకొని పోయిన నీ తల వెంట్రుకలు ఆ మహాబలవంతుడి రాకతో చిక్కువీడి పోతవి. అచిరకాలములో నీవు ఉదయిస్తున్న పూర్ణచంద్రబింబము వంటి ఆ రామప్రభు ముఖబింబాన్ని చూస్తావు. నీ దుఃఖాన్ని పాము కుబుసాన్ని వలె వదిలిపెట్టుతావు.

ఓ మైథిలీ, రామప్రభువు సుఖము అనుభవించ వలసినవాడు. అచిరకాలములో రావణాసురుణ్ని యుద్ధములో చంపివేస్తాడు. పరిపూర్ణ మనోరథుడు

అవుతాడు. నీవు అతని ప్రియురాలవు. నీతో సుఖము అనుభవిస్తాడు. వానకు భూమిమీద పైరువలె ఆ మహాత్ముడి పరాక్రమానికి నీవు ఎంతో సంతోషిస్తావు.

"ఓ సీతా, మేరుపర్వతము చుట్టూ గుర్రమువలె గుండ్రముగా తిరిగే ఆ దేవుణ్ణి దినకరుణ్ణి నీవు వెంటనే ప్రార్థించు, ఆ సూర్యుడే ప్రజలకు అందరికీ కాంతిని యిచ్చేవాడు" అని చెప్పింది

## 38

సరమ అట్లా చెప్పింది. వంశు ఎండలకు ఎండిపోయిన భూమి వానకు చల్లపడ్డట్లు సీతాదేవి సరమ మాటలకు సంతోషపడ్డది. సరమ సమయజ్ఞురాలు. సమయానుకూలముగా మాట్లాడింది. సీతాదేవిని తన స్నేహాతిశయమున సంతోష పెట్టవలెను అనుకొన్నది. మందహాసము చేస్తూ మధురముగా, "ఓ సీతా, ఆధారము లేని ఆకాశమార్గాన పోయేశక్తి నాకు ఉంది. నా అంత వేగముగా గరుత్మంతుడు కానీ వాయుదేవుడు కానీ ఆకాశములో సంచారము చేయలేరు. నేను ఎవరికీ తెలియకుండా రామప్రభువు దగ్గరకు పోయి నీ క్షేమసమాచారము చెప్పి రావలెను అనుకొంటున్నాను" అని సరమ అన్నది.

ఇట్లా మనోహరముగా చెప్పిన మాటలు సీతాదేవి విన్నది. అంతవరకూ దుఃఖపడుతూ ఉన్న ఆ సీతాదేవి సరమను చూచి "ఓ సరమా, ఆకాశములో కానీ పాతాళలోకములో కానీ పోయే సామర్థ్యము నీకు ఉంది అని నాకు తెలుసును. నా విషయములో ఎవరూ చేయలేని పని నీవు చేయకలవు అని కూడా నాకు తెలుసును. నీవు నిజముగా గట్టిగా నన్ను సంతోషపెట్ట తలచుకొన్నట్లయితే నీవు ఇప్పుడు ఇక్కడనుంచి పోయి ఆ రావణాసురుడు ఏమి చేస్తున్నాడో తెలుసుకొని వచ్చి చెప్పు. ఆ క్రూరుడు ఆ దుష్టాత్ముడు ఆ శత్రు రావణుడు రావణుడు తన మాయాబలముతో నన్ను మద్యము తాగి మతిపోయిన దానినిగా చేసివేస్తున్నాడు. నాకు కావలి ఉంచిన రాక్షసాంగనలు నన్ను ఎప్పుడూ భయపెట్టుతూనూ బెదిరిస్తూనూ ఉండేటట్లు చేసినాడు. నేను ఈ అశోకవనములో ఎప్పుడూ శోకమే అనుభవిస్తున్నాను. ఆ రావణుడు ఎప్పుడు వచ్చి నన్ను ఏమిచేస్తాడోనని భయముతో బాధపడుతున్నాను. నన్ను బ్రతుకనిస్తాడో లేడోనని శంకిస్తున్నాను. నాకు ఏమాత్రము మనస్స్వాస్థ్యమూ లేకుండాపోయింది. ఆ రావణుడు నన్ను ఏమిచేయ తలచుకొంటున్నది నీవు పోయి తెలుసుకొనివచ్చి నాకు చెప్పేటట్లయితే నీవు నాకు ఎంతో మేలుచేసిన దానవు అవుతావు" అని చెప్పింది.

ఇట్లా చెప్పి కన్నీళ్ళు కారుస్తూ ఉన్న సీతాదేవి కన్నీళ్ళను ఆ మధుర భాషిణి సరమ తుడుస్తూ "ఓ జానకీ, నీ కోరిక ఇదా. అట్లా అయినట్లయితే ఇప్పుడే పోయివస్తాను. నీ శత్రువు అభిప్రాయము ఏమిటో కనుక్కొంటాను. వెంటనే వచ్చివేస్తాను. చూడు" అని చెప్పి రావణాసురుడు ఉన్నచోటికి పోయింది. అతడు అప్పుడు మంత్రులతో మాట్లాడుతున్నది అంతా విన్నది. వారి వారి నిశ్చయాలను గుర్తించడములో ఆమె నేర్పరి. ఆ దురాత్ముడి నిశ్చయము తెలుసుకొన్నది. వెంటనే అశోకవనానికి వచ్చింది. తన రాకను ఎదురు చూస్తూ ఉన్న సీతాదేవి దగ్గరకుపోయింది. పద్మాసనము వదిలిపెట్టిన మహాలక్ష్మీదేవివంటి ఆ సీతాదేవి లేచి ఆ సరమను కౌగిలించుకొన్నది. ఆమెకు స్వయముగా ఆసనము ఇచ్చి "ఓ సరమా, సుఖముగా కూర్చో ఆ దురాత్ముడు రావణుడు ఏమి నిశ్చయించినాడో చెప్పు. ఉన్నది ఉన్నట్టు చెప్పు" అని అడిగింది.

అట్లా అడిగి గజగజ వణుకుతూ ఉన్న సీతాదేవితో ఆ మధురభాషిణి సరమ "ఓ వైదేహీ, రావణాసురుడితో అతని తల్లీ ఆ విద్ధుడు అనే వృద్ధమంత్రీ నిన్ను వదిలి పెట్టవలసింది అని ఎంతో బోధించినారు. ఆ మనుజేంద్రుణ్ణి రాముణ్ణి సత్కరించి మైథిలిని ఇచ్చివేయవలెను, అని చెప్పినారు. అట్లాచేయక పోయేటట్లయితే సర్వనాశనము అయిపోతుంది అన్నారు. జనస్థానములో అంత మంది రాక్షసులను అంత అద్భుతముగా రాముడు సంహారము చేయడమే అందుకు నిదర్శనము అని చెప్పినారు. అంతటితో వారు ఊరుకోలేదు. హను మంతుడు సముద్రలంఘనము చేసి లంకాపట్టణానికి రావడమూ నీ దర్శనము చేయడమూ ఆ తరువాత అంతమంది రాక్షసులను ఆ హనుమంతుడు ఒక్కడూ చంపి వేయడమూ ఈ భూమిమీద ఎప్పుడు అయినా ఎవడు అయినా చేసినాడా అని వారు అడిగినారు. ఇట్లా ఆ రావణాసురుడి తల్లీ మంత్రివృద్ధుడు అవిద్ధుడూ ఏమి అడిగినప్పటికిన్నీ ఎంత చెప్పినప్పటికిన్నీ ధనాశాపరుడు ఏమి అయినప్పటికిన్నీ తన ధనాన్ని వదులుకోడానికి అంగీకరించనట్టు ఆ రావణా సురుడు నిన్ను వదిలిపెట్టడానికి ఒప్పుకోలేదు.

"ఓ సీతా, రావణాసురుడు చచ్చిపోతేనే తప్ప బ్రతికి ఉండగా నిన్ను వదిలిపెట్టడు, ఆ క్రూరుడూ వాడి మంత్రులూ ఇట్లా నిశ్చయించినారు. చచ్చి పోవడానికే వాండ్లు ఈ విధముగా నిశ్చయించినారు. భయమునుంచి నిన్ను రావణాసురుడు వదిలి పెట్టడు. యుద్ధములో రాక్షసులు అందరూ చచ్చి పోయినా నిన్ను వదిలి పెట్టడు. వాడు కూడా చచ్చిపోయిన తరువాతనే నిన్ను వదిలిపెట్టుతాడు.

"ఓ సీతా నీవు భయపడవద్దు, నీ వల్లని కన్నులు నాకు చెప్పుతున్నవి. యుద్ధములో రాముడు తన తీక్ష్ణబాణాలతో రావణాసురుణ్ణి చంపి వేస్తాడు. నిన్ను అయోధ్యకు తీసుకొని పోతాడు" అని చెప్పింది.

ఇట్లా సరమ చెప్పుతూ ఉండగా వానరసైన్యాలు భూమి అంతా కంపించి పోయేట్టుగా భేరీలు మోగిస్తూనూ శంఖాలు పూరిస్తూనూ సింహనాదాలు చేయడము వినిపించింది.

ఆ వానరసైన్యాల మహాధ్వనులు వినపడగానే లంకాపట్టణములో రాక్షస రాజభృత్యులముఖాలలో కళకాంతులు మాసిపోయినవి. అందరినీ దైన్యము ఆవరించింది. ఆ మహాధ్వనులకు నిశ్చేష్టులు అయి పోయినారు. రాజు తప్పిదము మంచి తిమకు చావు తప్పదు అని రాక్షససైన్యము అనుకొన్నది.

## 37

శంఖఘోషలతోనూ భేరీభాంకారాలతోనూ ఆ మహాబాహువు ఆ పర పురంజయుడు ఆ రఘువంశలలాముడు రాముడు లంకాపట్టణము మీదికి బయలు దేరినాడు.

రాక్షసేశ్వరుడు రావణాసురుడు ఆ మహాధ్వనులు విన్నాడు. ఒక ముహూర్తము సేపు ఆలోచించినాడు. మంత్రుల వంక చూచినాడు, జగత్తును అంతా బాధపెట్టే ఆ నిర్దయుడు ఆ మహాబలవంతుడు రావణుడు అప్పుడు ఆ సభాభవనము దద్దరిల్లి పోయేట్లుగా "ఓ సచివులారా, రాముడు సముద్రము దాటే రావడాన్ని గురించీ అతని పరాక్రమాన్ని గురించీ వానరసైన్యాన్ని గురించీ మీరు చెప్పిందంతా నేను విన్నాను. మీరు అందరూ సత్యపరాక్రములు అయి ఉండిన్నీ మీకు అందరికీ రాముడి పరాక్రమాన్ని గురించి తెలిసి ఉండిన్నీ ఇప్పుడు మీరు ఒకరిని ఒకరు చూచుకొంటూ గుడ్లు మిటకరించి ఊరక ఉండడమున్నూ చూస్తున్నాను" అని నిందించినాడు.

అట్లా మంత్రులను అందరినీ నిందిస్తూ ఉండగా రావణాసురుడి తల్లికి పిన తండ్రి అయిన మాల్యవంతుడు అనే మహాప్రాజ్ఞుడు రావణాసురుణ్ణి చూచి "రాజా, (అన్వీక్షికీ- త్రయీ- వార్తా- దండనీతి అనే నాలుగు) విద్యలలోనూ సుశిక్షితుడు అయి రాజనీతిని అనుసరించి రాజ్యపాలనము చేసే రాజు చిరకాలమూ ఐశ్వర్యము అనుభవిస్తాడు. శత్రువులను వశపరచుకొంటాడు. అటు ఉంటే రాజు కాలాన్ని పట్టి శత్రువులతో నయినా సంధి చేసుకొంటాడు. కాలాన్ని పట్టి యుద్ధము చేస్తాడు. స్వపక్షాన్ని వృద్ధిచేసుకొని మహదైశ్వర్యము

అనుభవిస్తాడు. ఏ రాజు అయినా తన బలము తక్కువగా ఉన్నప్పుడున్నూ శత్రువు తనతో సరిసమానము అయిన బలవంతుడు అయినప్పుడున్నూ సంధి చేసుకొంటాడు. శత్రువుకన్నా తాను అధికబలవంతుడు అయిఉన్నప్పుడే శత్రువును తిరస్కరించి యుద్ధము చేయడము కర్తవ్యము.

"ఓ రావణుడా, నీవు ఇప్పుడు రాముడితో సంధి చేసుకోటము మంచిది అని నా అభిప్రాయము నీకు రాముడితో విరోధానికి కారణము సీత. నీవు ఆమెను అతడికి ఇచ్చి వేసేట్లయితే ఆ విరోధము పోతుంది. యుద్ధము జరగదు. దేవర్షులూ గంధర్వులూ మొదలు అయిన వారు అందరూ రాముడి జయాన్ని కాంక్షిస్తున్నారు. నీకు అతడితో విరోధము వద్దు. సంధి చేసుకో, అది మంచిది.

"ఓ రావణుడా, భగవంతుడు బ్రహ్మదేవుడు సురాసురలూ ధర్మాధర్మాలూ అనే రెండుజంటలు సృష్టించినాడు. ధర్మము సురలనూ అధర్మము అసురలనూ ఆశ్రయించింది. మహాత్ములు అయిన దేవతలకు ధర్మము సాయపడుతున్నది అనీ అసురరాక్షసులకు అధర్మము సాయపడుతున్నది అనీ వింటున్నాము. ధర్మము అధర్మాన్ని మింగివేసినప్పుడు కృతయుగము అనీ అధర్మము ధర్మాన్ని మింగివేసినప్పుడు కలియుగము అనీ అంటూ ఉంటారు. నీవు దిగ్విజయము కోసము లోకాలలో తిరిగేటప్పుడు ధర్మాన్ని ధ్వంసము చేసివేసినావు. అధర్మాన్ని అవలంబించినావు. అందువల్ల శత్రువులు (ధార్మికులు) ఇప్పుడు మనకన్నా బలవంతులు అయినారు. నీ అజాగ్రత్తవల్ల అధర్మము అభివృద్ధి అయింది. ధర్మము మనలను మింగివేస్తున్నది అది (ధర్మము) దేవతలకు అనుకూలము చేస్తూవుంది. ధర్మము వారికి సాయపడుతున్నది.

"ఓ రావణుడా, నీవు విషయాసక్తుడవు అయి పోయినావు. ఏ కించిత్కారణమువల్లనో (మునిపత్నులనూ మునికన్యలనూ అపహరించుకొని వచ్చినందువల్లనో ఏమో) అగ్నిహోత్రాలవంటి మహర్షులకు నీవు మహామనస్తాపము కలుగచేసినావు. ఆ మహర్షుల ప్రభావము ఎదిరించ నలవికాకుండా మంటలు మండే అగ్నిహోత్రము వంటిది. వారు యథాశాస్త్రముగా అగ్నిహోత్రాలు వేలుస్తున్నారు. వేదాలను గట్టిగా చదువుతున్నారు. రాక్షసులు పారిపోయేట్టు వారు బ్రహ్మఘోషము చేస్తున్నారు. గ్రీష్మకాలములో మేఘాల వలె రాక్షసులు అందరూ ఆ యా దిక్కులకు పారిపోతున్నారు. అగ్నిహోత్రాల వంటి ఆ మహర్షుల అగ్నిహోత్రాలలోనుంచి లేస్తూవున్న పొగలు దశదిశలా వ్యాపించి రాక్షసుల తేజాన్ని అణచివేస్తూ వున్నవి. మహర్షులు ఆ యా పవిత్ర ప్రదేశాలలో దృఢనియమాలతో తపస్సు చేస్తున్నారు. ఆ తపస్సే రాక్షసులను తాపము ఎత్తిస్తున్నది.

"ఓ రాజా, నీవు దేవదానవయక్షులూ మునులు అయిన వారివల్ల చావు రాకుండా ఉండే వరము సంపాదించినావు. అయితే ఇప్పుడు మహా సైన్యముతో బలవంతులూ దృఢవిక్రములూ అయిన నరులూ వానరులూ వచ్చినారు. వారితో ఇంకా భల్లూకవీరులూ గోలాంగూల వీరులూ వచ్చి సింహనాదాలు చేస్తున్నారు. అంతేకాదు, ఇప్పుడు అనేక ఉత్పాతాలు భయంకరముగా అంతరిక్షములోనూ భూమి మీదనూ కనపడుతున్నవి. రాక్షసులు అందరూ నాశనము అయి పోతారేమో ననిపిస్తూ ఉంది, వికృతరూపముతో మేఘాలు తీక్ష్ణముగానూ భయంకరముగానూ గర్జిస్తూ లంకాపట్టణము అంతటా వేడి వేడి నెత్తురు వాన కురుస్తున్నవి. గుఱ్ఱాలూ ఏనుగులూ కన్నీళ్లు కారుస్తూ ఏడుస్తున్నవి. దుమ్ముకొట్టుకొని ధ్వజాలు వివర్ణము అయిపోయినవి. అవి ఇదివరకటి వలె భాసించడము లేదు. తోడేళ్ళూ నక్కలూ గద్దలూ ఎప్పుడు పడితే అప్పుడు లంకాపట్టణములోకి వచ్చి భయంకరముగా అరుస్తున్నవి. నల్లటి స్త్రీలు మాటలతో బెదిరిస్తూ ఆయా వస్తువులు ఇండ్లలోనుంచి దొంగిలించుకొని పోతూ ఎదురు అయినవారిని చూచి తెల్లటి పళ్లు బయటపడేట్టు నవ్వుతూ కలలలో కనపడుతున్నారు. ఇండ్లలో పూజ చేయడానికి ఉంచుకొన్న హవిస్సును కుక్కలు వచ్చి తిని పోతున్నవి. ఆవులకు గాడిదలు పుట్టుతున్నవి. ముంగిసలకు ఎలుకలు పుట్టుతున్నవి. పిల్లులు పెద్దపులులతోనూ ఊరపందులు కుక్కలతోనూ చేరుతున్నవి. కిన్నరులు రాక్షసులతోనూ మనుష్యులతోనూ కలుస్తున్నారు. తెలుపూ ఎరుపూ పాదాలతో పావురాళ్లు రాక్షస వినాశాన్ని సూచిస్తూ దైవికముగా తిరుగుతూ ఉన్నవి. ఇండ్లలో పెంచుకుంటూ ఉన్న గోరువంకలు మధురముగా కూయుడము మానివేసి చీచీ కూచీ మని క్రూరముగా అరుస్తున్నవి. పక్షులూ మృగాలూ పోట్లాడుకొని ఓడిపోయినవి. మళ్ళీ గుంపులు గుంపులుగా మృగాలమీదికి పక్షులూ పక్షుల మీదికి మృగాలూ పరుగులెత్తుతున్నవి. అవి అన్నీ సూర్యుడి వైపు ముఖము పెట్టి ఏడుస్తున్నవి.

మృత్యువు పురుషరూపము ధరించి గొరిగించుకొన్న తలతో వికలాంగముతో భయంకరాకారముతో ఆయా కాలాలలో అందరి ఇండ్లూ చూస్తూవుంది. ఇవే కావు. ఇంకా ఇతర దుష్టనిమిత్తాలు కనపడుతున్నవి. ఓ రాజా, ఆలోచించు. ఇక ముందు ఏ బాధా రాకుండా ఉండడానికి ఏమి చేయవలెనో నిశ్చయించు" అని చెప్పినాడు.

ఈ విధముగా ఆ ఉత్తమోత్తమ పౌరుషవంతుడు ఆ బలవంతుడు మాల్యవంతుడు చెప్పి రావణాసురుని పరిశీలించి చూచినాడు. తన మాటలు అతనికి అయిష్టము అయినట్లు తెలుసుకొని ఊరకున్నాడు.

## 3౬

ఆ దుష్టాత్ముడు రావణుడు మృత్యువు చేతికి చిక్కిపోతున్నాడు. అందువల్ల మాల్యవంతుడు చెప్పిన మంచి మాటలు మనస్సుకు ఎక్కలేదు. అంతేకాదు. ఆ మాటలకు అతడికి కోపము వచ్చింది కూడాను. కోపముతో కనుబొమ్మలు ముడి వేసి కను గుడ్లు తిప్పుతూ మాల్యవంతుణ్ణి చూచి "ఓ ముసలి వాడా, నీవు శత్రుపక్షాన చేరినావు. హితము చెప్పుతున్నటుగా నాకు అహితము చెప్పినావు. నాకు ఏదో మేలు చేయడము కోసము అన్నట్లు పరుషముగా మాట్లాడినావు. నీవు నన్ను మోసము చేయలేవు. ఇటువంటి మాటలు నా చెవికి ఎక్కవు.

"ఓ మాల్యవంతుడా, వాడు మానవుడు. నీచుడు. ఏకాకి. కోతులు వాడికి ఆశ్రయము ఇచ్చినవి. వాణ్ణి వాడి తండ్రి వెళ్లకొట్టినాడు. అడవే వాడికి ఆవాసము అయింది. వాణ్ణి ఆ రాముణ్ణి సమర్థుడు అని నీవు ఎందుకు అనుకొంటున్నావో చెప్పు. నేను సమస్తరాక్షసులకున్నూ ప్రభువును. పరమ పరాక్రమశాలిని. దేవతలు నన్ను చూచి భయపడుతున్నారు. నేను ఎందులో తక్కువ వాణ్ణి అనుకొంటున్నావో చెప్పు. రాక్షసవంశములో నీకన్నా పరాక్రమవంతుడు అయిన వాడు ఉండడము ఓర్వలేకనో శత్రుపక్షపాతము వల్లనో కాక శత్రువుల ప్రోత్సాహము వల్లనో నీవు నాతో పరుషముగా మాటాడినావు అనుకొంటున్నాను. శత్రువుల ప్రోత్సాహమే లేకపోయినట్లయితే పండితుడూ శాస్త్రతత్వజ్ఞుడూ అయిన నీ బోటివాడు ఎవడూ రాజ్యాధికారములో ఉన్న వాడితో అందులో నిగ్రహానుగ్రహసామర్థ్యము ఉన్న వాడితో పరుషముగా మాట్లాడడు.

"ఓ మాల్యవంతుడా, పద్మాసనము లేని మహాలక్ష్మీదేవి వంటి సీతను నేను అడవిలో నుంచి తెచ్చుకొన్నాను. నేను రాముడికి ఎందుకు ఇస్తాను. భయమువల్లనా — నాకు అటువంటిది లేదు. నేను కొద్ది రోజులలో నే ఆ రాముణ్ణీ ఆ లక్ష్మణుణ్ణీ, ఆ సుగ్రీవుణ్ణీ చంపి వేస్తాను. వాండ్లువెంట తెచ్చుకొన్న వానరసైన్యాన్ని నాశనము చేసి వేస్తాను. నీవు చూస్తావు. దేవతలు అయినా ద్వంద్వయుద్ధములో నా ఎదట నిలవ లేరు. అటువంటి నేను యుద్ధానికి భయపడటము ఎందుకు. నా శిరస్సు ఛేదించినప్పటికిన్నీ నేను ఒకడికి లొంగి పోను. అది నా స్వభావము. అది దోషము అయితే కావచ్చును. సహజస్వభావాన్ని ఎవడూ అతిక్రమించ లేడు. రాముడు యాదృచ్ఛికముగా సముద్రానికి సేతువు కట్టి ఉండవచ్చును. అందుకు నీవు ఎందుకు భయపడవలెను. అందులో ఆశ్చ

ర్యము ఏమి ఉంది. ఆ రాముడు వానరసైన్యముతో సముద్రాన్ని దాటి వచ్చి వాడే కాని ప్రాణాలతో తిరిగి పోవడము ఉత్తది. నేను సత్యము చెప్పుతున్నాను. శపథము చేసి చెప్పుతున్నాను" అన్నాడు.

ఈ విధముగా ఇంత గర్వముతో మాట్లాడిన రావణాసురుణ్ణి చూచి అతడికి కోపము వచ్చింది అని తెలుసుకొన్నాడు. తాను అతడితో అట్లా మాట్లాడినందుకు సిగ్గు పడిపోయినాడు. రావణాసురుడు అడిగిన మాటలకు జవాబు చెప్పకుండా యథోచితముగా జయము ఆశీర్వదించి రావణాసురుడి అనుజ్ఞతో మాల్యవంతుడు అక్కడ నుంచి తన ఇంటికి పోయినాడు.

అంతట రావణుడు తన మంత్రులతో ఆలోచించినాడు. విమర్శించినాడు. లంకాపట్టణానికి అసమానము అయిన రక్షణము ఏర్పాటు చేసినాడు. తూర్పు ద్వారము దగ్గర ప్రహస్తుణ్ణి ఉండమనీ దక్షిణద్వారము దగ్గర మహోదరుణ్ణి మహాపార్శ్వుణ్ణీ ఉండమనీ పశ్చిమద్వారము దగ్గిర మహా మాయావి అయిన తన కొడుకును ఇంద్రజిత్తును అనేకమంది రాక్షసయోధులతో ఉండమనీ ఉత్తర ద్వారము దగ్గిర శుకసారణులను ఉండమనీ ఆజ్ఞాపించినాడు. తానూ స్వయముగా ఆ ఉత్తరద్వారము దగ్గర నే ఉంటాను అని చెప్పినాడు. పట్టణమధ్యములో మహాబలవంతుడు అయిన విరూపాక్షుడు అనే రాక్షసుణ్ణి అనేకమంది రాక్షసయోధులతో ఉండమని ఆజ్ఞాపించినాడు.

ఈ విధముగా ఆ రాక్షసపుంగవుడు రావణుడు లంకాపట్టణాన్ని కాపాడడానికి ఏర్పాట్లు చేసి కాలము మూగించుకొని వస్తూ ఉన్నందువల్ల తాను కృతకృత్యుడు అయినట్టు భావించుకొన్నాడు.

అట్లా ఆ లంకాపట్టణానికి రావణాసురుడు సమగ్రము అయిన రక్షణ సంవిధానము ఏర్పాటు చేసినాడు. మంత్రులు అందరూ అతనికి జయము ఆశీర్వదించి పూజించినారు. అంతట ఆ సంపన్నుడు రావణుడు మంత్రులను వదిలిపెట్టి తన అంతఃపురములోకి పోయినాడు.

## 32

రామలక్ష్మణులూ వానరరాజు సుగ్రీవుడూ వాయుపుత్రుడు హనుమంతుడూ భల్లూకరాజు జాంబవంతుడూ రాక్షసరాజు తమ్ముడు విభీషణుడూ వాలిపుత్రుడు అంగదుడూ శరభుడూ సుషేణుడూ అతని బంధువులూ మైందుడూ ద్వివిదుడూ గజుడూ గవాక్షుడూ కుముదుడూ నలుడూ పనసుడూ లంకాపట్టణము దగ్గరకు పోగానే జరగవలసిన కార్యాన్ని గురించి ఆలోచించసాగినారు.

"ఇదిగో, రావణాసురుడు ఏలుతూవున్న లంకాపట్టణము. ఎట్టఎదుట కన బడుతున్నది. సురాసురోరగ గంధర్వులకు ఎవరికీ జయించనలవి కాకుండావుంది. ఇక్కడ ఈపట్టణములో రాక్షసాధిపతి రావణాసురుడు ఎప్పుడూ సన్నిహితు డుగా ఉంటున్నాడు. కాబట్టి మనకు కార్యసిద్ధిఅయ్యే ఉపాయము ముందుగా ఆలోచించవలెను" అని రాముడు చెప్పినాడు.

అప్పుడు విభీషణుడు పొందికఅయిన మాటలతో అధికార్థముగ "ప్రభూ, నామంత్రులు అనలుడూ శరభుడూ సంపాతీ ప్రఘసుడూ అనే నలుగురున్నూ పక్షులరూపము ధరించి లంకాపట్టణములోకి పోయి శత్రుసైన్యములో చొరబడి రావణాసురుడు చేసిన ఏర్పాట్లను అన్నిటినీ చూచి తిరిగి వచ్చినారు. ప్రభూ ఆదురాత్ముడు రావణాసురుడు నగరరక్షణము కోసము చేసిన ఏర్పాట్లను అన్ని టినీ నా నలుగురు మంత్రులూ నాకు చెప్పినారు. వారు చెప్పింది అంతా నేను చెప్పుతాను వినవలసింది. ప్రహస్తుడు వాడి సైన్యాలతో తూర్పుద్వారాన్ని మహాబలవంతులు అయిన మహాపార్శ్వుడూ మహోదరుడూ వాండ్ల సైన్యాలతో దక్షిణద్వారాన్ని రావణాసురుడి కొడుకు ఇంద్రజిత్తు పట్టిసాసిధానుష్కుల తోనూ కూటముద్గరపాణులతోనూ ఇంకా నానావిధాయుధధారులు అయిన శూరులతోనూ పశ్చిమద్వారాన్ని కావలి కాసే ఏర్పాటు రావణాసురుడు చేసినాడు.

రావణాసురుడు స్వయముగా నిర్భయముగా ఉత్తర ద్వారములో ఉన్నాడు. వేలకు వేలు రాక్షసయోధులు ఆయుధపాణులుఅయి అతనిచుట్టూ వున్నారు. యోధులేకాకుండా ప్రధానముఅయిన రాక్షసులు అందరూ అక్క డనే ఉన్నారు శూలాలూ ఖడ్గాలూ ధనుస్సులూ ధరించిన మహాసైన్యమూ ప్రధానరాక్షసులూ లంకాపట్టణ మధ్యగుల్మములో విరూపాక్షుడితో ఉన్నారు.

ఒక వెయ్యిమంది గజసాదులూ పది వేలమంది రథికులూ ఇరవై వేలమంది అశ్వికులూ ఒక కోటిమంది పదాతులూ రావణాసురుడి వెంట ఎప్పుడూ వుంటారు. వాండ్లు అతడికి ఇష్టులు. వాండ్లు అందరూ బలవంతులు. పరమపరా క్రమవంతులు. యుద్ధములో క్రూరులు. వాండ్లకు ఒక్కొక్కళ్లకు ఒక్కొక్క లక్ష పరివారము ఉంది. వాండ్లు ఎప్పుడూ యుద్ధానికి సంసిద్ధులుగాఉంటారు" అని చెప్పి లంకాపట్టణము పోయివచ్చిన తన నలుగురు మంత్రులనూ విభీషణుడు రాముడికి చూపించినాడు. ఆ నలుగురు రాక్షసమంత్రులున్నూ లంకాపట్టణ ములో ఏర్పాట్లను అన్నిటినీ రాముడికి స్వయముగా తెలియచెప్పినారు.

ఆ శ్రీమంతుడు విభీషణుడు మళ్లీ ఆ కమలపత్రాక్షుణ్ణి రాముణ్ణి చూచి "రామా, రావణుడు కుబేరుడి మీదికి యుద్ధానికి పోయినప్పుడు పది లక్షల

మంది రాక్షసయోధులను వెంట తీసుకొని పోయినాడు. వాండ్లు అందరూ ఆ దురాత్ముడితో సరిసమానము అయిన పరాక్రమవంతులు, బలవంతులు, తేజోవంతులు. ధైర్యములో కానీ దర్పములో కానీ వాండ్లు తమ ఏలికకు తీసిపోరు. ఇట్లా చెప్పుతున్నందుకు నన్ను కోప పడవద్దు. నిన్ను భయపెట్టడానికి నేను ఇట్లా చెప్పడములేదు. నీకు రోషమువచ్చి వెంటనే రావణాసురుణ్ణి సంహారము చేయడానికోసము చెప్పుతున్నాను. ఓ ప్రభూ నీవు నీ పరాక్రమముతో దేవతలను అయినా నిగ్రహించకలవు. నీకు ఆ సామర్థ్యము ఉంది. ఇప్పుడు నీ చుట్టూ ఉన్న మహావానరసైన్యాన్ని నాలుగు అవయవాలుగా వ్యూహము పన్ను, రావణాసురుణ్ణి వధించు" అని చెప్పినాడు.

ఈ విధముగా విభీషణుడు చెప్పిన తరువాత రాముడు శత్రుసంహారము చేయడానికి వానరయూథపతులను చూచి "ఓ వానరవీరులారా, మీలో నీలుడు వానరయోధులను వెంట పెట్టుకొని ఈ లంకాపట్టణ తూర్పు ద్వారములో ఉన్న ప్రహస్తుడితో పోరాడవలెను. వాలి పుత్రుడు అంగదుడు వానర సైన్యముతో పోయి దక్షిణ ద్వారములో ఉన్న మహోదరుడితోనూ మహాపార్శ్వుడితోనూ యుద్ధము చేయవలెను. అప్రమేయబలుడు హనుమంతుడు వానర సైన్యముతో పోయి పశ్చిమ ద్వారాన్ని పడకొట్టవలెను.

"దైత్యదానవసంఘాలకున్నూ మహాత్ములు అయిన మహర్షులకున్నూ అపకారము చేసిన ఆ క్షుద్రుణ్ణి బ్రహ్మదేవుడి వరదానమువల్ల బలవంతుడు అయి ప్రజలను హింసిస్తూ ఉన్న ఆ క్రూరుణ్ణి సమస్త లోకాలలోనూ యథేష్టముగా తిరుగుతూ ఉన్న ఆ రాక్షసాధిపతిని రావణాసురుణ్ణి స్వయముగా నేనే సంహారముచేయ నిశ్చయించుకొన్నాను. ఆ రావణాసురుడు వాడి సైన్యాలతో ఉన్న ఉత్తరద్వారము దగ్గరకు నేను నా తమ్ముడు లక్ష్మణుడితో పోయి పోరాడుతాను.

"వానరరాజు సుగ్రీవుడూ భల్లూకరాజు జాంబవంతుడూ రాక్షసరాజు తమ్ముడు విభీషణుడూ ఆకాశమార్గాన పోయి లంకాపట్టణమధ్యగుల్మములో పోరాడవలెను.

ఈ యుద్ధములో వానరులు మనుష్య స్వరూపము ధరించకూడదు. వానర రూపముతోనే ఉండవలెను. అదే మన సైనికులు అని తెలియడానికి గుర్తు. మహాపరాక్రమంతుడు నా తమ్ముడూ లక్ష్మణుడూ నేనూ నీలుడూ అంగదుడూ హనుమంతుడూ సుగ్రీవుడూ మన స్నేహితుడు విభీషణుడూ మొత్తము మేము ఏడుగురమూ మనుష్యరూపముతో యుద్ధము చేస్తాము" అని చెప్పినాడు.

ఆ మతిమంతుడు రాముడు కార్యసిద్ధి కోసము ఈ విధముగా నిర్ణయించినాడు. రమణీయము అయిన సువేల పర్వతతటాన్ని చూచినాడు. ఆ ప్రదేశానికి ఎక్కి పోవలెను అనుకొన్నాడు.

అంతట మహా బుద్ధిమంతుడు ఆ మహాధైర్యవంతుడు రాముడు మహత్తరము అయిన వానర సైన్యముతో ఈ పృథ్వివి అంతా ఆచ్ఛాదించి పరమసంతోషముతో లంకాపట్టణము మీదికి పోయినాడు.

## 3౦

రాముడు లక్ష్మణుడితో ఆలోచించినాడు. అంతట ఆ సువేల పర్వతశిఖరముమీదికి పోవడానికి నిశ్చయించుకున్నాడు. ధర్మజ్ఞులూ మంత్రజ్ఞులూ కార్యవిధిజ్ఞులూ అనురక్తులూ అయిన సుగ్రీవుణ్ణి విభీషణుణ్ణి చూచి మధురముగా "ఓ మిత్రులారా, ధాతువులతో దగధగలాడుతూ ఉన్న ఈ సువేలపర్వతశిఖరము మీదికి మనము అందరమూ పోదాము. ఇప్పుడు లంకాపట్టణము ఎట్లా ఉందీ మనకు అక్కడనుంచి కనబడుతుంది. మనము అందరమూ ఈ రాత్రి అక్కడనే ఉండిపోదాము.

"వాడు రావణుడు తన చావుకోసము నా భార్యను ఎత్తుకొనిపోయినాడు. వాడు ధర్మాధర్మాలు ఆలోచించలేదు. సదాచారాన్ని పాటించలేదు. పులస్త్యవంశగౌరవాన్ని గణించలేదు. రాక్షససాధారణము అయిన నీచబుద్ధితో నింద్యము అయిన పరదారాపహరణము చేసినాడు. ఆ నీచుడి అపరాధమునుంచి ఇప్పుడు రాక్షసులు అందరూ చచ్చిపోయే దురవస్థ వచ్చింది. ఆ రాక్షసాధముడి పేరు చెప్పితే నాకు కోపము వస్తుంది. ఒక్కడు కాలపాశవశంగతుడు అయి పాపిష్ఠి పని చేస్తాడు. ఆ నీచుడి అపచారమునుంచి వాడి వంశమూ అంతా నాశనము అయిపోతుంది" అని కోపముతో చెప్పుతూనే రాముడు ఆరాత్రి ఉండడానికి ఆసువేలపర్వతము మీదికి నడవసాగినాడు. హెచ్చరికతో మహాచ్ఛరము తీసుకొని ఆ పరమపరాక్రమవంతుడు లక్ష్మణుడు రాముణ్ణి వెంబడించినాడు. ఆలక్ష్మణుడి వెనక సుగ్రీవుడున్నూ తన నల్గురు మంత్రులతో విభీషణుడున్నూ నడిచినారు.

హనుమంతుడూ అంగదుడూ నీలుడూ నలుడూ మైందుడూ ద్వివిదుడూ గజుడూ గవాక్షుడూ గవయుడూ శరభుడూ గంధమాదనుడూ పనసుడూ కుముదుడూ హరుడూ రంభుడూ జాంబవంతుడూ సుషేణుడూ ఋషభుడూ శతవలీ మొదలు అయిన వానరయూథపతులూ యింకా తక్కిన వానరయోధులూ

రాముణ్ణి చేరడానికి ఆ సువేలపర్వతము మీదికి వాయువేగముతో పోయినారు. అచిరకాలములో ఆ సువేలపర్వతశిఖరముమీద రామాదులను కలసుకొన్నారు.

ఆ సువేలపర్వతానికి ఎట్టఎదుట త్రికూటపర్వత శిఖరముమీద ఉన్న లంకాపట్టణాన్ని వారు అందరూ చూచినారు. అది ఆకాశాన్ని చొరుచుకొని పోయినట్టుగా కనిపించింది. అందము అయిన బహిర్ద్వారాలతోనూ ఎత్తు అయిన ప్రాకారాలతోనూ రాక్షసపమూహాలతోనూ శోభిస్తూనూ ఎత్తు అయిన ప్రాకారము మీద నల్లటి రాక్షసులతో మరి ఒక ప్రాకారముగానూ ఉన్న లంకాపట్టణాన్ని వానరయూథపతులు అందరూ చూచినారు. అంతట ఆ వానరవీరులు అందరూ యుద్ధోత్సాహులు అయినారు. రాముడి అనుమతితో నానావిధ సింహనాదాలు చేసినారు.

అప్పుడు సంధ్యాకాలము అయినందువల్ల సూర్యుడు ఎర్రబడిపోయినాడు. అంతట అస్తమించినాడు. అప్పుడు పూర్ణచంద్రుడితో శోభాయమానముగా వెన్నెల వచ్చింది.

సుగ్రీవుడు అప్పుడు అక్కడ వానరసైన్యానికీ వానర యూథపతులకూ రామలక్ష్మణులకూ చక్కని వసతులు ఏర్పాటు చేయించినాడు. అందుకు ఆ వానర వాహినీపతిని విభీషణుడు అభినందించి గౌరవించినాడు.

## ౩౯

ఆ వానరవీరులు ఆ రాత్రి అంతా ఆ సువేలపర్వతము మీద హాయిగా కాలము గడిపినారు. వనదుర్గముగా ఉన్న మహావనాలనూ ఉద్యానవనాలనూ తెల్లవారుతూనే చూచినారు. అవి అన్నీ మిట్టపల్లాలు లేని సమప్రదేశములో (సువేలపర్వతమునుంచి త్రికూటపర్వతము వరకూ) ఎంతో దూరము విశాలముగానూ రమణీయముగానూ నేత్రపర్వముగానూ కనిపించినవి. ఆ వనాలనూ ఆ ఉద్యానవనాలనూ వానరులు అందరూ చూచినారు.

ఆ వనాలలో సంపెంగిచెట్లూ సురపొన్నచెట్లూ మద్దిచెట్లూ నేల కనపడకుండా కానుగ తొపులూ పంక్తులు పంక్తులుగా నాగకేసరచెట్లూ అశోకవృక్షాలూ తాటిచెట్లూ మద్దిచెట్లూ ఏరుమద్దిచెట్లూ కడిమిచెట్లూ పూచిన ఏడాకుల అరటిచెట్లూ కొండగోగుచెట్లూ కలిగొట్టుచెట్లూ కనిపించినవి. ఆయా మహోన్నతవృక్షాలకు రకరకాల లతలూ అల్లుకొన్నవి. అట్లా అల్లుకొన్న ఆ లతలూ ఆ చెట్లూ పూలు పూసినవి. అందువల్ల ఆ వృక్షాల చివరను ఎర్రటి చిగురులతో చిగుళ్లూ చిత్రవిచిత్రము అయిన రంగులతో పూలూ కనిపించినవి.

చుట్టూ చిత్రవిచిత్రము అయిన వనాలతోనూ ఉద్యానవనాలతోనూ పచ్చిక బయళ్లలోనూ జలాశయాలతోనూ ఆ లంకాపట్టణము దేవేంద్రుడి అమరావతి పట్టణమువలె శోభాయమానముగా కనిపించింది. మధురవాసనలు గుబాళించే మహారమణీయము అయిన పూలతోనూ పండ్లతోనూ ఆయా వృక్షాలు దండిగ చర్చ చేసుకొని ఆభరణాలతో అలంకరించుకొన్న దేవతలవలె కనిపించినవి.

ఆ మహావనము సర్వఋతువులలో తుమ్మెదలు మూగే రమ్యమూ మనోజ్ఞమూ అయిన కుబేరుడి చైత్రరథవనము వలెనూ దేవేంద్రుడి నందనోద్యానవనము వలెనూ తోచింది. ఆ మహావనములో సెలయేళ్లదగ్గర నీరుకోళ్లూ చీకప కొక్కెరలూ తిరుగుతూనూ నెమిళ్లు నాట్యము ఆడుతూ ఉండగా కోకిలలు మధుర గానము చేస్తూనూ ఉండటము ఆ వానరవీరులు అందరూ గమనించినారు. ఆగా పక్షులపాటలు విన్నారు. సంతోషాతిశయముతో ఆ కామరూపుల దేహాలు ఉప్పొంగి పోయినవి.

ఆయా పుష్పఫలభరితవృక్షాలమీద మదించిన పక్షులు పాటలు పాడుతూనూ తుమ్మెదలు పూలతేనెలు తాగుతూనూ (భృంగరాజాలు) గండు తుమ్మెదలు ఝంకారము చేస్తూనూ వృక్షసమూహాలలో కోకిలలు పాటలు పాడుతూనూ కౌజుపిట్టలూ బెగ్గురుపక్షులూ మధురధ్వనులు చేస్తూనూ ఉన్న ఆ లంకాపట్టప్రాంతవనాలలోకి వానరవీరులు పోయినారు. ఆ వనాలలో పుష్ప సంసర్గమువల్ల సుగంధము గుబాళించే వాయువు చల్లగా హాయిగా వీచినందువల్ల ఆ వానరవీరుల ఘ్రాణేంద్రియాలు తృప్తిచెందడమే కాకుండా దేహాలు పులకలు ఎత్తినవి. అప్పుడు కొంతమంది వానరయూథపతులు సుగ్రీవుడి అనుజ్ఞతో లంకాపట్టణాన్ని చూచి రావడానికి ముందుగా బయలుదేరి పోయినారు.

అమిత వేగముతో బయలుదేరి పోయిన ఆ వానరవీరుల పాదఘట్టనలకు భూమి అదిరి పోయింది. భూమి మీదినుంచి లేచిన దుమ్ము ఆకాశాన్ని కనపడకుండా ఆవరించింది. వారి సింహనాదాలకు ఆవనాలలో ఉన్న పక్షులూ జింకలూ ఏనుగులూ ఎలుగుబంట్లూ అడవి పందులూ అడవి దున్నలూ సింహాలూ బెదిరిపోయి దశదిశలా పరుగులెత్తినవి ఆ మహాధ్వనికి లంకాపట్టణము అంతా సంచలించి పోయింది.

(ఆ లంకాపట్టణానికి సముద్రము జలదుర్గము. అది దాటినతరువాత. సువేలా పర్వతము పర్వతదుర్గము, ఆ పర్వతదుర్గము దాటిన తరువాత వనదుర్గము ఆ వనదుర్గముదాటిన తరువాత త్రికూటపర్వతముమీద లంకాపట్టణము ఉంది). ఆ త్రికూటపర్వతము చాలా ఎత్తు అయింది. అది ఆకాశాన్ని స్పృశిస్తున్నట్టుగా

కనపడుతుంది. అంతటా తెల్లటి పూలతోనూ బంగారువన్నెతోనూ ధగధగ లాడుతూ రమణీయముగా నేత్రపర్వముగా ఉంటుంది. ఆ ఎత్తుకు పక్షులు సయితము ఎగిరిపోలేవు" అక్కడి కిపోకలము అని మనస్సులోనయినా ఎవరూ అనుకోలేరు. కాలినడకను అక్కడికి పోవడము ఉత్తిది అని వేరే చెప్ప నక్కర లేదు.

ఆ త్రికూటపర్వతము మీద రావణాసురుడు ఏలుతూ ఉన్న లంకాపట్టణము పొడుగు నూరు యోజనాలు. వెడల్పు ముప్ఫయి యోజనాలు, ఆ లంకా పురద్వారాలు తెల్లటి మేఘాలవలెనూ ప్రాకారములు వెండి బంగారు కాంతులతోనూ తేజరిల్లుతూ ఉంటవి, ఆకాశమధ్యములో వర్షాకాలమేఘాల వలె అక్కడి ప్రసాదగృహాలూ విమానగృహాలూ శోభిస్తూ ఉంటవి. కైలాస శిఖరము వలె అక్కడ వెయ్యి స్తంభాలతో ప్రాసాదభవనము ఆకాశములోకి చొరుచుకొని పోతున్నట్లుగా కనపడుతుంది. అక్కడ నూర్లకొద్దీ రాక్షసులు కావలి కాస్తూ ఉంటారు. ఆ రాక్షసేంద్రుడి ఆ చైత్యప్రాసాదభవనము ఆ లంకా పట్టణానికి ఒక ఆభరణము వంటిది.

ఆ శ్రీమంతుడు ఆ పరాక్రమవంతుడు రాముడు లక్ష్మణుణ్ణీ వానరయూథ పతులను వెంట పెట్టుకొని మధుర గానము చేసే పక్షులూ వివిధ మృగాలూ ఉన్న మహారణ్యాలతోనూ వివిధ ధాతువులతోనూ ధగ ధగలాడే పర్వతాలతోనూ మనోహరము అయిన ఉద్యానవనాలతోనూ కిటకిటలాడే మహాగృహాలతోనూ అనేక ప్రాసాదగృహ పంక్తులతోనూ వివిధరాక్షస సమూహాలతోనూ నానావిధ రక్షణలతోనూ గొప్ప యంత్రాలు అమర్చిన బహిర్ద్వార కవాటాలతోనూ సమస్త ద్రవ్య సమృద్ధముగా ఉన్న లంకాపట్టణాన్ని చూచి ఆశ్చర్యపడి పోయినాడు.

## ౪౦

ఆ సువేలపర్వతము మీద రెండు యోజనాల వలయములో ఉన్న వానర సైన్యముతోనూ వానర యూథపతులతోనూ సుగ్రీవుడితోనూ లక్ష్మణుడితోనూ రాముడు ఒక ముహూర్తము సేపు దిశదిశలూ పరిశీలించి చూచినాడు. మనోహరము అయిన త్రికూటపర్వతముమీద రమణీయము అయిన వనాలతో విశ్వకర్మ నిర్మించిన ఆ లంకాపట్టణాన్నీ ఆ పట్టణ గోపురశిఖరము మీద ఉన్న రావణాసురుణ్ణీ రాముడు అప్పుడు చూచినాడు.

ఆ రావణాసురుడికి ఇరువైపులా తెల్లటి వింజామరలతో వీస్తున్నారు. [illegible]చకము అయిన ఛత్రము పట్టినారు. ఒంటినిండా రక్తచందనము పూసి

ఉంది. మెడలో నుంచి వేళ్లాడుతూ ఉన్న రత్నాభరణాలు తళతళ లాడుతూ అతడు నీలమేఘమువలె కనిపించినాడు. అతని వక్షఃస్థలము మీద ఐరావతము కొమ్ములతో గీరిన గాయాల మచ్చలు కనిపించినవి. బంగారు జరీ ఉత్తరీయము వేసుకొన్నాడు. కుంకేటి నెత్తురువంటి ఎర్రటి వస్త్రము కట్టుకొన్నాడు. ఆకాశములో సంధ్యారాగము అలముకొన్న మహా నీలమేఘమువలె తోచినాడు.

అట్లా కనిపించిన ఆ రాక్షసరాజును రావణాసురుణ్ణి రామలక్ష్మణులూ వానరవీరులు అందరూ చూస్తూఉన్నారు. ఆ రాక్షసరాజును చూచే మూడ బలముతో సుగ్రీవుడికి పట్టరాని కోపము వచ్చింది. ఆ ధైర్యవంతుడు ఆ బలవంతుడు హఠాత్తుగా లేచినాడు. ఆ సువేల పర్వత శిఖరము మీదినుంచి ఎగిరిదట్టే రావణాసురుడు ఉన్న గోపురము మీదికి పోయినాడు. ఆ రావణాసురుణ్ణి ఒక క్షణము సేపు తేరి పార చూచినాడు. నిర్భయముగా అతణ్ణి ఒక గడ్డిపోచగా భావించి పరుషముగా "ఓ రాక్షసుడా, నేను లోకనాథుడు రాముడి దాసుణ్ణి. ఆ మహానుభావుడు మాత్రము నన్ను తన స్నేహితుడు అని చెప్పుతూ ఉంటాడు. ఆ రామప్రభు తేజము నాలో ఉంది. నీవు ఇప్పుడు నన్ను తప్పించుకొని పోలేవు" అంటూ సుగ్రీవుడు తటాలున పయికిఎగిరి రావణాసురుడి కిరీటాన్ని లాగి నేలమీద పారవేసినాడు.

అంత వేగముతో తన మీదికి వస్తూఉన్న సుగ్రీవుణ్ణి చూచి ఆ రాక్షసరాజు రావణాసురుడు "ఓరీ, నీవు నాకు కనపడనంతవరకూ సుగ్రీవుడవు (మంచి మెడకలవాడవు) ఇప్పుడు నీవు హీనగ్రీవుడవు (మెడ లేని వాడవు)" అంటూ లేచి తన రెండుచేతులతోనూ సుగ్రీవుణ్ణి నేలమీద పడతోసినాడు. నేలమీద పడ్డ సుగ్రీవుడు బంతివలె పయికి ఎగిరి తన రెండు చేతులతోనూ రావణాసురుడి మీద కలియపడ్డాడు.

అప్పుడు ఆ ఉభయుల దేహాలనుంచీ చెమటలు కారినవి. ఉభయుల దేహాల నిండా నెత్తురు కమ్ముకొన్నది. ఒకరిని ఒకరు పెనవేసి పట్టుకొని క్షణము సేపు కదలకుండా మెదలకుండా నిలుచున్నారు. అప్పుడు ఒకరు పూచిన బూరుగు చెట్టువలెనూ ఒకరు పూచిన మోదుగుచెట్టు వలెనూ కనిపించినారు.

ఆ వానరరాజూ ఆ రాక్షసరాజూ ఒకరిని ఒకరు పిడిగుద్దులు గుద్దుకొన్నారు. అరచేతులతో బాదుకొన్నారు. మోచేతులతో పొడుచుకొన్నారు. గోళ్లతో గిచ్చుకొన్నారు. సహించలేని బాధతో ఒకరితో ఒకరు పోట్లాడినారు.

ఆ గోపురపు తిన్నెల మధ్యను ఆ ఇద్దరు మహాబలవంతులూ భయంకర వేగముతో చేతులతో పట్టు పట్టినారు. ఒకరిని ఒకరు పయికి ఎగరవేసినారు.

ఒకరిని ఒకరు కింద పడలాగినారు. ఒకరి దేహాన్ని ఒకరు వంగ తీసినారు. ఉభయులూ ఆ గోపుర వేదికలకు పాదాలు తన్ని పట్టి ఒకరిని ఒకరు పడలాగినారు. ఒకరి దేహాన్ని ఒకరు చేతులతో పెనవేసి పట్టుకొన్నారు. ప్రాకారము పక్కను ఉన్న అగడ్తలో ఇద్దరూ పడ్డారు. ఇద్దరూ ఎగిరి చేతులు నేలమీద మోపి ఒక క్షణముసేపు బుసలుకొట్టి ఒకరిని ఒకరు పెనవేసి పట్టుకొన్నారు. పయికి ఎగిరినారు. బాహుపాశాలతో బంధించుకొన్నారు.

అంతట ఆ యిద్దరూ అభ్యాసబలముతోనూ సహజ బలముతోనూ చెలరేగినారు. సింహాలవలెనూ పెద్దపులులవలెనూ తిరుగుతూ వివిధ పద్ధతులతో పోరాడినారు. ఒకరికి ఒకరు ఎదురుగుండా పోయి నిలుచున్నారు. ఎగురు రొమ్ములతో ఒకరిని ఒకరు కొట్టుకున్నారు. ఏకకాలాన నేలమీద పడ్డారు. ఒక్కసారిగా ఉభయులూ నేలమీది నుంచి లేచినారు. ఒకరిని ఒకరు కొట్టుతూ అనేకవిధాల పోరాడినారు.

వారు ఉభయులూ బలవంతులు మాత్రమే కారు. ఉభయులూ వ్యాయామ శిక్ష పొందినవారు. ఉభయులూ చక్కగా సాము చేసిన వారు. ఉభయులూ మదపుటేనుగుల వంటివారు. ఏనుగుల కట్లు స్తంభాలవంటి తమ చేతులతో ఎంతసేపు బాదుకొన్నా ఒక్కరున్నూ అలసిపోలేదు. ఉభయులూ అమితవేగముతో గుండ్రముగా తిరుగుతూ ఎంతోసేపు పోరాడినారు సుగ్రీవుణ్ని రావణుడు చంపివేయవలెను అనుకొన్నాడు. రావణుణ్ని సుగ్రీవుడు చంపివేయవలెను అనుకొన్నాడు. ఎలుకకోసము పొంచివుండే పిల్లిమాదిరిగా ఇద్దరూ సమయముకోసం కనిపెట్టుకొని ఎప్పటికి అప్పుడు ఒకరిమీదికి ఒకరు దూకడానికి సిద్ధము అయినారు.

ఆ వానరరాజు సుగ్రీవుడూ రాక్షసరాజు రావణాసురుడూ మల్లయుద్ధ విశారదులు. వివిధవిధాలపోరాటములోనూ ఆరితేరినవారు. విచిత్రము అయిన మండలాకారముగా వైష్ణవమూ వైశాఖమూ మండలమూ ప్రత్యాలీఢమూ ఆలీఢమూ అనే స్థానాలలో నిలుచుంటూనూ గోమూత్రికము వలె విచిత్రముగా దగ్గరకు పోతూనూ వెనక్కు పోతూనూ పక్కకు పోతూనూ దెబ్బలు తప్పించుకోడానికి సవ్యాపసవ్యముగా తిరుగుతూనూ పారిపోతున్నట్టు పరుగెత్తి ఎదురుగుండా వచ్చి కొంచెము దూరములో నిర్భయముగా నిలుచుంటూనూ పరాఙ్ముఖుడు అయినట్టు వెనకకుపోతూనూ శరీరాన్ని సంకోచించి వంగి ఎదిరిపట్టు తప్పించుకొంటూనూ ఎదిరిని కాలితో తన్నడానికి పయికి ఎగురుతూనూ ఎదిరి తన చెయ్యి పట్టుకోవస్తూఉంటే చెయ్యి ముడుచుకొంటూనూ పోరాడినారు.

అంతలో రావణాసురుడు తన మాయలు చూపించడానికి మొదలుపెట్టినాడు. సుగ్రీవుడు అది కనిపెట్టినాడు. అతడు అప్పటికీ ఏమాత్రమూ అలసిపోలేదు. బలశాలిగానే ఉన్నాడు. అయితే రావణాసురుడి యోచన తెలుసుకొన్నాడు. అతగాణ్ణి మోసము చేయవలెను అనుకొన్నాడు. ఇట్టె ఆకాశానికి ఎగిరినాడు. అప్పుడు రావణాసురుడు తెల్లబోయి అక్కడనే నిలుచున్నాడు.

' రావణాసురుడు అలసి సొలసి పోయేటంత వరకూ సుగ్రీవుడు పోరాడినాడు. ఆ సూర్యపుత్రుడు సుగ్రీవుడు అంతట అతి విశాలము అయిన ఆకాశాన్ని లంఘించి వానర వీరులమధ్యను ఉన్న రాముడి పార్శ్వానికి చేరవలెను అనుకొన్నాడు. రాముడికి యుద్ధోత్సాహము కలగచేయడానికి అంతట సుగ్రీవుడు వాయువేగముతో సంతోషముగా వానరసేనా సమూహములోకి వచ్చి వాలినాడు.

## ౪౧

రామలక్ష్మణులు గాయాలతో వచ్చిన సుగ్రీవుణ్ణి చూచినారు. ఆ వానర రాజును రాముడు కౌగలించుకొని "మిత్రుడా, నీవు నాతో కూడా ఆలోచించకుండా సాహసము చేసినావు. ఇటువంటి సాహసపు పనులు రాజులు ఎవరూ చేయరు. నీవు వీరుడవు. అయితే సాహసప్రియుడవు. నేనూ ఈ విభీషణుడూ ఈ వానరసైన్యము సందేహముతో బాధపడ్డాము. నీవు ఇటువంటి సాహసము చేసినావు. ఓ సుగ్రీవుడా, ఇప్పుడు చేసినట్టుగా ఇకను ఎప్పుడూ నాతో ఆలోచించకుండా చేయవద్దు.

"ఓ మహాబాహూ! నీవు శత్రువులను వధించగలవు. నాకు తెలుసును కాని నీకు ఏ ఆపద అయినా వచ్చేట్లయితే నాకు సీతతో కానీ భరతుడితో కానీ లక్ష్మణ శత్రుఘ్నులతో కానీ చివరకు నా శరీరముతో కానీ నాకు ఏమి పని. మిత్రుడా, నీవు దేవేంద్రుడు అంతటి పరాక్రమవంతుడవు. వరుణదేవుడు అంతటి సాహసివి, నేను నిన్ను ఎరిగి ఉన్నప్పటికిన్నీ నీవు తిరిగి వచ్చేటంత వరకూ ఏమి ఆపద వస్తుందోను అని భయపడ్డాను.

"ఓ బలవంతుడా, నేను యుద్ధములో ఆ రావణాసురుణ్ణి పుత్రబంధు సైన్య సమేతముగా సంహారము చేసివేసి లంకా పట్టణములో విభీషణుడికి రాజ్యాభిషేకము చేసి అయోధ్యానగరానికి పోయి భరతుడికి రాజ్యము ఒప్పగించి దేహము చాలించవలెను అనుకొంటున్నాను" అని చెప్పినాడు.

ఇట్లా రాముడు చెప్పిన మాటలు విని సుగ్రీవుడు "రామా, నీవు మహా వీరుడవు. నీకు నేను ఏమి అని చెప్పేది. నీ భార్యను ఎత్తుకొని పోయిన రాక్షసుణ్ణి చూచినాను. నేను సహించలేకపోయినాను. నేను పౌరుషము కలవాణ్ణి. నిలువలేకపోయినాను. అయితే, వాణ్ణి నీవే వధించవలెను కాబట్టి నేను వాణ్ణి చంపివేయకుండా తిరిగి వచ్చినాను" అని చెప్పినాడు.

రాముడు ఆ వీరుణ్ణి సుగ్రీవుణ్ణి కౌగలించుకొని అభినందించినాడు. అంతట లక్ష్మణుణ్ణి చూచి "లక్ష్మణా, చల్లని జలాలతోనూ రుచ్యము అయిన ఫలాలతోనూ ఉన్న ఈ వనములోనే ఈ సేనాసమూహాలను చక్కగా విభజించి వ్యూహాలు ఏర్పాటు చేసి యుద్ధ సన్నద్ధము చేయవలెను. లోకక్షయకరమూ భయంకరమూ అయ్యే ఋక్షవానర రాక్షసవధ జరుగుతుంది అని నాకు తోస్తున్నది. భయనిమిత్తాలు కనపడుతున్నవి. చూడు, గాలి దేహాన్ని పెట్ల కొట్టుతున్నది భూమి కదులుతూ ఉంది పర్వత శిఖరాలు వణుకుతూ ఉన్నవి. చెట్లు విరిగి పడిపోతున్నవి. మేఘాలు క్రూరము అయిన పక్షుల వలె భయంకరముగా గర్జిస్తున్నవి. రక్తబిందువులతో మహాభయంకరముగా వాన కురుస్తున్నది. రక్తచందన కాంతులతో సంధ్య పరమ దారుణముగా కనపడుతున్నది. సూర్యమండలము నుంచి అగ్నికణాలు రాలి పడుతున్నవి. భయంకరము అయిన మృగపక్షిసమూహాలు అమంగళముగా సూర్యుడికి ఎదురుగుండా నిలుచుని ఏడుస్తున్నవి. మహాభయము పుట్టేటట్టు అరుస్తున్నవి. ప్రళయకాలములో వలె చంద్రుడు కాంతిహీనుడు అయిపోయి నలుపూ ఎరుపూ కిరణాలతో రాత్రిపూట దేహతాపము ఎత్తిస్తున్నాడు. అంతే కాదు. చంద్రుడి గాలిగుడి కురచ అయిపోయింది. రక్తవర్ణముతో భయంకరముగా కనపడుతున్నది. పగలు సూర్యమండలములో నల్లటి మచ్చ కనపడింది. నక్షత్రాలు ఎప్పటిమాదిరిగా కనపడడము లేదు. చూడు. కాకులు డేగలతోనూ గద్దలు చిన్న చిన్న పిట్టలతోనూ కలుస్తున్నవి. నక్కలు పెద్ద పెట్టున అమంగళముగా అరుస్తున్నవి. మనము వెంటనే ఇప్పుడే ఈ వానరసైన్యాన్ని వెంటపెట్టుకుని లంకాపట్టణానికి పోదాము. ఆ పట్టణము ఇంతవరకూ ఎవరికీ ఎదిరించ నలవికాకుండా ఉంది. మనము వేగముగా ముట్టడించడము మంచిది" అని చెప్పినాడు.

ఆ మహాబలవంతుడు ఆ పరమపరాక్రమవంతుడు రాముడు ఇట్లా లక్ష్మణుడితో చెప్పి అప్పటికి అప్పుడు ఆ పర్వత శిఖరము మీది నుంచి కిందికి దిగినాడు. దుర్ధర్షము అయిన వానరసైన్యాన్ని చూచినాడు. ఆ కాలజ్ఞుడు ఆ ధర్మజ్ఞుడు రాముడు అంతట సుగ్రీవుడి సాయముతో ఆ వానరసైన్యాన్ని యుద్ధసన్నద్ధము చేసినాడు.

ఆ మహాధానుష్కుడు రాముడు ప్రాతఃకాలాన ఆ అనంత వానరవాహినికి ముందు లంకాపట్టణానికి నడువ సాగినాడు. అప్పుడు ఆ మహానుభావుడి వెంట విభీషణుడూ సుగ్రీవుడూ లక్ష్మణుడూ హనుమంతుడూ జాంబవంతుడూ సుషేణుడూ నడిచినారు. వారి వెనుక భల్లూకవీరులతోనూ వానరవీరులతోనూ ఆ మహావానరవాహిని భూమిని అంతా ఆవరించి నడిచింది. ఏనుగుల వంటి వానరవీరులు పెరిగి పెద్ద పెద్ద చెట్లను చేతులలో పట్టుకొని అడ్డగించ నలవి కాకుండా నడిచినారు. పతాకపంక్తులతోనూ ఎంతో ఎత్తు అయిన ప్రాకారముతోనూ బహిర్ద్వారాలతోనూ దేవతలకు అయినా చొర నలవి కాకుండా ఉన్న లంకాపట్టణము దగ్గరకు పోయినారు.

ఆ లంకాపట్టణోత్తరద్వారము పర్వతశిఖరము అంత ఎత్తున ఉంది. ఆ ద్వారాన్ని రావణాసురుడు కాస్తున్నాడు. భయంకరాకారులూ వివిధాయుధధారులూ అయిన రాక్షసులు అక్కడ అంతటా యుద్ధసన్నద్ధులుగా ఉన్నారు. అది వరుణదేవుడు పరిపాలించే భయంకరము అయిన మహాసముద్రము వలెనూ దానవులు కాపాడే పాతాళలోకము వలెనూ కనిపించింది. ఆ ద్వారాన్ని సామాన్యులు చూస్తే దద్దిరిల్లి పోతారు. ఆ ఉత్తరద్వారాన్ని కొట్టే సామర్థ్యము రాముడికి తప్ప మరి ఎవరికీ లేదు. ఆ ఉత్తరద్వారములో ఉన్న రాక్షసయోధుల వివిధాయుధాలనూ వారు తొడుగుకొన్న కవచాలనూ రాముడు చూచినాడు.

వానరసేనానాయకుడూ పరమపరాక్రమవంతుడూ అయిన నీలుడు మైందద్వివిదులతో తూర్పు ద్వారము దగ్గర నిలచినాడు. మహాబలవంతుడు అంగదుడు ఋషభుడితోనూ గవాక్షుడితోనూ గజుడితోనూ గవయుడితోనూ దక్షిణద్వారము దగ్గర నిలచినాడు. హనుమంతుడు ప్రమాథీ ప్రఘసుడూ మొదలు అయిన వానరవీరులతో పశ్చిమద్వారము దగ్గర నిలచినాడు. ఉత్తర పశ్చిమద్వారాల మధ్యను గరుత్మంతుడితోనూ వాయుదేవుడితోనూ సరి సమానము అయిన వేగముతో పోరాడే వానరయూథపతులతోనూ ముప్ఫయి ఆరు కోట్ల మంది వానరయోధులతోనూ సుగ్రీవుడు నిలచినాడు. అది ఆ సైన్యానికి మధ్య గుల్మము.

అప్పుడు రామాజ్ఞను శిరసావహించి లక్ష్మణుడూ విభీషణుడూ ఒక్కొక్క ద్వారము దగ్గర ఒక్కొక్క కోటి మంది, వానరవీరులను ఉంచినారు. బహుసైన్యముతో జాంబవంతుడు సుగ్రీవుడి సమీపములో నిలచినాడు. ఆ వానరయోధులు అందరూ పెద్దపులుల వలె గోళ్లతోనూ కోరలతోనూ పోరాడు

తారు. ఆ వానరయోధులు అప్పుడు సంతోషముతో పర్వతశిఖరాల వంటి పెద్ద పెద్ద రాళ్లు పట్టుకొని చెట్లు పట్టుకొనీ యుద్ధానికి సంసిద్ధము అయినారు.

ఆ వానరయోధులు అందరూ తమ తమ తోకలు పైకి ఎత్తినారు. కోపముతో నేత్రాలూ ముఖాలూ ఎర్ర చేసినారు. గోళ్లతో చీల్చి వేయడానికీ కోరలతో కొరికి వేయడానికీ సంసిద్ధులు అయినారు. చిత్రవిచిత్రము అయిన దేహాలతోనూ వికృతాననాలతోనూ ఆ వానరులు అందరూ లంకాపట్టణాన్ని ముట్టడించడానికి సంసిద్ధముగా నిలుచున్నారు.

ఆ వానరులలో కొందరు పది ఏనుగుల బలము కలవారు. కొందరు నూరు ఏనుగుల బలము కలవారు. కొందరు వెయ్యి ఏనుగుల బలము కలవారు. కొందరు వానరయూథపతులు ఓఘసంఖ్యాకము అయిన ఏనుగుల బలము కలవారు. కొందరు అంతకు నూరింతలు బలము కలవారు. కొందరు ఇంత అంత అని లెక్క వేయ నలవి కాని బలవంతులు. అప్పుడు అక్కడ ఆ వానరసైన్యము మిడుతల దండు వలె విచిత్రముగా కనిపించింది. అట్లా ఆ లంకా పట్టణము దగ్గర ఉన్న వానరులే కాకుండా ఇంకా వెనక నుంచి ఆకాశమార్గాన ఎగిరి వస్తూ ఉన్న వానరులతోనూ భూమిమీద నడిచి వస్తూ ఉన్న వానరులతోనూ అటు ఆకాశమూ ఇటు భూమీ కనిపించకుండా పోయినవి. అదివరకు నియమించిన వానరయోధులే కాకుండా ఒక్కొక్క ద్వారము దగ్గిర ఒక్కొక్క కోటి మంది భల్లూకవీరులూ ఇంకా ఇతర వానరయోధులూ వచ్చి చేరినారు. ఆయా ద్వారాల దగ్గరనే కాకుండా ఆ లంకాపట్టణము చుట్టూ కోట్లకొద్దీ వానరులు నిలిచినారు. అట్లా వానరసమూహాలు చుట్టూ మూగడము నుంచి ఆ లంకాపట్టణములోకి గాలి చొరపడి వీచలేక పోయింది.

అంత వేగముగా అంత మంది వానరులు మహామేఘాలు కమ్ముకొన్నట్టు ఆ లంకాపట్టణాన్ని ముట్టడించడము చూచి రాక్షసులు విస్మయ పడి పోయినారు. ఆ వానరసేనాసమూహాలు అట్లా వస్తూ ఉంటే సముద్రము చెలియలి కట్టను తెంచుకొని మహాధ్వని చేస్తూ ప్రవహిస్తున్నట్టుగా తోచింది. ఆ మహాధ్వనికి లంకాపట్టణప్రాంతవనాలూ ప్రాకారాలూ బహిర్ద్వారాలూ అవీ ఇవీ ఏమిటి ఆ పట్టణము పట్టణము అంతా చలించి పోయింది. దేవాసురులు అందరూ ఏకము అయినా ఎదిరించ నలవి కాకుండా ఆ వానరసైన్యము రామలక్ష్మణ సుగ్రీవులతో నిలచింది.

లంకాపట్టణాన్ని ముట్టడించడానికీ రాక్షసులను అందరినీ సంహారము చేయడానికీ వానరసైన్యము సంసిద్ధము అయింది. ఆయా కాలానుగుణముగా

సామదృుపాయాలను ప్రయోగించే క్రమము తెలిసిన రాముడు తదనంతర కార్య క్రమాన్ని గురించి మంత్రులతో ఒకటికి పదిసార్లు ఆలోచించినాడు. విభీషణు డితో సంప్రదించినాడు, రాజధర్మముపాటించ వలసిందేను అని నిశ్చయించి అంగదుణ్ణి పిలిచి "నాయనా, అంగదుడా, నీవు ఇప్పుడు నిర్భయముగా అశ్రమ ముగా ఆకాశమార్గాన లంకాపట్టణములో దశగ్రీవుడి దగ్గరకు పోయి రావలెను. నేను చెప్పినట్టు ఈ మాటలు వాడితో నీవు చెప్పవలెను.

"ఓ రాక్షసుడా, నీ ఐశ్వర్యము అయి పోయింది. నీ రాజరికము అంత రించి పోయింది. నీ తెలివి తేటలు అడుగు అంటి పోయినవి. నీవు చావబోతు న్నావు: బ్రహ్మదేవుడు ఇచ్చిన వరము నుంచి నీవు మదము ఎక్కి మహర్షులనూ దేవతలనూ గంధర్వులనూ అప్సరసలనూ నాగులనూ యక్షులనూ వారూ వీరు ఏమిటి—సమస్తము అయిన వారిని హింసించినావు: ఒళ్లు ఎరగకుండా సమస్త పాపకార్యాలూ చేసినావు. నేటితో నీ దర్పము అంతము అయిపోతుంది. వాస్తవము. నేను దండధరుణ్ణి. నిన్ను దండించడానికి వచ్చి నీ లంకాపట్టణ ద్వారము దగ్గర కని పెట్టుకొని ఉన్నాను. నిన్ను చంపివేస్తాను. ఓరాక్షసుడా, నీవు నా చేతిలో చచ్చిపోతావు, కనుక, మహర్షులూ రాజర్షులూ మొదలు అయిన వారు పోయే లోకానికి పోతావు.

"ఓ రాక్షసాధముడా, నీవు నన్ను అవతలకు పోనిచ్చి ఏ బలముతో సీతను అపహరించి తెచ్చుకొన్నావో ఆ బలము అంతా ఇప్పుడు చూపించు; లేదా నీవు ఇప్పుడు మైథిలిని తీసుకొని వచ్చి నాకుఇచ్చి నన్నుశరణము వేడుకో, నీవు ఇట్లా చేయక పోయేట్లయితే నా తీక్ష్ణబాణాలతో నిన్ను చంపి వేస్తాను. ఈలోకము అంతటా అరాక్షసము చేసి వేస్తాను, రాక్షసోత్తముడూ ధర్మా త్ముడూ అయిన విభీషణుడు నాశరణు చొచ్చినాడు. ఇకను ఆ శ్రీమంతుడు అకంటకము అయిన లంకాధిపత్యము వహిస్తాడు, సందేహము లేదు. నీకు ఏమీ తెలియడము లేదు. నీకు మూర్ఖులు సహాయులు అయినారు, నీవు పాపిష్ఠి వాడవు ధర్మహానిచేసిన వాడవు. నీవు ఒక్క క్షణము అయినా రాజుగా ఉండడానికి వీలు లేదు.

"ఓ రాక్షసుడా, ధైర్యము తెచ్చుకో, శౌర్యముతో ప్రవర్తించు, యుద్ధా నికి దిగు, నా బాణాలతో నిన్ను చంపివేస్తాను. నీవు పవిత్రుడవు అయి పోతావు, అట్లా కాకుండా నీవు పక్షివై ముల్లోకాలలో ఎక్కడ నా కంటపడినా బ్రతుకడము ఉత్తది.

"ఓ రాక్షసుడా, నీకు హితము చెప్పుతాను, విను, నీవు ఇకను చూచి పోయేది ఉండదు కనుక ఇప్పుడే లంకాపట్టణము అంతా చక్కగా తిరిగి చూడు నీ ఔర్ధ్వదైహికక్రియలు నీవే చేసుకో, నీకు నేను అవకాశము ఇస్తున్నాను.

ఓ అంగదుడా ఈ నా మాటలు ఎక్కువ తక్కువలు లేకుండా రావణాసురుడితో చెప్పు, వాడు ఏమి చెప్పుతాడో విని రా" అని చెప్పినాడు.

రామాజ్ఞను తలదాల్చి అంగదుడు అప్పటికి అప్పుడు ఆకాశానికి ఎగిరినాడు ఆకారము ధరించిన అగ్నిహోత్రమువలె ఆకాశమార్గాన ఒక్కముహూర్తములో ఆ కాంతిమంతుడు రావణాసురుడి మందిరములోకి పోయినాడు, ఏమరుపాటు లేకుండా మంత్రులతో కూర్చున్న రావణాసురుణ్ణి చూచినాడు, అంతట ఆకన కాంగదుడు అంగదుడు రావణాసురుడి సమీపానికి నేల మీదికి పోయి భగభగ మంటలు మండుతున్న అగ్నిహోత్రమువలె నిలుచున్నాడు. అట్లా మంత్రులతో కూర్చుని ఉన్న రావణాసురుడితో తనను గురించి తానే చెప్పుకొని రాముడు చెప్పి పంపించిన మాటలు ఎక్కువ తక్కువలు లేకుండా చెప్పతలచుకొని "ఓ రాక్షసరాజా, కోసలదేశాధిపతి రామప్రభువు నన్ను పంపించినాడు, నేను ఆయన దూతగా వచ్చినాను నా పేరు అంగదుడు, నేను వాలి పుత్రుడను, నీవు నా పేరు వినే ఉంటావు, రఘువంశలలాముడు రాముడు నిన్ను ఉద్దేశించి ఈ విధముగా చెప్పినాడు.

"ఓ క్రూరుడా, నీకు పౌరుషముఉంటే ఇప్పుడు బయటకి వచ్చి నాతో పోరాడు. నిన్నూ నీ పుత్రులనూ ని జ్ఞాతులనూ నీ బంధువులనూ చంపివేయుడానికి వచ్చినాను. ముల్లోకాలలోనూ ని భయములేకుండా చేసివేస్తాను. నీవు దేవతలకూ దానవులకూ కంటకుడవు అయి పోయినావు. నేను నిన్ను ఇప్పుడు వధించి వేస్తాను, నీవు బ్రతుక తలచుకొన్నట్లయితే ఇప్పుడు నీవు నా పాదాలు పట్టుకొని సమస్కారము చేసి నన్ను సత్కరించి వైదేహిని నాకు ఇవ్వవలెను. అట్లా చేయక పోయేట్లయితే నిన్ను చంపివేస్తాను. నీ రాజ్యము విభీషణుడికి ఒప్పగిస్తాను."ఈవిధముగా రామప్రభువు చెప్పుమన్నారు"అని పూర్తిచేసినాడు.

ఇంత పరుషముగా అంగదుడు చెప్పుతూ ఉంటే రావణాసురుడు రోషతామ్రాక్షుడు అయి మంత్రులను చూచి "ఈ బుద్ధిహీనుణ్ణి పట్టుకోండి. చంపివేయండి అని పదే పదే అరిచినాడు.

రావణాసురుడు అట్లా అనే అనడముతో జ్వలిస్తూ ఉన్న అగ్నిహోత్రము వంటి భయంకరాకారులు నల్గురు రాక్షసులు అంగదుణ్ణి పట్టుకో వచ్చినారు. అప్పుడు అక్కడ ఉన్న రాక్షసులకు అందరికీ తన బలమూ సామ

ర్థ్యమూ చూపించడానికి ఆ ధైర్యవంతుడు ఆ పరమ పరాక్రమవంతుడు అంగదుడు ఆ రాక్షసులకు నలుగురికీ పట్టుపడి పోయినాడు. అట్లా తన రెండు బాహువులనూ పట్టుకొన్న నల్గురు రాక్షసులనూ పక్షులవలె తన బాహుద్వయములో ఇరికించుకొని పర్వతము అంత ఎత్తున ఉన్న ఆ ప్రాసాద శిఖరము మీదికి అంగదుడు ఎగిరిపోయినాడు.

రాక్షసేశ్వరుడు రావణాసురుడూ తక్కిన రాక్షసులూ చూస్తూఉండగా అమిత వేగముతో అంతరిక్షమునుంచి నేలమీదికి ఆ నల్గురు రాక్షసులను అంగదుడు విసరివేసినాడు. అంతట ఆ ప్రతాపవంతుడు అంగదుడు ఆ ప్రాసాదశిఖరముమీదికి పోయినాడు. దేవేంద్రుడు హిమవత్పర్వత శిఖరాన్ని వలె అంగదుడు తన పాదఘాతముతో ఆ ప్రాసాదశిఖరాన్ని పగులకొట్టడము మొదలు పెట్టినాడు. తన పేరు రాక్షసులకు అందరికీ తెలియడానికోసము ప్రాసాద శిఖరాన్ని పగులకొట్టుతూ సింహనాదము చేసి ఆకాశానికి ఎగిరిపోయినాడు.

అట్లా రాక్షసులను అందరినీ వ్యథ పెట్టి, వానరులను సంతోష పెట్టడానికి అంగదుడు వానరసైన్యము మధ్యను ఉన్న రాముడి పార్శ్వానికి పోయి నిలుచున్నాడు.

రావణాసురుడు తన ప్రాసాదాన్ని అంగదుడు పగులకొట్టినందుకు పరమ కుపితుడు అయిపోయినాడు. తనకు వచ్చిన కీడునుగురించి ఆలోచించుకొంటూ నిట్టూర్పులు విడిచినాడు.

రాముడు తనవెంటఉన్న వానరవీరులు అందరూ సంతోషాతిశయముతో సింహనాదాలు చేస్తూఉంటే యుద్ధసన్నద్ధుడు అయినాడు.

మహా పరాక్రమశాలీ పర్వతాకారుడూ దుర్ధర్షుడూ అయిన సుషేణుడు సుగ్రీవాజ్ఞను శిరసావహించి వానరవీరులను అందరినీ వెంటపెట్టుకొని నక్షత్రాలలో చంద్రుడివలె లంకాపట్టణానికి ఉన్న నాల్గుద్వారాలూ తిరిగి చూచినాడు.

రాక్షసులు అందరూ లంకాపట్టణము చుట్టూ సముద్రాన్ని మించి నిలిచిన వానరాక్షౌహిణీశతాలను చూచి ఆశ్చర్యచకితులు అయినారు. కొందరు భయపడి పోయినారు. కొందరు యుద్ధోత్సాహముతో సంతోషపడ్డారు. ప్రాకారపరిఖల మధ్యప్రదేశము అంతటా వ్యాపించి వానరులు వానరమయప్రాకారముగా కనపడుతూఉంటే రాక్షసులు అందరూ చూచినారు. దీనులు అయిపోయినారు. భయముతో ఒండ్లువరగకుండాపోయి హాహాకారాలు చేసినారు.

ఆ రాక్షసరాజధానీ నగరములో రాక్షసయోధులు మహాయుధాలు ధరించి మహాభయంకరము అయిన కోలాహలధ్వనులతో ప్రళయ కాలవాయువులవలె అప్పుడు సంచరించినారు.

## ౪౨

అంతట రాక్షసయోధులు రాజమందిరములోకి పోయి తమ ఏలికను రావణాసురుణ్ణి చూచి రాముడు వానరసైన్యాలతో వచ్చి లంకాపట్టణాన్ని ముట్టడించినాడు అని చెప్పినారు. ఆ మాట వినీ వినడముతో ఆ నిశాచర రాజుకు కోపము వచ్చింది. తత్క్షణమే నగరరక్షణపు ఏర్పాట్లను అదివరకటికన్నా రెట్టింపు చేయించినాడు. అంతట తన ప్రాసాదము మీదికి పోయినాడు.

రాముడు వానరసైన్యాలతో కూడా లంకాపట్టణ ప్రాకారాన్ని అంతా తిరిగి చూచినాడు. రాక్షసులు ఆ నగరాన్ని ఎట్లా కాపాడుతూ ఉందీ గమనించినాడు. ఎదిరించ నలవి కాకుండానూ ధ్వజాలతోనూ పతాకాలతోనూ శోభాయమానముగానూ ఉన్న ఆ లంకాపట్టణాన్ని చూస్తూ ఉండగా ఆ మహానుభావుడి మనస్సు సీతాదేవి మీదికి పోయింది. తన కోసము ఆ మృగశాబాక్షి ఆ జనకరాజతనయ సీతాదేవి నిద్రాహారాలు లేకుండా కృశించిపోయి కటిక నేలమీద పడుకొంటూ దుఃఖపడుతూ ఉంటుంది అనీ ఆమెను రాక్షసులు బాధపెట్టుతూ ఉంటారు అనీ విచారపడి పోయినాడు. ఆ వైదేహిని గురించి ఆ ధర్మాత్ముడు కొంచెము సేపు ఆలోచించినాడు. అంతట లంకాపట్టణాన్ని ముట్టడించవలసింది అని వానరసైన్యాలను ఆజ్ఞాపించినాడు.

రాముడు ఏ పనిని అయినా నిరాటంకముగా చేసివేస్తాడు. అటువంటి ఆ రాముడు ఆజ్ఞాపించగానే వానరసేనాసమూహాలు మేము అంటే మేము అని పోటీ పడి సింహనాదాలు చేసినవి. కొనలు తేలిన పెద్ద పెద్ద రాళ్లతోనూ పెద్ద పెద్ద చెట్లతోనూ పిడికిట గుద్దులతోనూ ఆ లంకాపట్టణాన్ని పిండి పిండి చేయవచ్చును అని వానరసేనానాయకులు అనుకొన్నారు. అంతట వానర వీరులు కొనలు తేలిన పెద్ద పెద్ద రాళ్లనూ పెద్ద పెద్ద చెట్లనూ ఇంకా పెద్ద పెద్ద బండలనూ పెళ్లగించి తెచ్చి యుద్ధసన్నద్ధులు అయి నిలుచున్నారు.

రావణాసురుడు అప్పుడు తన ప్రాసాదముమీదికి పోయినాడు. ఆ లంకాద్వీప పర్వతాలమీదనూ వనాలలోనూ ఉద్యానవనాలలోనూ లెక్క వేయ నలవి కాకుండా ఉన్న వానరసేనాసమూహాలను చూచినాడు. అట్లా భూమిని అంతా

కబళించి వేసిన ఆ వానరవాహినీ సమూహాలను అన్నిటినీ నాశనము చేసివేయడము ఎట్లాగా అని చాలా సేపు ఆలోచించినాడు. ధైర్యము తెచ్చుకొన్నాడు. తన విశాల నేత్రాలు తెరిచి తేరిపార చూచినాడు.

ఆ రావణాసురుడు అట్లా చూస్తూ ఉండగానే వానరసైన్యాలు భాగాలు భాగాలుగా ఏర్పడి తన పట్టణప్రాకారము మీదికి ఎక్కడము మొదలు పెట్టినవి. వానరయోధులు బంగారు వన్నె దేహాలతోనూ ఎఱ్ఱటి ముఖాలతోనూ ధగధగలాడుతూ మద్దిచెట్లనూ తాటిచెట్లనూ పెద్ద పెద్ద రాళ్ళనూ చేతులలో తీసుకొని రామకార్యార్థము తమ ప్రాణాలను అయినా లెక్క చేయకుండా లంకా పట్టణప్రాకారాగ్రభాగాలనూ బహిర్ద్వారాలనూ పగుల కొట్టడము ఆరంభించినారు. ఉద్యానవనాలను ధ్వంసముచేసి వేసినారు. స్వచ్ఛజలాలు ఉన్న అగడ్తలో రాళ్ళూ కఱ్ఱలూ గడ్డీ వేసి మన్ను పోసి పూడ్చి వేసినారు. అంతట వేల కొద్దీ లక్షల కొద్దీ కోట్ల కొద్దీ వానరసైనికులను వెంట పెట్టుకొని వానరయూథపతులు ప్రాకారము మీదికి ఎక్కినారు.

పెద్ద పెద్ద ఏనుగులవంటి ఆ వానరవీరులు ప్రాకారానికి అమర్చినబంగారు బహిర్ద్వారాలు పగులకొట్టుతూనూ కైలాసపర్వత శిఖరమువంటి ఆ బహిర్ద్వార గోపురాలను పడకొట్టుతూనూ ఎగిరి గంతులు వేసి పెద్ద పెద్ద కేకలు పెట్టినారు. అప్పుడు వెనక నుంచి వానరసేనాసమూహాలు ఆ లంకాపట్టణప్రాకారము మీదికి పరుగెత్తుకొని వచ్చినవి. అతి బలవంతుడికి రాముడికి జయము! మహాబలవంతుడికి లక్ష్మణుడికి జయము! సుగ్రీవరాజుకు జయము అంటూ జయజయలు పలుకుతూ సింహనాదాలు చేస్తూ ఆ కామరూపులు వానరవీరులు ఆ లంకాపట్టణప్రాకారాన్ని పడ కొట్టినారు. ప్రసిద్ధవానర సేనానాయకులు అయిన వీరబాహువూ సుబాహువూ నలుడూ ఆ ప్రాకారాన్ని పడకొట్టించి ఆ వానరసైన్యాలు అక్కడ విడిదిచేసే ఏర్పాట్లు చేయ సాగినారు.

అప్పుడు కుముదుడు జయోత్సాహముతో తేజరిల్లుతూ ఉన్న పదికోట్ల మంది వానరసైనికులను వెంటపెట్టుకొనిపోయి ఆ లంకాపట్టణ తూర్పు ద్వారాన్ని కమ్ముకొన్నాడు. ఆ కుముదుడికి తోడ్పడడానికి అనేకమంది వానరవీరులతో ప్రఘసుడూ పనసుడూ నిలచినారు. వీరుడూ బలవంతుడూ అయిన శతవలి ఇరవైకోట్ల మంది వానరులను వెంటపెట్టుకొని పోయి దక్షిణ ద్వారాన్ని కమ్ముకొన్నాడు. మహాబలవంతుడూ తార తండ్రీ అయిన సుషేణుడు అరవైకోట్ల మంది వానరవీరులతో పోయి పశ్చిమద్వారాన్ని కమ్ముకొన్నాడు.

రామలక్ష్మణులు సుగ్రీవుడితో కూడా అలంకాపట్టణ ఉత్తరద్వారాన్ని కమ్ముకొన్నారు. భయంకరుడూ మహాకాయుడూ అమిత వీర్యవంతుడూ గోలాంగూలుడూ అయిన గవాక్షుడు ఒక కోటమంది వానరవీరులతోనూ మహా వీర్యవంతుడూ శత్రుధ్వంసకుడూ అయిన ధూమ్రుడు భీమవేగులు అయిన ఒక కోటిమంది భల్లూకవీరులతోనూ గద చేతిలో పట్టుకొని మహా వీర్యవంతుడూ మహా బలవంతుడూ అయిన విభీషణుడు యుద్ధసన్నద్ధులు అయిన తన నలుగురు మంత్రులతోనూ రాముడి పక్కను నిలచినారు.

గజుడూ గవాక్షుడూ (వానరుడు) గవయుడూ శరభుడూ గంధమాదనుడూ అన్ని వైపులా తిరుగుతూ వానరసైన్యాన్ని కాపాడుతూ ఉన్నారు.

రావణాసురుడు ఆ వానరసేనా సన్నివేశాన్ని చూచినాడు. కోపపరీతుడు అయిపోయినాడు. తన సర్వసైన్యాలనూ వెలుపలికి పొమ్మని ఆజ్ఞాపించినాడు. అంతట రాక్షసయోధులు భయంకరముగా సింహనాదాలు చేస్తూ చంద్రబింబము వలె తెల్లటి ముఖాలు ఉన్న భేరీలను బంగారు దండాలతో భయంకరముగా అంతటా వినిపించేటట్టు మ్రోగించినారు. భయంకరాకారులు అయిన ఆ రాక్షసులు వందల కొద్దీ వేల కొద్దీ శంఖాలు పూరించినారు. నిగ నిగలాడే ఆ నీలాంగులు నిశాచరులు అప్పుడు అట్లా భేరీలు మోగిస్తూ శంఖాలు పూరిస్తూ ఉంటే మెరుపులు మెరుస్తూ కొంగల పంక్తులు కనపడుతూ ఉరుములు ఉరిమే నీలమేఘాల వలె కనిపించినారు. రావణాసురుడు ఆజ్ఞాపించిన ఆరాక్షస సైన్యాలు అప్పుడు పర్వసమయములో సముద్రప్రవాహాలు పొంగి పొర్లి ప్రవహించేట్టుగా బయలు దేరినవి.

అప్పుడు వానరయోధులు అందరూ ఆ త్రికూట పర్వత శిఖరాలలోనూ చరియలలోనూ గుహలలోనూ ఆ లంకాద్వీపము అంతటానూ మారుమోగి పోయేట్టుగా సింహనాదాలు చేసినారు. వానరుల సింహనాదాలతోనూ రాక్షసుల సింహనాదాలతోనూ ఇంకా ఆ రాక్షసుల శంఖదుందుభుల ఘోషతోనూ ఏనుగుల ఘీంకారాలతోనూ గుర్రాల సకిలింతలతోనూ రథచక్రాల చప్పుళ్లతోనూ భూమ్యాకాశాలు బద్దలు అయిపోతున్నట్టుగా తోచింది. అదివరకటి దేవాసుర యుద్ధమువలె అప్పుడు వానరులకూ రాక్షసులకూ ఘోర సంగ్రామము ఆరంభమూ అయింది.

భయంకరాకారులు అయిన రాక్షసులు తమ తమ ప్రతాపము చెప్పుకుంటూ ధగ ధగలాడే గదలతోనూ తళ తళలాడే శూలాలతోనూ శస్త్రాయుధాల తోనూ గండ్రగొడ్డళ్లలోనూ వానరులను కొట్టినారు. మహాకాయులు అయిన

వానరయోధులు పెద్ద పెద్ద చెట్లతోనూ పెద్ద కొనలు తేలిన పెద్ద పెద్ద రాళ్ళతోనూ రాక్షసులను కొట్టినారు. అంతటితో ఆగకుండా ఆ వానరులు రాక్షసుల మీదికి పరుగెత్తుకొని పోయి గోళ్ళతో వాండ్లను చీల్చి వేసినారు. కోరలతో కొరికినారు. తమ తమ పేర్లూ తమ పరాక్రమమూ చెప్పుకుంటూ "జయజయ సుగ్రీవరాజా" అని అరిచినారు. ప్రాకారము మీద ఉన్న రాక్షసులు ఇంకా ఇతర రాక్షసులూ భిండివాలాలతోనూ (విడిచివాటు ఇనుప సుదియలతోనూ) ఖడ్గాలతోనూ శూలాలతోనూ నేలమీద ఉన్న వానరులను భేదించినారు. నేల మీద ఉన్న వానరులు అప్పుడు పరమ క్రుద్ధులు అయిపోయి పయికి యెగిరి ప్రాకారము మీద ఉన్న రాక్షస యోధులను పట్టుకొని కింద పడ ద్రోసినారు.

అప్పుడు రాక్షసులకూ వానరులకూ అట్లా దొమ్మిగా జరిగిన ఆ పోరాటములో అక్కడి నేల అంతా నెత్తురుతోనూ మాంసముతోనూ బురద బురద అయిపోయింది.

## ౮౩

ఆ మహాబలవంతులు వానరులు అట్లా పోరాడుతూ ఉంటే రాక్షసులు సహించలేక పోయినారు. వాండ్లకు భయంకరము అయిన కోపము వచ్చింది.

అంతట బంగారు శిరోభూషణాలు అలంకరించిన గుర్రాలతోనూ అగ్నిహోత్రము వలె ధగ ధగలాడే ధ్వజాలతోనూ మధ్యాహ్న సూర్యకాంతులవలె దుర్నిరీక్ష్యము అయిన రథాలతోనూ రమణీయము అయిన కవచాలతోనూ దశదిశలూ మారుమోగి పోయేట్లు మహాధ్వనులు చేస్తూ రావణాసురుడి జయము కాంక్షించే పెద్దపులివంటి రాక్షసోత్తములు బయలుదేరి వచ్చినారు. జయము కాంక్షించి అట్లా బయలుదేరి వచ్చిన ఆ కామరూపులను రాక్షసులను ఆ మహా వానరసైన్యము ఎదిరించింది. అట్లా ఒకండ్లను ఒకండ్లు ఎదిరించడములో రాక్షసులకూ వానరులకూ అప్పుడు ద్వంద్వ యుద్ధము జరిగింది.

మహా తేజోవంతుడు అయిన ఇంద్రజిత్తు అంగదుడితోనూ ప్రజంఘుడు అనే రాక్షసుడు విభీషణుడి మంత్రి అయిన సంపాతితోనూ మిత్రఘ్నుడు అనే రాక్షసుడు విభీషణుడితోనూ తపనుడు అనే రాక్షసుడు గజుడితోనూ నికుంభుడు అనే రాక్షసుడు నీలుడితోనూ ప్రఘసుడు అనే రాక్షసుడు సుగ్రీవుడితోనూ విరూపాక్షుడు అనే రాక్షసుడు లక్ష్మణుడితోనూ యజ్ఞకోపుడూ అగ్నికేతువూ రశ్మికేతువూ అనే రాక్షసులు రాముడితోనూ వజ్రముష్టి అనే రాక్షసుడు మైందుడితోనూ అశనిప్రభుడు అనే రాక్షసుడు ద్వివిదుడితోనూ ప్రతప

నుడు అనే రాక్షసుడు నలుడితోనూ విద్యున్మాలి అనే రాక్షసుడు సుషేణుడితోనూ పోరాటానికి తలపడినారు.

వీరే కాకుండా ఇంకా భయంకరాకారులు అయిన రాక్షసులు అనేక మంది వానరులతో బహువిధాల ద్వంద్వయుద్ధము సాగించినారు. పరస్పర జయేచ్ఛతో రాక్షసులకూ వానరులకూ గొప్ప పోరాటము దొమ్మిగా ఒళ్లు గగుర్పొడిచేట్టుగా జరిగింది. ఆ రాక్షసుల దేహాలనుంచీ వానరుల దేహాల నుంచీ నెత్తురు వెల్లువలు అయి పారుతూ ఉంటే వారి దేహాలమీద వెంట్రుకలు పచ్చిక పడియల వలెనూ వారి శరీరాల ఖండాలు కట్టెల పోగుల వలెనూ కనిపించినవి. శత్రుసైన్యాలను నాశనము చేసివేసే వీరుణ్ణి అంగదుణ్ణి దేవేంద్రుడు వజ్రాయుధముతో వలె ఇంద్రజిత్తు తన గదతో కొట్టినాడు. అప్పుడు ఆ కాంతిమంతుడు అమితవేగముతో ఇంద్రజిత్తు ఎక్కివచ్చిన బంగారు రథాన్ని విరగగొట్టినాడు. గుఱ్ఱాలనూ సారథినీ చంపివేసినాడు. ప్రజంఘుడు సంపాతి మీద మూడు బాణాలు వదిలినాడు. అతడు ఆ బాణాలు తప్పించుకొని ఇనుమద్దిచెట్టుతో కొట్టి ప్రజంఘుణ్ణి చంపివేసినాడు. మహాబలవంతుడు జంబుమాలి రథముమీద వచ్చి పరమకుపితుడు అయి రథశక్తితో హనుమంతుడి వక్షఃస్థలాన కొట్టినాడు. అప్పుడు ఆ మారుతాత్మజుడు హనుమంతుడు అమితవేగముతో ఆ రథము ఎక్కి ఆ జంబుమాలిని అరచేతులతో చరచినాడు. భయంకరాకారుడు అయిన ప్రతపనుడు గర్జిస్తూ నలుడిమీదికి వస్తూ ఉంటే ఆ నలుడు అమితవేగముతో ఎదురుగుండా పోయి ఆ ప్రతపనుడి రెండు కన్నులూ ఊడపెరికినాడు. తీక్ష్ణబాణాలు వదులుతూ అందరినీ మింగివేసేటట్టు నోరు తెరుచుకొని వస్తూ ఉన్న ప్రఘసుణ్ణి సుగ్రీవుడు సప్తపర్ణవృక్షముతో కొట్టి చంపివేసినాడు. అగ్నికేతువూ రశ్మికేతువూ సుప్తఘ్నుడూ యజ్ఞకోపుడూ అనే నల్గురు రాక్షసులూ రాముడిమీద బాణాలు వదిలినారు. రాముడు అగ్నిశిఖల వంటి బాణాలను వదిలి ఆ నల్గురు రాక్షసుల శిరస్సులూ తెగవేసినాడు. మైందుడి పిడికిలిపోటుకు వజ్రముష్టి అనే రాక్షసుడు చచ్చిపోయినాడు. ఆ వజ్రముష్టి గుఱ్ఱాలూ రథమూ మైందుడి పిడికిలిపోట్లకు కోటబురుజుల వలె నేలకూలినవి. సూర్యుడు నీలమేఘాల మీద తన కిరణాలు ప్రసరించేట్టు నికుంభుడు నల్లటి కాటుక కొండవంటి నీలుడిమీద తీక్ష్ణబాణాలను వదిలినాడు. అట్లా అమితవేగముతో నూరు బాణాలు వదిలి నవ్వుతూ ఉన్న నికుంభుణ్ణి చూచి నీలుడు విష్ణుదేవుడివలె విక్రమించి ఆ నికుంభుడి శిరము తెగవేసి వాడి రథచక్రముతో సారథిని ఛేదించి వేసినాడు. వజ్రదేహుడు ద్వివిదుడు అశనిప్రభుణ్ణి రాక్షసులు అందరూ చూస్తూ ఉండగా కొనలు తేలిన పెద్ద పెద్ద రాళ్ళతో కొట్టినాడు. అట్లా రాళ్ళతో తనను కొట్టుతూ ఉన్న ఆ ద్వివి

దుడిమీద అశనిప్రభుడు పిడుగులవంటి బాణాలు వదిలినాడు. ఆ బాణాలకు దేహము అంతటా గాయాలు అయి ద్వివిదుడికి అత్యుత్కటము అయిన కోపము వచ్చింది. అంతట ఆ ద్వివిదుడు మద్దిచెట్టుతో అశనిప్రభుణ్ణి కొట్టి చంపివేసినాడు. అతడి రథాన్ని విరగ కొట్టినాడు. గుర్రాలను చంపివేసినాడు. రథముమీద ఉన్న విద్యున్మాలి బంగారు ములుకులు వేసిన బాణాలు సుషేణుడిమీద వదిలి పదే పదే అరిచినాడు. అంతట ఆ వానరోత్తముడు సుషేణుడు రాతితో విద్యున్మాలి రథాన్ని పడకొట్టినాడు. విద్యున్మాలి ఆ రథముమీది నుంచి ఇట్టే కిందికి దిగి చేతులో గద తీసుకొని సుషేణుడి మీదికి పరుగెత్తినాడు. అప్పుడు ఆ వానర పుంగవుడు సుషేణుడు అది చూచి క్రోధావేశపరవశుడు అయి పెద్ద రాయి తీసుకొని విద్యున్మాలి మీదికి పోయినాడు. అట్లా పెద్ద రాయి తీసుకొని తన మీదికి వస్తూ ఉన్న సుషేణుణ్ణి చూచి విద్యున్మాలి తన గదతో ఆ వానరుడి వక్షఃస్థలముమీద కొట్టినాడు. ఘోరము అయిన ఆ గదాప్రహారాన్ని లెక్క చేయకుండా ఆ వానరోత్తముడు సుషేణుడు తన చేతిలో ఉన్న రాయిని విద్యున్మాలి వక్షఃస్థలముమీద విసరి వేసినాడు. ఆ రాతి దెబ్బకు విద్యున్మాలి గుండె చితికిపోయింది. ప్రాణము పోయి నేల కూలినాడు.

ఈ విధముగా ఆ ద్వంద్వయుద్ధములో వానరవీరులు రాక్షసవీరులను కొట్టి చంపివేసినారు. విరిగిపోయిన ఖడ్గాలతోనూ గదలతోనూ శక్త్యాయుధాలతోనూ తోమరాయుధాలతోనూ ముక్కలు చెక్కలు అయిపోయిన రథాలతోనూ నుగ్గు నుగ్గు అయిపోయిన ఆ రథచక్రాలతోనూ ఆ చక్రాల కళ్ళతోనూ కాండ్లతోనూ తెగి పడిపోయిన గుర్రాలతోనూ చచ్చి పడిపోయిన ఏనుగులతోనూ హతులు అయి పడిపోయిన వానరయోధులతోనూ రాక్షస వీరులతోనూ ఆ శవాలను తినడానికి వచ్చిన ఘోరము అయిన నక్కలతోనూ ఆ యుద్ధభూమి భయంకరముగా కనిపించింది. దొమ్మిగా జరిగిన ఆ యుద్ధములో రాక్షసవీరుల మొండెములూ వానరయోధుల మొండెములూ చెల్లాచెదరుగా అన్ని దిక్కులా పడిపోయినవి.

అప్పుడు వానరవీరులు రాక్షసయోధులను అట్లా చీల్చి వేస్తూ ఉంటే నెత్తురు కమ్ముకొన్న దేహాలతో రాక్షసవీరులు సూర్యాస్తమయాన్ని కాంక్షిస్తూ మళ్లీ యుద్ధము చేయడానికి సన్నద్ధులు అయినారు.

## ౭౭

వానరులూ రాక్షసులూ అట్లా యుద్ధము చేస్తూ ఉండగానే ప్రాణాలు తీసివేసే రాత్రి వచ్చింది. అప్పుడు బద్ధవైరముతో పరస్పరజయేచ్ఛతో వానరులకూ రాక్షసులకూ ఘోరయుద్ధము జరిగింది.

భయంకరము అయిన చీకటిలో "నీవు రాక్షసుడవా" "నీవు వానరుడవా" అని కేకలు వేస్తూ అరుస్తూ అన్యోన్యమూ కొట్టుకొన్నారు. ఆ చిమ్మచీకటిలో "చంపు" "చీల్చు" "ఎట్లా పారిపోతావు" అనే కేకలు గోలగా వినిపించినవి. బంగారు కవచాలు తొడుగుకొన్న రాక్షసయోధులు ఆ చిమ్మచీకటిలో ఓషధులతో జ్వలించే పర్వతాలవలె కనిపించినారు. అపారము అయిన ఆ గాఢాంధకారములో రాక్షసులు క్రోధపరవశులు అయిపోయి అమితవేగముగా వానరులను పట్టుకొని తింటూ తిరిగినారు. అప్పుడు వానరవీరులు మహాకోపముతో ఆకాశానికి ఎగిరినారు. బంగారు శిరోభూషణాలతో అలంకరించిన గుర్రాలను కోరలతో గోళ్లతో చీల్చి వేసినారు. అగ్నిజ్వాలలవంటి ధ్వజాలను విరగకొట్టినారు. అట్లా ఆ వానరవీరులు రాక్షసబలాన్ని క్షోభపెట్టుతూ కోపావేశముతో ఏనుగులనూ ఏనుగు ఎక్కిన వారినీ కొరికివేసినారు. రథాలమీది ధ్వజాలనూ పతాకాలనూ పడలాగినారు. అప్పుడు కనిపించిన రాక్షసులనూ కనపడని రాక్షసులనూ రామలక్ష్మణులు విషసర్పాలవంటి బాణాలను వదిలి చంపివేసినారు. గుర్రాల గిట్టల తాకిడికిన్నీ రథచక్రాల తాకిడికిన్నీ రేగిన దుమ్మునుంచి కన్నులకు ఏమీ కనిపించకుండా పోయింది. వాటి చప్పుళ్లనుంచి చెవులకు ఏమీ వినిపించకుండా పోయింది. అట్లా ఒళ్లు గగురు పొడిచేట్టుగా మహాభయంకరముగా ఆ రాత్రి యుద్ధము జరిగింది. ఆ యుద్ధభూమిలో రక్తము ఏరులుఅయి ఘోరముగా ప్రవహించింది.

అప్పుడు శంఖవేణుస్వనాలతో కలసిన భేరీమృదంగధ్వనులూ పణవాల మోతలూ అద్భుతముగానూ రాక్షసులూ వానరులూ కొట్టుకొంటూ అరిచిన అరుపులూ దెబ్బలు తిన్నవాండ్ల మూలుగులూ పరమదారుణముగానూ వినిపించినవి. ఆ పోరాటములో రాక్షసులు వానరులను చంపివేయడానికి శక్త్యాయుధాలనూ శూలాయుధాలనూ గండ్రగొడ్డళ్లనూ ఉపయోగించినారు. ఆ కామరూపులను రాక్షసులను చంపివేయడానికి వానరులు పెద్ద పెద్ద రాళ్లనూ చెట్లనూ వాడినారు. ఆ ఆయుధాలు అన్నీ ఆ యుద్ధభూమిలో పడిపోయి ఆ భూమిని పూజించిన పూలవలె కనిపించినవి. రక్తము స్రవించి ఆ యుద్ధభూమి అంతా బురద బురద అయినందువల్ల లోపలికి పోవలవి కాకుండానూ ఎవరు చచ్చిపోయిందీ తెలుసుకో వలవి కాకుండానూ అయిపోయింది. వానరుల ప్రాణాలూ రాక్షసుల ప్రాణాలూ ఘోరముగా పోతున్న ఆ రాత్రి సమస్తప్రాణికోటికీ కాళరాత్రివలె ఎంతసేపటికీ తెల్లవారేటట్టు కనిపించలేదు.

అపరము దారుణము అయిన చీకటిలో ఆరుగురు రాక్షసులు బాణవర్షము కురిపిస్తూ రాముడిమీదికి పోయినారు. కుపితులుఅయి అట్లా తనపైకి వస్తూఉన్న

ఆరాక్షసుల గర్జాధ్వనులు ప్రళయకాలములో సప్తసముద్రాలు ఉప్పొంగే టప్పుడు అయ్యేటంత మహాధ్వనిగా రాముడికి వినిపించింది. రెప్పపాటులో ఆ ఆరుగురు రాక్షసులమీదనూ అగ్నిజ్వాలలవంటి ఆరు తీక్ష్ణబాణాలను రాముడు వదిలినాడు. ఆరామబాణాలూ మర్మస్థానాలలో పడ్డందువల్ల ఎదిరించ వలవికాని ఆఆరుగురు రాక్షసులూ మహోదరుడూ మహాపార్శ్వుడూ యమశత్రువూ మహాకాయుడు అయిన వజ్రదంష్ట్రుడూ శుకసారణులూ ఆ యుద్ధరంగములోనుంచి పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు. అప్పుడు ఆ మహాబలవంతుడు రాముడు బంగారు ములుకులతో అగ్నిజ్వాలలవంటి బాణాలు వేసి దిక్కులూ విదిక్కులూ వెలుతురుతో కనిపించేట్టు చేసినాడు. ఆ రామబాణాగ్నికి అప్పుడు అక్కడ ఎట్టఎదట నిలిచిన రాక్షసులు అందరూ అగ్నిహోత్రములో పడ్డ మిడుతలవలె నాశనము అయిపోయినారు. అప్పుడు రాముడు వదిలిన బంగారు ములుకుల బాణాలు వేలకొద్దీవచ్చి అన్నిదిక్కులా పడుతూఉంటే అది మిణుగురు పురుగులతో శరత్కాల రాత్రిమాదిరిగా విచిత్రముగా కనిపించింది. అసలే భయంకరముగాఉన్న ఆరాత్రి వానరుల సింహనాదాలవల్లనూ రాక్షసుల మహాగర్జాధ్వనులవల్లనూ మరింత భయంకరముగా తోచింది. అన్నివైపులా ఆమహాధ్వనులు ఎక్కువ అయిపోయి ఆ త్రికూటపర్వత గుహాలలోనుంచి ప్రతిధ్వనిస్తూ ఉంటే ఆత్రికూటపర్వతము అప్పుడు పెద్దపెట్టున అరుస్తున్నట్టుగా వినిపించింది.

అంధకారమువంటి నల్లటి మహాకాయాలతో గోలాంగూలవీరులు తమ చేతులతో రాక్షసులను పెనవేసి పట్టుకొని భక్షించడము మొదలుపెట్టినారు. అంగదుడు అప్పుడు ఇంద్రజిత్తును వధించడానికి పోయి చటుక్కున వాడి గుర్రాలనూ సారథినీ చంపివేసినాడు. తన గుర్రాలనూ సారథినీ చంపివేసినందువల్ల అప్పుడు అక్కడ ఘోరసంగ్రామము సాగుతూ ఉన్నప్పటికిన్నీ ఆ మహాకాయుడు ఇంద్రజిత్తు ఆ రథాన్ని అక్కడనే వదలిపెట్టి అంతర్ధానము అయిపోయినాడు. ఆ ఇంద్రజిత్తు సారథినీ గుర్రాలనూ చంపివేసినందుకు ఆ పూనీయుణ్ణి అంగదుణ్ణి రామలక్ష్మణులు మెచ్చుకున్నారు. ఇంద్రజిత్తు ప్రభావము సర్వప్రాణికోటికిన్నీ తెలుసును. ఆమహాపరాక్రమశాలి ఇంద్రజిత్తు యుద్ధములో పరాజితుడు అయి పారిపోయినందుకు అందరూ సంతోషించినారు. అందరూ అంగదుణ్ణి స్తోత్రము చేసినారు. అప్పుడు సుగ్రీవుడూ విభీషణుడూ అందరు వానరయోధులూ అంగదుణ్ణి చూచి సంతోషాతిశయముతో "భలే-భలే" అని కేకలు వేసినారు.

ఆ యుద్ధములో భయంకరకర్ముడు అయిన అంగదుడు తనను జయించినందుకు పరమదారుణము అయిన కోపము వచ్చి ఇంద్రజిత్తు అంతర్ధానము అయి

నాడు. అది రాముడు గమనించినాడు. వానరవీరులను అందరినీ చూచి "ఓ వీరు లారా, మీరు అందరూ ఇప్పుడు మీ కపిరాజు వెంట జాగ్రత్తగా ఉండవలెను. వాడు ఆ ఇంద్రజిత్తు బ్రహ్మదేవుడు ఇచ్చిన వరము నుంచి ముల్లోకాల వారినీ ఎంతో బాధిస్తూ ఉన్నాడు. వాడికి ఇప్పుడు కాలము సమీపించుకొని వచ్చింది. అందువల్లనే వాడు మన మీదికి వచ్చినాడు. మనకు కార్యసిద్ధి అవుతుంది. అయితే నా కోసము మీరు అందరూ ఓర్చుకోవలెను. మీ భయము అంతా తీరి పోతుంది. వాడు పాపాత్ముడు, అంతర్ధానము అయి పోయినాడు. యుద్ధములో వాడు కఠినుడు, మన కంటికి కనపడకుండా వాడు ఇప్పుడు మంటలు మండే పిడు గులవంటి బాణాలను మన మీద వదులుతాడు" అని రాముడు చెప్పడము పూర్తి చేయకముందే ఆ ఇంద్రజిత్తు రామలక్ష్మణుల కరచరణాది సమస్తావయవాల మీదనూ నాగపాశాలు అనే భయంకరము అయిన బాణాలను వదలినాడు. వాడు మాయావి, ఆ యుద్ధభూమిలో ఎవరికి కనపడకుండా పోయి ఆ ఇంద్రజిత్తు అప్పుడు కూటయుద్ధానికి దిగినాడు. రామలక్ష్మణులను నాగపాశాలతో బంధించి వేసినా, క్రూరవిషసర్పాలవంటి ఆ బాణాలు అప్పటికి అప్పుడు ఆ వీరులను ఆ పురుషవ్యాఘ్రాలను రామలక్ష్మణులను పాములవలె చుట్టి వేసుకొని కరవడము మొదలు పెట్టినవి. అంతట వారు ఉభయులూ ఒళ్లు తెలియకుండా నేలమీద పడిపోయినారు. అది అంతా వానరులు చూచినారు.

ఎట్ట ఎదట కనపడుతూ ఉంటే రామలక్ష్మణులతో పోరాడే శక్తి ఆ రాక్షస రాజపుత్రుడికి ఇంద్రజిత్తుకు లేకపోయింది. అందువల్లనే అప్పుడు ఆ మాయావి అదృశ్యుడు అయిపోయి ఆ అన్నతమ్ములను రామలక్ష్మణులను నాగ పాశాలతో కట్టివేసినాడు.

## ౭౫.

ఇంద్రజిత్తు ఎక్కడ ఉందీ తెలుసుకో వలసింది అని ఆ మహాపరాక్రమ వంతుడు అతి బలవంతుడు రాముడు పదిమంది వానరయూథపతులను ఆజ్ఞాపించి నాడు. ఆ పరంతపుడి ఆజ్ఞను శిరసావహించి సుషేణుడి ఇద్దరు పుత్రులూ వాలి పుత్రుడు అంగదుడూ వానరపుంగవుడు నీలుడూ బలవంతుడు అయిన శరభుడూ వినతుడూ జాంబవంతుడూ సానుప్రస్థుడూ ఋషభుడూ ఋషభస్కంధుడూ పెద్ద పెద్ద చెట్లను తీసుకొని దశ దిశలా ఇంద్రజిత్తును వెతకడానికి సంతోషముగా ఆకాశానికి ఎగిరినారు.

ఆ వానరవీరులను అందరినీ ఆ ఇంద్రజిత్తు చూచినాడు. అతడు అస్త్ర వేత్త, అమితవేగముతో పోయే బాణాలను పరమాస్త్రమంత్రముతో అభిమం

ప్రయోగించి ఆ వానరవీరుల మీద వదిలినాడు. ఆ బాణాలకు ఛిన్నభిన్నమైన దేహాలు గాయాలు అయినవి. ఆ అంధకారములో ఇంద్రజిత్తు నీలమేఘాల చాటుకు పోయిన సూర్యుడి వలె ఆ వానరవీరులకు కనిపించకుండా దాగుకొన్నాడు.

అంతట ఆ జయశాలి ఇంద్రజిత్తు రామలక్ష్మణుల సమస్తావయవాలనూ భేదించే బాణాలు వదిలినాడు. వాడి కోపము అంతటితో ఆగలేదు. నాగపాశాలను (బాణ రూపములో ఉన్న పాములను) ఆ అన్న తమ్ముల దేహముమీద సందు లేకుండా ఉండేట్టు వదిలినాడు. ఆ బాణాలకు రామ లక్ష్మణులు కట్టుబడి పోయినారు. వారి దేహాలు గాయాలు అయినవి. ఆ గాయాలలో నుంచి అమితముగా రక్తము ప్రవహించింది. అప్పుడు ఆ అన్నతమ్ములు ఉభయులూ పూచిన మోదుగు చెట్లవలె కనిపించినారు.

ఎర్రటి కనుకొనలతో కాటుకరాశివలె కనుపించే ఇంద్రజిత్తు అప్పుడు రామలక్ష్మణులకు కనపడకుండా వారిని ఉద్దేశించి "ఓ సోదరులారా, నేను అంతర్ధానముఅయి పోరాడుతూ ఉంటే దేవేంద్రుడు అయినప్పటికిన్నీ నన్ను కనిపెట్టి పట్టుకోలేడు. ఇక మిమ్ములను గురించి చెప్పేది ఏమిటి. ఓ రామలక్ష్మణులారా, నన్ను కోపము కమ్ముకొన్నది. మిమ్ములను కంకపక్షి రెక్కల బాణాలు కమ్ముకొన్నవి. ఇకను ఇప్పుడే మిమ్ములను యమసదనానికి పంపించి వేస్తాను" అని చెప్పి ఆ ధర్మజ్ఞులను నిశితబాణాలతో నొప్పించి పక్కున నవ్వినాడు. పెద్ద పెట్టున అరిచినాడు. అంతట తన పెద్ద వింటిని తీసుకొని దిక్కులు దద్దరిల్లి పోయేట్టు నారి సారించినాడు. పదే పదే రామలక్ష్మణుల మీద ఘోరముగా బాణాలు వదిలినాడు. ఆయువు పట్టులు తెలిసిన ఆ ఇంద్రజిత్తు అట్లా రామలక్ష్మణుల ఆయువు పట్టులలో నిశితాస్త్రాలు వేస్తూ మాటి మాటికి అరిచినాడు. ఆ పోరాటములో ఆ నిశితాస్త్రాలకు రామలక్ష్మణులు కట్టుపడి పోయినారు. నిమిషములో వారికి కన్నులు కనిపించకుండా పోయినవి.

ఆ మహాధనుర్ధరులు ఆ మహావీరులు ఆ జగతీపతులు రామలక్ష్మణులు ఆ విధముగా బాణపూర్ణ దేహులు అయి పోయినారు. సర్వాంగాలూ గాయాలు అయినవి. ఆయువుపట్టులలో తగిలిన దెబ్బలకు నిలువలేక పోయినారు. వణికి పోయినారు. నేలమీద పడిపోయినారు. ఆ వీరులు ఒంటినిండా గుచ్చుకొన్న బాణాలనుంచి నెత్తురుతో తడిసి పోయి ఆర్తులు అయి పోయి ఆ నేలమీద పడుకొని బాధపడ సాగినారు. వారి దేహాలలో చేతుల వేళ్ళ వరకూ బాణాలు తగలకుండానూ చీలి పోకుండానూ గాయాలు కాకుండానూ ఉన్న ప్రదేశము ఒక అంగుళము అయినా లేదు.

ఆ కామరూపుడు ఆ క్రూరకర్ముడు ఇంద్రజిత్తు వేసిన తీవ్ర బాణాల నుంచి ప్రస్రవణపర్వతమునుంచి జలప్రవాహాల వలె రామలక్ష్మణుల దేహాల నుంచి రక్తము ఏరులు అయి పారింది. పూర్వము దేవేంద్రుణ్ణి జయించిన ఆ ఇంద్రజిత్తు వదిలిన బాణాలు ఆయువు పట్టులలో తగిలి రాముడే ముందుగా నేలమీద పడిపోయినాడు. ఇంద్రజిత్తు నాగపాశాలు అనే బాణాలు వేసి ముందుగా రాముణ్ణి కదలకుండా మెదలకుండా ఉండేటట్లు చేసి వేసినాడు. అంతట బంగారు పింజలతో వాడి అయిన ములుకులతో పై నుంచి కిందికి దూకే బాణాలతోనూ వంకరటెంకరలు లేకుండా సుంద్రముగా ఉండే నారసాలు అనే బాణాలతోనూ గంద్ర గొడ్డళ్లవంటి బాణాలతోనూ చేమోద్పుల వంటి బాణాలతోనూ అర్ధచంద్రాకారపు బాణాలతోనూ రాముణ్ణి ఇంద్రజిత్తు కొట్టినాడు. పిడికిలి పట్టు వదిలిపోయి నారి ఎక్కించని మువ్వంకల బంగారు ధనుస్సు చేతిలో పట్టుకొని రాముడు ఆ యుద్ధభూమిలో నేలమీద పడుకొన్నాడు. అట్లా బాణాలకు కట్టు పడిపోయి దేహము అంతటా గాయాలు అయి నేలమీద బాణతల్పము మధ్యను పడి ఉన్న ఆ పురుషోత్తముణ్ణి ఆ కమల పత్రాక్షుణ్ణి తన అన్నను రాముణ్ణి నేలమీద పడి ఉన్న లక్ష్మణుడు ఎట్లాగో కన్నులు తెరిచి చూచినాడు. బ్రతికడము నిరాశ చేసుకొన్నాడు.

నాగపాశబద్ధులు అయి అట్లా నేలమీద పడిఉన్న ఆ రామలక్ష్మణుల చుట్టూ వాయుసుతుడూ మొదలు అయిన వానరోత్తములు చేరి ఆర్తులు అయి పోయినారు.

## ౪౬

ఇంద్రజిత్తును కనిపెట్టడానికి ఆకాశములోనూ భూమిమీదనూ వెదుకుతూ ఉన్న వానరోత్తములు అప్పుడు బాణాలతో ఒళ్లు అంతా గాయాలు అయి నేలమీదపడిఉన్న రామలక్ష్మణులను చూచినారు.

మేఘము వాన కురిసి వెలిసినట్టు ఇంద్రజిత్తు కావలెను అనుకొన్న పని చేసి విరమించినాడు. అప్పుడు సుగ్రీవుడితో కూడా విభీషణుడు రాముడు పడి ఉన్న చోటికి వచ్చినాడు. హనుమంతుడితో కూడా నీలుడూ మైందుడూ ద్వివిదుడూ సుషేణుడూ కుముదుడూ అంగదుడూ వేగముగాపోయి రామలక్ష్మణులను చూచినారు. వారు అందరూ దిగులుపడి పోయినారు.

అప్పుడు రామలక్ష్మణులు చేష్టలు తప్పిపోయి మందము మందముగా నిట్టూర్పులు విడుస్తూ దేహము అంతటా సందు లేకుండా గుచ్చుకొన్న బాణాల

నుంచి నెత్తురు కారుతూ శరతల్పముమీద స్తబ్ధులు అయి పడిఉన్నారు. కొంచెము సేపటికి పాములవలె నిట్టూర్పులు విడుస్తూ నిశ్చేష్టులు అయిపోయి నారు. వారి విక్రమము మందగించింది. వారి దేహము అంతటా నెత్తురు కమ్ము కొన్నది. వారు అప్పుడు బంగారు ధ్వజాలవలె కనిపించినారు.

ఆ యుద్ధభూమిలో దేహము అంతటా బాణాలు గుచ్చుకొని పడిపోయి చేష్టలు మందగించిన రామలక్ష్మణుల చుట్టూ వానరులు అందరూ మూగినారు. అందరూ కన్నీళ్లు కారుస్తూ ఏడువసాగినారు. ఆ యుద్ధము జరిగేటప్పుడు ఆకాశములోనూ అన్ని దిక్కులానూ వెతికినారు. రాక్షసమాయతో వారికి ఎక్కడనూ ఇంద్రజిత్తు కనిపించలేదు. కనపడి ఉన్నట్లయితే వాణ్ణి ఆ ఇంద్ర జిత్తును ప్రాణాలతో పోనిచ్చి ఉండేవాండ్లు కారు.

అప్పుడు విభీషణుడు మాయతో కనపడకుండా పోయేవాండ్లను కను క్కొనే మాయవిద్యాబలముతో ఆ అప్రతిమకర్మణ్ణి వరదానమువల్ల అంతర్హి తుడు అయ్యే ఆ వీరుణ్ణి ఆ రాక్షసుణ్ణి తన అన్నకొడుకును ఇంద్రజిత్తును చూచి నాడు.

అప్పుడు ఇంద్రజిత్తు తన ప్రభావమువల్ల రామలక్ష్మణులు నేలమీద పడి పోవడము చూచి ఎంతో సంతోషించి తన వెంటఉన్న రాక్షసులతో "ఓ రాక్షసులారా, ఖరుణ్ణీ దూషణుణ్ణి చంపివేసిన అన్న తమ్ములను మహాబలవంతు లను రామలక్ష్మణులను ఇప్పుడు నా బాణాలతో నాశనము చేసి వేసినాను. మహ ర్షులు అందరూ దేవతలు అందరూ వచ్చినప్పటికిన్నీ నాగపాశబంధములనుంచి ఈ రామలక్ష్మణులను విడిపించలేరు. ఈ రాముడిని గురించి నా తండ్రి రావణా సురుడు ఎప్పుడూ ఆలోచిస్తూ దుఃఖముతో బాధపడుతూ ఉన్నాడు. రాత్రి మూడు ఝాములూ శయ్యమీద పడుకోడములేదు.

"ఈ రాముడి భయమునుంచి వర్షాకాలములో నదీజలాలు బురదలు బుర దలు అయిపోయేట్టు మన లంకాపట్టణములో అందరి మనస్సులూ పాడుఅయి పోయినవి. మనము అందరమూ సమూలముగా నాశనము అయిపోయే అనర్థము రాకుండా ఉండడానికి నేను ఈ రాముణ్ణి చంపివేసినాను. ఇప్పుడు రాముడి పరాక్రమమూ లక్ష్మణుడి విక్రమమూ వానరుల అందరి బలమూ శరత్కాల ములో మేఘాలవలె అగుపించకుండా పోయినవి" అని చెప్పి వానరయూథ పతులు అందరిమీదనూ బాణాలు వదిలినాడు.

శత్రుసంహారకుడు ఆ ఇంద్రజిత్తు అప్పుడు నీలుడిమీద ఒక తొమ్మిది బాణాలూ మైందద్వివిదుల మీద మూడు మూడు బాణాలూ జాంబవంతుడిమీద

ఒక్క బాణమూ హనుమంతుడిమీద పదిబాణాలూ గవాక్షుడిమీదనూ శరభుడి మీదనూ రెండేసి బాణాలూ గోలాంగూలుడుఅయిన గవాక్షుడిమీదనూ అంగదుడుమీదనూ అనేక బాణాలూ వదలినాడు. అగ్నిశిఖలవంటి ఆ బాణాలను అట్లా ఆ వానరవీరులమీద వదిలి ఆ మహాబలవంతుడు ఇంద్రజిత్తు సింహనాదము చేసినాడు. ఆ వానరవీరులను అట్లా బాధపెట్టి భయపెట్టి సంతోషాతిశయముతో పక పక నవ్వుతూ వెంట ఉన్న రాక్షసులతో "ఓ రాక్షసులారా, సేనాముఖాన నేను వదిలిన భయంకర బాణాలకు కట్టుపడిపోయిన ఆ అన్నతమ్ములను రామలక్ష్మణులను చూడండి. వారు చచ్చిపోయినారు" అన్నాడు.

ఇంద్రజిత్తు చెప్పిన ఈ మాటలకు ఆ కూటయోధులు ఎంతో సంతోషపడ్డారు. ఆశ్చర్యపడ్డారు. రాముడు చచ్చిపోయినాడు అని నీలమేఘాలవంటి ఆ రాక్షసులు అందరూ అనుకొన్నారు. పెద్దపెట్టున అరిచినారు. ఇంద్రజిత్తును పూజించినారు. అప్పుడు ఆ ఇంద్రజిత్తు నేలమీద కదలకుండా మెదలకుండా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు లేకుండా పడి ఉన్న రామలక్ష్మణులను మళ్ళీ చూచినాడు. ఆ ఉభయులూ చచ్చిపోయినారు అని నిశ్చయించుకొన్నాడు. అంతట ఆ జయశాలి ఇంద్రజిత్తు సంతోషపరవశుడు అయి లంకాపట్టణానికి ప్రయాణము అయినాడు.

రామలక్ష్మణుల సర్వాంగోపాంగాలలోనూ బాణాలు గుచ్చుకొని కదలకుండా మెదలకుండా పడి ఉండడము చూచి సుగ్రీవుడు ఖిన్నుడు అయిపోయినాడు. భయపడి పోయినాడు. అట్లా భయపడి కన్నీళ్లు కారుస్తూ వెలా తెలా పోతున్న సుగ్రీవుణ్ణి చూచి విభీషణుడు "ఓ సుగ్రీవుడా, భయపడడము చాలించు. నీవు కన్నీళ్లు కార్చవద్దు. యుద్ధాలు ఈ విధముగానే ఉంటవి. విజయానికి నియమము లేదు. ఒక కొంచెము సేపు ఒకడు జయించవచ్చును. చివరకు ఎవడు జయిస్తాడో తెలియదు.

"సుగ్రీవుడా, నీవు వీరుడవు. అధైర్యపడవద్దు. మనకు ఇంకా మిగిలి ఉన్న జీవితములో మనము ఏమి అయినా భాగ్యము అనుభవించవలసి ఉన్నట్లయితే ఈ ధైర్యవంతులు ఈ మహాబలవంతులు రామలక్ష్మణులు మూర్ఛ తేరుకొంటారు. ఓ సుగ్రీవుడా నీవు స్థిరచిత్తముతో ఉండు. అనాథుణ్ణి నన్ను స్థిరచిత్తముతో ఉండనివ్వు. సత్యధర్మపరాయణులకు మృత్యుభయము ఉండదు" అని చెప్పి నీళ్లు తీసుకొని తన చేతులతో సుగ్రీవుడి కన్నీళ్లను కడిగినాడు. అంతట ఆ ధర్మాత్ముడు విభీషణుడు మళ్ళీ నీళ్లు తీసుకొని మంత్రముతో అభిమంత్రించి ఆనీళ్లతో సుగ్రీవుడి కన్నులు తుడిచినాడు, ఆ బుద్ధిమంతుడు కపిరాజు

వ్యాకుల పడకుండా ఉండడానికి సమయోచితముగా విభీషణుడు "ఓ కపిరాజా, వైక్లబ్యానికి ఇది సమయము కాదు. ఇది అపత్కాలము. అతిస్నేహమువల్ల దిగులుపడవద్దు. ఆ అతిస్నేహము మరణకారణము అవుతుంది. అందువల్ల వైక్లబ్యాన్ని వదిలిపెట్టు. అది సమస్తకార్యాలను నాశనము చేసి వేస్తుంది. రాముడి ముందు నడిచే నీ వానరసైన్యాల మంచిని గురించి ఆలోచించు. అట్లా కాదు అనుకొన్నట్లయితే రామలక్ష్మణులు మూర్ఛ తేరుకొనే వరకూ వారిని కనిపెట్టుకొని ఉండు. వారు తేరుకోగానే వారే మన భయాలను అన్నిటినీ పోగొట్టుతారు. ఈ మూర్ఛవల్ల రాముడు ఏమాత్రమూ చచ్చిపోడు. ఆ మహానుభావుడి ముఖకాంతులు మాసిపోలేదు. చచ్చిపోయేవాడి ముఖాన ఆ కాంతులు ఉండవు.

"ఓ సుగ్రీవుడా, నీవు ఊరడిల్లు. నీ సైన్యాన్ని ఊరడించు. నేను మళ్ళీ అన్ని పనులూ చక్కపెట్టుతాను. అంతవరకూ నీవు నెమ్మదిగా ఉండు. ఓ వానరసత్తమా, ఈ వానరులు అందరూ భయపడి పోయినారు. కన్నులు తెరిచి అన్ని వైపులా తేరి పారచూస్తున్నారు. పారిపోవడానికి గుసగుసలాడుతున్నారు. నన్ను అండగా చూచుకో. పరుగెత్తిపోతున్న నీ వానరసైన్యానికి ధైర్యము చెప్పు. భయపడకుండా చూడు. వారిని ఉత్సాహపరుచు. అనుభవించిన పూలదండనువలె నీవు భయాన్ని వదిలిపెట్టు" అని చెప్పినాడు.

ఇట్లా విభీషణుడు సుగ్రీవుణ్ణి ఊరడించి భయపడి పారిపోబోతున్న వానర సైన్యానికి ధైర్యము చెప్పినాడు.

ఆ మహామాయావి ఇంద్రజిత్తు అనుచరులతో లంకాపట్టణములోకి పోయినాడు. హుటాహుటీ తండ్రి దగ్గరకు పోయినాడు. చేతులు జోడించి నమస్కారము చేసి "రామలక్ష్మణులను చంపివేసినాను. వారు చచ్చిపోయినారు" అని సంతోషముగా చెప్పినాడు. సభామధ్యములో కూర్చున్న రావణాసురుడు ఆ మాట విన్నాడు. శత్రువు చచ్చిపోయినాడు అని సంతోషపడ్డాడు. కూర్చున్న పీఠముమీదినుంచి లేచి ఆ వర్తమానము చెప్పిన తన కొమారుణ్ణి కౌగలించుకొన్నాడు. సంతోషాతిశయముతో అతడి శిరము ఆఘ్రాణించినాడు. ఆ రామలక్ష్మణులను ఎట్లా చంపివేసిందీ చెప్పమని అడిగినాడు.

అంతట ఇంద్రజిత్తు రామలక్ష్మణులను ఎట్లా నాగపాశబద్ధులను చేసిందీ వారు ఎట్లా చేష్టలు ఉడిగిపోయిందీ వారి కాంతులు ఎట్లా మాసిపోయిందీ జరిగింది జరిగినట్లు చెప్పినాడు.

తననూ సారథినీ గుర్రాలనూ కాపాడుకొంటూ పదకొండు వేలమంది విలుకాండ్లతో పోరాడే ఇంద్రజిత్తు చెప్పిన మాటలకు రావణాసురుడు ఉప్పొంగిపోయినాడు. రామలక్ష్మణులను గురించిన మనోవ్యాకులము అంతా రావణాసురుడికి పోయింది. సంతోషించినాడు. పుత్రుణ్ణి ఇంద్రజిత్తును మెచ్చుకొన్నాడు.

## ౪౭

ఇంద్రజిత్తు అట్లా కృతార్థుడు అయి లంకాపట్టణానికి పోయినాడు.

ఆ యుద్ధభూమిలో హనుమంతుడూ అంగదుడూ నీలుడూ సుషేణుడూ కుముదుడూ నలుడూ గజుడూ గవాక్షుడూ గవయుడూ గంధమాదనుడూ శరభుడూ రంభుడూ పృథుడూ శతవలీ మొదలుఅయిన వానరవీరులు అందరూ ఆర్తులుఅయిపోయి రామలక్ష్మణులచుట్టూ కనిపెట్టుకొని ఉన్నారు.

వానరయోధులు అందరూ చెట్లను చేతులలో పట్టుకొని వ్యూహాలు తీర్చి సర్వసంసిద్ధులుఅయి అన్నిదిక్కులానూ అటు పైకీ ఇటు కిందికీ చూస్తూ నిలుచున్నారు. గడ్డిపోచ కదిలితే రాక్షసులు వస్తూఉన్నారు ఏమోను అనుకొంటూ హెచ్చరికతో ఉన్నారు.

అక్కడ లంకాపట్టణములో అప్పుడు రావణాసురుడు సంతోషముగా తన కొడుకుకు ఇంద్రజిత్తుకు వీడ్కోలుచెప్పి పంపించివేసి సీతాదేవికి కావలి ఉంటూఉన్న రాక్షసాంగనలను రావించినాడు. రావణాసురుడి ఆజ్ఞప్రకారము త్రిజట మొదలుఅయిన రాక్షసాంగనలు వచ్చినారు. ఆ రాక్షసాధిపతి రావణాసురుడు సంతోషముతో ఆ రాక్షసాంగనలను అందరినీ చూచి "ఓ అంగనలారా, రామలక్ష్మణులను ఇంద్రజిత్తు చంపివేసినాడు. మీరు ఈ సంగతి సీతాదేవికి చెప్పి ఆమెను పుష్పకవిమానముమీద ఎక్కించుకొనిపోయి యుద్ధభూమిలో చచ్చిపడిఉన్న రామలక్ష్మణులను ఆమెకు చూపించవలెను.

సీతాదేవి రామలక్ష్మణుల అండచూచుకొని గర్వముఎక్కి నన్ను చేరకుండా ఉంది. ఈమె పెనిమిటి రాముడూ వాడితమ్ముడు లక్ష్మణుడూ యుద్ధములో చనిపోయినారు. రామలక్ష్మణులు వస్తారు అనే ఆశ అంతముఅయిపోతుంది. కనుక మైథిలి నిర్విశంకముగా ఏ దిగులూ లేకుండా సమస్తాభరణాలతోనూ అలంకరించుకొని నన్ను చేరుతుంది. యుద్ధములో చనిపోయిన రామలక్ష్మణులను ఈ విశాలాక్షి చూడవలెను. అంతటితో వారి ఆశ నిరాశ అయి

పోతుంది. నాకన్నా వేరేగతి ఈమెకు కనపడదు. ఇతరాపేక్ష లేకుండా తనంతట తానే ఈమె నన్ను చేరుతుంది" అని చెప్పినాడు.

ఇట్లా ఆ దురాత్ముడు రావణాసురుడు చెప్పింది ఆ రాక్షసాంగనలు విని "అట్లాగేను" అన్నారు. అంతట వాండ్లు పుష్పకవిమానము ఉన్నచోటికి పోయినారు. రావణాసురుడు ఆజ్ఞాపించినట్లుగా ఆ పుష్పకవిమానాన్ని తీసుకొని అశోకవనములో సీతాదేవిదగ్గరకు పోయినారు. భర్తృశోకముతో కుమిలిపోతూ ఉన్న ఆ సీతాదేవిని త్రిజటతోకూడా ఆ రాక్షసాంగనలు అప్పుడు ఆ పుష్పక విమానము ఎక్కించి రామలక్ష్మణులను చూపించడానికి తీసుకొనిపోయినారు.

"ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపివేసినాడు" అని రావణాసురుడు సంతోషాతిశయముతో లంకాపట్టణము అంతటా చాటింపు వేయించినాడు. ధ్వజాలకు అలంకారము చేయించినాడు. పతాకాలు ఎత్తించినాడు.

ఆ పుష్పకవిమానములో వచ్చిన త్రిజటను వెంట పెట్టుకొని సీతాదేవి సంతోషాతిశయముతో తిరుగుతూ ఉన్న రాక్షసయోధులనూ చచ్చిపడి ఉన్న వానరయోధులనూ చూచింది. దుఃఖార్తులు అయి రామలక్ష్మణుల చుట్టూ ఉన్న వానరవీరులను చూచింది.

బాణాల పాన్పుమీద రామలక్ష్మణులు విసంజ్ఞులుగా పడి ఉన్నారు. ఒంటినిండా బాణాలు గుచ్చుకొన్నందువల్ల గాయాలతోనూ బాణాలతోనూ ఉన్నారు. వారి కవచాలు చిరిగిపోయినవి. వారి ధనుస్సులు జారి పక్కనుపడి ఉన్నవి. అట్లా బాణమయము అయిపోయిన దేహాలతో పడిఉన్న రాముణ్ణి లక్ష్మణుణ్ణి సీతాదేవి చూచింది. అట్లా శరతల్పముమీద పడిఉన్న ఆ వీరులను ఆ పురుష పుంగవులను ఆ పుండరీకాక్షులను అగ్నిహోత్రోద్భవులు అయిన స్కంధవిశాఖులువంటి ఆ అన్నతమ్ములను రామలక్ష్మణులను చూచింది. ఆమెకు చెప్ప నలవికాని దుఃఖము వచ్చింది. ఎంతోసేపు ఏడ్చింది.

ఆ అనవద్యాంగి ఆ అసితేక్షణ జనకాత్మజ సీతాదేవి దుమ్ము కొట్టుకొని అట్లా పడిఉన్న తన పెనిమిటిని రాముణ్ణి తన మరిదిని లక్ష్మణుణ్ణి చూచింది. పెద్ద పెట్టున ఏడ్చింది.

కన్నీళ్లు కన్నులనిండా కమ్ముకొన్నందువల్లనూ దుఃఖమువల్లనూ ఏమీ తెలియకుండా పోయి దేవతలవంటి ఆ మహానుభావులు రామలక్ష్మణులు చని పోయినారు అనుకొన్నది.

## ౪౮

ఆ మహాబలవంతుడు తన భర్త రాముడూ తన మరిది లక్ష్మణుడూ చచ్చి పడి ఉన్నట్టుగా చూచి సీతాదేవి జాలి పుట్టేట్టుగా ఏడ్చింది.

"అయ్యో, నాకు పుత్రుడు పుట్టుతాడు అనీ నేను వైధవ్యము అనుభవించను అనీ సాముద్రికము తెలిసినవారు చెప్పినారు. నా భర్త అశ్వమేధాది యజ్ఞాలూ సత్రయాగాలూ చేస్తాడు అనికూడా చెప్పినారు. కార్తాంతికులు ఇంకా అనేక శుభాలు చెప్పినారు. నా భర్త పరమ పరాక్రమవంతుడు అనీ నేను ధన్యురాలను అనీ చెప్పినారు. ఇప్పుడు రామప్రభువు చనిపోవడముతో ఆ చెప్పినవి అన్నీ అబద్ధాలు అయిపోయినవి.

"పాదాలలో పద్మరేఖ ఉన్న స్త్రీ మహారాజు భార్య అవుతుంది అనీ ఆ మహారాజుతో కూడా ఆమెకు రాజ్యాభిషేకము అవుతుంది అనీ చెప్పుతారు. నా పాదాలలో స్పష్టముగా పద్మరేఖలు ఉన్నవి. ఇట్లా అయిపోయిందిఏమిటి. ఏ లక్షణాలు ఉంటే స్త్రీలు నిర్భాగ్యలు అయి వైధవ్యము అనుభవిస్తారు అని చెప్పుతారో ఆ లక్షణాలు ఏవీ నాకు లేవే. నేను ఇట్లా అయి పోయినాను ఏమిటి. పద్మరేఖలు అమోఘము అయిన ఫలము ఇస్తవి అని చెప్పింది అంతా అబద్ధము అయిపోయింది."

"నాతల వెంట్రుకలు ఎంతో సూక్ష్మముగా ఎక్కువ తక్కువలు లేకుండా నల్లగా ఉన్నవి. నా కనుబొమలు ఒక దానితో ఒకటి కలిసిపోలేదు. రోమాలు లేకుండా నా పిక్కలు గుండ్రముగా ఉన్నవి. నా కన్నులూ నా కణతలూ నా చేతులూ నా తొడలూ నా చీలమండలూ నా పాదాలూ బలుపుగా ఉన్నవి. గుండ్రని గోళ్లతో నా వేళ్ళు నా చేతులకు తగినట్టుగా ఉన్నవి ఎడము లేకుండా నా పీన స్తనాలు మొనలు అంటుకొని పోయిఉన్నవి. నా నాభి లోతుగాఉంది. నా మొత్తలు ఎత్తు అయినవి. నా వక్షఃస్థలము పక్కలు బలుపుగా ఉన్నవి. నా దేహము మీద (ఉండవలసిన) వెంట్రుకలు మృదువు అయినవి. నా దేహకాంతి నిగ నిగ లాడే రత్నము వంటిది. నా రెండు పాదాలూ వాటి పది వేళ్లూ (అరకాళ్లు) నేలను అంటుకొని ఉంటవి. ఇవి అన్నీ శుభలక్షణాలు అని పండితులు చెప్పినారు.

నా అరకాళ్లలోనూ అరచేతులలోనూ సమగ్రము అయిన యవాకార రేఖలు ఉన్నవి. వేళ్లు సందులు లేకుండా ఉన్నవి. నేను ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ ఉన్నట్టు కనపడుతాను అనీ, ఇవి అన్నీ శుభకన్యా లక్షణాలు అనీ

తెలిసిన బ్రాహ్మణులు చెప్పినారు నా పెనిమిటితో కూడా నాకు రాజ్యాభిషేకము జరుగుతుంది అని జ్యోతిషికులు అయిన బ్రాహ్మణులు చెప్పినారు. ఆ చెప్పినవి అన్నీ ఇప్పుడు అబద్ధాలు అయిపోయినవి.

ఆ అన్నతమ్ములు ఆ జనస్థానములో నన్ను వెదకి వెదకి నేను ఎక్కడ ఉందీ తెలుసుకొని దాటి రా నలవికాని మహాసముద్రాన్ని దాటివచ్చి ఇక్కడ గోష్పదము అంత మాయలో పడి చచ్చి పోయినారు. అయ్యో రామలక్ష్మణులు వారుణాస్త్రాన్నీ ఆగ్నేయాస్త్రాన్నీ ఐంద్రాస్త్రాన్నీ బ్రహ్మశిరోనామకాస్త్రాన్నీ సంపాదించినారే. ఆ అస్త్రాలను ఎందుకు ఉపయోగించలేదో. ఇప్పుడు నేను అనాధను అయి పోయినాను. నా రక్షకులు రామలక్ష్మణులు దేవేంద్రుడితో సరి సమానము అయిన వారు. యుద్ధములో ఇంద్రజిత్తు కంటికి కనపడకుండా మాయము అయి పోయినందువల్లనే నా పెనిమిటినీ నా మరదినీ చంపి వేయ కలిగినాడు. మనోవేగము వంటి వేగము కలవాడు అయినప్పటికిన్నీ శత్రువు కంట పడితే నా పెనిమిటి బ్రతుకనీయడు. అటువంటి రామప్రభువు తమ్ముడితో కూడా యుద్ధములో హతుడుఅయి నేలమీద పడిఉన్నాడు. కాల మహిమ. కాలానికి అశక్యము అయింది ఏదీలేదు. దైవాన్ని జయించడము అసంభవము.

నేను ఆ తపస్విని మా అత్తగారిని గురించి దుఃఖించినంతగా రామప్రభువును గురించి కానీ ఆ మహాబలవంతుడు లక్ష్మణుణ్ని గురించి కానీ నా తల్లినిగురించి కానీ చివరకు నన్ను గురించి కానీ దుఃఖించను. వనవాస వ్రతము ముగించుకొని రామప్రభువు లక్ష్మణుణ్ణీ సీతనూ వెంటపెట్టుకొని ఎప్పుడు వస్తాడా అనీ ఎప్పుడు చూస్తానా అనీ ఆమె ఎప్పుడూ ఎదురు చూస్తూ ఉంటుంది" అంటూ ఏడ్చింది.

అట్లా పరిదేవనము చేస్తూ ఉన్న సీతాదేవితో వెంట ఉన్న త్రిజట "ఓ దేవీ నీవు దుఃఖపడవద్దు. నీ భర్త జీవించి ఉన్నాడు. ఓ దేవీ, అన్నతమ్ములు ఇద్దరూ జీవించి ఉన్నారు అని చెప్పడానికి తగిన కారణాలు ఎన్నో కనపడుతున్నవి. రాజు యుద్ధములో చనిపోయినప్పుడు యోధుల ముఖాలలో సంతోషము కానీ యుద్ధోత్సాహము కానీ కోపముకానీ కనపడవు.

— "ఓ వైదేహీ, అంతేకాదు. మనము ఎక్కివచ్చిన పుష్పకవిమానము దేవలోకము లోనిది. రామలక్ష్మణులు నిజముగా చచ్చిపోయి ఉన్నట్లయితే ఈ పుష్పకవిమానము నిన్ను మోసుకొని వచ్చేదికాదు. యుద్ధములో ప్రధానవీరుడు చనిపోయినప్పుడు సైన్యానికి యుద్ధోత్సాహము హతము అయిపోతుంది. నీ

ప్రయత్నమూ చేయకపోవడమే కాకుండా సైన్యమంతా గలిబిలి అయిపోతుంది. చుక్కాని కాసేవాడు లేని నౌక జలాలలోవలె యుద్ధభూమిలో సైన్యము గందరగోళముగా తిరుగుతూ ఉంటుంది. ఈ వానరసైన్యము ఇప్పుడు అట్లా లేదు. ఈ సైన్యములో కలవరమే కనిపించడం లేదు. భయపడ్డట్టు లేదు. వానరవీరులు జాగ్రత్తగా రామలక్ష్మణులను చూస్తూ ఉన్నారు. నామాట నమ్ము. ఈ సుభ లక్షణాలు అన్నీ చూడు. రామలక్ష్మణులు జీవించి ఉన్నారు.

"ఓ సీతా, నీమీద నాకు ఉన్న స్నేహమునుంచి ఇది అంతా చెప్పు తున్నాను. నేను అబద్ధము ఆడడములేదు. నేను ఇదివరకు ఎన్నడూ నీతో అబద్ధము చెప్పి ఎరుగను. నేను ఎప్పుడూ నీతో అబద్ధము ఆడను. నీ సచ్ఛీలము నుంచీ నీ సత్ప్రవర్తనము నుంచీ నీవు నా మనస్సుకు నచ్చినావు. సురాసురులు అందరూ ఏకము అయి దేవేంద్రుడితో ఎత్తి వచ్చినా రామలక్ష్మణులను జయించలేరు.

"ఓ జానకీ, రామలక్ష్మణులు జీవించి ఉన్నారు. నాకు అట్లా కనపడు తున్నారు. అందువల్ల చెప్పుతున్నాను. ఓ మైథిలీ, ఇది చాలా గొప్ప లక్షణము. చూడు. ఈ రామలక్ష్మణులు ఇద్దరూ విసంజ్ఞులుగా పడి ఉన్నప్పటికిన్నీ వీరి ముఖాలమీద కళ కాంతులు ఏమాత్రమూ మాసిపోలేదు. ఆయుస్సు తీరిపోయిన వారి ముఖాలమీదనూ చచ్చిపోయినవారి ముఖాలమీదనూ కనిపించే పరమవికారము ఏమిన్నీ వీరి ముఖాలమీద కనిపించడము లేదు. నీవు ఈ రామలక్ష్మణుల కోసము దుఃఖపరవశవుఅయిపోవద్దు. నీవు దుఃఖము వదిలిపెట్టు. వీరు బ్రతుకకుండా పోవడము అనేది లేదు" అని చెప్పింది.

ఇట్లా త్రిజట చెప్పింది దేవకన్యవంటి సీతాదేవి విన్నది. చేతులుజోడించి "అట్లా జరగవలెను" అన్నది.

మనోవేగముతో పోయే ఆ పుష్పకవిమానముమీద దుఃఖపడుతూ ఉన్న సీతాదేవిని మళ్ళీ ఎక్కించుకొని అప్పుడు త్రిజట తిరిగీ లంకాపట్టణానికి తీసుకొని పోయింది. అంతట రాక్షసాంగనలు త్రిజటతోకూడా సీతాదేవిని ఆ విమానములోనుంచి దింపి అశోకవనానికి తీసుకొని పోయినారు.

రాక్షసరాజు రావణాసురుడు విహరించే ఆ అశోకవనములో సీతాదేవి తాను చూచి వచ్చిన రామలక్ష్మణులను గురించి తలచుకొంటూ దుఃఖపడసాగింది.

## ४౮

భయంకరము అయిన నాగపాశాలకు కట్టుబడిపోయి పాములవలె నిట్టూర్పులు విడుస్తూ నెత్తురుతో ఒళ్లు అంతా తడిసిపోయి నేలమీద పడుకొని ఉన్న రామలక్ష్మణుల చుట్టూ మహాబలవంతుడు అయిన సుగ్రీవుడితో కూడా వానర వీరులు అందరూ దుఃఖపడుతూ కనిపెట్టుకొని ఉన్నారు. అట్లా ఆ వానరవీరులు అందరూ చూస్తూ ఉండగా ఆ వీర్యవంతుడు రాముడు కన్నులు తెరిచినాడు. నాగపాశబద్ధుడు అయినప్పటికిన్నీ బలమువల్లనూ ధైర్యమువల్లనూ మూర్ఛ తేరుకొన్నాడు. గాఢముగా బాణాలు గుచ్చుకొని ఒళ్లు అంతా నెత్తురుతో తడిసిపోయి విషణ్ణుడు అయి దీనవదనముతో పడి ఉన్న తన తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణి చూచినాడు. దుఃఖము పొంగి పొర్లింది. అంతట రాముడు విలపించినాడు.

కన్నుల వెంట నీరు కారుస్తూ "అయ్యో, నా తమ్ముడు లక్ష్మణుడు యుద్ధములో పరాజితుడు అయి పడి ఉన్నాడు. ఇప్పుడు నాకు సీతతో పని ఏమిటి. నేను బ్రతికి ఉండి ప్రయోజనము ఏమిటి. ఈ భూలోకములో వెతికితే ఎక్కడను అయినా సీతవంటి స్త్రీని సంపాదించుకోవచ్చును. కాని ఈ విధముగా సాయపడేవాణ్ణి యుద్ధసమర్థుణ్ణి నా తమ్ముడు లక్ష్మణుడి వంటివాణ్ణి సంపాదించుకోడము అసంభవము. సుమిత్రాదేవిని సంతోషపెట్టే నా తమ్ముడు లక్ష్మణుడు చనిపోయేట్లయితే నేను ఈ వానరులు అందరూ చూస్తూ ఉండగానే ప్రాణము వదులుతాను.

"నేను మా అమ్మ కౌసల్యాదేవికి ఏమి చెప్పేది. కైకేయీదేవికి ఏమి చెప్పేది. నేను వెంట లక్ష్మణుడు లేకుండా అయోధ్యకు పోయేట్లయితే పుత్ర దర్శనలాలస అయి దూడ పోయిన లేడివలె ఏడ్చే సుమిత్రాదేవిని ఓదార్చడము ఎట్లాగు. ఆ యశస్వికి భరతుడికి ఏమి అని చెప్పడము. శత్రుఘ్నుడికి ఏమి అని చెప్పడము. ఎట్లా చెప్పడము. నా వెంట అడవికి వచ్చిన తమ్ముడు లేకుండా నేను అయోధ్యకు పోయేట్లయితే సుమిత్రాదేవి నన్ను నిందిస్తుంది. ఆమె నిందిస్తే నేను ఓర్చుకోలేను. అయ్యో, నేను ఇక బ్రతికి ఉండడము ఎందుకు. ఇక్కడనే ప్రాణము వదిలి పెట్టుతాను. నా కోసము ఈ లక్ష్మణుడు శరతల్పముమీద పడిపోయినాడు. చచ్చిపోయినట్టుగా ఉన్నాడు. అయ్యో, నేను ఏమిపాప కార్యము చేసినానో-ఏమి దుష్టకార్యము చేసినానో.

"ఓ లక్ష్మణా, నేను ఎప్పుడు విషణ్ణుణ్ణి అయినా నీవు నన్ను ఓదార్చేవాడవు. నేను ఇప్పుడు ఇట్లా దుఃఖపడుతూ ఉంటే నీవు నన్ను ఓదార్చ

లేకుండా ఉన్నావు. రాక్షసులను పడకొట్టిన నిన్ను రాక్షసులు పడకొట్టినారు. ఒంటి నిండా బాణాలు గుచ్చుకొని నెత్తురు వెల్లువలు అయి పారుతూ బాణాల పాన్పుమీద పడి ఉన్న లక్ష్మణుడు అస్తమిస్తున్న సూర్యుడివలె తేజరిల్లు తున్నాడు. అన్ని ఆయువుపట్టులలోనూ దెబ్బలు తగిలినవి. మాట్లాడలేకుండా ఉన్నాడు. మాట్లాడలేకుండా ఉన్నప్పటికిన్నీ లక్ష్మణుడి బాధ చూపుల వల్లనే తెలుస్తున్నది. ఈ మహాద్యుతిమంతుడు ఎట్లా నా వెంట అడవికి వచ్చినాడో నేనూ అట్లాగే వీడి వెంట యమసదనానికి పోతాను. వీడు ఎప్పుడూ నన్ను అనుసరించుకొని నా వెంట ఉన్నాడు. వీడు బంధుజనులకు అందరికీ ఇష్టుడు. అయినప్పటికిన్నీ నన్ను వదిలిపెట్టి ఎరగడు. నేను అభాగ్యుణ్ణి. నా అభాగ్యమువల్ల వీడికి ఈ దురవస్థ వచ్చింది. ఈ వీరుడికి లక్ష్మణుడికి ఎంత కోపము వచ్చినా ఒక్క పరుష వాక్యము అని ఎరగడు. ఒక్క అప్రియము ఆడి ఎరగడు. వీడు అట్లా అన్నట్టు మరి ఒకడు ఎవడూ నాతో చెప్పి ఉండలేదు. ఏకవేగములో అయిదు వందల బాణాలను వదిలే కార్తవీర్యార్జునుడికన్నా నా తమ్ముడు లక్ష్మణుడు అధికుడు. ఆ కార్తవీర్యార్జునుడికి వెయ్యి చేతులు ఉండేవి. నా తమ్ముడికి లక్ష్మణుడికి రెండే చేతులు అయినప్పటికిన్నీ ఆ కార్తవీర్యార్జునుడి కన్నా ఏకకాలాన ఎక్కువ బాణాలు వదిలేవాడు. మహాపరాక్రమవంతుడు అయిన దేవేంద్రుడి బాణాలను అయినా తన అస్త్రాలతో కొట్టే లక్ష్మణుడు-మహార్హము అయిన శయ్యమీద పడుకోవలసిన లక్ష్మణుడు ఒక రాక్షసుడి బాణాలకు నేలమీద పడి ఉన్నాడు.

"అయ్యో, విభీషణుణ్ణి రాక్షసరాజుగా నేను లంకాపట్టణములో రాజ్యాభిషేకము చేయలేదు. నా వాగ్దానము అబద్ధము అయింది. అదే నన్ను దహించి వేస్తుంది. సందేహము లేదు.

"ఓ సుగ్రీవుడా, నీవు కిష్కింధానగరానికి ఇప్పుడే తిరిగిపో. రావణాసురుడు బలవంతుడు, నేను ఉండను కనుక నిన్ను తరిమికొట్టుతాడు. నీవు అంగదుణ్ణి పురస్కరించుకొని నీ స్నేహితులనూ నలుణ్ణీ నీలుణ్ణీ తక్కిన వానరవీరులనూ వెంటపెట్టుకొని సముద్రాన్ని దాటిపో. ఈ యుద్ధములో ఇతరులు ఎవరూ చేయలేని పని హనుమంతుడు చేసినాడు. భల్లూకరాజు జాంబవంతుడూ గోలాంగూల రాజు గవాక్షుడూ చక్కగా పోరాడినారు. నేను సంతోషపడు తున్నాను. ఈ యుద్ధములో మైందుడూ ద్వివిదుడూ కష్టపడి పనిచేసినారు. కేసరీ సంపాతీ ఘోరముగా పోరాడినారు. గజుడూ గవయుడూ గవాక్షుడూ శరభుడూ ఇంకా ఇతరులూ నా నిమిత్తము ప్రాణాలు వదులుకోడానికి సిద్ధము అయి చక్కగా యుద్ధముచేసినారు.

"ఓ సుగ్రీవుడా, ఎవరు ఏమి చేస్తే నేమిటి- మానవుడు దైవాన్ని అతిక్రమించలేడు. సుగ్రీవుడా, నీవు పరంతపుడవు, నాకు స్నేహితుడవు. నీ హృదయము మంచిది. అధర్మానికి భయపడి నీవు చేయవలసింది అంతా నీ శక్తి వంచన లేకుండా చేసినావు.

"ఓ వానరులారా, మీరు అందరూ ఏ లోపమూ లేకుండా మీ మిత్రుడి పని చేసిపెట్టినారు. మీరు అందరూ ఇప్పుడు తిరిగి పోవలసింది. అందుకు నేను అనుమతిస్తున్నాను. మీరు యథేష్టముగా వెళ్ళిపొండి" అని చెప్పి రాముడు మళ్ళీ మూర్ఛపోయినాడు.

రాముడి పరిదేవనము వానరులు అందరూ విన్నారు. అతడు మూర్ఛ పోవడము చూచినారు. దుఃఖపడి పోయినారు. ఏడ్చి ఏడ్చి వానరులు అందరి కన్నులూ ఎఱ్ఱపడి పోయినవి.

అదివరకు పారిపోవడానికి ప్రయత్నము చేసిన వానర సైన్యాలను అన్నిటినీ పారిపోకుండా నచ్చచెప్పి విభీషణుడు గద చేతులో పట్టుకొని గబా గబా రాముడు ఉన్న చోటికి బయలుదేరినాడు. అట్లా అమిత వేగముతో వస్తూ ఉన్న కాటుక కొండవంటి ఆ విభీషణుణ్ణి రాముడి దగ్గిర ఉన్న వానరయోధులు చూచినారు. ఇంద్రజిత్తు అనుకొన్నారు. భయపడ్డారు. పారిపోవడానికి ప్రయత్నము చేయసాగినారు.

## ౫౦

అప్పుడు ఆ మహాతేజోవంతుడు ఆ మహాబలవంతుడు వానరరాజు సుగ్రీవుడు వానరవీరులను అందరినీ చూచి "ఓ వీరులారా, జలమధ్యములో ఎదురుగాలికి నావవలె మన సైన్యము అడ్డముఖము పెట్టుతున్నది ఏమిటి" అని అడిగినాడు.

అందుకు అంగదుడు "రాజా, ఒంటినిండా బాణాలు గుచ్చుకొని నెత్తురు కారుతూ బాణాల పాన్పుమీద పడుకొని ఉన్న రామలక్ష్మణులను నీవు చూడటము లేదా" అని అడిగినాడు.

అంతట సుగ్రీవుడు "అంగదుడా, అది కారణముగా కనపడటము లేదు. వానరయోధులు అందరూ మరి దేనికో భయపడుతున్నట్టు నాకు తోస్తున్నది. అందరూ ఏదో ఒక భయముమంచి చేతులలో ఉన్న చెట్లను వదిలి పెట్టినారు. అందరి ముఖాలలోనూ దిగులు కనపడుతున్నది. అన్ని దిక్కులా బేరిపార చూస్తూ పరిగెత్తి పారి పోతున్నారు. ఒకండ్లను చూచి ఒకండ్లు సిగ్గు పడటము

లేదు. వెనకకు తిరిగి చూడకుండా పరుగెత్తుతున్నారు. ఒకండ్లను ఒకండ్లు లాక్కొని పోతున్నారు. పడిపోయినవారి మీదుగా దాటి పోతున్నారు" అన్నాడు.

అప్పుడు ఆ సమయాన రాక్షసవీరుడు విభీషణుడు గదను చేతిలో పట్టుకొని అక్కడికి వచ్చినాడు. సుగ్రీవుణ్ణి ఆశీర్వదించి రామలక్ష్మణులను చూచినాడు. ఆ విభీషణుణ్ణి చూచే, వానరయోధులు అందరూ భయపడి పారి పోతున్నారు అని ఊహించి సుగ్రీవుడు తన సమీపములో ఉన్న జాంబవంతుణ్ణి చూచి "ఓ భల్లూకరాజా, ఈ వచ్చిన విభీషణుణ్ణి మన వానరయోధులు అందరూ ఇంద్రజిత్తు అనుకొని భయపడి పరుగెత్తి పారి పోతున్నారు. నీవు వెంటనే పోయి వాండ్లకు అందరికీ ఈ వచ్చినవాడు ఇంద్రజిత్తు కాడు అనీ విభీషణుడు అనీ నచ్చ చెప్పి వాండ్లను అందరినీ మళ్ళించుకొని రావలెను" అని ఆజ్ఞాపించినాడు.

అప్పుడు ఆ భల్లూకరాజు జాంబవంతుడు పరుగెత్తి పారిపోతున్న వానరులకు అందరికీ నచ్చచెప్పినాడు. వాండ్లను అందరినీ తిరిగీ తీసుకొని వచ్చినాడు. ఆ జాంబవంతుడి మాటలను అనుసరించి వచ్చి చూచి తాము చూచింది ఇంద్రజిత్తు కాడు అనీ విభీషణుడు అనీ తెలుసుకొన్నారు. వారిభయము అంతటితో తీరిపోయింది. వానరయోధులు అందరూ తిరిగీ సన్నద్ధులు అయినారు.

ఆ ధార్మికుడు విభీషణుడు రామలక్ష్మణులను చూచి దుఃఖపడి పోయినాడు. చేతితో నీళ్లు తీసుకొని ఆ అన్నతమ్ముల కన్నులు తుడిచినాడు. వారు మూర్ఛ తేరుకోలేదు. విభీషణుడు శోకముతో బాధపడ్డాడు ఏడుస్తూ "ఈ రామలక్ష్మణులు బలవంతులు. పరాక్రమవంతులు. యుద్ధప్రియులు. కూటయుద్ధము చేసే రాక్షసులనుంచి వీరికి ఈ దురవస్థ వచ్చింది. ఇంద్రజిత్తు దురాత్ముడు తల్లి కడుపు చెడపుట్టినాడు. రాక్షస సాధారణము అయిన కుటిలబుద్ధితో కూట యుద్ధము చేయని ఈ రామలక్ష్మణులను మోసము చేసినాడు. అయ్యో, వీరి దేహమంతటా బాణాలు గుచ్చుకొని నెత్తురుతో తడిసి నేలమీద పడిపోయినారు. నేను వీరి పరాక్రమాన్ని ఆశ్రయించినాను. నాకు సమస్తగౌరవాలూ సంప్రాప్తము అవుతవి అనుకొన్నాను. అయ్యో ఈ పురుషపుంగవులు ఉభయులూ దేహక్షయము కోసము నిద్ర పోతున్నారు. నాకు రాజ్యము ఏలవలెను అనే కోరిక పోయింది. నేను ఇక బ్రతికి ఉండేట్లయితే ఆపదలపాలు అయిపోతాను. నా శత్రువు రావణాసురుడి ప్రతిజ్ఞ నెరవేరుతుంది. వాడికోరిక నెరవేరుతుంది" అంటూ ఉన్న విభీషణుణ్ణి సుగ్రీవుడు కౌగలించుకొని "ఓ విభీష

ణుడా, నీవు ధర్మజ్ఞుడవు. రావణాసురుడి కోరిక నెరవేరదు. వాడి కొడుకు కోరిక నెరవేరదు. నీవు లంకారాజ్యము ఏలుతావు. సందేహము లేదు. ఈ రామలక్ష్మణులు మూర్ఛ తేరుకుంటారు. వీరు యుద్ధములో రాక్షస సమూహములతో కూడా రావణాసురుణ్ని సంహారము చేసి వేస్తారు" అని చెప్పి ఓదార్చినాడు.

అంతట సుగ్రీవుడు సుషేణుణ్ణి చూచి "నీవు ఈ అరిందములు రామలక్ష్మణులు మూర్ఛ తేరుకోగానే వీరిని తీసుకొని వానరయోధులతో కూడా కిష్కింధా నగరానికి పో. నేను రావణాసురుణ్ణి పుత్ర మిత్ర బాంధవముగా చంపివేసి కోలుపోయిన రాజ్యలక్ష్మిని వామనమూర్తి దేవేంద్రుడికి ఒప్పగించినట్టు సీతాదేవిని తీసుకువచ్చి రాముడికి సమర్పిస్తాను" అని చెప్పినాడు.

ఈమాటలకు సుషేణుడు "రాజా, పూర్వము దేవాసురయుద్ధము మహా భయంకరముగా జరిగింది. నేను ఆయుద్ధము చూచినాను. బాణప్రయోగకోవిదులూ శస్త్రాస్త్రవిదులూ అయిన దానవులు ఆయుద్ధములో వివిధాయుధాలూ దేవతల మీద ఎడతెగకుండా వర్షముగా కురిపించినారు. అప్పుడు ప్రాణాలుపోయిన వారికీ మూర్ఛపోయినవారికీ బృహస్పతి మంత్రవిద్యతోనూ ఓషధులతోనూ చికిత్సచేసినాడు. ఆమూలికలు అన్నీ క్షీరసముద్రతీరాన దొరుకుతవి. వాటిని తేవడానికి నీవు వెంటనే ఇప్పుడే వానరవీరులను పంపించవలెను. పర్వతాలలో దొరికే మహౌషధులను మన వానరులు బాగా ఎరుగుదురు. సంజీవకరణీ విశల్యకరణీ అనే రెండుమూలికలను దేవతలు సృష్టించినారు. వాటిని రెంటినీ ఇప్పుడు తెప్పించవలెను. పరమోత్తమము అయిన పాలసముద్రాన్ని పూర్వము దేవతలు అమృతముకోసము చిలికినారు. అక్కడ ఆపాలసముద్రములో ద్రోణపర్వతమూ చంద్రపర్వతమూ అనే రెండు పర్వతాలు ఉన్నవి. ఆ పర్వతాలమీద సంజీవకరణీ, విశల్యకరణీ అనే రెండు పరమౌషధాలూ ఉన్నవి. ఆ పరమౌషధులు రెంటినీ దేవతలు ఆ రెండు పర్వతాలమీదనూ నాటినారు. రాజా, వాయుసుతుణ్ణి హనుమంతుణ్ణి అక్కడికి పంపించు. అతడు పోయి వాటిని తీసుకొని వస్తాడు" అని చెప్పినాడు.

ఇట్లా సుషేణుడు చెప్పుతూ ఉండగా మెరుపులతో మేఘాలనూ సముద్ర జలాలను చెదరకొట్టుతూనూ భూమి అంతా కదిలిపోతున్నట్టు గాలి వీచింది. ఆగాలికి లంకాద్వీపములో ఉన్న మహావృక్షాలు కొమ్మలతో విరిగి సమూలముగా పెల్లగిలి సముద్రములో పడి పోయినవి. అక్కడ ఉంటూ ఉన్న మహాసర్పాలూ జలజంతువులూ భయపడి దాగుకోడానికి సముద్రములో మునిగి

పోయినవి. అంతట కొంచెము సేపటికి మహాబలవంతుడు వినతాపుత్రుడు గరుత్మంతుడు జ్వలిస్తూ ఉన్న అగ్నిహోత్రుడివలె అక్కడ వానరులకు అందరికీ కనిపించినాడు. మహాబలవంతులను రామలక్ష్మణులను బాణరూపాన చుట్టి వేసుకొని ఉన్న పాములు అన్నీ ఆ వచ్చిన గరుత్మంతుణ్ణి చూచి పారి పోయినవి. అప్పుడు ఆ గరుత్మంతుడు రామలక్ష్మణులను చూచి చంద్రసమ కాంతులతో తేజరిల్లుతూ ఉన్న తన చేతులతో ఆ రామలక్ష్మణులను సంతోషముగా తడవినాడు. అంతట ఆ అన్నతమ్ముల శరీరాల మీద గాయాలు అన్నీ కనపడకుండా పోయినవి. అంతే కాదు. వారి దేహాలు అప్పుడుమంచివన్నెతో నున్నగా అయిపోయినవి. వారి తేజస్సూ ఓజస్సూ వీర్యమూ బలమూ ఉత్సాహమూ సూక్ష్మార్థపరిజ్ఞానమూ జ్ఞాపకశక్తీ బుద్ధికుశలతా అదివరకటి కన్నా రెట్టింపు అయినవి.

ఆ మహావీర్యవంతుడు గరుత్మంతుడు సంతోషముగా రామలక్ష్మణులను లేవనెత్తి కౌగలించుకొన్నాడు.

అప్పుడు రాముడు గరుత్మంతుడితో "ఓ మహానుభావుడా, నీ అనుగ్రహమువల్ల మేము ఇంద్రజిత్తు పెట్టిన కష్టసముద్రములో నుంచి ఇప్పుడు గట్టు ఎక్కినాము. మాకు ఇప్పుడు ఇదివరకటి బలము వచ్చింది. నిన్ను చూస్తూ ఉంటే మా తండ్రి దశరథమహారాజును చూస్తూ ఉన్నట్టుగా ఉంది.

"ఓ రూపసంపన్నుడా, నీవు ఎవరవు. దివ్యపుష్పమాలికలూ దివ్యాభరణాలూ ధరించినావు. సుగంధలేపనముతో ఘుమఘుములాడుతూ ఉన్నావు. నిర్మలవస్త్రము కట్టుకొన్నావు. నీవు ఎవరవో చెప్పు" అని అడిగినాడు.

రాముడు అడిగిన ఈ ప్రశ్నకు ఆ మహాతేజోవంతుడు ఆ మహాబలవంతుడు ఆ పక్షిరాజు వైనతేయుడు అపరిమితము అయిన సంతోషముతో ఆనందబాష్పములు వదులుతూ "ఓ రామా, నేను నీ స్నేహితుణ్ణి. నిన్ను సంతోషపెట్టడమే నా పని. నేను నీ బహిశ్చర ప్రాణమువంటి వాడను. నా పేరు గరుత్మంతుడు. నీకు సహాయపడడానికి వచ్చినాను. ఆ క్రూరకర్ముడు ఇంద్రజిత్తు తన మాయాబలముతో నిర్మించిన నాగపాశాలను మహావీర్యవంతులు అయిన అసురులుకానీ మహాబలవంతులు అయిన దానవులుకానీ దేవేంద్రుడితో దేవతలూ గంధర్వులూ కానీ విడిపించలేరు. మహావిషముతో కటుకు కోరలతో కద్రువకు పుట్టిన నాగులు అనే మహాసర్పాలను ఇంద్రజిత్తు తన రాక్షసమాయాప్రభావముతో బాణాలుగా చేసి మీమీద వదలినాడు. ఓ రామా, నీవు ధర్మజ్ఞుడవు. నీ పరాక్రమము ఎప్పుడూ వ్యర్థము అయిపోదు. ఈ యుద్ధములో నీవూ నీ తమ్ముడూ శత్రువులను అందరినీ సంహారము చేసివేస్తారు. మీరు జయిస్తారు.

"ఓ రామా, మిమ్ములను ఇంద్రజిత్తు నాగపాశాలతో బంధించి వేసినాడు అని వినగానే బయలుదేరినాను. స్నేహధర్మాన్ని పాటించి ఇక్కడికి వచ్చినాను. మిమ్ములను మహాఘోరము అయిన నాగపాశాలనుంచి విడిపించినాను. మీరు ఇకను ఎప్పుడూ ఏమరుపాటు లేకుండా ఉండవలెను. కూటయుద్ధము చేయడము రాక్షసుల స్వభావము. మీరు పరిశుద్ధులు. శూరులు. మీరు ఋజువర్తనులు. అదే మీ బలము. అందువల్ల మీరు ఎప్పుడూ హెచ్చరికతో ఉండవలెను. యుద్ధభూమిలో రాక్షసులను ఎప్పుడూ మీరు నమ్మకూడదు. ఈ నిదర్శనము వల్లనే రాక్షసులు ఎప్పుడూ కుటిలురు అని తేలిపోయింది" అంటూ ఆ మహాబలవంతుడు గరుత్మంతుడు రాముడితో చెప్పినాడు. స్నేహాతిశయముతో రాముణ్ని కౌగలించుకొని "ఓ మిత్రుడా, నీవు ధర్మము తెలిసినవాడవు. శత్రువులమీద కూడా నీకు వాత్సల్యము ఉంది.

"ఓ రామా, నాకు అనుజ్ఞ ఇవ్వు. నేను పోయి వస్తాను. నేను నీకు ఎట్లా స్నేహితుడనో తెలుసుకోవలెను అనే కుతూహలము వద్దు. నీవు వీరుడవు. యుద్ధములో కృతకృత్యుడవు అవుతావు. అప్పుడు నేను ఎవరినో నీకు తెలుస్తుంది. రామప్రభూ, లంకాపట్టణములో బాలవృద్ధులనుమాత్రము వదలిపెట్టి తక్కిన వారిని అందరినీ నీ బాణపరంపరలతో ముంచి వేయవలెను. నీ శత్రువును రావణాసురుణ్ణి చంపి వేయవలెను. సీతాదేవిని తెచ్చుకోవలెను" అని చెప్పి అమితవేగముతో పోయే ఆ వీర్యవంతుడు గరుత్మంతుడు వానరుల మధ్యను ఉన్న రామలక్ష్మణులకు ప్రదక్షిణము చేసి వారిని కౌగలించుకొని వారికి నమస్కారపురస్సరముగా వీడ్కోలు చెప్పి ఆకాశమార్గాన వాయుదేవుడివలె సాగి పోయినాడు.

ఏ బాధా లేకుండా హాయిగా ఉన్న రామలక్ష్మణులను చూచి వానరులు సంతోషముతో సింహనాదాలు చేసినారు. అదివరకటివలె భేరీలు మ్రోగించినారు మృదంగాలు వాయించినారు. శంఖాలు పూరించినారు. తోకలు ఝాడించినారు. మరింత సంతోషముతో సింహనాదాలు చేసినారు. వృక్షాలు తీసుకొని పోరాడే ఆ వానరయోధులు అంతట పరాక్రమించి భుజాలు చరిచి నానావిధమహావృక్షాలనూ పెళ్ళగించి లక్షలకొద్దీ యుద్ధసన్నద్ధులు అయినారు. అప్పుడు వానరయోధులు అందరూ మహాధ్వనులు చేస్తూ నిశాచరులను భయపెట్టుతూ యుద్ధకాముకులు అయి లంకాపట్టణద్వారాలను ఎదుర్కొన్నారు.

ఆ మహానిశీథములో వానరయోధుల మహానాదాలు గ్రీష్మర్తువు అయిపోయిన తరువాత తొలకరి మేఘాలు ఉరిమే ఉరుములవలె గలిబిలిగా మహాభయంకరముగా వినిపించినవి.

## ౫౧

అప్పుడు ఆ బలవంతులు వానరులు చేసిన కోలాహలధ్వనులూ సింహనాదాలు రాక్షసులమధ్యను సభాభవనములో ఉన్న రావణాసురుడు విన్నాడు. ఆ గంభీరఘోషాన్ని వినీ వినడముతో మంత్రుల వంక చూచి వానరులు అందరూ మహామేఘాలవలె గర్జిస్తున్నారు. వాండ్లకు అందరికీ పరమసంతోషము వేసి ఉండవలెను. స్పష్టముగా తెలుస్తున్నది. పరమసంతోషమే వేయకపోయినట్లయితే వాండ్లు అందరూ అట్లా అరవరు. సందేహము లేదు. ఆ మహాధ్వని నుంచే సముద్రము అల్లకల్లోలముగా ఉంది. రామలక్ష్మణులు ఇంద్రజిత్తు వదిలిన తీక్ష్ణబాణాలకు కట్టుబడిపోయినారు. ఇప్పుడు వానరుల కోలాహలధ్వనులు వినపడుతున్నవి ఒక వేళ వారికి ఆ శరబంధాలు వదిలిపోయినవి. ఏమోను అని నాకు తోస్తూ ఉంది అని చెప్పి దాపునవున్న రాక్షసయోధులను చూచి "ఓ యోధులారా, వానరులు ఇప్పుడు దుఃఖపడుతూ ఉండవలసింది పోయి కోలాహలధ్వనులు చేస్తూ ఉన్నారు అందుకు కారణము ఏమిటో మీరు యిప్పుడే పోయి తెలుసుకొని రావలెను" అని రావణాసురుడు ఆజ్ఞాపించినాడు.

ఈ మాటలకు ఆ రాక్షసయోధులు అందరూ కలవర పడిపోయినారు. వెంటనే పోయి ప్రాకారము ఎక్కినారు. వానరసైన్యాన్ని చూచినారు. మహాభయంకరము అయిన నాగపాశబంధాలు విడిపోయి రామలక్ష్మణులు హాయిగా తిరుగుతూ ఉండడము కనిపించింది. అందుకు ఆ భయంకరులు భయపడిపోయినారు వారికి దిగులు వేసింది. ఆ ప్రాకారము మీదినుంచి కిందికిదిగి ముఖాలు వెల వెల పోతూ తమ ఏలికదగ్గరకు పోయినారు. వాండ్లు ఏ మాటలు ఎప్పుడు ఎవరితో చెప్పవలెనో తెలిసిన నేర్పరులు. ఆ అప్రియము అప్పుడు తమ ఏలికతో విన్నవించడము మంచిది అనుకొన్నారు.

ఆ రాక్షసయోధులు అప్పుడు రావణాసురుణ్ణి చూచి "రాజా, యుద్ధములో ఇంద్రజిత్తు వదిలిన నాగపాశాలకు అటూ ఇటూ కదలకుండా మెదలకుండా కట్టుపడిపోయిన రామలక్ష్మణులు ఆ నాగపాశాల కట్లు వదిలిపోయి కట్టుతాడు తెంచుకొన్న మదపుటేనుగులవలె చెలరేగి తిరుగుతున్నారు. మేము చూచినాము" అని చెప్పినారు.

ఈ విధముగా ఆ రాక్షసయోధులు చెప్పింది ఆ మహాబలవంతుడు రావణాసురుడు విన్నాడు. అతడికి దిగులు వేసింది. ఆలోచనలో పడ్డాడు. అతని ముఖము వెల వెల పోయింది. దిగులుపడుతూ "ఇంద్రజిత్తు వదిలిన బాణాలు

భయంకరము అయినవి. అమోఘము అయినవి. వాటిని వాడు వరదానమువల్ల సంపాదించినాడు. అవి తీక్ష్ణవిషసర్పాల వంటివి. అవి తేజములో సూర్యుడితో సరిసమానము అయినవి. ఆ బాణాలతో ఇంద్రజిత్తు రామలక్ష్మణులను బంధించి వేసినాడు. ఆ బాణబంధము నుంచి శత్రువులు ఇద్దరూ ఇప్పుడు విముక్తులు అయి ఉన్నట్లయితే రాక్షససైన్యానికి అంతటికీ ప్రాణసంశయావస్థ వచ్చింది అన్నమాట. అట్లా నాకు తోస్తూ ఉంది. ఆ బాణాలు వాసుకి తేజము వంటివి. ఇదివరకు అవి యుద్ధాలలో శత్రువుల ప్రాణాలను తీసి వేసినవి. అవి ఎన్నడూ నిష్ఫలము అయిపోలేదు. ఆ బాణాలు ఇప్పుడు పనికి రాకుండా పోయినవి" అంటూ రావణాసురుడు క్రుద్ధుడు అయిపోయినాడు. మహాసర్పమువలె నిట్టూర్పులు విడిచినాడు. ఆ రాక్షసుల మధ్యను ఉన్న ధూమ్రాక్షుణ్ణి చూచి "ఓ ధూమ్రాక్షుడా, నీ పరాక్రమము భయంకరము అయినది. కాబట్టి నీవు ఇప్పుడు మన రాక్షససైన్యాలలో గొప్ప సైన్యాన్ని తీసుకొనిపోయి వానరులతో కూడా ఆ రామలక్ష్మణులను చంపివేయవలెను" అని చెప్పినాడు.

అంతట ధూమ్రాక్షుడు ఆ ధీమంతుడికి రావణాసురుడికి నమస్కారము చేసి పరమసంతోషముతో ఆ రాజగృహములో నుంచి బయలుదేరినాడు. ఆ రాజగృహద్వారము దాటి వచ్చి యుద్ధోత్సాహముతో సేనాధ్యక్షుణ్ణి చూచి సేనలను వెంటనే పంపించమని చెప్పినాడు. ఆ సేనాధ్యక్షుడు ధూమ్రాక్షుడు చెప్పిన రాజాజ్ఞను శిరసా వహించి అప్పటికి అప్పుడు రాక్షససైన్యాన్ని సిద్ధము చేసినాడు.

నడుములకు గంటలు కట్టుకొన్న భయంకరాకారులు అయిన నిశాచర యోధులు శూలాలూ ముద్గరాలూ మొదలు అయిన వివిధాయుధాలూ చేతులలో పట్టుకొని సంతోషాతిశయముతో గర్జిస్తూ ధూమ్రాక్షుడి వెంట నడిచినారు. అప్పుడు ఆ ధూమ్రాక్షుడి వెంట పోవడానికి నాల్గు వైపులనుంచి రాక్షసయోధులు గదలూ ఇనుపదండాలూ ముసలాయుధాలూ ఇనుప గుదియలూ విడిచివాటు గుదియలూ బల్లెములూ ఈటెలూ గండ్రగొడ్డళ్లూ తీసుకొని మహామేఘాల వలె గర్జిస్తూ వచ్చి చేరినారు.

ధ్వజాలతోనూ బంగారు కిటికీలతోనూ ఉన్న రథాలకు వివిధముఖాల కంచర గాడిదలనూ పూన్చినారు. ఆ రథాలమీద కవచాలు తొడుగుకొన్న రాక్షసయోధులు కొందరు బయలుదేరినారు. పెద్ద పులులవలె దురాసదులు అయిన రాక్షసయోధులు కొందరు గుర్రాల మీదనూ కొందరు మదపు ఏనుగుల మీదనూ బయలుదేరినారు.

ధూమ్రాక్షుడు తోడేళ్లవంటి ముఖాలతోనూ సింహాలవంటి ముఖాల తోనూ బంగారు అలంకరణాలతోనూ ఉన్న కంచరగాడిదలు పూన్చిన రథము ఎక్కినాడు. ఆ రథము భయంకరధ్వనులతో కదిలింది. రాక్షససైన్యము ఆ రథము వెంట నడిచింది. వానరయూథాలతో హనుమంతుడు ముట్టడించిన లంకాపట్టణ పశ్చిమద్వారము వైపుకు ఆ రథముమీద ధూమ్రాక్షుడు ఖులాసాగా నవ్వుతూ బయలుదేరినాడు.

అట్లా పశ్చిమద్వారానికి పోతూ ఉన్న ఆ మహాభయంకరుడికి ఆ భీమవిక్ర ముడికి ధూమ్రాక్షుడికి అంతరిక్షము నుంచి ఘోరము అయిన పక్షులు అడ్డము వచ్చినవి. ఆ రథశీర్షముమీద మహాభయంకరము అయిన ఒక గద్ద వాలింది. శవా లను తినే రాబందులు పక్షులు ఆ రథధ్వజముమీద వాలి అవి అక్కడ నిలువలేక నేల కూలినవి. నెత్తురుతో తడిసిన తెల్లటి మొండెము ఒకటి వికృతస్వరముతో ఏడుస్తూ ధూమ్రాక్షుడి సమీపములో నేలమీద పడ్డది. నెత్తురు వాన కురిసింది. భూమి చలించింది. పిడుగుల ధ్వనితో గాలి ఎడా పెడా కొట్టింది దిక్కులు అన్నీ చీకట్లు కమ్ముకొన్నవి. ఆ మహాఘోరము అయిన ఉత్పాతాలను చూచి ధూమ్రాక్షుడు మనస్సులో దిగులు పడ్డాడు. రాక్షసయోధులు అందరూ భయ పడిపోయినారు. ఆ ధూమ్రాక్షుడి ముందు నడుస్తూ ఉన్న రాక్షసయోధులు దిగు లతో భయముతో మూర్ఛపోయినారు. అయితే ఆ బలవంతుడు ఆ మహాభయం కరుడు ధూమ్రాక్షుడు యుద్ధోత్సాహము నుంచి ఆ దుశ్శకునాలను లెక్కచేయ లేదు. ఆ రాక్షససైన్యముతో ముందుకు సాగిపోయినాడు. రామాజ్ఞలను శిరసా వహించి ఎదురుగుండా మహాప్రవాహము వలె సాగివస్తూ ఉన్న వానరవాహి నులను ధూమ్రాక్షుడు చూచినాడు.

## ౫౨

అట్లా తమమీదికి వస్తూఉన్న ఆ భయంకర పరాక్రముణ్ణి ధూమ్రాక్షుణ్ణి వానరులు అందరూ చూచినారు. యుద్ధకాంక్షతో సంతోషపడ్డారు. సింహ నాదాలు చేసినారు. అప్పుడు వానరులకూ రాక్షసులకూ దొమ్మీగా పెద్ద యుద్ధము జరిగింది.

శూలాలతోనూ ముద్గరాలతోనూ భయంకరము అయిన పరిఘాయుధాల తోనూ నానా వర్ణాల శూలాలతోనూ రాక్షసులూ చెట్లతోనూ రాళ్లతోనూ వానరులూ పోరాటము సాగించినారు. పరస్పరమూ ఘోరముగా కొట్టు కొన్నారు. ఆ ఘోరాకారులు రాక్షసులు వానరులను అనేకమందిని తెగవేసి

వారు. వానరులు చెట్లతో కొట్టి రాక్షసులను అనేకమందిని నేలమట్టము చేసి వేసినారు. రాక్షసులు క్రుద్ధులు అయిపోయి కంకపక్షి రెక్కలతో సూటిగా పోయే తీక్ష్ణబాణాలను భయంకరముగా వదిలి వానరులను చంపివేసినారు. అంతే కాదు, వాండ్లు ఆ రాక్షసులు భయంకరముఅయిన గదలతోనూ పట్టిసాలతోనూ కూటాలతోనూ ముద్గరాలతోనూ ఆ మహాబలవంతులను వానరులను అనేకమందిని కొట్టి చంపివేసినారు.

అందుకు వానరవీరులు భయపడలేదు. వారి యుద్ధోత్సాహము తగ్గలేదు. రోషము హెచ్చింది. రాక్షసులు అట్లా తమ యోధుల దేహాలను బాణాల తోనూ శూలాలతోనూ భేదిస్తూ ఉన్నప్పటికిన్నీ వానర యూధపతులు మహా రోషముతో పోరాటము సాగించడానికి వివిధవృక్షాలనూ వివిధశిలలనూ పెళ్లగించుకొని వచ్చినారు. సింహనాదాలు చేస్తూనూ తమ తమ పేళ్లు చెప్పు కొంటూనూ అంతకు అంతకూ భయంకరవేగముతో విజృంభించి ఆ భయంకరా కారులను రాక్షసులను అద్భుతముగా నలగకొట్టినారు ఆ జయశీలురు వానర వీరులు రాక్షసులను కొంతమందిని చితుకకొట్టినారు. నెత్తురు తాగే ఆ రాక్షసు లను, కొంతమందిని నెత్తురు కక్కుకొని చచ్చేట్టు కొట్టినారు. కొంతమందిని రెండుపక్షాలుగా చీల్చివేసినారు. వృక్షాల దెబ్బలకు రాక్షసులు కుప్పలు కుప్ప లుగా పడిపోయినారు. రాళ్లదెబ్బలకు నుగ్గునుగ్గ అయిపోయినారు.

వానరులు రువ్విన రాళ్లకు రథాల ధ్వజాలు విరిగిపోయి ఆ రథాలకు కట్టిన కంచరగాడిదలు చచ్చిపోయి ఆ రథాలు ముక్కలు ముక్కలుఅయి నేలపాలు అయినవి. పర్వతాలు అంతంత ఏనుగులూ ఆ ఏనుగులమీది రాక్షసులూ గుర్రాలూ ఆ గుర్రాలమీది రాక్షసులూ చచ్చి పడిపోయి పెద్ద పెద్ద పర్వతాలు అంత కుప్పలు కుప్పలుగా ఆ యుద్ధభూమిలో కనిపించినవి. ఆ భయంకర పరాక్రములు వానరులు అమిత వేగముతో పయికి ఎగిరి తీక్ష్ణముఅయిన తమ తమ గోళ్లతో రాక్షసుల ముఖాలు గీరి దేహాలను చీల్చివేసినారు. రాక్షసులు అనేక మంది తల వెంట్రుకలు విరపోసుకొని నెత్తురుతో తడిసిపోయి ముఖాలు వివర్ణము అయిపోయి నేలమీద పడి మూర్ఛపోయినారు. అప్పుడు కొందరు రాక్షసులు పరమ కుపితులుఅయి భయంకరముగా గర్జిస్తూ వజ్రాయుధాలవంటి తమ తమ చేతులతో కొట్టి వానరులను తరిమివేసినారు. అట్లా తరుముకొంటూ అమిత వేగముతోవచ్చి తమ పయిన పడుతూఉన్న రాక్షసులను అప్పుడు వానరులు అంతకన్నా అమిత వేగముతో ఎదురుతిరిగి పిడికిళ్లతో పొడిచి కాళ్లతో తన్ని గోళ్లతోనూ కోరలతోనూ చీల్చివేసి వృక్షాలతో కొట్టి నానాహింసలూ

పెట్టినారు. కనపడ్డ రాక్షసులను అందరినీ వానరులు అట్లా కొట్టుతూ ఉంటే ఆ బాధ భరించలేక రాక్షసులు అనేకమంది పరుగెత్తి పారిపోయినారు.

ఆ రాక్షసపుంగవుడు ధూమ్రాక్షుడు తన సైన్యములో చాలాభాగము పారి పోవడము చూచినాడు. కుపితుడు అయి పోయినాడు. యుద్ధోత్సాహముతో పోరాడుతూ ఉన్న వానరయోధులను హింసించడానికి బయలుదేరి వచ్చినాడు. అతని వెంట ఉన్న రాక్షసవీరులు కొంతమంది ఈటెలతో వానరులను పొడిచి నారు. కొందరు ముద్గరాలతో కొట్టినారు. ఆ దెబ్బలకు అనేకమంది వానరులు నెత్తురుతో తడిసి నేలమీద పడిపోయినారు. అప్పుడు రాక్షసులు మరి కొందరు ఇనుపగుదియలతోనూ భిండివాలాలతోనూ పట్టిసాలతోనూ వానరులను అనేక మందిని కొట్టినారు. ఆ ఆయుధాల దెబ్బలకు వానరుల దేహాలు ఛిన్నా భిన్నము అయి పోయి అవయవాలు స్వాధీనము తప్పిపోయి నేలకూలి ప్రాణాలు కోలు పోయినారు. ఆ రాక్షసుల శూలాల పోట్లకు కొందరు వానరులు నెత్తురుకారుతూ నేలమీద పడిపోయినారు. ఆ రాక్షసుల పక్క వేట్లకు కొంతమంది వానరుల గుండెకాయలు పగిలి పోయినవి. త్రిశూలాలతో రాక్షసులు పొడుస్తూ ఉంటే కొంత మంది వానరుల పేగులు వెళ్ళుకొని వచ్చినవి. ఆ రాక్షసులు కొందరు వానరులను తరుమకొట్టినారు. అట్లా వానరులకూ రాక్షసులకూ ఆ యుద్ధము పరమ భయంకరముగా జరిగింది.

అల్లెత్రాటి ధ్వని మనోహరము అయిన వీణానాదముగానూ ఆ యోధు లకు దెబ్బలు తగిలి నందువల్ల వచ్చిన ఎక్కిళ్లు తాళధ్వనులుగానూ ఆ యోధుల తూలుగులు మందస్వరముతో పాడుతున్న సంగీతముగానూ గాంధర్వవిద్య యుద్ధ రూపాన అప్పుడు ఆ యుద్ధభూమిలో విజృంభించింది.

అప్పుడు ఆ యుద్ధరంగములో ధూమ్రాక్షుడు చేతిలో ధనుస్సు పట్టుకొని పక పక నవ్వుతూ వానరుల మీద బాణవర్షము కురిపించినాడు. ఆ బాణాల బాధకు నిలువలేక వానరులు దశదిశలా పరుగులు ఎత్తి సాగినారు. అట్లా పారి పోతున్న తన వానరసైన్యాన్ని హనుమంతుడు అప్పుడు చూచినాడు. అతడికి ధూమ్రాక్షుడి మీద కోపము వచ్చింది. తన తండ్రి వాయుదేవుడితో సరిసమా నము అయిన ఆ పరాక్రమవంతుడి కన్నులు అప్పుడు రెండు ఇంతలు ఎర్రపడి పోయినవి. కొనలు తేలిన పెద్ద రాతి బండను చేతితో తీసుకొని ధూమ్రాక్షుడి రథముమీద విసరి వేసినాడు. అట్లా అంతరిక్షములో వస్తూఉన్న ఆ పెద్ద రాతి బండను అప్పుడు ధూమ్రాక్షుడు చూచినాడు. కలవర పడి పోయినాడు. గదను తీసుకొని ఇట్టే ఆ రథము మీదినుంచి నేలమీదికి దూకినాడు. హనుమంతుడు

విసరి వేసిన ఆ పెద్ద రాతిబండ ఆ ధూమ్రాక్షుడి రథముమీద పడ్డది. ఆ రథ ధ్వజము విరిగిపోయింది. నొగతోనూ చక్రాలతోనూ ఆ రథము నుగ్గు నుగ్గు అయి నేల కూలింది. బోదెతోనూ కొమ్మలతోనూ ఉన్న ఒక మహావృక్షాన్ని అప్పుడు హనుమంతుడు తీసుకొని రాక్షసయోధులను కొట్టడము మొదలు పెట్టినాడు. ఆ చెట్టుతో కొట్టిన దెబ్బలకు రాక్షసయోధులు ఎంతోమంది శిరస్సులుపగిలి నెత్తురు వరదలు అయి పారింది. నెత్తురుతో ఒళ్లు అంతా తడిసి నేలమీద పడిపోయి నారు. అట్లా రాక్షససైన్యాన్ని పడకొట్టి బ్రతికిఉన్నవారిని పారతోలి హనుమంతుడు కొనలు తేలిన మరి ఒక పెద్ద రాతిబండను తీసుకొని అంతట ధూమ్రాక్షుడి మీదికి పరుగెత్తినాడు. అట్లా తనమీదికి వచ్చి పడపోతున్న హనుమంతుణ్ణి ఆ వీర్యవంతుడు ధూమ్రాక్షుడు చూచినాడు. గదను చేతితో పట్టుకొని సింహనాదము చేస్తూ ధూమ్రాక్షుడు అమితవేగముతో హనుమంతుడి మీదికి పరుగెత్తినాడు. ఎన్నో మేకులతో ఉన్న ఆ గదను ధూమ్రాక్షుడు హనుమంతుడి తలమీదికి విసరి వేసినాడు. భయంకరము అయిన ఆ గద హనుమంతుడి నెత్తి మీద పడ్డది. వాయుపుత్రుడు ఆ మహా బలవంతుడు ఆ దెబ్బను గురించి ఆలోచించను అయినా ఆలోచించకుండా చేతిలోఉన్న శిలను ధూమ్రాక్షుడిమీద విసరి వేసినాడు. అది పోయి ధూమ్రాక్షుడి నడి నెత్తిమీద పడ్డది. ఆ రాతిదెబ్బకు ధూమ్రాక్షుడు సర్వాంగాలు వివశము అయిపోయినవి. అంతట వాడు నేల కూలినాడు. అట్లా చచ్చి పడిపోయిన ధూమ్రాక్షుణ్ణి చావకుండా మిగిలిఉన్న రాక్షసయోధులు అందరూ చూచినారు. భయపడి లంకా పట్టణములోకి పరుగెత్తి పారిపోయినారు.

శత్రువులను చంపివేసి నెత్తురు వరదలు అయి పారేటట్టుచేసి అలసిపోయిన ఆ మహా పరాక్రమవంతుణ్ణి హనుమంతుణ్ణి వానరులు అందరూ పూజించినారు. సంతోషించినారు.

## 43

హనుమంతుడు ధూమ్రాక్షుణ్ణి చంపివేసినట్టు రాక్షసేశ్వరుడు రావణాసురుడు విన్నాడు. మహా కోపముతో విషసర్పము వలె నిట్టూర్పులు విడిచినాడు. శూరుడూ మహాబలవంతుడూ అయిన వజ్రదంష్ట్రుణ్ణి చూచి "ఓ వీరుడా, నీవు సైన్యాన్ని వెంటపెట్టుకొని పో. ఆ రాముణ్ణి ఆ సుగ్రీవుణ్ణీ వారి వానరసైన్యాన్నీ వధించు" అని చెప్పినాడు. అందుకు ఆ మాయావి వజ్రదంష్ట్రుడు "అట్లా చేస్తా" అని రాక్షస వీరులను వెంటపెట్టుకొని రాక్షస సైన్యముతో బయలుదేరినాడు.

ఏనుగులతోనూ గుర్రాలతోనూ కంచరగాడిదలతోనూ ఒంటెలతోనూ వివిధ వర్ణాల పతాకాలూ ధ్వజాలు ఎత్తిన రథాలతోనూ రాక్షససైన్యము యుద్ధ సన్నద్ధము అయి వచ్చింది. వజ్రదంష్ట్రుడు చిత్ర విచిత్ర కాంతులతో ధగధగ లాడుతూ ఉన్న కిరీటమూ బాహుపురులూ కవచమూ ధరించి ధనుస్సు తీసుకొని యుద్ధ సన్నద్ధుడు అయినాడు. తప్త కాంచనా లంకారాలతో ధగధగలాడుతూ పతాకాలు ఎగురుతూ ఉన్న రథానికి ప్రదక్షిణము చేసినాడు. అంతట ఆ రథము ఎక్కినాడు. ఆ రాక్షస సేనానాయకుడి వెంట పదాతులు లారీలతోనూ తోమరాలతోనూ రంగు రంగుల శూలాలతోనూ ముసలాలతోనూ భిండివాలాలతోనూ పాశాలతోనూ శక్తులతోనూ పట్టిసాలతోనూ ఖడ్గాలతోనూ చక్రాయుధాలతోనూ గదలతోనూ పదును అయిన గండ్రగొడ్డళ్ళతోనూ ఇంకా వివిధాయుధాలతోనూ నడిచినారు. గజసాదులు తోమరాలూ అంకుశాలూ తీసుకొని యుద్ధ సన్నద్ధులు అయి మదపు టేనుగులు ఎక్కినారు. యుద్ధభయము లేకుండా తిరిగే ఆ మదపుటేనుగులు అప్పుడు కదలిపోతున్న పర్వతాలవలె కనుపించినవి. భయంకరము అయిన రాక్షససైన్యము యుద్ధానికి అట్లా బయలుదేరి పోతూ వుంటే వర్షాకాలములో ఆకాశములో మెరుపులతో ఉరుములతో పరుగులెత్తే మేఘ సమూహాల వలె కనిపించింది. ఆ రాక్షససైన్యము ఆయుధాల తళతళలతోనూ దిక్కులు పిక్కటిల్లిపోయే సింహనాదాలతోనూ బయలుదేరి అంగదుడు ముట్టడించిన లంకా పట్టణ దక్షిణద్వారము వైపు పోయింది.

ఆ రాక్షససైన్యము అట్లా పోతూ ఉండగా అశుభాలు కనిపించినవి, మేఘాలు లేని నిర్మలాకాశమునుంచి కన్నులు చెదిరిపోయే కొరవులు కింద పడ్డవి. నక్కలు అగ్నిజ్వాలలు కక్కుతూ భయంకరముగా అరిచినవి భయం కరము అయిన మృగాలు రాక్షసుల మరణాన్ని సూచిస్తూ అరిచినవి. అప్పుడు రాక్షసయోధులు భయముతో ఉక్కిరి బిక్కిరి అయి తడబడి పోయినారు.

ఆ మహాపరాక్రమవంతుడు ఆ మహాబలవంతుడు వజ్రదంష్ట్రుడు ఆ ఉత్పాతాలను అన్నిటినీ చూచినాడు. వాటిని అతడు లెక్క చేయలేదు. ధైర్యము చెడ కొట్టుకోకుండా రణోత్సాహముతో ఆ రాక్షససైన్యాన్ని వెంట పెట్టుకొని పోయినాడు.

జయముతో తేజరిల్లుతూ ఉన్న వానరులు వీరులు అందరూ అప్పుడు ఆ వస్తూ ఉన్న రాక్షససైన్యాన్ని చూచినారు. దశదిశలూ మారు మోగి పోయేట్లు సింహనాదాలు చేసినారు. భయంకరాకారులూ భయంకరాలూ అయిన

ఆ వానరులకూ రాక్షసులకూ అప్పుడు దొమ్మిగా పోరాటము ఆరంభము అయింది. పరస్పరమూ మహోత్సాహముతో యుద్ధము చేసినారు. అటు రాక్షసులూ ఇటు వానరులూ దేహాలు తెగిపోయి మెడలు విరిగిపోయి సర్వాంగాలూ నెత్తురుతో తడిసిపోయి నేల కూలినారు. పోరాటములో వెనుతీయని రాక్షసయోధులూ వానరయోధులూ నానావిధాయుధాలతోనూ పరమభయంకరముగా యుద్ధము చేసినారు. వానరులు అప్పుడు చెట్లతో కొట్టుతూ ఉన్న ధ్వనులూ రాళ్లు రువ్వుతూ ఉన్న ధ్వనులూ రాక్షసుల వివిధాయుధాల ధ్వనులూ రథచక్రాలధ్వనులూ ధనుష్టంకారధ్వనులూ భేరీమృదంగాదుల ధ్వనులూ శంఖాలు పూరించిన మహాధ్వనులూ పరమభయంకరముగానూ దొమ్మిగానూ వినిపించినవి. అంతట అటు రాక్షసులూ ఇటు వానరులూ ఆయుధాలు వదిలిపెట్టి బాహువులతో పోరాడటము మొదలు పెట్టినారు. వానరులు రాక్షసులను అరచేతులతో చరిచినారు. పిడికిళ్ళతో పొడిచినారు. కాళ్ళతో తన్నినారు. రాళ్లు రువ్వినారు. చెట్లతో కొట్టినారు. ఈ విధముగా వానరయోధులు రాక్షసయోధులను చాలా మందిని చంపివేసినారు.

ఆ యుద్ధములో వజ్రదంష్ట్రుడు తీవ్రబాణాలు వదిలి వానరులను బాధపెట్టుతూ లోకసంహారకాలములో పాశహస్తుడు అయిన యముడివలె విహరించినాడు. ఆయుధవిద్యలో ఆరితేరిన రాక్షసులు కోపమువచ్చి వివిధాయుధాలూ తీసుకొని ఒళ్లు ఎరగకుండా పోరాడి ఒక కొంత వానరసైన్యాన్ని సంహారము చేసి వేసినారు. రాక్షసులు అట్లా వానరులను వధించి వేయడము అంగదుడు చూచినాడు. ఆ వీర్యవంతుడు క్రోధతామ్రాక్షుడు అయినాడు. ప్రళయకాలాగ్నిహోత్రుడి వలె రేగినాడు. స్వల్పమృగాలను సింహమువలె అంగదుడు రాక్షసులను అనేక మందిని ఒక చెట్టుతో కొట్టి చంపివేసినాడు. పరాక్రమములో దేవేంద్రుడితో సరిసమానుడు అయిన ఆ అంగదుడు అప్పుడు పరమభయంకరముగా పోరాడినాడు. ఎట్ట ఎదట ఉన్న భయంకరపరాక్రములను రాక్షసులను అంగదుడు చెట్టుతో కొట్టినాడు. గొడ్డలి వేటుకు చెట్లవలె ఆ అంగదుడి దెబ్బలకు ఆ రాక్షసులు నేల కూలినారు. విరిగి పోయిన రథాలతోనూ, చచ్చి పడిపోయిన ఏనుగులతోనూ ముక్కలు ముక్కలు అయి పడిపోయిన ధ్వజాలతోనూ రాక్షసుల రక్తధారలతోనూ వానరుల రక్తధారలతోనూ అప్పుడు ఆ యుద్ధభూమి పరమభయంకరముగా కనిపించింది.

ఆ రాక్షసులు ధరించిన హారాలతోనూ బాహుపురులతోనూ వివిధాభరణాలతోనూ వారు కట్టుకొన్న ఆ యా రంగురంగుల గుడ్డలతోనూ తళతళలాడే

వివిధాయుధాలతోనూ నక్షత్రాలతో తేజరిల్లే శరత్కాల రాత్రివలె ఆ యుద్ధ భూమి శోభించింది.

ఆ అంగదుడి వేగానికి రాక్షసమహాసైన్యాలు అప్పుడు గాలికి మేఘాలవలె పరుగులెత్తినవి.

౫౪

అంగదుడు జయించడమూ తన రాక్షససైన్యము కొంత హతము అయిపోవడమూ కొంత పలాయనము అయిపోవడమూ ఆ మహాబలవంతుడు వజ్రదంష్ట్రుడు చూచి కోపముతో రెచ్చిపోయినాడు. దేవేంద్రుడి వజ్రాయుధము వలె భయంకరధ్వని అయ్యేట్టుగా తన ధనుస్సును సారిస్తూ వానరసైన్యాలమీద బాణవర్షము కురిపించినాడు. వజ్రదంష్ట్రుడు ఒక్కడే కాకుండా అప్పుడు ఆ యుద్ధములో శూరులూ ముఖ్యులూ అయిన రాక్షసులు రథాలమీద వచ్చి నానా విధాయుధాలతోనూ అద్భుతముగా పోరాటము సాగించినారు. వానరులలో శూరులూ శ్రేష్ఠులూ అయిన వారు పెద్ద పెద్ద రాళ్ళను తీసుకొని అన్నివైపుల నుంచీ రాక్షసులను కొట్టినారు. ఆ మహాయుద్ధములో రాక్షసులు వానరులను వివిధాయుధాలతోనూ కొట్టినారు. వానరులు రాక్షసులను మహావృక్షాలతోనూ పెద్ద పెద్ద రాళ్ళతోనూ పర్వతాలతోనూ కొట్టినారు. యుద్ధరంగములోనుంచి వెనకకు మళ్ళని ఆ వానరవీరసమూహాలకున్నూ రాక్షసవీరసమూహాలకున్నూ అప్పుడు ఘోరముఅయిన యుద్ధము జరిగింది.

తలలు తెగిపోయి చేతులూ కాళ్ళూ విరిగిపోయి ఆయుధాల దెబ్బలు ఒంటి నిండా తగిలి నెత్తురుతో తడిసిపోయి వానరయోధులూ రాక్షసయోధులూ నేల కూలినారు. ఆ యోధుల కళేబరాల కోసము అప్పుడు రాబందులూ గద్దలూ కాకులూ నక్కలూ గుంపులు గుంపులుగా వచ్చినవి. ఆ శవాలను ఆ పక్షులు అన్నీ ముసురుకొన్నవి.

ఆ వజ్రదంష్ట్రుడు చూస్తూ ఉండగానే రాక్షససైన్యాన్ని వానరసైన్యము వధించి వేసింది. వానరయోధులు కొట్టి చంపివేస్తూ ఉంటే రాక్షసయోధులు భయపడి పారిపోవడము చూచి వజ్రదంష్ట్రుడు రోషతామ్రాక్షుడు అయి చేతిలో ధనుస్సు తీసుకొని భయంకరముగా మోగిస్తూ వానరసైన్యముమీదికి పోయినాడు. కంకపక్షి రెక్కలతో సూటిగా పోయే బాణాలను వదిలి వానరులను భేదించినాడు. ఒక్కొక్క బాణానికి అయిదుగురిని ఆరుగురిని ఏడుగురిని ఎనిమిదిమందిని తొమ్మిదిమందిని వానరులను ఒక్కసారిగా భేదించినాడు. ఆ

పరమపరాక్రమవంతుడు వజ్రదంష్ట్రుడు ఆ విధముగా చిత్రవిచిత్రముగా బాణాలు వదిలి వానరులను చంపివేయడము మొదలు పెట్టినాడు.

అప్పుడు వానరయోధులు అందరూ భయపడిపోయినారు. దేవతలు అందరూ బ్రహ్మదేవుడి చుట్టూ మూగేటట్టు అప్పుడు ఆ వానరయోధులు అంగదుడి చుట్టూ మూగినారు. వానరసైన్య సమూహాలు భగ్నము అయిపోవడము చూచి అంగదుడు తనను ఎదురు చూస్తూ ఉన్న వజ్రదంష్ట్రుడికి ఎదురుగుండా పోయినాడు. అంగదుడూ వజ్రదంష్ట్రుడూ కలుసుకొన్నారు. ఉభయులూ పరమక్రుద్ధులు అయిపోయినారు. సింహమూ మదపుటేనుగూవలె సంచరించినారు. ఆ మహాబలవంతుడు వజ్రదంష్ట్రుడు మదపుటేనుగు మీద తోమరాల వలె అంగదుడి ఆయువుపట్లలో ఒక వెయ్యిబాణాలు వదిలినాడు.

ఆ మహాబలవంతుడు ఆ భయంకర పరాక్రమవంతుడు అంగదుడి సర్వాంగాలలోనూ బాణాలు గుచ్చుకొన్నవి. అతడు నెత్తురుతో తడిసిపోయినాడు. అప్పుడు అంగదుడు ఒక మహావృక్షాన్ని పెళ్లగించి వజ్రదంష్ట్రుడిమీద విసరివేసినాడు. అట్లావచ్చి తనమీద పడిపోతున్న ఆ మహావృక్షాన్ని వజ్రదంష్ట్రుడు చూచినాడు. కలవరపడిపోకుండా అనేక బాణాలువదిలి ఆ మహావృక్షాన్ని ఖండించివేసినాడు. ఆ మహావృక్షము ముక్కలు ముక్కలు అయి నేలమీద పడిపోయింది. అంగదుడు వజ్రదంష్ట్రుడి పరాక్రమాన్ని గమనించినాడు. ఒక వెడల్పాటి పర్వతశిఖరాన్ని తీసుకొని ఆ వజ్రదంష్ట్రుడిమీద రువ్వి సింహనాదము చేసినాడు. అట్లావచ్చి తనమీద పడబోతున్న ఆ పర్వతశిఖరాన్ని ఆ వీర్యవంతుడు వజ్రదంష్ట్రుడు చూచినాడు. తత్ క్షణమే ఒక గద తీసుకొని నిర్భయముగా నేలమీదికి దూకినాడు. అంగదుడు రువ్విన పర్వతశిఖరము వజ్రదంష్ట్రుడి రథముమీద పడ్డది, ఆ రథమూ దానిచక్రాలూ దానినొగా గుర్రాలూ నుగ్గునుగ్గు అయిపోయినవి.

ఈ లోపల అంగదుడు చెట్లతో ఉన్న ఒక పర్వతాన్ని పెళ్లగించి వజ్రదంష్ట్రుడి తలమీద వేసినాడు. అతడు అంతట నెత్తురుకక్కుకొంటూ నేలమీద పడి మూర్ఛపోయినాడు, గదను కౌగలించుకొని కొంచెముసేపు నిట్టూర్పులు విడిచి ఒళ్లు తెలియకుండా పోయిన ఆ నిశాచరుడు క్షణమూర్ఛ తేరుకొన్నాడు. కుపితుడు అయిపోయినాడు. ఎట్టఎదట నిలుచునిఉన్న అంగదుణ్ణి చూచినాడు. ఇట్టే తనగదతో అంగదుడి ఎదురు రొమ్ములమీద కొట్టినాడు. కాని తృప్తిలేక పోయింది. ఆ గదను పారవేసి ముష్టియుద్ధానికి తలపడ్డాడు. అప్పుడు ఆ రాక్షస

వీరుడూ ఈ వానరవీరుడూ ఒకరిని ఒకరు బాగా కొట్టుకొన్నారు. ఉభయులూ నెత్తురుకక్కుతూ ఆయాసపడుతూ బుధాంగారకులవలె పోరాడినారు.

అప్పుడు ఆ పరమపరాక్రమవంతుడు కపికుంజరుడు అంగదుడు పూల తోనూ పండ్లలోనూ ఉన్న ఒక చెట్టును పెళ్లగించి పోరాటానికి సంసిద్ధము అయినాడు. మరిఒక చెట్టును పెళ్లగించి వజ్రదంష్ట్రుడున్నూ పోరాడటానికి నిలుచున్నాడు. ఎద్దుచర్మము డాలు వారునూ అందము అయిన గజ్జలతో పొడు గాటి ఒరలోఉన్న ఖడ్గాన్ని అంగదుడు తీసుకొన్నాడు. ఆ వానరుడూ ఆ రాక్షసుడూ ఒకరిని ఒకరు జయించడానికి నానావిధాలా పోరాడినారు. గట్టిగా కొట్టుకొన్నారు. ఉభయులకూ ఒంటినిండా గాయాలు అయినవి. నెత్తురుతో తడిసిపోయి ఉభయులూ విరగపూసిన మోదుగుచెట్లవలె శోభించినారు. ఉభయులూ అలసిపోయినారు. మోకాళ్లమీద నిలుచున్నారు. క్రరదెబ్బతిన్న తాచు పామువలె రెప్పపాటులో కన్నులలోనుంచి నిప్పులురాలుస్తూ అంగదుడు లేచినాడు. చక్కగా సానపెట్టిఉన్న తెల్లటి ఖడ్గాన్ని ఇట్టే ఒరలోనుంచి దూసి వజ్రదంష్ట్రుడి కంఠాన్ని తెగవేసినాడు. ఒళ్లుఅంతా నెత్తురుతో తడిసిపోయి గుడ్లుతిప్పుతూ వజ్రదంష్ట్రుడి తలఊడి నేలమీద పడిపోయింది. ఆ తలతోపాటు వజ్రదంష్ట్రుడి మొండెమున్నూ ఆ నేలమీద పడిపోయింది.

అట్లా అయిపోయిన వజ్రదంష్ట్రుణ్ణి రాక్షసయోధులు చూచినారు. భయపడిపోయినారు. విషణ్ణవదనులు అయినారు. సిగ్గుతో తలలువంచుకొన్నారు. గర్వము ఉడిగిపోయి ఏమిచేయడానికి తోచక ఆ రాక్షసయోధులు అందరూ లంకాపట్టణములోకి పరుగెత్తి పారిపోయినారు.

ఆ మహాబలవంతుడు వాలి పుత్రుడు అంగదుడు వజ్రధరుడు అయిన దేవేంద్రుడి ప్రభావముతో వజ్రదంష్ట్రుణ్ణి వధించి వానరసైన్యము మధ్యను వానరుల పూజలు అందుకొంటూ దేవతలమధ్యను దేవేంద్రుడివలె తేజరిల్లినాడు.

౫౪

అంగదుడు వజ్రదంష్ట్రుణ్ణి చంపి వేసినాడు అని రావణాసురుడు విన్నాడు. చేతులు జోడించి తన పక్కను నిలుచునిఉన్న సేనాధ్యక్షుణ్ణిచూచి "ఓ సేనాధ్యక్షుడా, అకంపనుడు సమస్తాస్త్రకోవిదుడు. యుద్ధ ప్రియుడు. యుద్ధములో ప్రసిద్ధికెక్కినాడు. ఎప్పుడూ నా మేలుకోరుతూ ఉంటాడు. తన సైన్యాన్ని కాపాడుకొంటూ శత్రువులను వధించి వేయడములో అకం

పనుడు అతిసమర్థుడు. ఎదిరించ నలవికాని భయంకర పరాక్రములను వెంట పెట్టుకొని అకంపనుడు ఇప్పుడు యుద్ధానికి బయలుదేరి పోవలెను.

"ఓ అకంపనుడా, నీవు పరంతపుడవు. నీవు ఆ మహాబలవంతులను రామ లక్ష్మణులనూ సుగ్రీవుణ్ణీ జయించవలెను. తక్కిన వానరులను అందరినీ సంహారము చేసి వేయవలెను" అని చెప్పినాడు.

రావణాజ్ఞను శిరసావహించి ఆ మహాబలవంతుడు ఆ అలఘుపరాక్రముడు రాక్షససేనాధ్యక్షుడు అప్పటికి అప్పుడు రాక్షస సైన్యాన్ని యుద్ధానికి సిద్ధము చేసినాడు. ఆ సేనాధ్యక్షుడు పురికొల్పినందువల్ల భయంకరాకారులూ భయంకర నేత్రులూ అయిన రాక్షసముఖ్యులు నానావిధాయుధాలతోనూ యుద్ధసన్నద్ధులు అయి వచ్చినారు. మేఘస్వనమువంటి మహాధ్వనులు చెలరేగుతూ ఉండగా మేఘవర్ణముతో తప్తకాంచనకుండలాల ధగధగలతో ఆ మహాకాయుడు అకంపనుడు విశాలము అయిన రథము ఎక్కినాడు. ఆ రథము వెంట రాక్షససైన్యము బయలుదేరింది.

మహాయుద్ధములో అకంపనుడు అకంపముగా పోరాడుతాడు. దేవతలు సహితము అతడు కంపించేట్టు పోరాడలేక పోయినారు. అందువల్లనే అతడు అకంపనుడు అని ప్రసిద్ధికెక్కినాడు. ఆ రథముమీద అప్పుడు అతడు ఆదిత్యుడి వలె తేజరిల్లినాడు.

అకంపనుడు యుద్ధోత్సాహముతో శత్రువుల మీదికి అమితవేగముగా పోతూఉంటే అతని రథాన్ని లాగుకొని పోతూఉన్న గుర్రాలు హఠాత్తుగా ఆగిపోయినవి. నిర్వేతుకముగా నిరుత్సాహముతో నిలుచుండి పోయినవి. అప్పుడు అకంపనుడి ఎడమకన్ను అదిరింది. ఆతడు మాట్లాడపోతే మాటలు తడపడి పోయినవి. ముఖము వెలవెల పోయింది. అప్పుడు గాని ఎడా పెడా కొట్టింది. ఎండ కొంచెం ఉన్నప్పటికిన్నీ ఇట్టే ఆకాశాన మబ్బులు కమ్ముకొన్నవి. పక్షులూ మృగాలూ భయంకరముగా కర్ణకఠోరముగా అరిచినవి. సింహము మూపులవంటి ఎగువ భుజాలతోనూ పెద్దపులివంటి పరాక్రమముతోనూ తేజరిల్లే ఆ అకంపనుడు ఆ ఉత్పాతాలను గురించి ఏమీ ఆలోచించకుండా యుద్ధభూమికి సాగిపోయినాడు.

ఆ అకంపనుడు యుద్ధము చేయడానికి అట్లా రాక్షససైన్యాన్ని వెంట పెట్టుకొని వస్తూ ఉంటే సముద్రము కంపించి పోయేట్టుగా మహాధ్వని అయింది. ఆ మహాధ్వనికి వానరసైన్యము భయపడిపోయింది. అయితే వెంటనే వానరయోధులు అందరూ వృక్షాలూ శిలలూ ఆయుధాలుగా పట్టుకొని పోరా

టానికి నిలుచున్నారు. రాముడి కోసము వానరులూ రావణాసురుడి కోసము రాక్షసులూ తమ ప్రాణాలను వదిలి పెట్టడానికి నిశ్చయించుకొన్నారు. మహా భయంకరముగా యుద్ధము సాగింది. అటు రాక్షసులూ ఇటు వానరులూ అమిత బలవంతులు ఆ యుద్ధములో పాల్గొన్నారు. ఉభయుల యోధులూ పర్వతాకారులు. శూరులు. రాక్షసులను అందరినీ సంహారము చేసి వేయవలెను అని వానరులూ వానరులను అందరినీ సంహారము చేసి వేయవలెను అని రాక్షసులూ పోరాడినారు. ఆ అమితబలవంతులు ఆ పోరాటములో క్రోధావేశముతో అన్యోన్యమూ సింహనాదాలు చేస్తూ ఉంటే ఆ మహాధ్వనికి దిక్కులు పిక్కటిల్లి పోయినవి. ఆ వానరుల పాదాలతోక్కిడికి ఆ రాక్షసుల పాదాల తొక్కిడికి అక్కడి దుమ్ము ఎర్రటి రంగుతో భయంకరముగా పయికి రేగింది. అట్లా రేగిన దుమ్మునుంచి దిక్కులు కనపడకుండా పోయినవి. వెదచల్లిన పట్టువలె ఆ దుమ్ము పయికి పోయినకొద్దీ తెల్లపడి పోయింది. ఆ దుమ్ము అట్లా అంతటా వ్యాపించడమునుంచి ఏ వస్తూవూ కంటికి అగుపించకుండా పోయింది. రథాలు కానీ రథికుల కవచాలుకానీ గుర్రాలుకానీ చివరకు రథాలుకానీ కనపడలేదు. దొమ్మిగా సాగుతూఉన్న ఆ యుద్ధములో వానరులూ రాక్షసులూ అరుస్తూ ఉన్న అరుపులూ పరుగులెత్తుతూ ఉన్న చప్పుళ్ళూతప్ప వారి వారి రూపాలు కనిపించలేదు. దుమ్మునుంచి కనపడకుండాపోయిన ఆ చీకటిలో కోపముతో చెలరేగిన వానరులు తాము ఎవరిని చంపి వేస్తున్నదీ తెలియకుండా వానరులనే చంపివేసినారు. అదే విధముగా రాక్షసులు రాక్షసులనే చంపివేసినారు. అట్లా ఆ చీకటిలో ఒకరిని ఒకరు తెలుసుకోకుండా రాక్షసులూ వానరులూ కొట్టుకొని చస్తూఉంటే నెత్తురు వరదలు అయి పారింది. ఆ యుద్ధభూమి అంతా నెత్తురుతో బురద బురద అయిపోయింది. అంతటితో దుమ్ము రేగడము ఆగి పోయింది. ఆ ప్రదేశము అంతా పీనుగుల మయముగా కనిపించింది. అంతట వానరులు పరాక్రమించి రాళ్ళతోనూ శిలలతోనూ, రాక్షసులు పరాక్రమించి శస్త్రులతోనూ ప్రాసాలతోనూ గదలతోనూ పరిఘలతోనూ తోమరాలతోనూ పోరాటము సాగించినారు. అప్పుడు పర్వతాకారులూ భయంకర కర్ములూ అయిన వానరులు తమ బాహువులతో రాక్షసులనుకొట్టి చంపివేయడము మొదలు పెట్టినారు. అందుకు రాక్షసులు కోపముతో చెలరేగి ఈటెలతోనూ చిల్లకోలలతోనూ ఇంకా పరమదారుణము అయిన ఆయుధాలతోనూ వానరులను కొట్టి చంపివేయ సాగినారు.

అప్పుడు ఆ రాక్షససేనానాయకుడు అకంపనుడు భయంకరపరాక్రములు అయిన తన రాక్షసయోధులను అందరినీ పురికొల్పినాడు. అట్లా మహోత్సాహ

ముతో వచ్చిన ఆ రాక్షసయోధులను వానరులు ఎదిరించి తమ పరాక్రమముతో వాండ్ల చేతులలో ఉన్న ఆయుధాలను ఊడ లాగుకొని మహావృక్షాలతోనూ గొప్పగొప్ప శిలలతోనూ కొట్టి వాండ్లను చంపి వేసినారు.

ఆ సమయాన వానరవీరులు కుముదుడూ మైందుడూ ద్వివిదుడూ చెలరేగి మహావేగముతో పోరాటము సాగించినారు. ఆ వానరవీరులు విలాసముగా మహావృక్షాలు తీసుకొని కొట్టుతూ ఉంటే రాక్షసయోధులు చచ్చి కుప్పలు కుప్పలుగా నేల కూలినారు.

## ౫౬

ఆ యుద్ధములో రాక్షసయోధులను వానరవీరులు అట్లా చంపివేయడము అకంపనుడు చూచినాడు. క్రోధావేశపరవశుడు అయిపోయి తన గొప్ప ధనస్సును సారిస్తూ సారథితో "ఓ సారథీ వానరులు ఎంతోమంది రాక్షసయోధులను చంపివేసినారు. వాండ్లు ఆ వానరులు ఎక్కువమంది ఎక్కడ ఉంటున్నారో చూడు. ఈ రథాన్ని అక్కడికి తోలుకొని పో.

"ఇదుగో ఆ భయంకరాకారులు వానరులు చెట్లనూ పర్వతశిలలనూ తీసుకొని మనకు ఎదురుగుండా రాక్షసులతో పోరాడుతున్నారు. పోరాటములో పొగడ్తకెక్కిన ఆ వానరులను అందరినీ సంహారము చేసి వేస్తాను. వాండ్లు మన రాక్షససైన్యాన్ని అంతా మథించివేసినారు" అని చెప్పినాడు.

అకంపనుడు చెప్పినట్టుగా అమితవేగముతో ఆ రథాన్ని సారథి తోలినాడు. అంతట అకంపనుడు వానరులమీద బాణవర్షము కురిపించడము మొదలు పెట్టినాడు. ఆ బాణాలబాధకు వానరులు నిలువలేకపోయినారు. భయపడిపోయినారు. పోరాటము మానుకొని పరుగులెత్తి సాగినారు. అకంపనుడి బాణాలకు మృత్యువశము అయిపోతూఉన్న తన జ్ఞాతులను వానరులను అప్పుడు హనుమంతుడు చూచినాడు. ఆ మహాబలవంతుడు అంతట అక్కడికి బయలుదేరినాడు. ఆ మహాకపి తమకు తోడుపడడానికి రావడము వానరయూథపతులు చూచినారు. పరమసంతుష్టులు అయినారు. ఆ మహాబలవంతుడి అండను అప్పుడు ఆ వానరవీరులు అందరూ నిలచినారు.

ఆ హనుమంతుడిమీద అప్పుడు అకంపనుడు దేవేంద్రుడు కురిపించే సంతతవర్షధారల వలె బాణాల వర్షము కురిపించినాడు. ఆ మహాబలవంతుడు హనుమంతుడు అకంపనుణ్ణి చంపివేయడానికి సంకల్పించుకొన్నాడు. అట్లా తన మీద వచ్చిపడుతూన్న కరుకుబాణాలను ఏమాత్రమూ లక్ష్యముచేయకుండా

అకంపనుడి మీదికి పరుగెత్తినాడు. అప్పుడు ఆ మారుతాత్మజుడి పాదఘాతానికి భూమి కంపించింది. అతడు సింహనాదము చేస్తూ మహాతేజముతో మిట్ట మధ్యాహ్న సూర్యుడి వలె దుర్ధర్షుడు అయినాడు. అట్లా ఆకంపనుడి మీదికి పరుగెత్తుతూ ఉండగా తనచేతిలో ఆయుధము ఏదీలేదు అని తెలుసుకొన్నాడు. ఇట్టే ఒక పర్వతాన్ని పెళ్ళగించినాడు. దానిని చేతిలో పట్టుకొని గిరగిరా తిప్పి చూచినాడు. పూర్వము వజ్రధరుడు నముచిని వజ్రాయుధముతో హతమార్చి నట్టు ఆ మహాపరాక్రమవంతుడు హనుమంతుడు ఆ పర్వతముతో అకంపనుణ్ణి చంపివేయవలెను అనుకొన్నాడు. గిరగిరా తిప్పుతూఉన్న ఆ పర్వతాన్ని అకంపనుడిమీదికి రువ్వినాడు. అకంపనుడు అది చూచినాడు. ఆ పర్వతాన్ని పగులకొట్టడానికి అర్ధచంద్రాకారబాణాలను వదిలినాడు. ఆ పర్వతము ఆ అకంపనుడి బాణాలకు అంతరిక్షములోనే ముక్కలు ముక్కలు అయిపోవడము చూచినాడు. కోపపరవశుడు అయిపోయినాడు. అక్కడ ఎంతో ఎత్తుగా కొండ మాదిరిగా ఉన్న ఇనుమద్దిచెట్టును ఇట్టే పెళ్ళగించినాడు. ఆ మహాద్యుతి మంతుడు పరమసంతోషంతో పకపక నవ్వుతూ పెద్ద బోదెతోఉన్న ఆ చెట్టును తన చేతితో గిరగిర తిప్పిచూచినాడు. ఆ ధీమంతుడు హనుమంతుడు ఆ చెట్టుతో అకంపనుడిమీదికి పరుగెత్తుతూ దారిలో అడ్డము అయిన ఏనుగు లనూ ఆ ఏనుగులమీదఉన్న రాక్షసులనూ రథాలనూ ఆ రథాలమీద ఉన్న రథికు లనూపదాతులనూ నలగకొట్టినాడు. పరమవేగముతో పరుగెత్తుతూఉన్న ఆ హను మంతుడి తొడల తాకిడికి చెట్లు విరిగి పడిపోయినవి. పాదాల తొక్కిడికి నేల బీటలు పారింది. కుపితుడు అయిన యముడి వలె ప్రాణాలు తీసివేస్తూ ఉన్న ఆ హనుమంతుడిని చూచి రాక్షసయోధులు చావగా మిగిలినవారు పరుగు లెత్తినారు.

క్రుద్ధుడు అయి అట్లా రాక్షసులను అందరినీ చంపివేస్తూ ఉన్న హనుమం తుణ్ణి చూచి అకంపనుడు సింహనాదము చేసినాడు. దేహాన్ని చీల్చి వేసే పధ్నాలుగు నిశితబాణాలను ఆ వీర్యవంతుడి మీద వదిలినాడు. అటూ అనేక సార్లు తన మీద బాణవర్షము కురిసినప్పటికి హనుమంతుడు వృక్షాలతో ఉన్న పర్వతము వలె అచంచలముగా నిలుచున్నాడు. ఆ బాణాలు తగిలి ఆ మహా కాయుడు ఆ మహాపరాక్రమవంతుడు ఆ ధైర్యవంతుడు హనుమంతుడు పూచిన అశోకవృక్షము వలెనూ పొగలు లేకుండా మండుతూ ఉన్న అగ్నిహోత్రము వలెనూ కనిపించినాడు. అంతట మరి ఒక చెట్టును పెళ్లగించినాడు. ఇట్టే అకంపనుడి శిరము మీద కొట్టినాడు. ఆ చెట్టు దెబ్బకు అకంపనుడు నేల కూలినాడు.

అట్లా చచ్చి నేలమీద పడిపోయిన అకంపనుణ్ణి రాక్షసయోధులు అందరూ చూచినారు. భూకంపసమయాన చెట్లవలె గజగజ వణికిపోయినారు. దుఃఖపడిపోయినారు. భయపడిపోయినారు. వానరులు తరుముకొంటూ వస్తూ ఉంటే తమ తమ చేతులలో ఉన్న ఆయుధాలను పారవేసి ఒళ్లు అంతా చెమటలు కారుతూ నిట్టూర్పులు విడుస్తూ తలలు విరబోసుకొని మూఢులు అయిపోయి వాండ్లలో వాండ్లే కొట్టుకుంటూ భయమునుంచి మాటి మాటికీ వెనకకు తిరిగిచూస్తూ లంకాపట్టణానికి పరుగెత్తి పారిపోయినారు.

రాక్షసులు అందరూ అట్లా పారిపోయిన తరువాత ఆ మహాబలవంతులు వానరులు అందరూ హనుమంతుణ్ణి పూజించినారు. ఆ సత్త్వసంపన్నుడు హనుమంతుడు సంతోషముతో ఆ వానరయోధులను అందరినీ మెచ్చుకొన్నాడు. ఆ వానరయోధులు హనుమంతుణ్ణి యథాయోగ్యముగా బదులు పూజించినారు. జయముతో తేజరిల్లుతూ ఆ వానరవీరులు తమ బలముకొద్దీ సింహనాదాలు చేసినారు. ఆ సింహనాదాలకు లంకాపట్టణములో మహాబలవంతులు అయిన రాక్షసులు అందరూ అదిరిపోయినారు.

మహాభయంకరుడూ అమితబలవంతుడూ శత్రునాశకుడూ అయిన కైటభాసురుణ్ణి సంహారము చేసివేసిన మహావిష్ణువువలె ఆ మహాకపి ఆ మారుతాత్మజుడు హనుమంతుడు ఆ అకంపనుణ్ణి వధించి వానరసేనాసమ్ముఖాన వీరలక్ష్మితో విరాజిల్లినాడు.

అప్పుడు ఆ హనుమంతుణ్ణి దేవగణాలు పూజించినవి. రామలక్ష్మణులూ సుగ్రీవుడూ తక్కిన వానరవీరులూ మహాబలవంతుడు అయిన విభీషణుడూ హనుమంతుణ్ణి ఎంతగానో గౌరవించినారు, కొనియాడినారు.

## ౫౭

అకంపనుణ్ణి హనుమంతుడు చంపివేసినాడు అనే వర్తమానము రావణాసురుడు విన్నాడు. ఆ రాక్షసేశ్వరుడిముఖము అప్పుడు చిన్నబోయింది. మంత్రులవంక చూచినాడు. ఒక ముహూర్తముసేపు మనసులో ఆలోచించినాడు. అంతట ఆ మంత్రులు అందరితోనూ సంప్రదించినాడు. అప్పటికి ఇంకా మధ్యాహ్నము కాలేదు. ఆ పూర్వాహ్ణములోనే లంకాపట్టణము అంతా తిరిగి చూడటానికి బయలుదేరినాడు. ఆ లంకాపట్టణాన్ని కాపాడుతూ ఉన్న రాక్షససమూహాలనూ వ్యూహాలుగా ఉన్న సేనాసమూహాలనూ పతాకాలు ఎగురుతూ ఉన్న ధ్వజాల పంక్తులనూ చూచినాడు. వానరులు అట్లా తన లంకాపట్టణాన్ని ముట్టడించినందుకు కుపితుడు అయిపోయినాడు.

అంతట రావణాసురుడు తన సభాభవనానికి పోయినాడు. యుద్ధకోవిదుడు అయిన ప్రహస్తుణ్ణి చూచి "ఓ ప్రహస్తుడా, నీవు యుద్ధవిశారదుడవు. శత్రువులు హఠాత్తుగా మన పట్టణాన్ని ముట్టడించి బాధ పెట్టుతున్నారు. నీవు తప్ప మరి ఇతరులు ఎవరూ పోరాడి ఈ లంకాపట్టణాన్ని ఈ ముట్టడిలోనుంచి తప్పించలేరు అని నాకు తోస్తున్నది. నేనో కుంభకర్ణుడో నా సేనాపతివి నీవో ఇంద్రజిత్తో నికుంభుడో తప్ప మరి ఒకడు ఎవడూ ఈ భారము వహించలేరు. నీవు ఇప్పుడే నీ సైన్యాన్ని వెంటపెట్టుకొని వానరులు ఉన్నచోటికిపోయి వారిని జయించు. నీవు నీ సైన్యాలతో వెళ్ళితే చాలు. రాక్షసవీరుల సింహనాదాలకు ఆ వానరవాహిని అంతా చలించిపోతుంది. వానర సైనికులు అందరూ పారిపోతారు. వాండ్లు చలచిత్తులు. యుద్ధశిక్ష పొందిన వాండ్లు కారు. నీ సింహనాదము వినగానే సింహగర్జనము విన్న ఏనుగులవలె చిత్తస్థైర్యము చెడి వాండ్లు పరుగులెత్తి పారిపోతారు.

"ఓ ప్రహస్తుడా, అట్లా వానర సైన్యము పారిపోయిన తరువాత రామలక్ష్మణులు ఆధారము లేని వాండ్లూ అసహాయులూ అయి పోతారు. నీ చేతికి చిక్కుతారు. మనము ఊహిస్తున్నట్టు జరిగినా జరగక పోయినా ఇప్పుడు మనకు యుద్ధము చేయకుండా ఉండటానికి వీలు లేదు. యుద్ధములో ఎవరు జయిస్తారో చెప్ప లేము. అట్లా అనుకొని మనము యుద్ధము చేయకుండా ఊరక ఉండేట్లయితే ఇప్పుడు మన మీదికి ఎత్తి వచ్చిన ఎదిరి మనలను చంపి వేయకుండా పోడు. ఒక వేళ యుద్ధములో మనమే జయిస్తామో ఏమో చెప్ప లేము. కాబట్టి ఏమి అయినప్పటికిన్నీ మనము ఇప్పుడు యుద్ధము చేయడమే మనకు మేలు అని, నాకు తోస్తూ ఉంది. ఓ ప్రహస్తుడా, నీకు ఏమి తోస్తున్నదో చెప్పు. నేను చెప్పింది నీకు అనుకూలముగా తోచినా ప్రతికూలముగా తోచినా మనకు మేలు అయ్యేది ఏమిటో ఆలోచించి చెప్పు" అన్నాడు.

ఈ విధముగా రాక్షసరాజు రావణాసురుడు చెప్పి అడిగింది విని అసుర రాజుతో శుక్రాచార్యుడి వలె "ఓ రాజా, ఇదివరకు మంత్రులు అందరితోనూ ఆలోచించిన విషయమే ఇది. ఈ విషయములో పరస్పరమూ చర్చించడమూ వివాదపడడమూ అయిపోయింది. సీతాదేవిని ఇచ్చి వేసేట్లయితే యుద్ధము ఉండదు అనీ ఇవ్వక పోయేట్లయితే యుద్ధము తప్పదు అనీ ఇదివరకే నిశ్చయము అయిపోయింది. మేము మంత్రులము యుద్ధము రాక తప్పదు అనుకొన్నదే.

"రాజా, నీవు ఎప్పుడూ నన్ను గౌరవిస్తూ ఉన్నావు. నానావిధాలా నన్ను సంతోష పెట్టుతూ ఉన్నావు. ఇప్పుడు సమయము వచ్చినది. నిన్ను

సంతోషపెట్టడానికి నేను ఏ పనిఅయినా చేస్తాను. నీ కోసము నా బిడ్డలను అయినా నా పెండ్లాన్ని అయినా వదులుకొంటాను. నీ కోసము యుద్ధములో నా ప్రాణాలు పోయేటంతవరకూ పోరాడుతాను. నీవు చూస్తావు" అని చెప్పినాడు.

రావణాసురుడితో ఇట్లా చెప్పి ఆ ప్రహస్తుడు ఎట్టఎదట ఉన్న సేనాధ్యక్షులను చూచి "ఓ సేనాధ్యక్షులారా, రాక్షస మహాసైన్యాన్ని ఇప్పుడే సిద్ధము చేయండి. పిడుగులవంటి నా బాణాలకు యుద్ధభూమిలో చచ్చి పడిపోయే వానరుల మాంసాన్ని పక్షులు తనివితీర తినవలెను" అని చెప్పినాడు.

ప్రహస్తుడు ఆజ్ఞాపించినట్టుగా ఆ సేనాధ్యక్షులు అప్పటికి అప్పుడు రాక్షస సైన్యాన్ని యుద్ధసన్నద్ధము చేసినారు. నానావిధ తీక్ష్ణాయుధాలూ ధరించిన మదపుటేనుగులవంటి రాక్షసయోధులతో క్షణలేశములో లంకాపట్టణము అంతా నిండిపోయింది. ఆ యుద్ధములో జయించడానికి రాక్షసవీరులు అప్పుడు హోమాలుచేసి బ్రాహ్మణులకు గంధపుష్పాదులు ఇచ్చి పూజించడము వల్ల అక్కడ ఆజ్యసుగంధముతోనూ, పుష్పసుగంధముతోనూ గాలివీచింది. విజయముకోసము మంత్రపూతముచేసిన వివిధవిధాల పూలదండలనుసంగ్రామసన్నద్ధులు అయిన రాక్షసయోధులు అప్పుడు వేసుకొన్నారు. కవచాలు తొడుగుకొని చేతులలో ధనుస్సులు తీసుకొని రాక్షసయోధులు రావణాసురుడి దగ్గరకుపోయి నమస్కారముచేసి ప్రహస్తుడి దగ్గరకువచ్చి నిలచినారు.

అప్పుడు ప్రహస్తుడు రావణాసురుడికి వీడ్కోలు చెప్పినాడు. మహాభయంకరముగా భేరిని కొట్టించినాడు. అప్పుడు మేఘ గర్జనల వంటి ధ్వనులు చేస్తూ సూర్యుడి వలె దుర్నిరీక్షముగానూ చంద్రుడి వలె మనోజ్ఞముగానూ బంగారు కిటకీలతో చక్కని పైకప్పుతో దుర్ధర్షము అయిన సర్పధ్వజముతో చక్కని చక్రాలతో మహావేగముతో పోయే గుర్రాలతో యుద్ధానికి సిద్ధము చేసిన రథాన్ని మంచి సమర్థుడు అయిన సారథి తోలుకొని వచ్చినాడు. ఆ రథము సమస్త జగత్తునూ పరిహసిస్తూ ఉన్నట్టు కనిపించింది. రావణాసురుడి ఆజ్ఞను శిరసావహించిన ప్రహస్తుడు ఆ రథము ఎక్కినాడు. రాక్షసమహాసైన్యము అప్పుడు ఆ రథము వెంట బయలుదేరింది.

అప్పుడు ఉరుముల వలె దుందుభులూ నానావిధవాద్యాలూ మోగినవి. శంఖాలు పూరించినారు. సముద్రము పొంగి భూమిని ముంచి వేస్తూ ఉన్నట్టూ దిశలు బద్దలు అయిపోతున్నట్టూ ఆ ధ్వనులు వినిపించినవి. ఆ ప్రహస్తుడి రథము ముందు నడుస్తూ ఉన్న రాక్షసయోధులు అందరూ భయంకరాకారులు. వాండ్లు

అందరూ మహాకాయులు. భయంకరస్వరముతో సింహనాదాలు చేస్తూ నడిచినారు.

అట్లా యుద్ధానికి పోతున్న ప్రహస్తుణ్ని నరాంతకుడూ కుంభహనుడూ మహానాదుడూ సమున్నతుడూ అనే అతని నలుగురు మంత్రులూ వెంబడించినారు. ఆ రాక్షస మహాసైన్యము వ్యూహాలు తీరి ఏనుగుల మందలవలె ఆ ప్రహస్తుడు చుట్టూ నడచినవి. ప్రళయకాలములో సమస్తలోకాలనూ నాశనము చేసివేసే యముడివలె ప్రహస్తుడున్నూ, సముద్రముపొంగి మహాప్రవాహాలై పొర్లుతూ ఉన్నట్లు ఆ రాక్షససైన్య సమూహాలున్నూ కనిపించినవి.

ఆ ప్రహస్తుడున్నూ అతడివెంట యుద్ధానికి పోతూవున్న రాక్షసయోధులున్నూ చేసిన సింహనాదాలకు లంకా పట్టణములో ఉన్న సమస్త జంతువులున్నూ భయపడిపోయి వికృతస్వరాలతో విపరీతముగా అరిచినవి. నెత్తురుతాగి మాంసము తినే భయంకరము అయిన పక్షులు అప్పుడు ఆకాశములో ఆ రథము పైన మండలాకారముగా ప్రదక్షిణము చేసినవి. భయంకరము అయిన నక్కలు అగ్నిజ్వాలలు కక్కుతూ అరిచినవి. అంతరిక్షమునుంచి కొరవులు కింద పడ్డవి. గాలి ఎడా పెడా కొట్టింది. గ్రహయుద్ధము ఆరంభము అయినందువల్ల గ్రహాల కాంతులు మాసిపోయినవి. మేఘాలు కర్ణకఠోరముగా గర్జించినవి. ఆ ప్రహస్తుడి ముందు నడుస్తూవున్న రాక్షసయోధులు అందరూ తడిసిపోయేట్టు నెత్తురువాన కురిసింది. ఆ ప్రహస్తుడి రథపతాకము మీద ఒక గద్ద వాలి రెండు రెక్కలను ముక్కుతో పొడుచుకోసాగింది. ఆ ప్రహస్తుడి రథము తోలుతూవున్న సారధి తండ్రి తాతలనుంచీ రథచోదక వృత్తితో జీవించిన సూతవంశములో పుట్టినాడు. అనేకమార్లు యుద్ధాలలో ప్రహస్తుడికి రథము తోలినాడు. అటువంటి ఆ రథసారథి చేతిలోనుంచి హఠాత్తుగా కొరడా జారి నేలమీద పడిపోయింది. ఆ రథానికి కట్టిన గుర్రాలకాళ్ళు కారణములేకుండా మిట్టపల్లాలు లేని సమప్రదేశములో జారిపడి పోయినవి. అష్టవసువులకు దుర్లభము అయిన కాంతులతో యుద్ధానికి బయలుదేరిన ప్రహస్తుడి దేహకాంతులు ముహూర్త మాత్రములో కనపడకుండా పోయినవి.

ప్రసిద్ధి కెక్కిన ఆ బలవంతుడు ఆ పౌరుషవంతుడు పోరాటానికి రావడము కపిసైన్యము చూచింది. నానాప్రహరణాలతోనూ ఎదురుగుండా నిలిచింది. ఆ వానరయోధులు యుద్ధము చేయడానికి పెద్ద పెద్ద చెట్లనూ పెద్ద పెద్ద రాళ్లనూ పెళ్లగిస్తూ ఉంటే మహాధ్వని దొమ్మిగా అయింది.

అప్పుడు అటు రాక్షసులు అరుస్తూనూ ఇటు వానరులు గర్జిస్తూనూ ఉభయ సైన్యాలూ సంతోషముతో యుద్ధానికి చెలరేగినవి. ఉభయులూ వేగవంతులు.

ఉభయులూ యుద్ధసమర్థులు. ఒకండ్లను ఒకండ్లు చంపి వేయడానికి వానరులూ రాక్షసులూ పిలుచుకొంటూ భూమ్యాకాశాలు బద్దలు అయిపోయ్యేట్లు సింహనాదాలు చేసినారు.

అప్పుడు ఆ దుర్మతి ప్రహస్తుడు కపిరాజు సైన్యాన్ని తాను జయించ కలను అనుకొని అగ్నిహోత్రము మీదికి అమితవేగముతో పోయే మిడుతవలె చావడానికి ఆ వానరసైన్యము మీదికి పోయినాడు.

౫౮

అట్లా వస్తూ ఉన్న ఆ భీమపరాక్రముణ్ణి రాముడు చూచినాడు. ఆ అరిందముడు చిరునవ్వు నవ్వుతూ విభీషణుణ్ణి చూచి "ఓ మిత్రుడా, ఈ వస్తూ ఉన్న మహాకాయుడు ఎవడు. చుట్టూ గొప్ప సైన్యముతో వస్తూ ఉన్న ఈ నిశాచరుడు ఎవడో చెప్పు" అని అడిగినాడు.

"రామా, ఈ రాక్షసుడు రావణాసురుడి సేనానాయకుడు. వీడి పేరు ప్రహస్తుడు. రావణాసురుడికి లంకాపట్టణములో ఉన్న మహాసైన్యములో మూడవ భాగము వీడి స్వాధీనములో ఉంటూ ఉంది. వీడు ప్రసిద్ధికెక్కిన పరాక్రమవంతుడు. బలవంతుడు. శూరుడు. అస్త్రవేత్త" అని విభీషణుడు చెప్పినాడు.

సింహనాదాలు చేస్తూ ఉన్న రాక్షసయోధులను వెంటపెట్టుకొని వస్తూ ఉన్న ఆ భయంకరాకారుణ్ణి ఆ భయంకర పరాక్రముణ్ణి ఆ మహాకాయుణ్ణి ప్రహస్తుణ్ణి వానరవీరులు అందరూ చూచినారు. అప్పుడు ఆ బలవంతులు అందరూ అమితవేగముతో ఆ ప్రహస్తుడికి ఎదురుగుండా పోయి సింహనాదాలు చేసినారు.

తళతళలాడుతూ ఉన్న ఖడ్గాలతోనూ శక్త్యాయుధాలతోనూ ఋష్టులు అనే ఆయుధాలతోనూ ముసలాయుధాలతోనూ శూలాలూ గదలూ ఇనుప గుదియలూ ఈటెలూ మొదలు అయిన వాటితోనూ రకరకాల గండ్రగొడ్డళ్లతోనూ విచిత్రము అయిన ధనుస్సులతోనూ బాణాలతోనూ ఆ రాక్షసయోధులు అందరూ జయము కాంక్షిస్తూ వానరులమీదికి పరుగెత్తుకొని వచ్చినారు. ఆ రాక్షసయోధులతో పోరాడటానికి పూలుపూచిన చెట్లు చేతుల పట్టుకొనీ పెద్ద పెద్ద పొడుగాటి వెడల్పాటి రాళ్లు పట్టుకొనీ వానరయోధులు నిలుచున్నారు. అప్పుడు రాక్షసులు వానరులమీద బాణవర్షము కురిపించినారు.

వానరులు రాక్షసులమీద రాళ్ల వాన కురిపించినారు. ఆ విధముగా ఆ మహా సంగ్రామము ఆరంభము అయింది.

ఆ యుద్ధములో రాక్షసులను అనేకమందిని వానరులు చంపివేసినారు. వానరులను అనేకమందిని రాక్షసులు చంపివేసినారు. రాక్షసయోధులు శూలాలతో వానరులను చీల్చివేసినారు. చక్రాయుధాలతో వానరులను తెగవేసినారు. ఇనుప గుదియలతో వానరులను చితుక కొట్టినారు. గండ్రగొడ్డళ్లతో వానరులను నరికివేసినారు. బాణాలతో వానరుల గుండెకాయలను పగుల కొట్టినారు. తుండ్లు తుండ్లుగా ఎగిరిపడేట్టు వానరులను ఖడ్గాలతో తెగకొట్టినారు.

అప్పుడు వానరులు ఈ భూమిమీద కనిపించిన చెట్లనూ పర్వతాలనూ పెళ్ళగించి తెచ్చి వాటితో రాక్షసులను నుగ్గు నుగ్గు చేసినారు. ఆ వానరులు కొంతమంది రాక్షసులను వజ్రాయుధాలవంటి తమ గోళ్ళతో చీల్చివేసినారు. పిడికిలి పోట్లతో కొంతమంది రాక్షసులను చంపివేసినారు. చేతులతో కొంతమంది రాక్షసుల పళ్లు ఊడ కొట్టి వాండ్ల కన్నులు పెరికి వేసినారు. నెత్తురు కక్కు కొని నేల మీద పడిపోయేట్టు కొంతమంది రాక్షసులను కొట్టినారు. ఆ పోరాటములో అటు రాక్షసులూ ఇటు వానరులూ దెబ్బలు తిన్న వాండ్లు ఏడుస్తూనూ మూలుగుతూనూ ఉంటే తక్కిన వాండ్లు బొబ్బగా సింహనాదాలు చేసినారు. ఉభయపక్షాల యోధులూ క్రుద్ధులు అయిపోయి వీరమార్గము అనుసరించినారు. కన్నులు తిప్పుతూ నిర్భయముగా క్రూరకృత్యాలు చేసినారు.

అప్పుడు నరాంతకుడూ నికుంభుడూ మహానాదుడూ సమున్నతుడూ చెలరేగి వానరులను ఘోరముగా వధించడము మొదలు పెట్టినారు. వాండ్లు అట్లా చటుక్కున వచ్చి పడి వానరులను చంపివేస్తూ ఉంటే ద్వివిదుడు ఒక పర్వతశిఖరాన్ని నరాంతకుడి మీద రువ్వినాడు. ఆ దెబ్బకు నరాంతకుడు చచ్చిపోయినాడు. చక చకా చేతులతో పనులు చేసే దుర్ముఖుడు అనే వానరుడు ఒక మహావృక్షాన్ని ఇట్టే పెళ్లగించి దానితో సమున్నతుణ్ణి కొట్టి చంపివేసినాడు. తేజోవంతుడు జాంబవంతుడు అప్పుడు పరమక్రుద్ధుడు అయిపోయి ఒక పెద్ద రాతి బండను మహానాదుడి వక్షః స్థలముమీద వేసి కొట్టినాడు. ఆ రాతి దెబ్బకు ఆ మహానాదుడు చచ్చి పోయినాడు. తారుడు ఒక చెట్టుతో కుంభహనుడి శిరము మీద కొట్టినాడు. ఆ చెట్టు దెబ్బకు కుంభహనుడు చచ్చిపోయినాడు. అట్లా తన నలుగురు మంత్రులనూ వానర యూథపతులు చంపివేయడము ప్రహస్తుడు రథము మీది నుంచి చూచినాడు. సహించలేక పోయినాడు. ధనుస్సు తీసుకొని వానరులతో ఘోరముగా పోరాటము సాగించినాడు.

ప్రళయకాలము ఆ సన్నము అయినట్టు ఉభయ సైన్యాలూ కలవర పడిపోయినవి. సముద్రము పొంగి పొర్లి ఈ భూమిని అంతా ముంచి వేస్తున్నట్టు ఉభయ సైన్యాలూ మహాధ్వనులు చేసినవి.

అప్పుడు ఆ మహాయుద్ధములో యుద్ధకోవిదుడు ప్రహస్తుడు కుపితుడు అయి బాణపరంపరలతో వానరులను భయంకరముగా నొప్పించినాడు. ఆ యుద్ధ భూమిలో పడిపోయిన వానరుల కళేబరాలూ రాక్షసుల కళేబరాలూ పర్వతాల వలె ఘోరముగా కనిపించినవి. నెత్తురుతో నిండిపోయిన ఆ యుద్ధభూమి అప్పుడు వైశాఖమాసములో విరగపూసిన మోదుగుచెట్లతో కమ్ముకొని పోయిన భూమివలె తోచింది. చచ్చిపడిపోయిన వీరసమూహాలు తీరాలుగానూ విరిగిపడి పోయిన ఆయుధాలు మహావృక్షాలుగానూ రక్తప్రవాహము మహాజలముగానూ గుండెకాయకు ఇరువైపులా ఉండే మాంసము బురదగానూ వెదచల్లినట్టు పడి ఉన్న పేగులు నాచుగానూ ఛిన్నాభిన్నము అయిపోయిన దేహాలూ తలకాయలూ చేపలుగానూ దేహావయవాలు పచ్చికపట్లుగానూ అంతటా వ్యాపించిన గద్దలు హంసలుగానూ రాబందుపక్షులు సారస పక్షులుగానూ మెదస్సు అక్కడ వ్యాపించిన నురుగుగానూ ఆర్తులు అయిపోయిన వారి మూలుగులు మహాధ్వనులుగానూ పిరికివార్లకు దాటిపోనలవికాకుండా యముడు అనే మహాసముద్రములోకి పోతున్న మహాప్రవాహమువలె ఆ యుద్ధభూమి అప్పుడు అక్కడ కనిపించింది. శరత్కాలములో హంసలూ సారసపక్షులూ సేవించే నదిని సులభముగా దాటిపోయేట్టు యుద్ధభూమి అనే దాటిపోనలవికాని ఆ నదిని రాక్షసులూ వానరులూ ఇట్టె దాటిపోయినారు. కమలాల పుప్పొడులతో నిండిఉన్న కాసారములో దిగి బయటికివచ్చిన ఏనుగుల దేహాలు ఎర్రపడిపోయినట్టు ఆ యుద్ధ భూమిలోకి పోయిన వానరుల దేహాలూ రాక్షసుల దేహాలు ఎర్రపడిపోయినవి.

రథము మీదినుంచి బాణవర్షము కురిపించి వానరులను ఇట్టే చంపివేస్తున్న ప్రహస్తుణ్ణి నీలుడు చూచినాడు. అమిత వేగముతో ఆ వానర వీరుడు ఆ రాక్షస వీరుడికి ఎదురుగుండా పోయినాడు. అట్లా తనమీదికి వస్తూవున్న ఆ వానరవీరుణ్ణి నీలుణ్ణి ఆ రాక్షసవీరుడు ప్రహస్తుడు చూచినాడు. మహానీలమేఘాన్ని ఎగరకొట్టే వాయువు వలె ఆ నీలుడికి ఎదురుగుండా ప్రహస్తుడు ఆదిత్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్న తన రథముమీద పోయినాడు. ఆ మేటి విలుకాడు రాక్షస సేనాపతి ఆ ప్రహస్తుడు అంతట తన ఉత్తమోత్తమము అయిన ధనుస్సును ఆకర్ణాంతము లాగి నీలుడిమీద బాణాలు వదిలినాడు. ఆ బాణాలు అమిత వేగముతో గురితప్పకుండా కుపితసర్పాల వలె పోయి నీలుడిమీద పడ్డవి. అవి

అతనిని నొప్పించి భూమిలోకి పోయినవి. అగ్నిహోత్రము వంటి తీక్ష్ణబాణాలు తనమీద ప్రహస్తుడు వర్షముగా కురిపిస్తూవుంటే ఆ మహా బలవంతుడు నీలుడు శరత్కాలములో కురిసి ఇట్టే వెలిసిపోయే వర్షధారలను ఓర్చుకొనే ఆబోతువలె నిలుచుండి పోయినాడు. అయితే ఆ బాణవర్షానికి పట్టరాని కోపమువచ్చింది. సమయము దొరికింది. మహా సాలవృక్షాన్ని ఒకదాన్ని ఇట్టే పెళ్ళగించినాడు. మనోజవముతో పోయే ప్రహస్తుడి గుఱ్ఱాలను ఆ చెట్టుతో కొట్టినాడు. ఆ దెబ్బకు ఆ గుఱ్ఱాలు చచ్చి పడిపోయినవి. అప్పుడు ఆ మహాబలవంతుడు నీలుడు చటుక్కున ఎగిరిపోయి ప్రహస్తుడి చేతిలోవున్న ధనుస్సును పట్టుకొని ముక్కలు ముక్కలుగా విరగ కొట్టినాడు. అంతట పదే పదే సింహనాదము చేసినాడు.

రాక్షస సేనానాయకుడు ప్రహస్తుడు అట్లా విధనుష్కుడూ విరథుడూ అయి పోయినాడు. అంతట భయంకరము అయిన ముసలాయుధము తీసుకొని ఆ రథము మీదినుంచి కిందికి దూకినాడు. అంతట అమితవేగముతో ప్రహస్తుడు నీలుడి నొసటను ఆ ముసలాయుధముతో కొట్టినాడు. దేహము అంతా నెత్తురుతో తడిసిపోయి నీలుడు క్రుద్ధుడు అయిపోయి ఒక మహావృక్షముతో ప్రహస్తుడి ఎదురు రొమ్ములమీద కొట్టినాడు.

అప్పుడు ఆ ఉభయసేనానాయకుల దేహాలూ నెత్తురుతో తడిసిపోయినవి. ఉభయులూ బలవంతులు. అమిత వేగవంతులు. దెబ్బలుతిన్న మదపుటేనుగులవలె ఉభయులూ పోరాడటానికి బద్ధవైరముతో నిలుచున్నారు. ఆ వీరులు ఉభయులూ పోరాటములోఎన్నడూ వెనుకకు మళ్లి ఎరుగరు. ఉభయులూ సింహ శార్దూలాలవంటి వాండ్లు. అనేకయుద్ధాలలో ఉభయులూ సింహమువంటి దర్పముతోనూ పెద్ద పులివంటి పరాక్రమముతోనూ పోరాడి జయించినారు. ఎన్నడూ అపజయము అనేది ఎరగరు. అటువంటి ఆ రాక్షససేనా నాయకుడు ప్రహస్తుడూ వానరసేనానాయకుడు నీలుడూ జయేచ్ఛతో పరస్పరమూ సుతీక్ష్ణము అయిన కోరలతో కొరుక్కున్నారు.

అంతట ప్రహస్తుడు ముసలాయుధము తీసుకొని నీలుడి మీదికి ఉగ్రవేగముతో పరుగెత్తినాడు. అప్పుడు ఆ మహావేగుడు నీలుడు ఒక పెద్దరాయి తీసుకొన్నాడు. ప్రహస్తుడు తనతో పోరాటానికి ముసలాయుధము ఎత్తేలోపలనే ఆ పెద్ద రాతిబండను ఎత్తి అతడి తలమీద పడేట్టు విసరి వేసినాడు. భయంకరము అయిన ఆ రాతిబండ ప్రహస్తుడి తలమీద పడ్డది. ఆ తల ముక్కలు ముక్కలు అయిపోయింది. వేరువిరికిన మహావృక్షము వలె ప్రహస్తుడు నేటా

లున నేల కూలినాడు. పగిలిపోయిన శిరము నుంచీ దేహము నుంచీ పర్వతము నుంచి సెలఏళ్లవలె రక్తము ఏరులు అయి పారింది.

అంతివరకూ అకంపముగా వున్న రాక్షససైన్యము కంపించిపోయింది. తమ సేనానాయకుడు ప్రహస్తుడు అట్లా అయిపోగానే రాక్షసయోధులు అక్కడ నిలువలేకపోయినారు. ఆనకట్టను దాటి జలాలు ముందుకు పోలేనట్లు రాక్షసయోధులు ఒక్క అడుగు ముందుకు వేయలేకపోయినారు. లంకాపట్ట ణములో రావణాసురుడి ఇంటికి పరుగెత్తిపోయినారు. ఆలోచించుకొంటూ మాట్లాడలేక మూగవాండ్లవలె నిలుచుండిపోయినారు. దుఃఖమహాసముద్రములో పడి తెప్పరిల్లలేక పోయినారు.

అట్లా ప్రహస్తుణ్ణి జయించిన ఆ వానరసేనానాయకుడు ఆ మహాబల వంతుడు నీలుడు రామలక్ష్మణుల దగ్గరకు పోయినాడు. వారి మన్ననలను అందుకొన్నాడు.

## ౫౮

అగ్నిహోత్రుడి పుత్రుడు నీలుడు అనే వానరుడు ప్రహస్తుణ్ణి చంపివేసి నాడు. అని అంతట ఆ రాక్షసయోధులు రావణాసురుడితో చెప్పినారు. ఆమాట విని రావణాసురుడు దుఃఖపడ్డాడు. బాధపడ్డాడు. దుఃఖమూ కోపమూ మనస్సులో పెనవేసుకొని పోయినవి. దేవేంద్రుడు దేవయోధులతో చెప్పేటట్టు అప్పుడు ఆ రాక్షసరాజు రావణాసురుడు ఆ రాక్షసయోధులతో "ఓ యోధులారా, మన సేనానాయకుడు ప్రహస్తుడు దేవేంద్రుడి సైన్యాన్ని సంహారము చేసివేసినాడు. అటువంటివాణ్ణి అనుచరులతోనూ అతణ్ణి వెంబడించిన గజసాదులతోనూ వాన రులు చంపివేసినారు అని మీరు చెప్పుతున్నారు. అందువల్ల ఆ వానరులను తక్కువ వారు అనుకోడానికి వీలు లేదు. ఇకను ఆలోచించేది ఏమీ లేదు. ఆ శత్రువులను అందరినీ జయించడానికీ వారిని అందరినీ సంహారము చేసి వేయ డానికీ ఆ అద్భుత యుద్ధభూమికి నేనే స్వయముగా బయలుదేరవలెను. కార్చిచ్చు అడవిని దహించి వేసేట్టు నా బాణాలతో ఆ వానర సైన్యాన్నీ ఆ రామలక్ష్మణులనూ ఇప్పుడే నాశనముచేసి వేస్తాను" అన్నాడు.

జ్వలిస్తూ ఉన్న అగ్నిహోత్రమువలె ధగ ధగ లాడుతూనూ అలంకరణా లతో తళ తళ లాడుతూ బంగారు రథము వచ్చింది. ఉత్తమాశ్వాలు పూంచిన ఆ రథముమీద రావణాసురుడు ఎక్కినాడు. అప్పుడు శంఖాలు పూరించినారు. భేరీలూ పణవాలూ మోగించినారు. మహాధ్వని అయ్యేట్టు రాక్షసయోధులు భుజాలు చరచుకొన్నారు. రావణాసురుణ్ణి గురించి స్తోత్రపాఠాలు చదివినారు.

రాక్షసయోధులు అందరూ సింహనాదాలు చేయసాగినారు. అప్పుడు ఆ రాక్షస రాజు రావణాసురుడి రథము బయలుదేరింది. ఆ రథములో నిప్పుకణికలవంటి నేత్రాలతో పర్వతాకారులూ మహామేఘాకారులూ, అయిన రాక్షసయోధులు బయలుదేరినారు. ఆ రాక్షసరాజు రావణాసురుడు అట్లా అంత పరివారముతో అంత సైన్యముతో పోతూ ఉంటే మహాభూతాలను వెంటపెట్టుకొని పోయే రుద్రుడివలె కనిపించినాడు. అమితవేగముతో ఆ మహాపరాక్రమవంతుడు రావణాసురుడు అట్లా లంకాపట్టణము వెలుపలికి పోయినాడు. మహాసముద్ర ఘోషము వలెనూ మహామేఘనిస్వనాల వలెనూ సింహనాదాలు చేస్తూ మహా వృక్షాలూ పర్వతశిలలూ పట్టుకొని యుద్ధసన్నద్ధము అయిన వానర సైన్యాన్ని చూచినాడు.

అతి ప్రచండముగా అట్లా వస్తూ ఉన్న ఆ రాక్షససైన్యాన్ని వానరుల మధ్యను ఉన్న ఆ మహాకాంతిమంతుడు భుజగేంద్రబాహువు రాముడు చూచి నాడు. రాక్షస వీర భట తారతమ్యము తెలిసిన విభీషణునితో "మిత్రుడా, నానావిధ పతాకాలతోనూ ధ్వజాలతోనూ ఈటెలూ ఖడ్గాలూ శూలాలూ ధనుస్సులూ మొదలు అయిన ఆయుధాలతోనూ మహేంద్ర పర్వతము వంటి ఏనుగులతోనూ దేనికీ కలవరపడకుండానూ దేనికీ భయపడకుండానూ రాక్షస సైన్యము వస్తూ ఉంది. ఈ భయంకర సైన్యాన్ని వెంట పెట్టుకొని వస్తూ ఉన్న వాడు ఎవడు" అని రాముడు అడిగినాడు.

ఆ శక్రసమాన పరాక్రమవంతుడు విభీషణుడు అప్పుడు ఆ వస్తూ ఉన్న రాక్షస వీరుల బల పరాక్రమాతిశయాలను గురించి చెప్ప తలచుకొని "ఓ, రామా అడుగో, అప్పుడే ఉదయిస్తూ ఉన్న సూర్యుడి వంటి ఎర్రటి ముఖముతో ఏనుగు మూపు మీద కూర్చుండి ఏనుగు వలె తల ఆడిస్తూ వస్తున్నవాడు రావణాసురుడి కొడుకు అకంపనుడు అనేవాడు.

"అడుగో, సింహము చిత్రించిన పతాకము ఎగురుతూ ఉన్న రథముమీద మదపుటేనుగు వంటి ఆకారముతో బయటికి వెళ్ళికొని వచ్చిన పెద్ద పెద్ద కోరలతో ఇంద్రధనుస్సు వంటి ధనుస్సు చేతిలో పట్టుకొని వస్తూ ఉన్న వాడే బ్రహ్మానుగ్రహము వల్ల అంతర్ధానము అయిపోయే శక్తి సంపాదించిన ఇంద్రజిత్తు.

"అడుగో ఆ రథము మీద వింధ్యపర్వతము వలెనూ మహేంద్రపర్వతము వలెనూ అస్తగిరి వలెనూ మహాకాయుడు అతుల్య ప్రమాణ ధనుస్సును మోగిస్తూ వస్తూ ఉన్న వాడు అతిరథుడు. వాడు అతివీరుడు. వాడి పేరు అతికాయుడు.

"ఘంటలు గణ గణ మోగించుకొంటూ వస్తూ ఉన్న ఏనుగు మీద శ్రవణ కఠోరముగా అరుస్తూ అప్పుడే ఉదయించిన సూర్యబింబము వంటి ఎఱ్ఱటి కన్ను లతో వస్తూ ఉన్న వీరుడి పేరు మహోదరుడు.

"సంధ్యాకాలమేఘము అలముకొన్న పర్వతము వంటి ఆకారముతో కాంచనచిత్రితా భరణాలు ధరించి తళతళలాడుతూ ఉన్న ఈమె పట్టుకొని పిడుగువంటి వేగముతో గుఱ్ఱము మీద వస్తూ ఉన్న వాడు పిశాచుడు.

"అడుగో, పర్వతము అంత ఎద్దు మీదనెక్కి తీక్ష్ణము అయిన మెరు పుల వలె మెరుస్తూ వజ్రాయుధము అంత వేగముగా పనిచేసే శూలాన్ని పట్టు కొని వస్తూ ఉన్న వాడు త్రిశిరుడు.

"అడుగో, పన్నగరాజధ్వజము ఉన్న రథముమీద యుద్ధసన్నద్ధుడు అయి ధనుస్సు విదిలిస్తూ మ్రోగిస్తూ అందము అయిన వెడల్పాటి ఎదురు రొమ్ము లతో మేఘ సమాన రూపముతో వస్తూఉన్న వాడు కుంభుడు."

"అడుగో, చూడు పెద్ద పరిఘాయుధము పట్టుకొని వస్తూ ఉన్నాడు. ఆ పరిఘకు పొదిగిన వజ్రాలు పొగలు రాజుకుంటూ ఉన్నట్టూ దానికి పొదిగిన బంగారము నుంచి అది మంటలు మండుతూ ఉన్నట్టూ కనపడుతూ ఉంది. ఆ పరిఘను పట్టుకొని వస్తూ ఉన్నవాడు నికుంభుడు. వాడు రాక్షస సైన్యానికి ధ్వజమువంటి వాడు. అనేక అద్భుత ఘోరకృత్యాలు చేసినాడు."

"అడుగో, ఆ రథాన్ని చూడు. దానిమీద పెద్ద పతాకము ఎగురుతూ ఉంది. ఆ రథము అగ్నిహోత్ర కాంతులతో ధగధగ లాడుతూ ఉంది. ఆరథము నిండా ధనుస్సులూ ఖడ్గాలూ బాణాలూ ఉన్నవి. ఆ రథముమీద వస్తూఉన్న వాడి పేరు నరాంతకుడు. వాడు పర్వతశిఖరాలను పెళ్లగించి వాటిని ఆయుధా లుగా చేసుకొని పోరాడుతాడు."

"ఓ రామా, చూడు. వ్యాఘ్రముఖాలతోనూ ఒంటె ముఖాలతోనూ ఏనుగు ముఖాలతోనూ మృగముఖాలతోనూ గుఱ్ఱము ముఖాలతోనూ ఉన్న ఘోరాకారులను వెంటపెట్టుకొని రథముమీద వస్తూ ఉన్న వాణ్ణి చూడు. వాడు తన ఎఱ్ఱటి గ్రుడ్లుతిప్పుతున్నాడు. పూర్ణచంద్రమండలమువలె సుంద్రము గానూ తెల్లగానూ సన్నటి శలాకలతో ఎంతో అందముగానూ ఉన్న శ్వేతచ్ఛత్రము కింద దేహకాంతులతో తేజరిల్లుతూ భూతప్రేత పిశాచాలను వెంటపెట్టుకొని వచ్చే రుద్రుడివలె వస్తూ ఉన్నాడు. వింధ్యహిమవత్పర్వతాల వంటి భీమకాయముతోనూ నవరత్నఖచిత కిరీటముతోనూ బంగారు కుండలాలతోనూ ధగధగ లాడుదూ సూర్యుడి వలె తేజరిల్లుతూ తన

ఆడిస్తూ ఆ రథము మీద వస్తూ ఉన్నాడు. వాడే దేవతల దర్పాన్నీ దేవేంద్రుడి దర్పాన్నీ యముడి దర్పాన్నీ అణచి వేసిన రాక్షసరాజు రావణాసురుడు" అని చెప్పినాడు.

ఇట్లా ఆ రాక్షసవీరులను గురించి చెప్పిన ఆ శత్రుసంహారకుణ్ణి విభీషణుణ్ణి రాముడు చూచి "ఆహా, ఎంత కాంతిమంతుడు—ఎంత తేజోవంతుడు ఈ రావణాసురుడు. ఆశ్చర్యము. కన్నులు మిరుమిట్లుకొలిపే కిరణాల నుంచి తేరి పార చూడ నలవికాని సూర్యుడివలె వీడు దేహకాంతులతో తేజరిల్లుతూ ఉన్నాడు. వీడి రూపమే వీడి ప్రతాపాన్ని స్పష్టముగా తెలియ చెప్పతూ ఉంది. వీడి కాయమూ వీడి తేజమూ దేవదానవ వీరులకు ఎవరికీ లేదు. వీడి యోధులు అందరూ తేజోవంతులు. పర్వతాకారులు, అందరూ దీప్తాయుధాలు ధరించినారు. మహాకాయులూ భయంకరాకారులూ అయిన యమ కింకరులను వెంట పెట్టుకొని వచ్చే యమధర్మరాజువలె వీడు ఈ రాక్షసరాజు మహాకాంతిమంతుఋ భయంకరపరాక్రములూ అయిన యోధులను వెంట పెట్టుకొని వస్తూ ఉన్నాడు.

"ఓ విభీషణుడా, ఈ పాపాత్ముడు నా అదృష్టము నుంచి నేటికి నా కంటపడ్డాడు. సీతాపహరణము నుంచి వీడిమీద నాకు వచ్చిన కోపము ఈనాటితో తీరిపోతుంది" అని చెప్పినాడు. అంతట ఆ మహా పరాక్రమవంతుడు రాముడు ధనుస్సునూ ఉత్తమోత్తమ బాణాలనూ తీసుకొని లక్ష్మణుడితో కూడా యుద్ధసన్నద్ధుడు అయి నిలుచున్నాడు.

ఇక్కడ రాముడు యుద్ధసన్నద్ధుడు అవుతూవుంటే అక్కడ ఆ మహాకాయుడు రావణాసురుడు మహాబలవంతులు అయిన రాక్షసవీరులను చూచి "ఓ వీరులారా, మీరు పోయి మీమీ గృహద్వారాల దగ్గరనూ చతుష్పథాలలో వున్న గృహద్వారాలలోనూ నిర్విశంకముగా హాయిగా ఉండండి. మీరు అందరూ కూడా నా వెంట ఉండేట్లయితే నగరములో సరియయిన బలము లేదు అని వానరులు తెలుసుకోకలుగుతారు. అంతట వానరులు నగరములో చొరబడి సర్వనాశనము చేసివేస్తారు. అందువల్ల మీరు పొండి" అని చెప్పి రాక్షసవీరులను పంపించివేసినాడు. మహాసముద్రజలాలను ఒక మహామీనము ధ్వంసము చేసివేసేటట్లు తాను ఆ వానరసైన్య సముద్రాన్ని ధ్వంసము చేయకలను అనుకొని ఆ రాక్షసరాజు రావణాసురుడు అంతట వానరసైన్యము మీదికి రథాన్ని తోలించినాడు.

అమితవేగముతో తన వానరసైన్యముమీద పడటానికి ధగధగలాడుతూ ఉన్న ధనుస్సుతోనూ తళతళలాడుతూ ఉన్న బాణాలతోనూ వస్తూ ఉన్న రాక్షసేంద్రుణ్ణి రావణాసురుణ్ణి సుగ్రీవుడు చూచినాడు. ఆ సుగ్రీవుడు ఒక పర్వత శిఖరాన్ని పెళ్లగించి దానిని చేతిలో పట్టుకొని రావణాసురుడికి ఎదురుగుండా పరుగెత్తినాడు. ఎన్నో చెట్లతోనూ చరియలతోనూ ఉన్న ఆ పర్వత శిఖరాన్ని అంతట ఆ నిశాచరరాజు మీద విసరివేసినాడు. తనమీద పడబోతూ ఉన్న ఆ పర్వతశిఖరాన్ని రావణాసురుడు చూచినాడు. తత్క్షణమే బంగారు ములుకులతో ఉన్న బాణాలను ఆ పర్వతశిఖరముమీద వదిలినాడు. పెద్దఎత్తున పెరిగిన చెట్లతోనూ చరియలతోనూ ఉన్న ఆ పర్వతము రావణాసురుడి బాణాలకు ముక్కలు ముక్కలు అయి నేలమీద పడ్డది. అంతట ఆ రాక్షసలోక నాథుడు రావణాసురుడు ప్రాణాంతకముఅయిన మహాసర్పము వంటి బాణాన్ని వింట సంధించినాడు. దేవేంద్రుడి వజ్రాయుధము వంటి వేగముతోనూ వాయువేగముతోనూ మంటలు మండుతూ నిప్పులు కక్కుతూ పోయే ఆ బాణాన్ని ఇట్టే సుగ్రీవుడిమీద వదిలినాడు. నిశితాగ్రముతోనూ వజ్రాయుధమువంటి ఆకారముతోనూ ఉన్న ఆ బాణము కుమారస్వామి వదిలిన ఉగ్రశక్త్యాయుధము క్రౌంచపర్వతాన్నివలె సుగ్రీవుణ్ణి చీల్చుకొని పోయింది. ఆ మహావీరుడు సుగ్రీవుడు ఆ బాణము అట్లా తనలో నుంచి దూసుకొని పోయినందుకు బాధపడుతూ గుండె చెదిరి అరుస్తూ నేలమీద పడిపోయినాడు. అట్లా నేలమీద పడి చేష్టలు తప్పిపోయిన సుగ్రీవుణ్ణి చూచి రాక్షసయోధులు అందరూ సింహనాదాలు చేసినారు.

అంతట గవాక్షుడూ గవయుడూ సుదంష్ట్రుడూ జ్యోతిర్ముఖుడూ నభుడూ అనే వానరవీరులు దేహాలు పెంచి పర్వతాలు పెళ్ళగించి వాటిని తీసుకొని ఆ రాక్షసేంద్రుడి మీదికి పరుగెత్తినారు. అప్పుడు ఆ రాక్షసాధిపతి నిశితాగ్రబాణాలు వదిలి ఆ వానరులు పట్టుకొని పోయిన పర్వతశిఖరాలను ముక్కలు ముక్కలుగా పడగొట్టి బంగారు ములుకుల బాణాలు వదిలి ఆ వానర వీరులను అందరినీ నేల పడగొట్టినాడు. భయంకరాకారులు అయిన ఆ వానర వీరులు నేలమీద పడిపోయినతరువాత రావణాసురుడు పరమ భయంకరముగా వానరసైన్యము మీద బాణవర్షము కురిపించడము మొదలుపెట్టినాడు. ఆ బాణాలకు పరమ పరాక్రమవంతులుఅయిన వానరవీరులు చచ్చిపోతూనూ ఘోరముగా బాధపడుతూనూ ఉంటే చూచి వానరయోధులు అందరూ భయము అనే శల్యముతో బాధపడుతూ పెద్ద పెట్టున కేకలు వేసుకుంటూ సర్వశరణ్యుడు అయిన రాముడి శరణు చొచ్చినారు.

అంతట ఆ మహాపరాక్రమవంతుడు ఆ మహాధనుర్ధరుడు రాముడు తన ధనుస్సును తీసుకొని వానరులను కాపాడడానికి రావణాసురుడి మీదికి బయలు దేరినాడు. అప్పుడు లక్ష్మణుడు ఆ రాముడికి ఎదురుగుండా పోయి చేతులు జోడించి పరమార్థముగా "ఓ ప్రభూ, ఈ దురాత్ముణ్ణి చంపివేయడము నీకు ఒక లెక్కా, వీడు నీచుడు. ఇటువంటి నీచుణ్ణి నీవు చంపివేయడముకన్నా నేను చంపివేయడము బాగుంటుంది. నేను వీణ్ణి చంపివేస్తాను. అన్నా రామా, అనుమతించు" అని వేడుకొన్నాడు.

ఆ మహాతేజోవంతుడు సత్యపరాక్రముడు రాముడు లక్ష్మణుడితో "తమ్ముడా, నీవే పో. పోరాటములో జాగ్రత్తగా నీవు మెలగవలెను. రావణాసురుడు మహావీర్యవంతుడు. యుద్ధములో వాడి పరాక్రమము అద్భుతముగా ఉంటుంది సుమా. వాడు కోపముతో చెలరేగట్లయితే ముల్లోకాలవారున్నా వాణ్ణి ఎదిరించలేరు. సందేహము లేదు. అయితే పోరాటములో వాడి లోపము ఎక్కడ వుందో నీవు వెతుకు. నీ లోపాన్ని గమనించి సవరించుకో. కంటితో వాణ్ణి చూస్తూ వుండు. హెచ్చరికతో పోరాడు. ఏ మాత్రమూ ఏమరకుండా నీ ధనుస్సుతో నిన్ను నీవు కాపాడుకుంటూ ఉండవలెను" అని చెప్పినాడు.

రాముడు చెప్పిన ఈ మాటలు లక్ష్మణుడు విన్నాడు. రాముణ్ణి కౌగలించుకున్నాడు. ప్రదక్షిణము చేసినాడు. ఆ మహానుభావుడి అనుజ్ఞతో యుద్ధానికి బయలుదేరినాడు.

దేహాలు తెగి చెల్లాచెదరుగా పడిఉన్న వానరులమీద రావణాసురుడు దేదీప్యమానమూ భయంకరమూ అయిన ధనుస్సులోనుంచి బాణవర్షము కురిపిస్తున్నాడు. ఏనుగు తొండమువంటి చేతితో ధనుస్సు పట్టుకొని లక్ష్మణుడు ఆ రావణాసురుడి వంక చూచినాడు. అట్లా పోరాటానికి సిద్ధముఅయి పోబోతున్న లక్ష్మణుణ్ణి మహాతేజోవంతుడు మారుతాత్మజుడు చూచినాడు. కింకరుడు తాను ఉండగా లక్ష్మణుడు పోరాటానికి పోవటము ఏమిటి అనుకొన్నాడు. రావణాసురుడు వదులుతూఉన్న బాణాలను తన చేతులతో అడ్డగిస్తూ ఆ ధీమంతుడు హనుమంతుడు రావణాసురుడి మీదికి పరుగెత్తినాడు. ఇట్టే ఎగిరి రావణాసురుడి రథము ఎక్కినాడు. కుడిచెయ్యిఎత్తి భయపెట్టుతూ "ఓ రాక్షసుడా, నీవు దేవదానవ గంధర్వ రాక్షసులను అందరినీ జయించినావు. యథార్థమే. నీకు వారి భయములేదు. నాకు తెలుసును. అయితే ఇప్పుడు నీవు వానరులకుమాత్రము భయపడక తప్పదు. నేను ఇప్పుడు నా అయిదు వేళ్ళ కుడి

చెయ్యి ఎత్తినాను. బహుకాలమునుంచి నీ దేహములో ప్రాణిరూపాన ఉంటూ ఉన్న ఆత్మను ఇప్పుడు నేను బయటికి వెళ్ళగొట్టుతాను. చూసుకో" అన్నాడు హనుమంతుడు.

ఆ భయంకరపరాక్రముడు రావణాసురుడు కోపముతో కన్నులు ఎఱ్ఱచేసి "ఓవానరుడా, నిశ్శంకముగా కొట్టు. రావణాసురుణ్ణి ఒక వానరుడు కొట్టినాడు అనేకీర్తి నీకు స్థిరముగా ఉండిపోతుంది. నీపరాక్రమము నేను తెలుసుకొంటాను. అంతట నిన్ను నాశనము చేస్తాను" అన్నాడు.

అందుకు ఆ వాయుసుతుడు హనుమంతుడు "ఓరావణుడా, ఇదివరకు నేను కొట్టిన నీకొడుకును అక్షకుమారుణ్ణి జ్ఞాపకము తెచ్చుకో" అన్నాడు. ఈ మాట చెవిన పడీ పడటముతో ఆ వీర్యవంతుడు ఆకాంతిమంతుడు రావణాసురుడు అరచేతితో హనుమంతుడి ఎదురురొమ్ములమీద ఒక్క చరుపు చరిచినాడు. ఆచరుపుకు హనుమంతుడు గజగజ వణికిపోయినాడు. ఒకముహూర్తము సేపటికి ఆ మహామతిమంతుడికి ఆ మహాతేజోవంతుడికి హనుమంతుడికి స్థైర్యమువచ్చింది. అంతట పరమక్రుద్ధుడు అయిపోయినాడు. తన అరచేతితో ఆరావణాసురుణ్ణి కొట్టినాడు. ఆదెబ్బకు భూకంపసమయాన భూమిమీద పర్వతము కంపించిపోయేట్టు ఆ రథముమీద ఉన్న రావణాసురుడు కంపించినాడు.

ఆపోరాటములో హనుమంతుడి అరచేతి దెబ్బతిని గజగజలాడుతూ ఉన్న రావణాసురుణ్ణి చూచి వానరులు అందరూ కోలాహలధ్వనులు చేసినారు. పయినుంచి చూస్తూ ఉన్న దేవర్షులూ సిద్ధులూ దేవతలూ హనుమంతుణ్ణి మెచ్చుకొన్నారు.

ఆ పరాక్రమవంతుడు రావణాసురుడు తెప్పరిల్లి "భళే-భళే-వానరుడా, నీవు నా శత్రువు అయినప్పటికిన్నీ నిన్ను నేను మెచ్చుకొంటున్నాను," అన్నాడు.

"ఛీ ఛీ— నాది ఏమి పరాక్రమము ఓ రావణుడా, నీవు ఇంకా బ్రతికి ఉన్నావు. నా పరాక్రమము కాల్పనా. ఓ దుర్బుద్ధీ, ఈ కాస్త దెబ్బకే నన్ను పొగడుతున్నావు ఏమిటి. ఇప్పుడు నన్ను మళ్ళీ కొట్టు. ఆ తరువాత ఒక గుద్దుతో నిన్ను యమసదనానికి నేను పంపిస్తాను" అన్నాడు హనుమంతుడు.

ఈ మాటలకు రావణాసురుడు కోపముతో భగ్గున మండిపోయినాడు. కన్నులు జ్యోతులు అయిపోయినవి. ఇట్టె హనుమంతుడి వక్షఃస్థలముమీద ఈడ్చి ఒక గుద్దు గుద్దినాడు. విశాలవక్షఃస్థలముమీద తగిలిన ఆ దెబ్బకు హను

మంతుడు వణికిపోయినాడు. ఉత్తరక్షణాన అవయవాలు స్వాధీనము తప్పి పోయినవి. ఆ రథముమీదినుంచి కింద పడిపోయినాడు. అట్లా నేలమీద పడి పోయిన హనుమంతుణ్ణి వదిలిపెట్టి ఆ అతిరథుడు ఆ మహాబలవంతుడు రావణా సురుడు అమిత వేగముతో నీలుడి మీదికి పోయినాడు. ప్రాణము తీసివేసే భయంకరసర్పమువంటి బాణాన్ని ఆ నీలుడిమీద వదిలినాడు. ఆ వానర సేనాధి పతి నీలుడు ఆ బాణము గుచ్చుకొని బాధపడుతూనే ఒక పర్వత శిఖరాన్ని పెళ్లగించి రావణాసురుడిమీద విసరి వేసినాడు.

అప్పుడు ఆ తేజస్వి ఆ మతిమంతుడు హనుమంతుడు తెప్పరిల్లినాడు. పోరాటానికి అటూ ఇటూ చూచినాడు. నీలుడితో పోరాటము సాగిస్తూ ఉన్న రావణాసురుణ్ణి చూచి "ఓ రాక్షసుడా, మరి ఒకడితో పోరాడుతున్న వాడి మీద పడడము ధర్మము కాదు. అందువల్ల నిన్ను ఇప్పుడు వదిలి పెట్టు తున్నాను" అని చెప్పి తప్పుకొన్నాడు.

నీలుడు విసరివేసిన పర్వత శిఖరముమీద ఆ మహాపరాక్రమవంతుడు రావ ణాసురుడు ఏడు బాణాలు వదిలినాడు. ఆ బాణాలు తగిలి ఆ పర్వత శిఖరము ముక్కలు ముక్కలు అయిపోయింది. అదిచూచి ఆ పరవీరహంత వానర యూథపతి నీలుడు కోపముతో ప్రళయకాలాగ్నివలె అయిపోయినాడు. ఇనుమద్దిచెట్లనూ మద్దిచెట్లనూ చంద్రచెట్లనూ పూలువిరగపూసిన మామిడిచెట్లనూ ఇంకా వివిధవృక్షాలనూ పెళ్లగించి ఆ రావణాసురుడిమీద విసరివేసినాడు. ఆ చెటను అన్నిటినీ రావణాసురుడు తన బాణాలతో నరికివేసినాడు. అంతట మహాభయంకరముఅయిన బాణవర్షము కురిపించ సాగినాడు. మేఘాలు వర్షించే వానను పర్వతమువలె ఆ బాణాల వర్షములో నీలుడు తడిసిపోయినాడు. అంతట నీలుడు తన ఆ కారాన్ని హ్రస్వము చేసుకొన్నాడు. ఇట్టే ఎగిరి రావణా సురుడి రథధ్వజముమీదికి పోయి కూర్చున్నాడు. అట్లా తన ధ్వజముమీద కూర్చున్న నీలుణ్ణిచూచి రావణాసురుడికి పెద్దకోపమువచ్చింది. అప్పుడు నీలుడు సింహనాదముచేస్తూ ఆ రథధ్వజముమీదినుంచి రావణాసురుడు పట్టుకొనిఉన్న ధనుస్సు చివరకున్నూ ఆ ధనుస్సు కొనమీదినుంచి అతడు పెట్టుకొనిఉన్న కిరీటము మీదకిన్నీ దూకడము మొదలుపెట్టినాడు. అదిచూచి రామ లక్ష్మణులూ హనుమంతుడూ ఆశ్చర్యపడిపోయినారు. ఆ కపిలాఘ వానికి ఆ మహాతేజోవంతుడు రావణాసురుడున్నూ ఆశ్చర్యపడ్డాడు. వ్యాకులపడి పోయినాడు. అది చూచి వానరులు అందరూ పకపకా నవ్వినారు. అంతట సంతోషాతిశయముతో సింహనాదాలు చేసినారు.

రావణాసురుడికి కొంచెముసేపు ఏమి చేయడానికిన్నీ తోచక నిలుచుండి పోయినాడు. ఆ నీలుడిమీద ఆగ్నేయాస్త్రము వదలవలెను అనుకున్నాడు. ఆగ్నేయాస్త్రముతో అభిమంత్రించిన బాణాన్ని తీసుకొని రావణాసురుడు ధ్వజాగ్రముమీదఉన్న నీలుణ్ణి చూచి "ఓరీ కపీ, నీవు చాలా మాయలు నేర్చుకొన్నావు. మహాలాఘవముతో ఎగురుతున్నావు. ఓవానరుడా, నీకు శక్తివుంటే ఇప్పుడు నిన్ను నీవు కాపాడుకో. నేను నీప్రాణము తీయపోతున్నాను. నీవు అనేక ఆకారాలు సృష్టించుకొంటున్నావు. అయినప్పటికిన్నీ నేను వదిలే అస్త్రము నీ ప్రాణము తీస్తుంది. చేతనయ్యేట్లయితే నీ ప్రాణము పోకుండా చూసుకో" అంటూ ఆగ్నేయాస్త్రముతో సంబంధించిన బాణాన్ని వదిలినాడు. ఆ ఆగ్నేయాస్త్రము అంతట పోయి ఆ వానరసేనానాయకుడు నీలుడి వక్షస్థలాన పడ్డది. అది ఆ నీలుణ్ణి దహించివేయడము మొదలుపెట్టింది. అతడు అక్కడ నిలవలేక పోయినాడు. ఆధ్వజాగ్రముమీదినుంచి నీలుడు నేలమీద పడిపోయినాడు. నీలుడు అగ్నిహోత్రుడి పుత్రుడు. అప్పుడు అగ్నిహోత్రుడి అనుగ్రహామువల్లనూ తన నైసర్గిక తేజోమహిమవల్లనూ నీలుడు మోకాళ్ళు ఆనించి నేలమీదపడి మూర్ఛపోయినాడు. కాని ప్రాణముపోలేదు.

నీలుడు ఒళ్లు తెలియకుండా పడి పోవడము రావణాసురుడు చూచినాడు. అంతట యుద్ధోత్సాహముతో ఆ యుద్ధభూమిని పార చూచినాడు. మేఘ గంభీరధ్వనులు చేస్తూ పోయే ఆ రథముమీద ఏ అడ్డులేకుండా రణమధ్యానికిపోయి ఈ పృథ్వీఅంతా కంపించిపోయేట్టు ధనుష్టంకారము చేసినాడు.

అప్పుడు లక్ష్మణుడు ఆ రావణాసురుడితో "ఓ నిశాచరుడా, నీవు నా మీదికి రావలెను అనుకొన్నట్లయితే వానరులతో యుద్ధము చేయడము ఏమిటి" అని అడిగి దళదిళలూ మారుమోగిపోయేట్టు భయంకరముగా తన ధనుస్సును మోగించినాడు. అప్పుడు రావణాసురుడు ఆ లక్ష్మణుడికి ఎదురుగుండా పోయి "ఓ లక్ష్మణా, నీకు వినాశకాలము వచ్చింది. అందువల్లనే విపరీతబుద్ధి పుట్టింది. నా మీదికి వస్తున్నావు. ఇది నా అదృష్టము. నా కంట పడ్డావు. ఇప్పుడే ఈ క్షణమే నా బాణాలతో నిన్ను మృత్యుదేశానికి పంపిస్తాను" అన్నాడు. తెల్లటి పిట్టపళ్లు వేసుకొని అట్లా అరుస్తూఉన్న రావణాసురుణ్ణిచూచి ఏ మాత్రమూ తడపడకుండా "ఓ రాక్షసుడా, పాపకృత్యాలు చేయడములో నీవు మహా దొడ్డవాడవు. ఓ రాక్షసరాజా, మహాప్రభావులు ఎవరూ నీ వలె అరవరు. తమనుతాము పొగడుకొనరు. ఓ నిశాచరుడా, నీ శక్తి నీ ప్రతాపమూ

నేను ఎరుగుదును. నీవు ఎంతటి బలవంతుడవో ఎటువంటి పరాక్రమవంతుడవో నాకు తెలుసు. నేను శరచాపాలు పట్టుకొని నిలుచున్నాను. రా. పోరాడు. ఎందుకు ఊరక నిన్ను నీవు పొగడుకొంటావు" అని అంటూ ఉండగా రావణాసురుడు కుపితుడు అయిపోయి లక్ష్మణుడిమీద ఏడు బాణాలు వదిలినాడు. కరుకుకొనలతో బంగారు ములుకులతో ఉన్న తన బాణాలతో లక్ష్మణుడు ఆ ఏడు బాణాలనూ నరికివేసినాడు. మహాసర్పాలు తుండ్లు తుండ్లుగా తెగి పడిపోయినట్లు తన ఏడు బాణాలు నేలమీద పడిపోవడము చూచి రావణాసురుడు క్రోధావేశముతో మరింత తీక్ష్ణము అయిన బాణాలను వదిలినాడు. అందుకు లక్ష్మణుడు ఏ మాత్రమూ వ్యాకులపడలేదు. బాణవర్షము కురిపించ తలచుకొని తన ధనుస్సును మండలాకారముగా వంచి కత్తివాయి అంబులనూ అర్ధచంద్రాకారపు అంబులనూ ఈటెలవంటి అంబులనూ వదలడము మొదలు పెట్టినాడు. అవి రావణాసురుడు వదిలే బాణాలను అన్నిటినీ నరికివేయ సాగినవి.

ఆ దేవ విరోధి తాను వదిలిన బాణాలు అన్నీ వ్యర్థము అయిపోవడము చూచినాడు. లక్ష్మణుడి లాఘవానికి ఆశ్చర్యపడిపోయినాడు. మళ్ళీ లక్ష్మణుడి మీద తీక్ష్ణము అయిన బాణాలను వదిలినాడు, అప్పుడు లక్ష్మణుడు రావణాసురుణ్ణి వధించి వేయవలెను అనుకొన్నాడు. దేవేంద్రుడు వదిలే వజ్రాయుధముతోనూ పిడుగుతోనూ సరిసమానము అయిన వేగముతో భగభగ మంటలు మండుతూ పోయే బాణాలను ఆ వింటను ఎక్కించి వెంటవెంటనే రావణాసురుడిమీద వదిలినాడు. లక్ష్మణుడు వదిలిన ఆ బాణాలను అన్నిటినీ రావణాసురుడు తన బాణాలతో ఖండించివేసినాడు. అంతట ఆ రావణాసురుడు బ్రహ్మదేవుడు తనకు ఇచ్చిన ప్రళయకాలాగ్ని వంటి బాణాన్ని లక్ష్మణుడి లలాటాన్ని గురిపెట్టి వదిలినాడు. ఆ బాణమువచ్చి లక్ష్మణుడి మీదపడ్డది. ఆ బాణము దెబ్బకు లక్ష్మణుడు వణికిపోయినాడు. చేతితో పట్టుకొని ఉన్న ధనుస్సు పట్టు తప్పిపోయింది. అమితకష్టముతో తెప్పరిల్లినాడు. తత్ క్షణమే ఒక బాణము వదిలి దేవశత్రువు అయిన ఆ రావణాసురుడి చేతిలో ఉన్న వింటిని విరగకొట్టినాడు. లక్ష్మణుడు అంతటితో పోనీయలేదు. కరుకు కొనల బాణాలు మూడింటిని ఆ రావణాసురుడిమీద వదిలినాడు. వాటి దెబ్బకు ఆదేవ విరోధి గజ గజ వణికి పోయినాడు. ఒళ్లు తెలియకుండా పోయింది. కష్టముమీద కొంచెము సేపటికి తేరుకొన్నాడు. అయితే ఆ మహాశక్తిమంతుడి చేతిలో చాపము పోయింది. కండలు బయటపడేట్టు ఒంటినిండా గాయాలు అయినవి. దేహము అంతా నెత్తురుతో తడిసిపోయింది. అంతట ఆ రాక్షస రాష్ట్రనాథుడు రావ

ణాసురుడు తనకు బ్రహ్మదేవుడు అదివరకు ఇచ్చిన శక్త్యాయుధాన్ని తీసినాడు. వానరవాహిని అంతా భయపడిపోయేట్టు ఆశక్త్యాయుధాన్ని చటుక్కున లక్ష్మణుడి మీద వదిలినాడు. పొగలూగెగలూ లేకుండా మంటలు మండుతూ నిప్పులు కక్కుతూ వస్తూ ఉన్న ఆశక్త్యాయుధాన్ని చూచి లక్ష్మణుడు వేల్చిన అగ్నిహోత్రము వంటి బాణాలను వదిలినాడు. అట్లా అటువంటి బాణాలు వదిలినప్పటికినీ్న ఆశక్త్యాయుధము వచ్చి లక్ష్మణుడి విశాలవక్షః స్థలముమీద పడ్డది. శక్తిమంతుడు అయినప్పటికినీ్న ఆశక్త్యాయుధము దెబ్బకు లక్ష్మణుడివిశాలవక్షః స్థలము మంటలు మండింది, ఆబాధ భరించలేక పోయినాడు. మూర్ఛపోయినాడు. అది చూచి రావణాసురుడు ఆ లక్ష్మణుడిని తీసుకొనిపోవలెను అనుకొని తన చేతులతో లేవనెత్త పోయినాడు. హిమవత్పర్వతాన్ని కానీ మందర పర్వతాన్ని కానీ మేరు పర్వతాన్ని కానీ ముల్లోకాలను కానీ చేతులతో లేవనెత్తడము సాధ్యము అవుతుందో ఏమోకానీ పోరాటములో అట్లా పడిపోయిన ఆ లక్ష్మణుణ్ణి తను చేతులతో ఆ రావణాసురుడు లేవనెత్త లేక పోయినాడు. బ్రహ్మ సంబంధముఅయిన శక్త్యాయుధము వక్షఃస్థలాన పడగానే తాను విష్ణుదేవుని అచింత్యాంశముగా భావించి అది తనను ఏమీ చేయలేదు అని లక్ష్మణుడు అనుకొన్నాడు. రాక్షసుల దర్పాన్ని అణచివేయడానికి మనుష్యాకారములో వైష్ణవాంశము అయినందువల్ల ఆ లక్ష్మణుణ్ణి దేవకంటకుడు అయిన రావణాసురుడు తన చేతులతో లేవనెత్తలేక పోయినాడు.

అప్పుడు వాయుసుతుడు హనుమంతుడు క్రుద్ధుడు అయిపోయినాడు. హుటాహుటీ రావణాసురుడిమీదికి పరుగెత్తినాడు. వజ్రాయుధ తుల్యము అయిన తన పిడికిటితో ఆ రావణాసురుడి వక్షఃస్థలాన ఒక్క పోటు పొడిచినాడు. ఆ పిడికిలిపోటుకు ఆ రాక్షసేశ్వరుడు నిలవలేక పోయినాడు, గజగజ వణికిపోయినాడు. మోకాళ్లు నేలమీద ఆనించి ముందుకు బోర్లా పడిపోయినాడు. నోటిలోనుంచీ చెవులలోనుంచీ కన్నులలోనుంచీ నెత్తురు కక్కుకొన్నాడు. దేహము గిర్రున తిరుగుతూ ఉన్నట్టు తోచింది. తూలిపోతూ ఆ రథముమీద మెల్లగా కూర్చున్నాడు. కాని స్థిమితము తప్పిపోయింది, ఒండ్లు తెలియకుండా పోయింది. మూర్ఛ పోయినాడు.

భయంకర పరాక్రముముతో పోరాడే రావణాసురుడు అ ఖిన్నముగా మూర్ఛపోవడము పైనుంచి చూచి దేవేంద్రుడూ దేవతలూ దేవర్షులూ సంతోషపడ్డారు ఆ యుద్ధభూమిలో వానరులు అందరూ సంతోషాతిశయముతో సింహనాదాలు చేసినారు.

అప్పుడు ఆ పరమ పరాక్రమవంతుడు హనుమంతుడు మూర్ఛపోయిన లక్ష్మణుణ్ణి తన చేతులలో ఎత్తుకొని రాముడిదగ్గరకు పోయినాడు. ఆ లక్ష్మణుణ్ణి రావణాసురుడు శత్రువు అయినందువల్ల లేవనెత్తలేక పోయినాడు. కాని హనుమంతుడు పరమ భక్తుడూ మిత్రుడూ అయినందువల్ల అవలీలగా ఎత్తుకొనిపో కలిగినాడు. అట్లా హనుమంతుడు ఆ లక్ష్మణుణ్ణి రాముడి దగ్గరకు తీసుకొని పోగానే ఆ శక్త్యాయుధము దానిఅంతటనే రావణాసురుడి దగ్గరకు తిరిగి పోయింది, అప్పుడు ఆ శత్రు సూదనుడు తేరుకొన్నాడు. గాయాలు ఆరిపోయినవి. అచింత్యముఅయిన వైష్ణవాంశాన్ని స్మరించినాడు.

రావణాసురుడున్నూ మూర్ఛ తేరుకొన్నాడు. మహాచ్చాపాన్ని మళ్ళీ తీసుకొని వానరసైన్యముమీద తీక్ష్ణబాణాలను వదలడము మొదలుపెట్టినాడు. ఆ బాణాలకు గొప్పగొప్ప వానరవీరులు పడిపోవడమూ పరుగులెత్తడమూ రాముడు చూచినాడు. రావణాసురుడిమీదికి తత్‌క్షణమే పరుగెత్తినాడు. అప్పుడు హనుమంతుడు రాముడిదగ్గరకు పరుగెత్తిపోయి "ఓ ప్రభూ, మహావిష్ణువుకు గరుత్‌మంతుడు వాహనము. అదేవిధముగా నీకు, ఓరామా, నేను వాహనాన్ని. నీవు ఇప్పుడు నన్ను ఆరోహించు. పోయిగా రావణాసురుణ్ణి సంహరించు" అని చెప్పినాడు.

అంతట ఆ మహాశూరుడు రాముడు ఆ మహాబలవంతుణ్ణి హనుమంతుణ్ణి ఆరోహించినాడు. పోరాటానికి రథముమీద వస్తూ ఉన్న రావణాసురుణ్ణి ఆ మనుజాధిపుడు రాముడు చూచినాడు. బలిచక్రవర్తిని చూచిన విష్ణుమూర్తి వలె ఆ మహాతేజోవంతుడు రాముడు క్రుద్ధుడు అయిపోయినాడు. తన మహాచ్చాపాన్ని ఎత్తినాడు. పిడుగుల మోతలవలె అల్లెత్రాటిని మోగించినాడు. అట్లా జ్యానాదముచేసి రావణాసురుణ్ణిచూచి "ఓ రాక్షసుడా, నిలు. నిలు. నీవు నాకు ఇంత అంత అని చెప్ప నలవికాని అప్రియము చేసినావు. నీవు ఎక్కడికిపోయినా నేను నిన్ను వదిలిపెట్టను. నీవు దేవేంద్రుడిదగ్గరకు పోయినా సూర్యుడిదగ్గరకు పోయినా యముడిదగ్గిరకు పోయినా బ్రహ్మదేవుడిదగ్గరకు పోయినా అగ్నిహోత్రుడిదగ్గరకుపోయినా శివుడిదగ్గరకుపోయినా నీవు దశదిశలలో ఎక్కడికిపోయినా నిన్ను వదిలిపెట్టేవాణ్ణికాను. అటువంటిది ఇప్పుడు నా ఎదట పడ్డావు. నిన్ను విడిచిపెట్టను.

ఓ రాక్షసుడా, ఇప్పుడు నీవు శక్త్యాయుధముతో ఎవణ్ణి కొట్టినావో వాడే వచ్చి నీతో పోరాడుతాడు. ఎప్పుడోకాదు, ఇప్పుడే నిన్ను నీ పుత్రులతోనూ నీ భార్యలతోనూ వధించివేస్తాడు. ఓ రాక్షసుడా, నేను ఎవరినో

చెప్పుతాను విను. జనస్థానములో నివాసము పెట్టుకొన్న భయంకరాకారులను ఆయుధధారులను పధ్నాలుగు వేలమంది రాక్షసులను హతము అర్చివేసింది నేనే" అని చెప్పినాడు.

రాముడు చెప్పిన ఈ మాటలు వింటూనే రావణాసురుడు హనుమంతుడి మీద కాలానలశిఖలవంటి బాణాలు వదిలినాడు. ఆ బాణాలు తగిలి స్వభావ సిద్ధముగా తేజోవంతుడు అయిన వాయుపుత్రుడు హనుమంతుడు మరింత తేజోవంతుడు అయినాడు.

రావణాసురుడి బాణాలకు హనుమంతుడి దేహము అంతా గాయాలు అయిపోవడము ఆ మహాతేజోవంతుడు రాముడు గమనించి కోపపరవశుడు అయిపోయినాడు. అంతట ఆ రావణాసురుడి రథముమీద మంచి ములుకులతో ఉన్న బాణాలను వదిలినాడు. ఆ బాణాలు తగిలీ తగలడములో ఆ రథ చక్రాలు ఊడిపోయినవి, గుఱ్ఱాలు చచ్చిపోయినవి. సారధి యమలోకానికి పోయినాడు. ఆ రధముమీద వున్న ధ్వజమూ పతాకాలూ ఛత్రమూ విరిగి నేల కూలినవి. ఆ రథములో వున్న శూలాలూ ఖడ్గాలూ మొదలు అయిన ఆయుధాలు అన్నీ ముక్కలు ముక్కలుగా విరిగిపోయినవి. భగవంతుడు అయిన దేవేంద్రుడు వజ్రాయుధాన్ని మేరుపర్వతము మీద వదిలినట్లు రాముడు ఆ దేవేంద్రశత్రువు విశాలసుజాతి వక్షఃస్థలముమీద వజ్రాయుధముతోనూ పిడుగుతోనూ సరిసమానము అయిన బాణాన్ని వదిలినాడు.

అదివరకు వజ్రాయుధము దెబ్బకు కానీ పిడుగుపాటుకు కానీ క్షోభపడి ఎరుగని ఆ రావణాసురుడు అప్పుడు ఆ రామబాణము దెబ్బకు తాళలేని బాధ పడ్డాడు. వణికిపోయినాడు, తెలియకుండా చేతిలో ధనుస్సు వదిలిపెట్టినాడు. మూర్ఛపోయినాడు. అట్లా మూర్ఛపోయిన ఆ రావణాసురుణ్ణి ఆ మహా పరాక్రమవంతుడు రాముడు చూచి ధగధగ లాడుతూఉన్న అర్ధచంద్రాకార బాణాన్ని తీసినాడు. దానిని ఆ రాక్షసాధిపతిమీద వదిలినాడు. అది అతని శిరముమీద ఉన్న నవరత్నఖచిత కిరీటాన్ని పగలకొట్టింది.

రావణాసురుడు మూర్ఛ తేరుకొన్నాడు. కిరీటము అట్లా విరిగిపోయినందువల్ల ముఖాన కళకాంతులు మాసిపోయినవి. విషము పిండిన సర్పమువలెనూ జ్వాలలు ఆరిపోయిన అగ్నిహోత్రమువలెనూ కిరణాలు మాసిపోయిన సూర్య బింబమువలెనూ ఐశ్వర్యము పోయిన శ్రీమంతుడివలెనూ ఉన్న రావణాసురుణ్ణి చూచి "ఓ రావణుడా, నీవు మహా భయంకరముగా పోరాడినావు. మేటి వీరులను నా వారిని హతమార్చినావు. చాలా అలసిపోయినావు. మూర్ఛ

పోయినావు, నీకు ఇప్పుడు ధనుస్సు పట్టుకొనే శక్తికూడా లేదు. ఇటువంటి దశలో నిన్ను చంపివేయడము యుద్ధ ధర్మము కాదు. ఇప్పుడు నేను నిన్ను చంపివేసేట్లయితే నాకు లోకాపవాదము వస్తుంది. నేను ఎప్పుడూ ధర్మము తప్పను. అందువల్ల ఇప్పుడు నీ మీద బాణాలు వేసి నిన్ను మృత్యువశము చేయను.

"ఓ రాత్రించరుడా, నీవు ఈ యుద్ధములో మంచి దెబ్బతిన్నావు. బాగా బాధపడ్డావు. నేను అనుమతిస్తున్నాను. నీవు ఇప్పుడు నీ లంకా పట్టణానికిపో. నీ అలసట అంతా తీర్చుకో. మంచి ధనుస్సు తీసుకో, మంచి రథము ఎక్కు. మళ్లీ ఇక్కడికిరా. నీవు అట్లా ధనుర్ధరుడవు అయి రథము మీద వస్తే నా బలము ఏమిటో నీకు తెలుస్తుంది" అని రాముడు చెప్పినాడు.

ఆ రాక్షసరాజు దర్పము హతము అయిపోయింది. హర్షము హతము అయిపోయింది. గుర్రాలు హతము అయిపోయినవి. సారథి హతము అయిపోయి నాడు. చేతిలో పట్టుకొన్న విల్లు విరిగిపోయింది. గుచ్చుకొన్న బాణాలు బాధ పెట్టుతూ ఉన్నవి. కిరీటము ఛిన్నాభిన్నము అయిపోయింది. రాముడు అట్లా చెప్పుతూ ఉంటే రావణాసురుడికి అప్పుడు ఏమి చేయడానికి తోచలేదు. లంకా పట్టణానికి పోయినాడు.

ఆ రజనీ చరుడు ఆ మహాబలవంతుడు దేవదానవ శత్రువు రావణాసురుడు అటు లంకా పట్టణానికి పోగానే రామలక్ష్మణులు వానర వీరులకు గుచ్చు కొన్న బాణాలను పీకించి వారు బాధపడకుండా చేసినారు.

అట్లా దేవేంద్ర శత్రువు రావణాసురుడు పరాజితుడు అయిపోయినందుకు భూతగణాలూ దిక్పాలకులూ మహర్షులూ మహోరగులూ సురాసురలు—వారు వీరు ఏమిటి సమస్తజగత్తూ సంతోషించింది.

## ౬౦

రామబాణాలకు బాధపడుతూనూ భయపడుతూనూ రావణాసురుడు లంకాపట్టణానికి పోయినాడు. అతడి దర్పము అణగిపోయింది. దిగులుపడి పోయినాడు. సింహాన్ని చూచి పారిపోయి వచ్చిన ఏనుగు వలెనూ, గరుత్మంతుణ్ణి చూచి పారిపోయి వచ్చిన పాము వలెనూ, ఆ మహాబలవంతుణ్ణి ఆ మహా పరా క్రమవంతుణ్ణి రాముణ్ణి చూచి భయపడిపోయి వచ్చినాడు. ఖిన్నుడు అయి పోయినాడు. పొగలూ గిగలూ లేకుండా నిప్పులు కక్కుతూ మంటలు మండే బ్రహ్మదండము వలెనూ చటుక్కున ఏ దిక్కున పడితే ఆ దిక్కున మెరిసే మెరుపు తీగవలెనూ వచ్చిపడే రామబాణాలను గురించి తలచుకొంటూ వ్యథ

పడి పోయినాను. కుంగిపోయినాను. బంగారుమయము అయిన దివ్యసింహాసనముమీద కూర్చుని రావణాసురుడు రాక్షసవీరులను చూచి "ఓ వీరులారా, నేను దేవేంద్రుడితో సరిసమానము అయిన బలవంతుణ్ణి. పరాక్రమవంతుణ్ణి, అటువంటి నన్ను మానవుడు ఒకడు జయించినాడు. నేను చేసిన పరమోత్తమము అయిన తపస్సు అంతా వ్యర్థము అయిపోయినట్టే కదా.

"దేవదానవగంధర్వులు కానీ యక్షరాక్షస పన్నగులు కానీ నన్ను చంపివేయకుండా ఉండేవరము బ్రహ్మదేవుడు నాకు ఇచ్చినాడు. మానవులు నన్ను చంపివేయకుండా ఉండేవరము నేను ఆ బ్రహ్మదేవుణ్ణి అడగలేదు. అందువల్ల నాకు మరణభయము మానవుడివల్లనే అని బ్రహ్మదేవుడు నాతో చెప్పిన భయంకరవాక్యము ఇప్పుడు నాకు అనుభవానికి వస్తూఉంది. అది అంతే. బ్రహ్మవాక్యము తప్పదు.

"ఓ రాక్షసముఖ్యులారా, పూర్వము నేను దిగ్విజయయాత్రకు పోయినప్పుడు ఇక్ష్వాకువంశీయుణ్ణి అనరణ్యుడు అనే రాజును చిత్రవధ చేసినాను. ఆ అనరణ్యుడు చచ్చి పోతూ నన్ను చూచి "ఓ రాక్షసాధమా, నీవు కులాధముడవు. దుర్బుద్ధివి. నా వంశములో పుణ్యపురుషుడు ఒకడు పుట్టుతాడు. వాడు యుద్ధములో నీ పుత్రులతోనూ నీ మంత్రులతోనూ నీ సైన్యముతోనూ నీ గుర్రాలతోనూ నీ సారథితోనూ నిన్ను సంహారము చేసి వేస్తాడు" అని ప్రతిజ్ఞ చేసి చెప్పినాడు. ఆ అనరణ్యుడు చెప్పిన మహాపురుషుడే ఈ దశరథాత్మజుడు రాముడు అని నాకు తోస్తున్నది.

నేను పూర్వము వేదవతి అనే ఆమెను బలవంతముగా భంగపరిచినాను. ఆ తపస్విని నన్ను శపించింది. నన్ను నాశనము చేసి వేస్తాను అని చెప్పింది. ఆ మహాభాగ వేదవతే ఈ జనకనందిని సీతాదేవిగా పుట్టి ఉంటుంది. నేను పూర్వము కైలాసపర్వతము పెళ్లగించినప్పుడు ఉమాదేవికి నా మీద కోపము వచ్చింది. స్త్రీ నిమిత్తము నాకు చావు రావలెను. అని ఉమాదేవి నన్ను శపించింది. నేను నందీశ్వరుణ్ణి అపహసించినాను. అందుకు అతనికి కోపము వచ్చి తనను పోలిన వానరులు పుట్టి నన్ను సర్వనాశము చేసి వేయవలెను అని శాపము పెట్టినాడు. నేను రంభను చూచి మోహించినాను. కౌమార్తణ్ణి అయిన ఆమెను బలాత్కారించినాను. అందుకు ఆమె పెనిమిటికి కోపమువచ్చి నాకు శాపము పెట్టినాడు. వరుణకన్యక పుంజికస్థల అనే ఆమెను బలాత్కారించి మానభంగము చేసినాను. అందుకు బ్రహ్మదేవుడికి నామీద కోపమువచ్చి శాపము

పెట్టినాడు. నేను బాధించిన మహర్షులు అందరూ నన్ను శపించినారు. ఆ మహర్షుల మాటలు అబద్ధాలు అయిపోవు.

"ఓ రాక్షసులారా, ఈ విషయము అంతా మీరు గమనించండి. ఇకను ఇప్పుడు జయించడానికి అవసరము అయిన ప్రయత్నమంతా మీరు చేయండి. పురద్వారాలలోనూ భటసంచారప్రదేశాలలోనూ గోపుర శిఖరాలలోనూ మీరు కావలి కాయండి. దేవదానవుల దర్పాన్ని అణగద్రొక్కిన కుంభకర్ణుడు అప్రతిమాన గంభీరుడు. వాడు ఇప్పుడు నిద్ర పోతున్నాడు. ఇప్పుడే కాదు. వాడు బ్రహ్మ శాపమునుంచి ఎప్పుడూ నిద్రపోతూనే ఉంటాడు. ఆ కుంభకర్ణుణ్ణి నిద్ర లేపవలెను" అని చెప్పుతూ ఆ మహాబలవంతుడు రావణాసురుడు ప్రహస్తుడు చచ్చిపోవడమూ తాను ఓడిపోయి రావడమూ తలచుకొని కుంభకర్ణుణ్ని నిద్ర లేపడానికి ఆ భయంకర రాక్షస యోధులతో "ఓ వీరులారా, మీరు రాజభవన ద్వారాలలో కావలి ఉండవలెను. అంతేకాదు. నగర ప్రాకారము యొక్క కావలి కాయవలెను. మీలో కొందరు పోయి నిద్రా పరవశుడు అయియున్న కుంభకర్ణుణ్ణి నిద్ర లేపండి. నేను యిక్కడ ఈ దశలో ఉంటూ ఉంటే వాడు సుఖముగా నిశ్చింతగా నిద్ర పోతున్నాడు. కాలకర్మమువల వాడు ఆరునెలలూ ఏడునెలలూ ఎనిమిది తొమ్మిది నెలలూ నిద్రపోతూ ఉంటాడు ఇప్పటికి తొమ్మిది దినాల కిందట యుద్ధాలోచన సభలో కుంభకర్ణుడు జరగవలసిన దానిని గురించి చర్చించి నిర్ణయించి వెళ్ళిపోయినాడు. వాడు ఇటీవలనే నిద్ర పోవడానికి మొదలు పెట్టినాడు. కనుక లేపితే వాడు నిద్ర లేస్తాడు. వాణ్ని ఆ మహాబలవంతుణ్ణి నా తమ్ముణ్ణి కుంభకర్ణుణ్ణి మీరు ఇప్పుడే నిద్ర లేపండి. వాడు ఆ మహాబాహువు నావలె శాపగ్రస్తుడుకాడు. అందువల్ల వాణ్ణి నరులుకానీ వానరులుకానీ చంపివేస్తారు అనే భయములేదు. అంతే కాదు. మన రాక్షస వీరులు అందరిలోనూ వాడు ప్రధానము అయినవాడు. వాడు యుద్ధభూమిలో ధ్వజము వంటి వాడు. పోరాటములో వానరులనూ రామలక్ష్మణులనూ వాడు తప్పకుండా చంపివేస్తాడు. అయితే తెలివి లేనివాడు. గ్రామ్యసుఖాలలో పడి ఎప్పుడూ నిద్రపోతూ ఉంటాడు. మహాదారుణము అయిన ఈ యుద్ధములో రాముడు నన్ను అవమానించినాడు. ఇప్పుడు కుంభకర్ణుడు నిద్ర లేచి వచ్చేట్లయితే నా దుఃఖము తీరిపోతుంది. ఇటువంటి కష్టకాలములో వాడు నాకు తోడు పడక పోయేట్లయితే దేవేంద్రుడితో సరిసమానము అయిన పరాక్రమవంతుడు అయినప్పటికీన్నీ నాకు వాడితో ఏమి ప్రయోజనము. కాబట్టి వాణ్ణి మీరు వెంటనే నిద్ర లేపండి." అని చెప్పినాడు.

ఈ చెప్పింది అంతా రాక్షసవీరులు విన్నారు. రక్తమాంసాహారులు అయిన ఆ రాక్షసులు అంతట పూలదండలనూ సుగంధద్రవ్యాలనూ పిండి వంటలనూ తీసుకొని అమిత వేగముతో కుంభకర్ణుడి ఇంటికి పోయినారు. మహా ద్వారముతో ఒకటిన్నర యోజనము వైశాల్యముతో రమణీయము అయిన కుంభ కర్ణుడి గృహములోకి ఆ రాక్షసయోధులు అందరూ పోయినారు. ఆ నిశాచరుడు నిద్రపోతూ ఉన్న ఆ గుహాకార గృహములోనుంచి సుగంధవాసనలు ప్రవాహా లుగా వస్తూ ఉన్నవి. అభయంకరుడి దగ్గరకు పోబోయినారు. నిద్రపోతూ ఉన్న ఆకుంభకర్ణుడి నిట్టూర్పుల ఉరవడికి వాండ్లు ముందుకుపోలేకపోయినారు. ఆనిట్టూ ర్పులగాలి వాండ్లను వెనకకు తోసివేయడము మొదలుపెట్టింది. మహాప్రయత్నము చేసి మహాకష్టము మీద లోపలికి పోయినారు. ఆ గుహాకారగృహము బంగారు చపటాతోనూ మంగళద్రవ్యాలతోనూ మనోహరముగా కనిపించింది. అక్కడ శయ్య మీద ఆ రాక్షసవ్యాఘ్రము—అభయంకరాకారుడు కుంభకర్ణుడు వేల కూలిన పర్వతము వలె సర్వాంగాలు చాచుకొని పెద్ద కిరీటముతోనూ బంగారు బాహుపురులతోనూ వికృతముగా లేపడానికి అలవికాకుండా మహానిద్ర పోతు న్నాడు. ఒంటిమీద వెంట్రుకలు నిక్కపొడుచుకొని ఉన్నవి. పాము బుసలు కొట్టేటట్టు భయంకరము అయిన నాసారంధ్రాలలోనుంచీ పాతాళము వంటి విశాలము అయిన నోటిలోనుంచీ ఊపిరి వదులుతున్నాడు. ఆ ఊపిరి అతడుతిన్న మేధోరుధిరవాసనలు కొడుతూ వుంది. లేపడానికి అలవికా కుండా అట్లా నిద్రపోతున్న ఆ రాక్షసవ్యాఘ్రాన్ని కుంభకర్ణుణ్ణి ఎంతలేపినా ప్రయోజనము లేకపోయింది.

ఆ కుంభకర్ణుణ్ణి నిద్రలేవగానే తృప్తిపరచడానికి అతని ఎట్టఎదట మేరువు పర్వతము అంత ఎత్తున జింకల మాంసాన్నీ ఎనుపోతుల మాంసాన్నీ అడవి పందుల మాంసాన్నీ ఆశ్చర్యకరము అయిన అన్నపు రాశులనూ ఉంచినారు. నిండా నెత్తురు ఉన్న బానలనూ ఇంకా నానావిధ మద్యభాండాలనూ ఉంచి నారు. అంతట ఆ శత్రుసంహారకుడి ఒంటినిండా ఘుమఘుమలాడే చందనము పూసినారు. దివ్య సుగంధము గుబాళించే పూల దండలు అతడి మెడలో వేసినారు. సుగంధధూపము వేసినారు. అతణ్ణి స్తోత్రము చేసినారు. మేఘాలు ఉరుములు ఉరిమేటట్టు పెద్ద పెట్టున అరిచినారు. చంద్రబింబము వంటి పెద్ద పెద్ద శంఖాలు పూరించినారు. ప్రయోజనము లేకపోయింది. కుపి తులు అయిపోయి అందరూ ఒక్కసారిగా ఎడతెగకుండా అరిచినారు. చేతు లతో తట్టినారు. కదిలించినారు. మళ్లీ మహాధ్వని చేసినారు. కుంభకర్ణుడు నిద్ర లేవలేదు.

అట్లా దుందుభులూ పణవాలూ మోగిస్తూనూ శంఖాలు పూరిస్తూనూ సింహనాదాలు చేస్తూనూ ఉంటే అయిన మహాధ్వనులకు పక్షులు దిక్కులు తెలియకుండా పయికి ఎగిరి పోయినవి. ఎంత ఎత్తు ఎగిరినా ఆ మహాధ్వనులు ఆగలేదు. ఆ మహాధ్వనులకు భయము వదలక అట్లా ఎంతో ఎత్తు ఎగిరిపోయిన పక్షులు అక్కడె నిలవలేక కింద పడిపోయినవి.

ఆ రాక్షససమూహులు అందరూ అట్లా ఏకము అయి ఎంత అరిచినా ఆ కుంభకర్ణుడు నిద్ర మేల్కొనలేదు. అంతట ఆ రాక్షససమూహులు ఆ కుంభకర్ణుణ్ణి అరచేతులతో చరిచినారు. పిడికిళ్ళతో పొడిచినారు. గుద్దినారు. ఆ దెబ్బలకు ఆ కుంభకర్ణుడు నిద్ర లేవక పోవడము, అట్లా ఉండగా ఊపిరి మరింత ఉరవడిగా వదులుతూ ఉంటే ఆ రాక్షసులు అక్కడె నిలవడమే కష్టము అయిపోయింది. అంత ఆ భయంకరులు ఇనప గుదియలూ ముసలాలూ గదలూ ముద్గరాలూ తీసుకొని కొట్టినారు. పర్వత శిఖరాలూ వృక్షాలూ పెళ్లగించుకొని వచ్చి ఆ కుంభకర్ణుణ్ణి కొట్టినారు. ఏమి చేసినా అతడు నిద్ర లేవలేదు. అప్పుడు అక్కడె ఒక పదివేల మంది రాక్షసులు చేరి ఏకకాలాన భేరిలూ పణవాలూ మృదంగాలూ భయంకరముగా మోగించినారు. అతడు నిద్ర లేవలేదు. అంతట ఆ పదివేలమంది రాక్షసులూ ఒక్కసారిగా శంఖాలు పూరించినారు. కాటుక కొండలవంటి ఆ రాక్షసులు పెద్దపెట్టున అరుస్తూ కొట్టుతూ ఎంతలేపినా ఆ కుంభకర్ణుడు నిద్రలేవలేదు.

ఏమిచేసినా ఆ కుంభకర్ణుడు నిద్రలేవక పోయినందువల్ల ఆ రాక్షససమూహులు మరింత భయంకరము అయిన ప్రయత్నము తలపెట్టినారు. కొంతమంది భేరీ పణవ మృదంగ శంఖధ్వనులు చేస్తూఉంటే కొంతమంది గుర్రాలను కొరడాలతో కొట్టీ గాడిదలను కర్రలతో బాది ఏనుగులను అంకుశాలతో పొడిచీ ఆ కుంభకర్ణుడిమీదికి తోలినారు. మరింత మహాధ్వని చేసినారు. ఆ మహాధ్వనికి లంకాపట్టణ పర్వతాలూ వనాలూ కదిలిపోయినవి కాని కుంభకర్ణుడు మాత్రము నిద్ర మేలుకోలేదు.

బంగారు దండాలతో భేరీలను అన్నిటినీ ఏకకాలాన మ్రోగించినారు. బ్రహ్మశాపవశమువల్ల కుంభకర్ణుడు నిద్రలేవలేదు. రాక్షసులు అందరూ కుపితులు అయిపోయినారు. కొంతమంది అతడిని లేపడానికి తమ పరాక్రమాన్ని ప్రదర్శించినారు. కొందరు భేరీలు మ్రోగించినారు. కొందరు సింహనాదాలు చేసినారు. కొందరు అతడి జుట్టు పీకినారు. అతడి చెవులు కొరికినారు. కుండలకొద్దీ బానలనిండా నీళ్లు తీసుకొనివచ్చి అతడి చెవులలో

పోసినారు. వాండ్లు ఎవండ్లు ఏమిచేసినా మహానిద్రలో ఉన్న ఆ కుంభకర్ణుడు మేలుకొనలేదు. కదలను అయినా కదలలేదు. అంతట కొందరు బలవంతులు కూటముద్గరాయుధాలు తీసుకొని అతడి తలమీద కొట్టినారు. అన్ని అవయవాల మీద దెబ్బలు వేసినారు. శతఘ్నులతో ఆ మహాకాయుడి దేహము అంతటా కొట్టినారు. అతడికి మెలకువ రాలేదు. అంతట ఒక వెయ్యి ఏనుగులను అతడి మీదికి తోలినారు. వాటిచేత అతణ్ని తొక్కించినారు. అప్పుడు ఏదో చిన్న పురుగు తనమీద పాకుతూ ఉన్నట్టుగా కన్నులు తెరిచినాడు. పర్వత శిఖరాలతోనూ వృక్షాలతోనూ కొట్టిన దెబ్బలను గురించి తెలుసుకోకుండా ఆవలిస్తూ నిద్ర లేచినాడు. ఆ నిశాచరుడు కుంభకర్ణుడు పర్వత శిఖరాలవలె కఠినముగానూ మహా సర్పాలవలె పొడుగుగానూ ఉన్న చేతులు విదిలించుకొంటూ ఆవలించడానికి మంటలు మండుతూ ఉండే బడబా ముఖమువంటి నోరు వికృతముగా తెరిచినాడు. పాతాళద్వారము వంటి ఆ నోరు తెరిచి ఆవలిస్తూఉంటే అది మేరుపర్వతము మీద ఉదయిస్తూ ఉన్న సూర్యుడివలె కనిపించింది ఒళ్లు విరుచుకొంటూ ఆవలిస్తూ ఆ కుంభకర్ణుడు వదిలిన నిట్టూర్పులు కొండగుహల నుంచి వచ్చే పెద్దగాలివలె వీచింది. వానాకాలములో కొక్కెరలు బారులు కట్టి తిరుగుతూ ఉంటే వాన కురవబోయే మహామేఘమువలె వంకరటింకర హారాలతో ఆ నిశాచరుడి ఆకారము అగుపించింది. అగ్నికణాల వలెనూ ఆకాశములో (శన్యంగారక) గ్రహాలవలెనూ ఆ రాక్షసుడి కన్నులు కనిపించినవి.

నిద్ర లేచి అట్లా దేహము విదిలించుకొంటూ "ఆకలి, ఆకలి వేస్తూ ఉంది" అని అరిచిన ఆ కుంభకర్ణుడికి రాక్షసయోధులు అప్పుడు నానావిధ భక్ష్యాలనూ వరాహమాంసరాశులనూ మహిషమాంసరాశులనూ చూపించినారు. మంచి ఆకలి వేసినందువల్ల ఆ మాంసరాశులను భక్షించి వేస్తూ దాహము వేసినందువల్ల బానలనిండా ఉంచిన నెత్తురు తాగినాడు. అప్పుడు కుంభకర్ణుడు తృప్తి చెందినాడు అని తెలుసుకొని ఆ రాక్షసయోధులు అందరూ అతడిని సమీపించి సాష్టాంగనమస్కారము చేసినారు. చుట్టూ నిలుచున్నారు. కలకపారినకన్నులూ మూస్తూ తెరుస్తూ వారిని అందరినీ చూచినాడు. తనను మేలుకొలిపినందుకు ఆశ్చర్యపడుతూ ఆ నిశాచరుడు "ఓ యోధులారా, మీరు ఎందుకు నన్ను నిద్ర లేపినారు. నన్ను లేపవలసినంత అవసరము మీకు ఏమివచ్చింది. రాజు కుశలముగా ఉన్నాడు కదా. మా అన్న దేనికిఅయినా భయపడుతున్నాడా. మీరు తొందరపడి ఎందుకు నన్ను లేపినారు. తెలుస్తూనే ఉంది. శత్రువుల వల్ల పరమభయావస్థ వచ్చి ఉంటుంది. అందువల్లనే నన్ను నిద్రలేపినారు.

నేను ఇప్పుడే ఆ శత్రువులను అందరినీ సంహారముచేసి వేస్తాను. సందేహించవద్దు. నేను ఏవిధము అయిన భయమూ లేకుండా చేసివేస్తాను. దేవేంద్రుణ్ణి అయినా పడగొట్టుతాను. అగ్నిహోత్రుణ్ణి అయినా ఆర్పివేస్తాను. మా అన్న ఏదో స్వల్పకారణానికి నన్ను లేపమన లేదు కదా. నన్ను నిద్రలేపడానికి యథార్థకారణము ఏమిటో చెప్పండి" అని అడిగినాడు.

ఇట్లా పూనికతో అడిగిన ఆ మహాబలవంతుడికి కుంభకర్ణుడికి నమస్కారముచేసి రావణాసురుడి మంత్రి యూపాక్షుడు అనేవాడు "ఓ, రాజా, దేవతల వల్ల ఏ కొంచెము భయమూ లేదు. ఇప్పుడు మానవుడివల్ల పెద్ద భయము వచ్చిపడి బాధపెట్టుతూ ఉంది. దైత్యదానవులవల్ల ఎన్నడూ ఇంత భయము ఎరగము. పర్వతాకారులు అయిన వానరులు ఇప్పుడు లంకాపట్టణాన్ని ముట్టడించినారు. సీతాపహరణమువల్ల కోపము వచ్చిన రాముడినుంచి ఇంత భయము వచ్చిపడ్డది. ఇదివరకు ఒక్క వానరుడు వచ్చి అక్షకుమారుణ్ణి చతురంగబలాలతో చంపివేసి లంకాపట్టణాన్ని దగ్ధముచేసిపోయినాడు. సూర్యుడివంటి కాంతిమంతుడు రాముడు దేవతలను జయించిన మీ అన్నను రావణప్రభువును ఇప్పుడు యుద్ధములో జయించినాడు. మన ప్రభువు చచ్చిపోయినాడు అనుకొని ఆ రాముడు వదిలిపెట్టినాడు. దైత్యులూ దానవులూ ఏమి చేయలేకపోయిన మన ఏలికను రావణుణ్ణి ఇప్పుడు రాముడు జయించినాడు. బ్రతికి ఉన్నాడో లేడో నన్న సందేహమువలనే రాముడు యుద్ధభూమిలోనుంచి రావణుణ్ణి విడిచిపెట్టినాడు" అని చెప్పినాడు.

యూపాక్షుడు చెప్పిన ఈ మాటలు కుంభకర్ణుడు విన్నాడు. యుద్ధములో తన అన్న రావణుడు ఓడిపోయినాడు అన్నందుకు అతడికి పెద్దకోపము వచ్చింది. గుడ్లు తిప్పుతూ "ఓ యూపాక్షుడా, నేను ముందు ఆ రామలక్ష్మణులనూ ఆ వానరసైన్యాన్ని సంహారము చేసివేస్తాను. ఆ తరువాత పోయి మా అన్నను చూస్తాను. వానరుల రక్తమాంసాలతో రాక్షసులను తృప్తిపరుస్తాను. ఆ రామలక్ష్మణుల నెత్తురు నేను స్వయముగా దాహము తాగుతాను" అన్నాడు.

ఇట్లా కోపము పెచ్చుపెరిగిపోయి ఒళ్ళు తెలియకుండా గర్వముతో మాట్లాడుతూ ఉన్న కుంభకర్ణుణ్ణి రాక్షసయోధులలో ముఖ్యుడు అయిన మహోదరుడు చేతులు జోడించి "ఓ మహాబాహూ, నీవు రావణుడు చెప్పేది ముందు విను. గుణదోషాలు ఆలోచించు. ఆ తరువాత యుద్ధములో శత్రువులను జయించు" అని చెప్పినాడు.

ఈవిధముగా మహోదరుడు చెప్పింది విని కోపముతో ఆ మహాబలవంతుడు ఆ మహాపరాక్రమవంతుడు కుంభకర్ణుడు లేచినాడు.

ఆ భయంకర నేత్రుణ్ణి ఆ భయంకరాకారుణ్ణి ఆ భయంకరపరాక్రమవంతుణ్ణి కుంభకర్ణుణ్ణి నిద్రలేపి అప్పటికి జరిగింది అంతా రాక్షసమంత్రులు విన్నవిస్తూ ఉంటే రాక్షసయోధులు అమితవేగముతో పోయి సింహాసనముమీద కూర్చుని ఉన్న రావణాసురుణ్ణి చూచి చేతులు జోడించి నమస్కారము చేసి "ఓ రాజా, నీ తమ్ముణ్ణి కుంభకర్ణుణ్ణి నిద్రలేపినాము. అటునుంచే అతణ్ణి యుద్ధము చేయడానికి పొమ్మంటావో ఇక్కడికి వచ్చి నిన్ను చూచి పొమ్మంటావో చెప్పు" అని అడిగినారు.

రావణాసురుడు సంతోషించినాడు. ఆ రాక్షసయోధులతో "ఓ యోధులారా, నేను కుంభకర్ణుణ్ణి చూడవలెను అనుకొంటున్నాను. వాణ్ణి మీరు యథాన్యాయముగా గౌరవించి ఇక్కడికి పిలుచుకొని రండి" అని రావణాసురుడు చెప్పినాడు. "అట్లాగేను" అని చెప్పి ఆ రాక్షసయోధులు మళ్ళీ కుంభకర్ణుడి దగ్గరకుపోయి "ఓ కుంభకర్ణుడా, సర్వరాక్షసపుంగవుడు మన ఏలిక రావణుడు నిన్ను ఇప్పుడు చూడవలెను అనుకొంటున్నాడు. ఓ రాజా నీవు ఆయన కోరినట్టు వచ్చి సంతోషపెట్టు" అని చెప్పినారు. "అట్లాగేను" అని ఆ మహాబాహువు ఆ దుర్ధర్షుడు అన్నగారి ఆజ్ఞను శిరసావహించడానికి శయ్యమీదినుంచి లేచినాడు. సంతోషముగా ముఖము కడుగుకొన్నాడు. స్నానము చేసినాడు. అలంకరించుకొన్నాడు. దాహము వేసినందువల్ల బలవర్ధకము అయిన మద్యాన్ని వెంటనే తీసుకొని రమ్మని తొందర చేసినాడు. అప్పుడు ఆ రాక్షసయోధులు నానావిధమద్యాలూ భాండాల నిండా తీసుకొనిపోయి ఆ కుంభకర్ణుడికి సమర్పించినారు. అతడు అప్పుడు రెండువేల కుండల మద్యము తాగినాడు. రావణుడి దగ్గరకు బయలుదేరినాడు. కొంచెము ఎక్కువగా తాగినందువల్ల కైపు ఎక్కి ఆ తేజోవంతుడు సంతోషాతిశయముతో తూలుతూ ప్రళయకాలములో సర్వలోకాలనూ సర్వనాశనము చేసివేయడానికి కింకరులను వెంటపెట్టుకొనిపోయే యముడివలె రాక్షసయోధసమూహాలను వెంటపెట్టుకొని భూమి వణికిపోయేట్టు అడుగులు వేస్తూ నడిచినాడు. సూర్యుడు తన కిరణాలతో ఈ భూమిని తేజరిల్ల చేసేటట్టు ఆ మహాపరాక్రమవంతుడు కుంభకర్ణుడు తన దేహకాంతులతో ఆ రాజవీధిని అంతా వెలుగుచేస్తూ పౌరజనుల నమస్కారాలు అందుకొంటూ బ్రహ్మదేవుణ్ణి చూడపోయే దేవేంద్రుడివలె రావణాసురుడి ఇంటికి పోయినాడు.

లంకాపట్టణము వెలుపల ఉన్న వానరయోధులు అందరూ ఆ లంకాపట్టణ రాజవీధినపోతూ ఉన్న ఆ శత్రుసంహర్తను ఆ అప్రమేయబలవంతుణ్ణి ఆ పర్వతాకారుణ్ణి కుంభకర్ణుణ్ణి చూచినారు. భయపడ్డారు. కొందరు దిగులు

